



# జానపదవిజ్ఞానంలో స్త్రీ చిత్రణం

రచన :

డా. ఎ. విజయలక్ష్మి







రచన

**డా. ఎ. విజయలక్ష్మి**

డా. బొడ్డుపల్లి పురుషోత్తం గారి పర్యవేక్షణలో

తెలుగు శాఖ ద్వారా 1982 వ సంవత్సరంలో పి.హెచ్‌డి. పట్టాకై

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించిన

సిద్ధాంత వ్యాసానికి గ్రంథరూపం

**జానపద విజ్ఞానంలో స్త్రీ చిత్రణం**

**రచన :**
డా. ఎ. విజయలక్ష్మి.



ప్రథమ ముద్రణ : నవంబరు, 2017.

**ప్రతులు** : 500.
వెల : రూ.250/-

**ప్రతులకు**
డా. ఎ. విజయలక్ష్మి,
501, యాగంటి విన్,
రాజేంద్రనగర్, 1వలైను,
గుంటూరు – 522 006.
చరవాణి : 9985037370

అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో

**ముద్రణ**
శ్రీలక్ష్మీ ముద్రణాలయం,
14/2, అరండల్ పేట,
గుంటూరు – 522 002
ఫోను : 0863– 2230643.

# అంకితం




**"కలౌ వేంకట నాయకః"**

ఆపద మొక్కులవాడా! అనాధ రక్షకా! ఆపద్బాంధవా! శేషాచల శ్రీనివాసా! వడ్డికాసులవాడా! పేరు ఏదైనా ఆర్తితో 'ఓ' అని పిలవగానే 'ఆ' అంటూ పలికే కలియుగ దైవం నన్ను నడిపించే నా స్వామి ఏడుకొండల వేంకటరమణునికి

భక్తి ప్రపత్తులతో
**విజయలక్ష్మి**

## 'జానపద విజ్ఞానంలో స్త్రీ చిత్రణం' గ్రంథావిష్కర్త
## ప్రజా హృదయాధినేత



*నవ్యాంధ్రకు నడకలు నేర్పి, పోలవరానికి ప్రాణ ప్రతిష్ఠ చేసి,*
*పట్టిసీమను పరుగులు తీయించి, రైతన్నల ముంగిళ్ల విరుల నవ్వులు పూయించి,*
*డ్వాక్రా మహిళల జీవితాలలో వెలుగులు నింపిన స్ఫూర్తి ప్రదాత, నవయువనేత...*

**శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు**

**నవ్యాంధ్ర ముఖ్యమంత్రి**

# రచనా ప్రణాళిక

జానపద విజ్ఞానాన్ని విజ్ఞలోకం విశేషంగా ఎక్కువ మక్కువతో సమీక్షిస్తున్న కాలమిది. ఇందుకు కారణం ఇది నిసర్గమైన జాతీయ సంపద కావటమే. ఎందరో మహానుభావులు ఎన్నో కష్ట నష్టాలకోర్చి ఎంతో కాలంగా తాము సేకరించిన జానపద గేయాల్ని ముద్రింపచేసి లోకోపకారమొనర్చారు. నావంటి పరిశోధక విద్యార్థులకు మార్గం సుగమం చేశారు. ఇట్టి వారిలో ప్రాతఃస్మరణీయులు కీ.శే. నేదునూరి గంగాధరంగారు, చిరస్మరణీయులు కీ.శే. చింతా దీక్షితులుగారు, ఆచార్య బిరుదరాజు రామరాజుగారు, కీ.శే. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి (కృష్ణశ్రీ) గారు, ఆచార్య తూమాటి దొణప్పగారు, ఎల్లోరా (గొడవర్తి భాస్కరరావు)గారు, ప్రయాగ నరసింహ శాస్త్రిగారు, హరి ఆదిశేషువుగారు, కీ.శే. టేకుమళ్ల కామేశ్వరరావుగారు, డా. ఆర్వీ. ఎస్. సుందరంగారు, బాదగౌని నరేంద్రగారు, లక్ష్మీకాంతమోహన్‌గారు, డా. నాయని కృష్ణ కుమారిగారు తదితరులు.

జానపద వాఙ్మయమంటే చిన్ననాటి నుండి నాకున్న ఆసక్తిని పురస్కరించుకొని పరిశోధనకుపక్రమించాను. ఈ సాహిత్యాన్ని పరిశీలించి నప్పుడు నన్నెక్కువగా ఆకర్షించింది ఇందులో చిత్రితమైన స్త్రీ జీవితం. జానపద విమర్శ వాఙ్మయంలో అక్కడక్కడ ఇంచించుకగా ఉట్టంకితమయిన స్త్రీ జీవితాన్ని ఆమూలచూడంగా అన్వేషించి స్త్రీ జీవన సంస్కృతిని పునర్ని ర్మించాలనే లక్ష్యంతో చేసిన కృషే నా ఈ సిద్ధాంత వ్యాసం.

నా పరిశోధన పూర్వభాగం, ఉత్తర భాగం అనే రెండు విభాగాలుగా సాగింది. పూర్వభాగంలో నాలుగు పరిచ్ఛేదాలు, ఉత్తర భాగంలో ఒక పరిచ్ఛేదం ఉన్నాయి.

"స్త్రీ సారస్వతం సంఘజీవనానికి జీవగఱ్ఱ, స్త్రీలోనున్న మాతృత్వమే సహజంగా పెల్లుబకగా స్త్రీ సారస్వతం ఆవిర్భవించింది" అంటారు నేదునూరి

గంగాధరం గారు. వివిధ గేయాలలో ప్రస్ఫుటించిన స్త్రీలోని విభిన్న భావాలను వివిధ శీర్షోపశీర్షికలుగా వింగడించి భావమథనం కావించటానికి ప్రయత్నించాను.

జానపద స్త్రీ అంటే నిరలంకారంగా మొరటుగా ఉంటుదని నాగరికులు సామాన్యంగా భావిస్తుంటారు. కానీ ఆమె ఎన్నెన్ని రకాల కోకలు కడుతుందో మరెన్ని రకాల రవికలు ధరిస్తుందో, ఏ విధంగా వస్త్ర మేళనం కావిస్తుందో, ఎన్ని విధాలుగా కొప్పుముడులు పెడుతుందో ఏయే ఆభరణాలు ధరిస్తుందో 'అలంకార విశేషాలు' అనే ప్రథమ పరిచ్ఛేదంలో పరిశీలించాను.

బాహ్యాలంకారాల కన్న గుణాలంకారాలు మిన్న. అత్తల గుణాలలోను, కోడళ్ల గుణగణాలలోను గల వైచిత్రిని విభిన్న ప్రకరణాల క్రింద ప్రదర్శించి జానసద స్త్రీ ఆశలు – ఆకాంక్షలు ఎట్టివో 'గుణాలంకార విశేషాలు' అనే ద్వితీయ పరిచ్ఛేదంలో నిరూపించటానికి ప్రయత్నించాను.

గుణంకన్న భావం బలీయమైంది. మానవ జీవితాన్ని తీర్చిదిద్దేది భావుకతే. అందులోనూ స్త్రీకున్న భావనైపుణ్యం పురుషుడిలో కనిపించదు. దుహితగా, సోదరిగా, ప్రియురాలిగా, మాతృమూర్తిగా జానపద మహిళా సంభావనను సమీక్షించాను. అంతేకాక సహజ మనోహరమైన హాస్య చతురత, ఆర్ద్రహృదయంలో పెల్లుబికే కరుణ, జీవితాన్ని తీర్చిదిద్దే నైతిక శక్తి, ఆనందమయంగా నోములు, వ్రతాలు నిర్వహించుకుంటూ నెరపే భక్తి భావన మొదలైన అనేక అంశాలతో 'భావాలంకార విశేషాలు' అనే తృతీయ పరిచ్ఛేదాన్ని యథాశక్తిగా పరిసమాప్తం గావించాను.

జీవితాన్ని కళగా తీర్చిదిద్దటంలోనే మానవ ప్రతిభ పదర్శిత మవుతుంది. కన్యగా, జాయగా, నియమవ్రతగా, వివిధాచార వ్యవహార నిర్వాహకురాలిగా పండుగల్లో, పబ్బాల్లో పలురకాల వంటకాలు వండి వడ్డిస్తూ,

మంత్రతంత్రోచ్చాటనాలు చేస్తూ జానపద స్త్రీ తన 'జీవితాలంకార విశేషాల' ను ఏ రీతిగా శోభాయమానం గావిస్తుందో చతుర్ధ పరిచ్ఛేదంలో వర్ణించాను.

ఇంతవరకు విరచితమైన ఈ నాలుగు పరిచ్ఛేధాలు 'జానపద సాహిత్యంలో స్త్రీ చిత్రణం' అనే శీర్షికకు సంబంధించినవి. ఇది పూర్వభాగం. ఇక అయిదవ పరిచ్ఛేదం 'సామెతల్లో స్త్రీ సమాలోచనం' అనేది. ఇది ఉత్తరభాగం. సామెతలు జాతి జీవనం మీద నేర్పుగా తీర్పునిచ్చే నిశిత సూత్రాలు. ప్రతి వక్తా తన సంభాషణలో ఏదో ఒక సామెతనుపయోగించి శ్రోతకు ఆమెత చేకూర్చటానికి ప్రయత్నిస్తాడు. స్త్రీ గురించిన సామెతలే అధికంగా కనిపించాయి. అందులో ఆడపుట్టుక, పెళ్లి, దాంపత్య జీవనం, సవతిపోరు, అత్త-కోడళ్ల సంబంధం, స్వభావం, నడవడి, అలంకారాలు అనే వివిధ ఉపశీర్షికల క్రింద స్త్రీ సమాలోచనాన్ని తెలుగు జాతి ఏ విధంగా సంభావించిందీ యథోచితంగా విమర్శించాను.

మొత్తంమీద జానపద విజ్ఞానంలోని సాహిత్యం, సామెతలు అనే రెండు ప్రధానాంశాల్ని పురుస్కరించుకొని పూర్వోత్తరార్థాలుగా సాగిన ఈ వ్యాసంగం తెలుగు ఆడపడుచు జీవిత చిత్రణగా భావించవచ్చు.

ఈ నా వ్యాసంగానికి ఆధారం ముద్రిత సాంఘిక జానపద విజ్ఞాన వాఙ్మయమే. ఈ నా కృషి సహృదయ సమాదరణ పాత్రం కాగలదని ఆశిస్తాను.

విధేయురాలు,

విజయలక్ష్మి.

# జానపద విజ్ఞానంలో స్త్రీ చిత్రణం

ఒక జాతి సంస్కృతీ వైభవాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలంటే ఆ జాతి జానపద సాహిత్యాన్ని పరిశీలించాల్సిందే. ఏ జాతికైనా నాగరిక సాహిత్యం కంటే జానపద సాహిత్యమే ప్రాథమికమైంది. ఆదిమ మానవుని ప్రధాన వృత్తి వేట. వేట నుండి తిరిగి వచ్చినప్పుడు సంతోషంతో పెట్టిన కేక నుండి, పనిచేసేటప్పుడు శ్రమాపనయనం కోసం పలికిన శబ్దాల నుండి క్రమంగా భాష ఏర్పడింది. క్రమ క్రమంగా సాహిత్యం ఏర్పడింది. పదిమందితో కలిసి లయబద్ధంగా పదం కదుపుతూ పదం కలుపుతూ తన సంతోషాన్ని పంచుకోవటం లేదా శ్రమను మర్చిపోవటం అలవోకగా జరిగింది. అందుకే ఈ సాహిత్యం నిసర్గమనోహరమయింది. జనపదాలలో నివసించే వారిని జానపదులని, వారి సాహిత్యాన్ని జానపద సాహిత్యమనీ, వారు ఆలపించిన గేయాల్ని జానపద గేయాలనీ పేర్కొనటం జరిగింది. కాలాంతరంలో శిష్ట సాహిత్యం ఏర్పడింది. ఒక నాణానికి బొమ్మ బొరుసువలె ఒక జాతి జీవన స్రవంతిలో జానపద సాహిత్యం, నాగరిక సాహిత్యం తుల్య ప్రాధాన్యాన్ని వహిస్తాయి. నాగరిక సాహిత్యం ఆ జాతి మేధాశక్తికి నిదర్శనమైతే జానపద సాహిత్యం ఆ జాతి హృదయ సంపదకు ప్రతిబింబం. మానవుడెంత మేధాజీవియో అంత హృదయ ప్రధానుడు కూడా. అందుకే మానవ జీవిత సమగ్ర స్వరూపావగాహనానికి జానపద సాహిత్యాన్ని తప్పక పరిశీలించాల్సిందే.

జానపద గేయాలను ప్రధానంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. 1. శ్రామిక గేయాలు 2. వినోద గేయాలు. జానపదులు తమ దినచర్యలలో శ్రమాపనయనం కోసం పాడుకొనే గేయాలే శ్రామిక గేయాలు. ఆడుతూ పాడుతూ పనిచేస్తే అలుపూ సొలుపూ తెలియదని వారి భావన. అందుకే వీటికి

పనిపాటలు అని సామాన్య వాడుక. పండుగ సమయాలలో సంతోషాన్ని పంచుకొంటూ పాడే పాటలు వినోద గేయాలు.

శ్రామిక గేయాలైనా, వినోద గేయాలైనా భూమికి ఇరుసువలె ఈ గేయాలన్నింటికీ కేంద్రబిందువు స్త్రీ అనడంలో ఎంతమాత్రం అతిశయోక్తిలేదు. స్త్రీ. ఇది ఒక అక్షరం కాదు. అక్షర సముదాయం. సకార, తకార, రేఫల కలయిక. మూడక్షరాల సముదాయం. ఈ ప్రకృతి త్రిగుణాత్మకమైంది. సత్వ, రజః తమో గుణాలు ఈ ప్రకృతిని నడిపిస్తున్నాయి. ఆ మూడు గుణాలు స్త్రీ శబ్దంలోని మూడు అక్షరాలకు సంకేతంగా భావించవచ్చు. హిందూ పురాణాల ప్రకారం ఈ విశ్వానికి అధిదేవత స్త్రీ. అమ్మలగన్న అమ్మ ముగ్గురమ్మల మూలపుట్టమ్మ 'ఆది పరాశక్తి'. మహారాష్ట్రలోని నాసిక్ త్రయంబకంలో చిన్నపాయగా పుట్టిన పవిత్ర గోదావరి ఆంధ్రరాష్ట్రంలోని రాజమండ్రి వద్ద తన విశ్వరూపాన్ని చూపినట్లుగా విశ్వాధిదేవత ఆదిపరాశక్తి అంశ అయిన స్త్రీ విశ్వరూపం జానపద గేయాలలో చూడవచ్చు.

జానపదాంగన కన్యగా, సోదరిగా, ప్రియురాలిగా, భార్యగా, తల్లిగా నిర్వహించిన పాత్రలు; ఆమె అలంకార ప్రియత్వం; ఆశలు – ఆకాంక్షలు; వివిధ భావనలు; పిల్లలను లాలించి, పాలించి, గోరుముద్దలు తినిపించి పెంచి పెద్ద చేయటం; రుచిగా, శుచిగా వంటలు వండి కుటుంబ సభ్యులందరినీ సంతృప్తి పరచటం; వివిధ ఆచార వ్యవహారాలను పాటిస్తూ నోములు, వ్రతాలు ఆచరించటం మొదలైన విషయాలలో తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తుంది.

కొండను అద్దంలో చూపినట్లుగా స్త్రీ యొక్క విశ్వరూపాన్ని నాయీ సిద్ధాంత వ్యాసంలో దిఙ్మాత్రంగా ప్రదర్శించటానికి చేసిన కృషి ఇది.

# కృతజ్ఞతాంజలి

'శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్' మానవుడు ఏ పని చేయాలన్నా అందుకు సాధనం శరీరమే. అటువంటి ఈ శరీరాన్నిచ్చి ఇంతదాన్ని చేసిన నా తల్లిదండ్రులు శ్రీ అంచే సత్యానారాయణ, శ్రీమతి బసవపున్నమ్మ గార్లకు ముందుగా నా కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలి.

పరిశోధన చెయ్యాలి అనుకున్నప్పుడు ఆదిలోనే హంసపాదు పడగా దానిని తొలగించి పరిశోధన విద్యార్థిగా నాకు ప్రవేశం కల్పించిన గుంటూరు పట్టణ ప్రముఖ వైద్యులు, మాజీ శాసన సభ్యులు, సాహితీవేత్త, లబ్ధప్రతిష్ఠులు డా. కాసరనేని సదాశివరావు, ఎమ్.ఎస్., తెనాలి పట్టణ ప్రముఖ వైద్యులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం (అప్పటి) సెనేట్ మెంబరు అయిన డా. కొడాలి వీరయ్య చౌదరి ఎమ్.బి.బి.యస్. గార్లకు - - - -

పరిశోధక విద్యార్థిగా నాకు అవకాశం కల్పించి, నా సిద్ధాంత వ్యాసానికి పుటంపెట్టి, కమ్మెచ్చున తీసిన బంగారు తీగెగా చేసిన నా పరిశోధనా పర్యవేక్షకులు, గురుదేవులు డా. బొడ్డుపల్లి పురుషోత్తం, ఎమ్.ఎ., పిహెచ్.డి. గారికి; పరిశోధనా సమయంలో ఎల్లప్పుడూ తగు సూచనలు, సలహాలనిస్తూ ప్రోత్సహించిన ఆచార్య తూమాటి దొణప్ప, ఎమ్.ఎ., పిహెచ్.డి., డా. ఎస్. గంగప్ప, ఎమ్.ఏ., పిహెచ్.డి., డా. యార్లగడ్డ బాలగంగాధరరావు, ఎమ్.ఎ., పిహెచ్.డి. గార్లకు; నా పరిశోధనలో సహాయ సహకారాలు అందించిన నాగార్జున విశ్వవిద్యాలయ తెలుగు శాఖ అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బందికి, గ్రంథాలయాధికారులకు; ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ అధికారులకు; నా సహచర పరిశోధక విద్యార్థులకు; నా సిద్ధాంత వ్యాసాన్ని అక్షరం అక్షరం తరచి తరచి పరీక్షించి నన్ను ఉత్తీర్ణురాలిని చేసిన పరీక్షాధికారులు ఆచార్య బిరుదరాజు రామరాజు ఎమ్.ఏ., పిహెచ్.డి., డా. పి.ఎస్.ఆర్. అప్పారావు, ఎమ్.ఎ., పిహెచ్.డి., గార్లకు - - - -

నా ఉద్యోగ పర్వానికి బాటలు వేసి నన్నెంతగానో గౌరవించి, అభిమానించిన కళాశాల పాలకవర్గ అధ్యక్షులు, మాజీ శాసన సభ్యులు, ప్రముఖ

వైద్యులు డా. కాజ కృష్ణమూర్తి ఎమ్.బి.బి.యస్.; పాలక వర్గ ఉపాధ్యక్షులు డా. జక్కంపూడి సీతారామారావు, ఎమ్.బి.బి.యస్., ఎల్.ఎల్.బి., ఎల్.ఎల్.ఎమ్.; పాలక వర్గ కార్యదర్శి శ్రీ గ్రంధి అప్పారావు గార్లకు - - - -

బాలికా విద్యను ప్రోత్సాహిస్తూ ప్రతి క్లాసులో సగం మంది ఉండేలా విద్యార్థినులకు స్థానం కల్పించటమే గాక తొలిసారి మహిళా జాతీయ సేవా పథకాన్ని ప్రారంభించి నాకు మహిళా కార్యక్రమ అధికారిగా అవకాశమిచ్చి సేవా కార్యక్రమాలలో నా చేత ఓనమాలు దిద్దించటమే గాక ఆరు సంవత్సరాలలో నన్ను నిష్ణాతురాలిని చేసి ఆకాశంలో సగం మహిళలదే అని నమ్మి ఆచరించి చూపి, మహిళా శక్తికి వెన్నుదన్నుగా నిలిచిన స్త్రీ పక్షపాతి, కళాశాల తొలి పిన్సిపాల్ శ్రీ తోటకూర వేంకట రాయలు గారికి - - - -

తెలుగు శాఖలో సమన్వయంతో పనిచేయటంలోనే గాక నిరంతరం ప్రతి కార్యక్రమంలోనూ విలువైన సలహాలు, సూచనలతో నన్ను ప్రోత్సహించిన, ప్రోత్సహిస్తున్న శాఖాధ్యక్షులు డా. కందిమళ్ల సాంబశివరావు, ఎమ్.ఎ., పిహెచ్.డి., డి.లిట్. గారికి - - - -

25 సంవత్సరాల పాటు ప్రశాంతంగా ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించటానికి కావలసిన సుహృద్భావ వాతావరణాన్ని కల్పించటమేగాక జాతీయ సేవా పథకంలో భాగంగా గ్రామాలలో ఏర్పాటు చేసిన ప్రత్యేక శిబిరాలలో పాల్గొని విద్యార్థినులను, నన్ను ఉత్సాహపరచి, ప్రోత్సహించి, నేను చేపట్టిన ప్రతి పనిలోను సహాయ సహకారాలు అందించిన కళాశాల పాలకవర్గానికి, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బందికి - - - -

నేను చేపట్టిన జాతీయ సేవా పథకం కార్యక్రమాలకు ఆర్థికంగాను, హార్థికంగాను సహకారాన్ని అందించిన చిలకలూరిపేట పట్టణ ప్రముఖ వైద్యులకు, స్వచ్ఛంద సంస్థలకు, వ్యాపార వేత్తలకు, రాజకీయ నాయకులకు, ఇతర పురప్రముఖులకు - - - -

నా హృదయ పూర్వక కృతజ్ఞతాంజలి.

నా పరిశోధనకు తోడ్పడిన గౌతమి గ్రంథాలయం, రాజమండ్రి; శ్రీ శారదానికేతన్, వేటపాలెం; శ్రీ వర్ధమాన సమాజం, నెల్లూరు; శ్రీ సరస్వతీ మహల్, తంజావూరు గ్రంథాలయాధికారులకు మనఃపూర్వక ధన్యవాదాలు.

నా పరిశోధనలో నాతో పాటు అన్ని గ్రంథాలయాలకు తిరిగిన పెద్దన్నయ్య శ్రీ మంగారావుకు, నా కళాశాల విద్యకు నాంది పలికిన చిన్నన్నయ్య శ్రీ రాంబాబుకు, ఇంటి పని వంటపని అంటూ నన్ను విసిగించకుండా నా చదువుకు భంగం కలిగించని వదినలు శ్రీమతి కాజ కృష్ణకుమారి, శ్రీమతి పోతిని నాగేంద్రం గార్లకు నా ప్రేమపూర్వక కృతజ్ఞతలు.

ఏ పని చేసినా, చేస్తున్నా వెనక మేమున్నామంటూ నన్ను ప్రేమాను రాగాలతో ముందుకు నడిపించే చిరంజీవులు వేంకట రాజేష్ కృష్ణ, సునీల్ మోహన్ లకు; కోడళ్లు శ్రీమతి దండమూడి విరిజ్యోతి, శ్రీమతి లావు వర్షలకు; నాయనమ్మా పుస్తకం ఎప్పడిస్తావు అంటూ రోజూ అడిగే చిట్టితల్లి రేణుకు శుభాభినందనలు.

నాలోని అణువణువూ నిండి నన్ను నడిపిస్తున్న శ్రీ వారికి ఏంచెప్పినా అది నాకు నేను చెప్పుకున్నట్లే.

ఉలితో శిలను శిల్పంగా మలచినట్లు నా ముడి సరుకును చక్కగా డి.టి.పి. చేసి ఓపిగ్గా చివరి తప్పు వరకూ సవరించిన శ్రీవల్లీ టైపు ఇనిస్టిట్యూట్ యజమాని శ్రీ వేంకట శరవణ గారికి, శంఖంలో పోస్తే గాని తీర్థం కాదన్నట్లు ముద్రణ జరిగితే గాని పుస్తకరూపం రాదు గనుక అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీలక్ష్మీ ప్రెస్ అధినేత శ్రీ కాట్రగడ్డ శ్యాంబాబు, బి.టెక్., గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు.

ఒక వ్యక్తి ఎదిగాడు అంటే సమాజంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఎందరిదో ప్రోద్బలం, ప్రోత్సాహం, సహకారం ఉంటుంది. ఆ విధంగా అదృశ్యంగా ఉండి నన్ను నడిపించిన శక్తులకూ, వ్యక్తులకూ, బంధువులకూ, హితులకూ, శ్రేయోభిలాషులకు ప్రతి ఒక్కరికీ నా కృతజ్ఞతాంజలి.

సాటిలేని, మేటిలేని, ధీటైన మహిళాశక్తికి శిరసు వంచి పాదాభివందనం చేస్తూ.....

విజయలక్ష్మి.

# సంకేత పద వివరణం

| | | | |
|---|---|---|---|
| 1 | జా.క.సం. | - | జానపద కళాసంపద |
| 2 | జా.గే. ద్వి.సం. | - | జానపద గేయాలు (ద్వితీయ సంపుటి). |
| 3 | జా.గే. ప్ర.సం. | - | జానపద గేయాలు (ప్రథమ సంపుటి). |
| 4 | జా.గే. వా.ప. | - | జానపద గేయ వాఙ్మయ పరిచయము. |
| 5 | జా.గే. వా.వ్యా. | - | జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి. |
| 6 | తె.క.జా.గే. | - | తెలుగు కన్నడ జానపద గేయాలు. |
| 7 | తె.జా.గే.సా. | - | తెలుగు జానపద గేయ సాహిత్యము. |
| 8 | తె.దే.జా.గీ. | - | తెలుగు దేశపు జానపద గీతాలు. |
| 9 | తె.ప.పా. | - | తెలుగు పల్లె పాటలు. |
| 10 | తెలం. జా.గే. | - | తెలంగాణా జానపద గేయాలు. |
| 11 | తెలం.ప.పా. | - | తెలంగాణా పల్లెపాటలు. |
| 12 | ప.ప. | - | పల్లె పదాలు. |
| 13 | మ.క. | - | మధుర కవితలు. |
| 14 | మో.ప. | - | మోట పదాలు. |
| 15 | శ.ర. | - | శబ్ద రత్నాకరము. |
| 16 | సరా. | - | సరాగాలు. |
| 17 | సా.వి. | - | సాంప్రదాయిక విజ్ఞానం. |
| 18 | సూ.ని. | - | సూర్యరాయాంధ్ర నిఘంటువు. |
| 19 | సెల. | - | సెలయేరు. |

# విషయ విన్యాసం

## పూర్వభాగం

## జానపద సాహిత్యంలో స్త్రీ చిత్రణం

I

# అలంకార విశేషాలు

1. వస్త్రాలంకరణం
2. కేశాలంకరణం
3. ఆభరణాలంకరణం



# పూర్వభాగం

# జానపద సాహిత్యంలో స్త్రీ చిత్రణం

## I అలంకార విశేషాలు

### 1. వస్త్రాలంకారణం

**చీరలు** : జానపద స్త్రీ వస్త్రాలంకరణంలో అత్యంత శ్రద్ధాసక్తులు కలదిగా జానపద వాఙ్మయాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. వస్త్రాలంకరణంలో ముఖ్యమైనవి చీర, రవిక. ఏ ఆభరణాలున్నా లేకపోయినా అందమైన చీరా రవికా ఏ అతివకైనా అందాన్ని ఆనందాన్ని చేకూరుస్తాయి.

జానపద స్త్రీ ధరించిన వివిధ రకాలైన చీరల్ని ఈ క్రిందివిధంగా విభజించవచ్చు.

**ప్రసిద్ధమైన చీరల ఉత్పత్తి కేంద్రాల్లో తయారైన చీరలు** : ఆంధ్రప్రదేశ్‌లో సుప్రసిద్ధమైన చీరల ఉత్పత్తి కేంద్రాల్లో తయారైన చీరల్ని జానపద స్త్రీ ధరించినట్లు జానపద గేయాలవల్ల స్పష్టమవుతున్నది. తూర్పు ప్రాంతంలోని జానపద స్త్రీలు సాలూరు (శ్రీకాకుళం జల్లా) సన్నచీర[1]ల్ని ఎన్నిక చేసేవారని తెలుస్తుంది. అంతేగాక ఆ సమీపంలోని విజయనగరం యీనులకోక[2]ను కూడా ఆమె ఆకాంక్షించింది. విశాఖ పట్టణానికి దగ్గరలోనే ఉన్న సింహాద్రి కేవలం పుణ్యక్షేత్రమేగాక మంచి మంచి చీరల్ని తయారు చేసే కేంద్రంగా కూడా ప్రసిద్ధి చెందినట్లు సింహాద్రి చీర[3]ల ప్రసక్తి వల్ల విదితమవుతుంది. తూర్పుగోదావరి జిల్లాలోని బండార్లంక చీర[4]ల్ని జానపద స్త్రీ మక్కువతో ధరిస్తుంది. కాకినాడలో తయారైన కమ్మంచు కోక[5]లు కూడా ఆమె నాకర్షించాయి.

---

[1] జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 40.
[2] పైదే.
[3] మిన్నేరు, పుట – 372.
[4] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 12.
[5] పైదే.

దక్షిణ ప్రాంతంలో చంద్రగిరి నుంచి చీరల ఉత్పత్తి కేంద్రంగా వాసికెక్కింది. తత్కారణంగా జానపదాంగన ఆ కేంద్రపు చీరల్ని ఆకాంక్షించింది.[6]

తెలంగాణా ప్రాంతంలోని భువనగిరి చీరల ఉత్పత్తి కేంద్రంగా ప్రసిద్ధికెక్కటం వల్ల జానపదస్త్రీకి ఆ కేంద్రంలో తయారైన బొట్లచీర[7] పట్ల కోర్కె పొడగట్టడం సహజం.

జానపదాంగనకు బొంబాయిల బొట్లచీర[8] మీద కూడా ఆకాంక్ష పొడమినట్లు ఒకానొక గేయం నిరూపిస్తున్నది.

ఆంధ్ర జానపద స్త్రీకి పొరుగున ఉన్న కర్ణాటదేశపు చీర[9]ల మీద కూడా మక్కువ ఎక్కువగా ఉన్నట్లు గోచరిస్తుంది.

ఇంకా ఎన్నో ప్రాంతాలలో చీరలు నేయటం ప్రసిద్ధికెక్కటం నిరూపితమవుతున్నా జానపద సాహిత్యంలో పైన పేర్కొన్న కేంద్రాల చీరలే నిరూపితమవటం ఆశ్చర్యం కలిగిస్తుంది. ముద్రిత గ్రంథాలలోని జానపద గేయాలలో కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు సంబంధించిన గేయాలు చాలా తక్కువ కావటం వల్లనేమో ఆయా జిల్లాలలో ప్రసిద్ధిగాంచిన ఉత్పత్తి కేంద్రాలు ఎన్నో ఉన్నప్పటికీ వాటిలో తయారయిన చీరల ప్రసక్తి ఈ గేయాలలో కనిపించటం లేదు.

**రంగు చీరలు** : చీర ప్రాముఖ్యం అనేక అంశాలపై ఆధారపడి ఉంటుంది. రంగును బట్టి ఆకర్షించేవి కొన్ని, అంచును బట్టి ఆకర్షించేవి కొన్ని, నేత నాణ్యాన్ని బట్టి ఆకర్షించేవి మరికొన్ని. అంతేగాక చీరలపై అచ్చుగుద్దిన పలురకాలైన బొమ్మలను బట్టి కూడా వీటికి ప్రాముఖ్యం లభిస్తుంది. పెక్కు రంగుల చీరల పేర్లు జానపద సాహిత్యంలో చోటు చేసుకున్నాయి. జానపద స్త్రీలకు ఇటువంటి చీరలంటే మక్కువ ఎక్కువని వేరుగా చెప్పనక్కరలేదు.

---

[6] జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 63.

[7] తెలంగాణ పల్లెపాటలు, పుట – 162.

[8] పల్లెపదాలు, పుట-239, 240.

[9] మిన్నేరు, పుట – 119.

రంగు చీరలు రెండు రకాలు: 1.ముదురు రంగు చీరలు. 2. లేతరంగు చీరలు.

**ముదురు రంగు చీరలు** : ముదురు రంగు చీరల్లో నల్లచీర[10] అన్నా, చెంగావి[11] చీర[12] అన్నా, కందు వన్నియ చీర[13] అన్నా జానపద స్త్రీ అంగలారుస్తుంది. నీలిరంగు చీర[14]న్నా, ఆకుపచ్చ చీర[15]న్నా ఆమెకు ఆకాంక్ష అధికం. మిరప్పండు చీర[16]ను ధరించడటం కూడా ఆమె కోర్కెకు ఆటపట్టు. తొగరురంగుచీర[17]న్నా, తోపురంగుచీర[18]న్నా జానపద స్త్రీ ఎక్కువ మక్కువ పడుతున్నట్లు తెలుస్తున్నది. తొగరురంగన్నా, తోపురంగన్నా ఎరుపు అని నైఘంటికార్థం.[19] అసలు తొగరు రంగంటే కందిగింజ ఎరుపని అర్థం. తొగర్లు అంటే కందులనే వ్యవహారం ఇప్పటికీ తెలంగాణ జిల్లాలలో ఉంది.

తెల్లచీర[20] లేదా అచ్చం తెల్లచీర[21] పట్ల కూడా ఆమె అభిలాష తెల్లమవుతుంది. తెల్లచీరల్నే చందమామ చీర[22] లని కూడా వ్యవహరించటం కద్దు.

---

10 మున్నీరు, పుట – 113.

11 సింహాసన ద్వాత్రింశికలో "చెంగావులును" అని పేర్కొన్నదానికి వివరణనిస్తూ శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు చెంగావి అనునది లేత వన్నెయై యుండునని భావించిరి.

—ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట – 108.

తళుకు చెంగావి కోకయు వలుద శిఖయు" – క్రీడాభిరామం, పుట -42.

చెంగావి అంటే లేత కాషాయ రంగు అని నేతకారుల వివరణ.

12 పల్లెపదాలు, పుట -214.

13 తెలంగాణ పల్లెపాటలు, పుట- 79.

14 పైదే, పుట – 67.

15 పైదే

16 మిన్నేరు పుట -230.

17 పల్లెపదాలు, పుట – 143.

18 మధుర కవితలు, పుట – 366.

19 తొగరు=ఎరుపు, తోపు= ఎరుపు – సూర్యరాయాంధ్ర నిఘంటువు.

20 తెలంగాణ పల్లెపాటలు, పుట – 109.

21 పల్లెపదాలు, పుట – 239.

22 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 172.

వంగపండురంగు చీర[23]ను ధరించటం కూడా ఆమెకెంతో అభిలాష. ఇవేకాకుండా ప్రత్యేకంగా రంగేదో తెలియని వన్నెచీర[24]ను కూడా జానపద స్త్రీ మక్కువతో కట్టినట్లు తెలుస్తున్నది. వన్నెచీర అంటే చిత్రవర్ణపు చీర అని నైఘంటికార్థం.

**లేతరంగు చీరలు** : జానపద స్త్రీ ముదురు రంగు చీరలనే గాక లేత రంగు చీరలను కూడా అభిలషించినట్లు ఆ సాహిత్యాన్ని పరిశీలించినప్పుడు స్పష్టమవుతున్నది. ఆమె మొవ్వాకు చీర[25] ను మనసు పడి కట్టినట్లు తెలుస్తున్నది. ఇది లేత ఆకు పచ్చని రంగు. ఇదే విధంగా ఫలాన రంగు అని పేర్కొనకుండా ప్రకృతిలోని సామ్యాలతో రంగులను నిర్దేశించడంలో ప్రకృతికి వస్త్రధారణకు గల సన్నిహితత్వం ప్రస్ఫుట మవుతుంది. ఈ సామ్యాలలో చెట్లు, చేమలు, ఆకులు అలములే గాక తిర్యక్సామ్యాలు కూడా అక్కడక్కడ కన్పిస్తాయి. ఇందులో ముంగివన్నె చీర[26] ఒకటి. అంటే ముంగిస అనే జంతువు రంగు అని నేతకారుల వివరణ. లేత గోధుమ రంగుగా భావించవచ్చు.

లేతరంగు చీరలు చాలా తక్కువగా కన్పిస్తున్నాయి. జానపద స్త్రీకి రోజంతా పనులతోనే సరిపోతుంది. పనులు చేసేటప్పుడు లేతరంగు చీరలు ధరిస్తే మురికి అయ్యే అవకాశమెక్కువ. మురికి బట్టలు చూడటానికి బాగుండవు. కనుక ఆమె లేత రంగు చీరలను ఎక్కువగా అభిలషించి ఉండకపోవచ్చు.

**అద్దకపు చీరలు** : చీర రంగును బట్టేగాక వాటిపై అచ్చుగుద్దిన పలు రకాలైన బొమ్మలను బట్టి కూడా వాటికి ప్రాముఖ్యం కలుగుతుంది. ఈ బొమ్మలను అచ్చుగుద్దే కళకు కలంకారీ అని పేరు. ఇందుకు బందరు కేంద్రంగా ప్రాచీన కాలం నుండీ ప్రసిద్ధి పొందినట్లు తెలుస్తున్నది.[27]

---

[23] మున్నీరు, పుట – 111.

[24] జానపద కళాసంపద, పుట -134.

[25] పల్లెపదాలు, పుట – 217.

[26] తెలంగాణ పల్లెపాటలు, పుట – 158.

[27] బందరు అద్దకాలు నీదమ్మోలి చందరమ్మా -జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట-40.
కలంకారీ అద్దకం తెలుగుదేశమంతటా ఉందని, కానీ ఉత్తర సర్కారులో కృష్ణాజిల్లాలోను అందులోనూ బందురులో వాటికి ప్రసిద్ధి కలిగిందని శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు పేర్కొన్నారు.
– ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట – 430.

సాదా చీరలే కాకుండా ఈ విధమైన అద్దకపు చీరల్ని కూడా జానపద స్త్రీలు సరదాగా ధరించేవాళ్లు. వివిధ రకాలైన పూల ఆకారంలోను, పక్షుల ఆకారంలోనూ చీరలపై అద్దకపు పని చేసే వారు. సన్నజాజిపూలు,[28] మల్లెపూలు,[29] పొన్నపూలు,[30] ఆవపూలు,[31] రోజా మల్లెలు[32] మొదలైన పూల ఆకారంలో అద్దకపు పని చేసిన చీరల్ని బాగా ధరించే వాళ్లు. చుక్కలద్దిన కోకలు కూడా విశేషంగా కట్టేవారు.

పూల చీరలే గాక బాణాల చీరలు[33] (బాణాల ఆకారంలో అద్దకపు పనిచేసిన చీరలు), బతానీల కోకలు[34] కూడా ముఖ్యంగా పల్లెపట్టుల్లో వాడుకలో ఉన్నాయి. అందమైన గవ్వాక్షుల[35] చీర[36]ను కూడా జానపద స్త్రీలు సింగారించినట్లు ఈ వాఙ్మయం సాక్ష్యమిస్తున్నది.

**గళ్ల చీరలు** : అద్దకపు చీరలే కాకుండా గళ్లగళ్ల చీరలు కూడా జానపద స్త్రీలు ధరించేవారు. ఉల్లిమళ్లచీర,[37] మండి తెల్లని[38] చీర ప్రసక్తి ఒక పాటలో

---

"చిత్ర విచిత్రాల బొమ్మలు, నగిషీలు, నమూనాలు గల కర్ర అచ్చులతో బట్టమీద రంగులతో అద్దుతారు. రకరకాల రంగు బట్టలమీద దానికి సరిపడే రంగు అద్దకపు చిత్రాలు ముద్రిస్తారు. ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క రంగు పూసిన దిమ్మలతో ముద్రించి రకరకాల వర్ణచిత్రాలు వచ్చేలాగు చేస్తారు. ఇందులో 'కలంకారీ' అద్దకాలు శ్రేష్ఠమైనవి. బందరు కలంకారీ అద్దకాలు జగత్ప్రసిద్ధి పొందాయి" — మిన్నేరు, పుట -335.

28 పల్లెపదాలు, పుట – 149.
29 మున్నీరు, పుట – 21.
30 మిన్నేరు, పుట – 306.
31 పైదే.
32 సరాగాలు, పుట – 164.
33 మిన్నేరు, పుట – 494.
34 జానపద గేయాలు, ప్ర. సం. పుట – 94.
35 ఎద్దుకన్ను ఆకారంలో ముద్రలు అచ్చుగుద్దిన చీర అని నేతకారుల వివరణ.
36 మిన్నేరు, పుట - 224
37 మిన్నేరు, పుట-39.
38 పైదే, పుట – 306.

వస్తుంది.[39] పచ్చని సరిగళ్ల పారుటాకు చీరలు[40] కూడా వాడుకలో ఉండేవి. నాగుల చీర[41]ను కూడా కట్టుకొనే ఆచారం ఉంది.[42]

**పట్టు చీరలు** : జానపద సాహిత్యంలో అక్కడక్కడా పట్టుచీరల ప్రసక్తి కూడా కనిపిస్తుంది. ఆర్థికంగా స్తోమత కలిగిన స్త్రీలు పెళ్లిళ్లు, పేరంటాళ్లు, జాతరలు, ఉత్సవాలు మొదలైన సందర్భాలలో వాటిని కట్టుకొని ఉండవచ్చు లేదా దేవతా మూర్తులకు ధరింపచేసిన వాటిని చూచి అటువంటి చీరలు కట్టుకోవాలనే అభిలాషను వ్యక్తం చేసి ఉండవచ్చు. నాగపట్నం పట్టుచీర,[43] పట్టుపూల చీర,[44] పమిడిజల్తారు పట్టుచీర,[45] జల్తారు పట్టుచీర[46] వంటి చీరల పేర్లు ఈ సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. మిరపకాయ పట్టుచీర[47] అంటే ఎక్కువ ఇష్టమైమో అనిపిస్తుంది. వ్యాపారస్తులు పట్టుగాని పట్టు చీరలిచ్చి ఆమెను మోసగించి ఉంటారు. అందుకే దగా పట్టుచీర[48] ప్రసక్తికూడా గోచరిస్తుంది. పట్టుచీర అనే తెలుగు పదమే కాకుండా సిల్కుచీర[49] అనే మిశ్ర సమాసం కూడ ప్రయోగింపబడటం చేత ఆగేయం ఆధునికంగా కల్పింపబడిందిగా భావించవచ్చు.

**అంచు చీరలు** : చీరకు అంచు ఒక ప్రత్యేకతను సంతరించి పెడుతుంది. ఈ అంచులు రకరకాలు. సాదారంగు అంచులు, పూల అంచులు, బొమ్మలతో కూడిన అంచులు, పట్టు అంచులు మొదలైనవి. జానపద సాహిత్యంలో నల్లంచు,[50]

---

39 తెలుపు రంగు చీరలో తెల్ల గడిగల దానిని మండి తెల్లని చీర అంటారని నేతకారుల వివరణ.
40 మున్నీరు, పుట – 137.
41 ఎఱ్ఱ కఱలుగల పొప్పళి చీర, త్రివేణి, పుట – 222.
42 నాగుల చీరను సంతానం కలగటానికి ధరిస్తారని, తెల్లనూలు మీద ఎర్రనూలు గళ్లు వేసిన దానిని నాగులచీర అంటారని శ్రీ గంగాధరంగారు పేర్కొన్నారు – మిన్నేరు పుట – 369.
43 మున్నీరు, పుట – 111.
44 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 88.
45 పల్లెపదాలు, పుట 87.
46 సరాగాలు, పుట 39.
47 మిన్నేరు, పుట – 230.
48 మున్నీరు, పుట -110.
49 పల్లెపదాలు, పుట 87..
50 పైదే, పుట – 47.

నీలంచు,[51] చెంగావి అంచు[52] చీరల ప్రసక్తి కనిపిస్తుంది. కరకంచు[53] పెద్దకోక,[54] కాకినాడ కమ్మంచుకోక,[55] కోట బొమ్మంచు[56] కోక[57] మొదలైన పెక్కు రకాల చీరలు జానపద స్త్రీ మోజుగా ధరిస్తుంది. బొమ్మంచు[58] చీరలపై[59] ఆమెకు అభిమానమధికం. అనేక పూలంచు చీరలు[60], ఆవపూ సన్నంచు చీరలు[61] ఆమె ధరించినట్లు తెలుస్తున్నది. అంచు చీరలలోనూ ముదురురంగు అంచు చీరలేగాక లేతరంగు అంచు చీరలను[62] కూడా అభిలషించినట్లు నిరూపితం. సన్నని తీగకు చిన్న చిన్న ఆకుల్ని జోడించిన అంచు గలిగిన చీరల్ని పురుగంచు చీరలని[63] వ్యవహరిస్తారు. ఇటువంటి చీరల ప్రసక్తి కూడా ఈ వాఙ్మయంలో గోచరిస్తుంది.

---

51 తెలంగాణ పల్లెపాటలు, పుట – 118.

52 మిన్నేరు, పుట – 437.

53 కరకంచు= కరక్కాయ నీటితో వ్రాసినయంచు, సూ.ని.
శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు కూడా కరకంచు అంటే కరక్కాయ చెక్కతో
వన్నె వేయుచుండిరేమో! ననిరి. – ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట- 109.

54 పల్లెపదాలు, పుట- 187.

55 జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట-12.

56 కొండల వరుస వంటి అంచుగలిగిన అని నేతకారుల వివరణ

57 మిన్నేరు, పుట – 198.

58 బొమ్మంచు(లు)-1 అంచులందు బొమ్మలు చిత్రించినది. 2. ఎఱ్ఱనిది – సూ.ని.
ఇందులో రెండవ అర్థమే సరియైనది.
"లేత బొమ్మంచున్ గెంజిగురాకు మోవిది విధాత్వర్థం బనుస్థింతునో" – క్రీడాభిరామము, పుట- 90.
పై ప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "నెల్లూరు జిల్లాలో పూర్వము యెర్రని అంచుగల తెల్లని చీరెలు వాడుకలో నుండెను. ఎర్రని అంచునే బొమ్మంచు అనిరి, లేతయైన బొమ్మంచు వంటి ఎర్రని పెదవులు అని కొంటె కవి వాడినాడు"–ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట- 73.

59 మున్నీరు, పుట – 111.

60 తెలంగాణ పల్లెపాటలు, పుట – 100.

61 మిన్నేరు, పుట – 316.

62 మధుర కవితలు, పుట – 302.

63 తెలంగాణ పల్లెపాటలు, పుట – 96.

ఇవేగాక విలువైన పట్టంచు చీరలు,[64] సరిగంచు చీరలు,[65] చుట్టు జల్తారు చీరలు,[66] చెంగావి జరీ యంచు చీరలు,[67] చీనిపైతాణియంచు[68] చీరలు[69] వంటి వాటి ప్రస్తావన కూడా ఈ వాఙ్మయంలో గమనించవచ్చు.

పైన పేర్కొన్న చీరలేగాక గర్భవతులు, బాలింతలు అయిన స్త్రీలు కాత్రేడు చీరలు[70] కట్టేవారు. ఇవి సన్నని నల్లంచు కలిగిన కోరా చీరలు. కాత్రేడు అంటే ఒక క్షుద్రదేవతనీ ఆ దేవత పేరు మీదుగా చీర కట్టుకుంటే శరీరం ఆరోగ్యంగా ఉంటుందనే నమ్మకం లోకంలో ఉంది.[71] కాని శబ్దాన్ని బట్టి కాటి ఱేడు అనగా శివుడని అర్థం. అతని కంఠం కూడా నలుపేగదా! ఆవిధంగానే సన్నని నల్లంచు గలిగిన చీరలు గనుక వీటిని కూడా అదే విధంగా భావించి కాత్రేడు చీరలని వ్యవహరించారేమో!

వేరువేరు రంగులతో చీర వేరుగాను, అంచువేరుగాను నేసి, నేత పూర్తయిన తరువాత రెంటినీ కలిపే చీరల్ని కనుము చీరలని[72] అంటారు. ఆ రకం చీరల్ని కూడా జానపద స్త్రీ ధరించింది. చెరుగు చీర[73] కూడా ఇటువంటిదే. చెఱగు అంటే అంచలము, కొంగు అని సూ.ని. ఈ చెరుగు చీరనే పాట్నా చీర అని కూడా అంటారు. చీరరంగుకంటే భిన్నమైన రంగును పమిట చెంగుకు అద్దకం వేస్తారు.

64 తెలంగాణ పల్లెపాటలు, పుట – 144.

65 మున్నీరు, పుట – 216.

66 మిన్నేరు, పుట -121.

67 తెలంగాణ పల్లెపాటలు, పుట -121.

68 చీనిపైతాణియంచు=చైనా దేశ సంబంధమైన జల్తారు అంచు చీరలు –సూ.ని.

69 మిన్నేరు, పుట – 316.

70 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 91.

71 'కాటేరు' అంటే ఎల్లమ్మ అనే క్షుద్రదేవత అనీ, ఈమె వలన 'ప్రదర' అనే వ్యాధి కలుగుతుందని స్త్రీలు నమ్మతారనీ శ్రీగంగాధరంగారి వివరణ. వీరే 'కాత్రేడు' అంటే వనదేవత అనీ వేటగాళ్లు సుఖంగా ఇంటికి తిరిగి రావటానికి ఈ దేవతను ప్రార్థిస్తారనీ కూడా వివరించారు. –మిన్నేరు, పుటలు–369, 370.
పై వివరణను బట్టి స్త్రీలు తమకు ప్రదరవ్యాధి కలగకుండా ఎల్లమ్మ పేరుమీదుగా కాటేరు కోకలను కట్టుకునే వారని భావించవచ్చు. కాటేరు కాత్రేడు అయ్యుండవచ్చు.

72 తెలంగాణ పల్లెపాటలు, పుట -131.

73 మధురకవితలు, పుట – 366.

గంగసరపు చీర[74] కూడా ఈవిధమైనటువంటిదే. దీనినే కుప్పటపంచు చీర అనీ అంటారు. దీనిని నేసేటప్పుడు చీరలోని నూలు పోగులు అంచులోనికి పోకుండా నేస్తారు. పిదప అంచును వేరుగా నేస్తారు. దీనిని తెలంగాణలోని గొల్ల, కురుమ స్త్రీలు ధరిస్తారు.

అర్థం స్పష్టంగా బోధపడని కొన్ని రకాల చీరలు కూడా జానపద వాఙ్మయంలో కనిపిస్తున్నాయి. దండానా చీర,[75] రాప్రొద్దు చీర,[76] కటారి కోక[77] ఇటువంటివే. వీటికి నేతవాళ్లు కూడా సరియైన వివరణ ఇవ్వలేకపోయారు. రాత్రి ధరించే చీరను రాప్రొద్దు చీర అనవచ్చునేమో! ఇది కేవలం ఊహ మాత్రమే.

ఈ విధంగా ఈకాలపు వారికి తెలియని కొన్ని చీరల పేర్లు కూడా జానపద వాఙ్మయంలో చోటుచేసుకున్నాయి.

మొత్తంమీద ఎంతో వైవిధ్యంతో కూడిన రంగులు, నేతలు, అద్దకాలు, అంచులు, పమిట చెంగులు గల చీరలు జానపద స్త్రీలు ధరించినట్లు ఆ వాఙ్మయం నిరూపిస్తున్నది. దీనిని బట్టి వస్త్రాలంకరణలో వీరికి మంచి అభినివేశం ఉన్నట్లు భావించవ్చు.

**రవికలు** : జానపద స్త్రీ వస్త్ర ధారణలో చీర తరువాత ప్రధానమైనది రవిక. జానపద వాఙ్మయంలో ఎన్నో రకాల రవికలు కనిపిస్తున్నాయి. రంగు రంగుల రవికలు, బొమ్మల రవికలు, రకరకాల అంచు రవికలు, పూసల రవికలు, ముత్యాల రవికలు, అద్దాల రవికలు, పట్టు రవికలు, సన్నరవికలు, ముతక రవికలు - ఇలా ఎన్నో. ఇటువంటి వైవిధ్యవిలసితమైన రవికల్ని జానపద స్త్రీలు ధరించారని తెలిసినప్పుడు ఒకింత ఆశ్చర్యం కలగకమానదు.

**అంచు రవికలు** : రవికకు అంచు ప్రాణం వంటిది. అంచులేని రవికకన్నా అంచుగల రవిక ఎంతో నిండుగా శోభావహంగా ఉంటుంది. బయటకు కన్పించేది విశేషంగా

[74] తెలంగాణ పల్లెపాటలు, పుట- 72.
[75] సరాగాలు, పుట – 166.
[76] మిన్నేరు, పుట – 315.
[77] జానపద గేయాలు, ప్ర.సం.,పుట – 55.

ఈ అంచే. ఎందుకంటే సాధారణంగా అంచులు చేతులకు, నడుము పట్టీలకు మాత్రమే వేసుకొంటారు. మిగిలిన రవికనంతా పమిట ఆక్రమిస్తుంది. ఆంధ్ర స్త్రీ అటు ఘూర్జర స్త్రీలాగా శరీరాన్నంతటినీ పూర్తిగా వస్త్రాలతో నింపదు. ఇటు ద్రవిడాంగనలాగా అర్ధనగ్నంగానూ ఉండదు. అరచాటుగా పైట వేసుకొని రవికలో కొంతభాగాన్ని ప్రదర్శించటంలో ఆమెకు గల సౌందర్య దృష్టి ప్రస్ఫుటమవటమేగాక రవిక అంచుల అందం ఎంతో ఆకర్షణీయంగా గోచరిస్తుంది.

ఈ అంచులు రకరకాలు. సాదారంగుల అంచులు, పువ్వులు, పక్షులు ముద్రలు వేసిన అంచులు, పట్టు అంచులు, చారల అంచులు మొదలైనవి. బొమ్మంచు రవికలన్నా,[78] నల్లంచు రవికలన్నా,[79] నెమలంచు రవికలన్నా,[80] చంద్రపూవన్నంచు (చంద్రకాంతపూవు వన్నె అంచు), రవికలన్నా,[81] ఉడతంచు[82] రవికలన్నా,[83] వాణీయంచు రవికలన్నా[84] జానపద స్త్రీకి మక్కువ ఎక్కువ. పట్టుకంకణాల రవిక (పట్టంచు రవిక)లను,[85] పేటంచు రవిక (జరీ అంచు రవిక) లను[86] కూడా ఇష్టంగా ధరిస్తుంది.

---

78 పల్లెపదాలు, పుట -200.
79 మున్నీరు, పుట – 113.
80 పైదే.
81 పైదే, పుట – 316.
82 'ఉఋత చారలు' అంటే ఉడత చారల వంటి వన్నెలని శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారి వివరణ
– ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట -109.
ఉడతంచు అంటే ఉడత చారల వంటి వన్నె అంచు గలిగిన అని భావించవచ్చు.
83 మున్నీరు, పుట- 111.
84 పైదే.
85 పైదే, పుట – 306.
86 తెలుగుదేశపు జానపద గీతాలు, పుట -36.

**రంగుల రవికలు** : రంగు రవికలలో నింబోలు రవిక[87] (నీలి రంగు రవిక), నెమలివన్నె రవిక,[88] కుంకుమ రైక,[89] పంచవన్నెల రవిక,[90] తోపు రవిక[91] లంటే ఆమెకు అత్యంత ప్రీతిపాత్రం.

**కలంకారీ రవికలు** : కలంకారీ పనిచేసిన వివిధ రకాల రవికలను (పోతల రవికలను)[92] ధరించటం జానపద స్త్రీకి ఎక్కువ అభిలషణీయం. పూలరైకలు,[93] ఎర్రని పొగడ పూలరైకలు,[94] మల్లెమొగ్గల రవికలు,[95] జాజిమొగ్గల గేదంగి రవికలు,[96] చుక్కల రవికలు,[97] శనగపూల రవికలు,[98] నాగుపడగల రైకలు (నాగుపడగ ఆకారంలో ముద్రలు వేసిన),[99] చిలకల రవికలు (చిలుకల ఆకారంలో ముద్రలు వేసిన),[100] వారి నెక్కువగా ఆకర్షిస్తాయి.

**పట్టు రవికలు** : నేత రవికలే గాక పట్టురవికలు,[101] మేల్మిపట్టు రవికలు,[102] చేపట్టు చెల్వబంగారు రైకలు[103] కూడా ధరించటానికి మోజుపడుతుంది జానపదాంగన. నక్కీ (మాయజరీ) రవికలు[104] కూడా ధరించటానికి సరదాపడుతుంది.

---

87 తెలంగాణ పల్లెపాటలు, పుట -159.
88 పల్లెపదాలు, పుట- 39.
89 పైదే.
90 మిన్నేరు, పుట -306.
91 పైదే.
92 తెలంగాణ పల్లెపాటలు, పుట 132.
93 పల్లెపదాలు, పుట -161.
94 మిన్నేరు, పుట – 306.
95 పైదే, పుట – 143.
96 మున్నీరు, పుట – 15.
97 సరాగాలు, పుట -229.
98 జానపద గేయాలు, ప్ర.సం. పుట – 94.
99 త్రివేణి, పుట – 87.
100 మిన్నేరు, పుట – 99.
101 తెలంగాణ పల్లెపాటలు, పుట -159.
102 మున్నీరు, పుట – 110.
103 సరాగాలు, పుట – 24.
104 త్రివేణి, పుట -104.

**చేతిపని చేసిన (ఎంబ్రాయిడరీ) రవికలు** : పూసల (పూసలు కుట్టిన) రవికలు,[105] రంగైన రత్నాల (రత్నాలు కుట్టిన) రవికలు,[106] అద్దాల[107] రవికలు,[108] మెరుపుటద్దాల రవికలు,[109] గుండీల (గుండీలు కుట్టిన) రవికలు[110] జానపద స్త్రీలను విశేషంగా ఆకర్షిస్తాయి.

గోటేసిన[111] రవికలు,[112] చుట్టూగోడు రవికలు,[113] లక్క రైకలు,[114] చింతగింజల జీడిరైకలు[115] వీరు ఆసక్తితో ధరిస్తారు.

**గ్రామనామాల రవికలు** : కొన్ని ఊళ్ల పేర్లు కూడా ఈ రవికల పేర్లతో కలిపి వ్యవహారమవుతున్నాయి. ఉప్పాడ జరీరవిక,[116] నాదెళ్ల పట్టు రవిక,[117] నల్లగొండ నక్కీ రవిక,[118] రాజమండ్రి రైక[119] మొదలైనవి ఇటువంటివే. ఆయా గ్రామాలలో ప్రత్యేకంగా

105 పల్లె పదాలు, పుట – 241.
106 పైదే. పుట – 86.
107 పట్టునూలు జలతారు నగిషి పనిని 'బుటేదారి' అంటారు. అతి ప్రాచీనమయిన చిత్రకళగా దీనిని భావించాలి. బుటేదారి పనిలో నూలు బట్టమీద రంగుపట్టుదారంతో వెనుక నుంచి సూదితో కుడతారు. పట్టు జరీకుచ్చులు అమర్చుతారు. కొన్నింటికి గాజుపూసలు, ముత్యాలు కలిపికుడతారు. మరికొన్నింటికి అద్దాల బిళ్లలు అమర్చి కుడతారు" -మిన్నేరు, పుట – 385.
108 పల్లెపదాలు,పుట – 34.
109 పైదే.పుట. 210.
110 తెలంగాణ పల్లెపాటలు, పుట -183.
111 గోటేసిన అన్నా చుట్టూగోడు అన్నా ఒకటే. రవిక చేతులకు, మెడకు రవిక రంగు కంటే భిన్నమయిన రంగుగల వేరొక గుడ్డను అతికి, పైకి సన్నగా అంచులాగా కనిపించేటట్లు కొంత గుడ్డ ఉంచి, మిగిలిన గుడ్డను లోపలికి మడిచి కుడతారు.
112 పల్లెపదాలు, పుట – 195.
113 పైదే, పుట -210.
114 పైదే, పుట – 166.
115 తెలంగాణ పల్లె పాటలు, పుట -146.
116 జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 12.
117 పైదే, పుట – 40.
118 తెలంగాణ పల్లెపాటలు, పుట – 162.
119 పల్లెపదాలు, పుట – 95.

రవిక గుడ్డలు ఉత్పత్తి అయిన కారణంగా ఆ రవికలు ఆ విధంగా ప్రసిద్ధిచెంది ఉండవచ్చు.

ఇదే విధంగా మరికొన్ని రకాల రవికలు కూడా ఈ సాహిత్యంలో కనిపిస్తున్నాయి. రావిమళ్ల (రావి ఆకు పరిమాణంలో గడి కలిగిన) రవిక,[120] ఎదురు పేళ్ల (సిరిచాప అల్లిక వంటి నేత కలిగిన) రవిక[121] లను కూడా జానపద స్త్రీలు మక్కువతో ధరిస్తారు. వదులు రవికలన్నా గుజనపు రవిక[122] లేదా గుత్తపు రవిక[123] వారికి ప్రీతిపాత్రమని ఆ సాహిత్యాన్ని పరిశీలించినప్పుడు స్పష్టమవుతుంది.

వాటి స్వరూపం తెలియని పెక్కు రవికల పేర్లు కూడా జానపద వాఙ్మయంలో పొడగడుతున్నాయి. అట్టి వాటిలో బానమాని రవిక,[124] నమిలడుగు (నెమలి అడుగుల ఆకారంలో కలంకారీ పని చేసినదేమో?) రవిక,[125] బెల్లపచ్చుల రైక,[126] కనుకుట్ల కనులరైక[127] ముఖ్యమైనవి.

**వస్త్ర మేళనం** : కేవలం చీరా రవికా ధరించటమే గాక ఆ ధరించటంలోనూ ఎంతో సౌందర్యాన్ని, ప్రత్యేకతను ప్రదర్శిస్తుంది జానపద స్త్రీ. చీర ఏరంగులో ఉంటే జాకెట్టును కూడా అదే రంగులో కుట్టించుకొని ఆధునిక స్త్రీ రంగుల సమ్మేళనాన్ని సాధించి తన్మూలంగా సౌందర్య సముజ్జ్వలత్వాన్ని ప్రదర్శించటానికి ప్రయత్నిస్తుంది. అంతే గాకుండా చీరకు, జాకెట్టుకు తగినట్లుగా అదే రంగు బొట్టు, గాజులు, చెప్పులు ధరించటం నేటి ఫ్యాషను. దీనినే మ్యాచింగు (matching=ఏకరూపత) అంటారు. అత్యాధునికమైన (1976-80 సంవత్సరాల మధ్యకాలం) ఫ్యాషను ఏమిటంటే సాదా చీరల మీద చుక్కల రవికలు, చారల రవికలు; లేత రంగు చీరల మీద ముదురు

[120] మున్నీరు, పుట – 44.
[121] పైదే, పుట – 214.
[122] పైదే, పుట – 456.
[123] జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 12.
[124] మిన్నేరు, పుట-145.
[125] జానపద కళా సంపద, పుట – 174.
[126] త్రివేణి, పుట – 87.
[127] పల్లెపదాలు, పుట – 239.

రంగు రవికలు; ముదురు రంగు చీరలమీద లేత రంగు రవికలు ధరించటం. ఒక్కొక్కప్పుడు ముదురు రంగు చీరలు కట్టినప్పుడు దానికి వ్యతిరేకంగా తెల్లని జాకెట్టు ధరించి రంగుల విభిన్నత్వం ద్వారా సౌందర్యాన్ని సమున్మేషం చేయటానికి కూడా ఆధునిక స్త్రీ ఉత్కంఠిస్తుంది. ఇట్టి రంగుల సమ్మేళనాన్ని జాన పద స్త్రీ ఏనాడో సాధించిందంటే ఒకింత ఆశ్చర్యం కలగక మానదు. ఒకప్పటి ఫ్యాషనైన బుట్ట చేతుల రవికలు కూడా ఈ మధ్య స్త్రీలు ధరిస్తున్నారు. దీనిని బట్టి చరిత్ర పునరావృతమైనట్లే ఫ్యాషన్లు కూడా పునరావృతమవుతున్నట్లు స్పష్టపడుతున్నది.

"నల్లగొండ నక్కిరైకె నాకె తెస్తానంటివో
బోనగిరి బొట్లు చీరె నాకె తెస్తానంటివో"[128]

అని అనటంలో సౌందర్యంతో పాటు వస్త్రధారణలోని అందం కూడా ఈ పంక్తిలో గోచరిస్తుంది. భువనగిరిలో తయారయిన చుక్కల చీరతోపాటు నక్కీ రవికను తొడగటం చక్కదనానికి నిక్కగా జానపదస్త్రీ భావించి ఉంటుంది.

ముంగివన్నె చీరతోపాటు ముత్యాల రవికను[129], ఆకుపచ్చ చీరతోపాటు అద్దాల రవికను,[130] నీలవన్నె చీరతో పాటు నింబోలు (నీలివన్నె) రవికను,[131] పట్టంచు చీరతో పాటు పట్టుబట్టరవికను[132] ధరించటం అందానికొక పద్ధతిగా కన్పిస్తుంది.

కరకంచు చీరతో చుక్కల రవికను తొడుక్కోవటం,[133] చుక్కలకోక కట్టుకొని చుట్టూ గోడున్న రవిక తొడగటం,[134] నల్ల చీరతో నెమలంచు రవిక నలంకరించు కోవటం,[135] జల్తారు చీరతో అద్దాల రవికను అందగించు కోవటం,[136]

---

[128] తెలంగాణ, పల్లెపాటలు, పుట – 162.
[129] పైదే, పుట – 158.
[130] పైదే, పుట – 159.
[131] పైదే.
[132] పైదే, పుట -159.
[133] మధుర కవితలు, పుట – 229.
[134] మిన్నేరు,పుట – 450.
[135] మున్నీరు, పుట – 113.
[136] సరాగాలు, పుట – 39.

కాట్రేని చీరతో గోటేసిన రవిక తొడుక్కోవటం,[137] వంగపడు చీరతో వాణీయంచు రవిక చేకూర్చటం,[138] ఉల్లిమల్ల చీరతో ఉడతంచు రవిక తొడుక్కోవటం,[139] చుట్టూ చెంగావి చీరతో చుక్కలున్న రవిక చక్కదిద్దుకోవటం[140] పరిపాటిగాఉన్నట్లు జానపద వాఙ్మయం సాక్ష్యమిస్తున్నది. జానపద వాఙ్మయంలో వస్త్రధారణలో ఇట్టి కలయికలు స్త్రీ స్వభావోచిత సౌందర్యదృష్టికి నికషోపలంగా భావింవచ్చు.

పచ్చచీర మీద పట్టంచు రవిక,[141] ఎర్రచీర మీద నల్లంచు రవిక,[142] చుట్టూ జల్తారు ఉన్న చీరతో మల్లె మొగ్గల రవిక[143], పూలచీరతో పూసలరైక,[144] జల్తారు పట్టుచీరతో రంగైన రత్నాల రవిక,[145] బాణాల చీరతో బొమ్మంచు రవిక,[146] కలిపి ధరించటం వస్త్రధారణలో అప్పటి పద్ధతిగా భావించవచ్చు.

అందంగా గవ్వాక్షుల చీరగట్టి కుందనపు పూలరవిక తొడుక్కొని ఒకమారు,[147] పట్టంచుల చీర మీద మెరిసే పంచవన్నెల రవికను ధరించి మరొక మారు,[148] కరకంచుల చీరతో పట్టు కంకణాల రవికతొడుక్కుని వేరొకమారు,[149] అవపూల చీరతో మెరిసే అద్దాల రవిక తొడుక్కుని ఇంకొక పర్యాయం,[150] పొన్నపూల చీరతో ఎర్రని పొగడపూల రవిక తొడుక్కుని వేరొకతరి,[151] తెల్లనిచీరమీద

137 మిన్నేరు, పుట – 369.
138 మున్నీరు, పుట -111
139 పైదే.
140 పైదే.
141 పైదే, పుట – 113.
142 పైదే.
143 మిన్నేరు, పుట-143.
144 పల్లెపదాలు, పుట – 241.
145 పైదే, పుట -86.
146 పైదే, పుట -200.
147 మిన్నేరు, పుట – 224.
148 పైదే, పుట – 306.
149 పైదే.
150 పైదే.
151 పైదే.

నిండా మొగ్గలున్న రవిక తొడుక్కుని మరో పర్యాయం,[152] ఒక్కొక్కప్పుడు తోపుచీర కట్టుకొని తోపు రంగువికనే తొడుక్కొని[153] జానపద స్త్రీ కనులకింపుగా కనిపిస్తుంది.

బటానీల కోక మీద తన ప్రియుడు కన్నేశాడని, శనగపువ్వుల రవిక మీద చేయ్యేశాడని[154] తోటి స్త్రీల వద్ద వాపోతుంది ఒకానొక కొంటె కోణంగి.

చెంగావి జరీయంచు చీరలిస్తానని, రంగురంగుల ముత్యాల రవిక లిస్తానని[155] ప్రియురాలిని ప్రలోభపెట్టే ప్రియులు కూడా ఈ వాఙ్మయంలో కనిపిస్తారు.

అలక వహించిన భార్యను సంతకు వెళ్లి సరిగంచు చీర, అద్దాల రవిక తెస్తానని[156] అనునయించే భర్తలూ ఈ సాహిత్యంలో గోచరిస్తారు.

ఈ రీతిగా చీరకు సరిపడే రవిక, రవిక కనువైన చీర కట్టుకొని జానపద మహిళ తన నిసర్గ శారీరక సౌందర్యానికి అనుకూలమైన వస్త్రధారణా సమ్మేళనంతో సాక్షాత్కరించటం ఎంతో సరసంగా సహృదయ రంజకంగా గోచరిస్తుంది.

జానపదులు జీవితాన్ని ఒక కళగా తీర్చిదిద్దుకొనే వారని, వారికి జీవితాశయాలు, ఆశలతో పాటు ఎంతో సౌందర్యదృష్టి ఉందని చెప్పటానికి పైన నిరూపించిన వస్త్రాలంకరణమే నిదర్శనం.

## 2. కేశాలంకరణం

వస్త్రధారణ తరువాత స్త్రీ చేసే పని కురులు ముడుచుకోవటమే. కురుల చిక్కుతీసి, తిన్నని పాపటతో జడనల్లుకోవటమో, కొప్పు ముడుచు కోవటమో చేస్తుంది. కేశసంపద స్త్రీ సౌందర్యాన్ని ఇనుమడింపచేస్తుంది. అందుకే స్త్రీని అత్తవారింటికి పంపుతూ 'వీథిలో తలవిప్పి కురులు ముడవొద్దు' అని సలహాచెప్తారు. ఎందుకంటే కేశసంపదపై అందరి చూపులూపడి దృష్టిదోషం తగిలి నశించి

[152] మిన్నేరు, పుట- 306.
[153] పైదే.
[154] జానపద గేయాలు, ప్ర.సం. పుట -94.
[155] తెలంగాణ పల్లెపాటలు,పుట -121.
[156] మున్నీరు, పుట – 216.

పోకూడదనే జాగ్రత్త కోసమే, ఆధునిక స్త్రీలు సహజ కేశసంపద కొరవడ్డ కారణంగా కృత్రిమ కేశసంపద కోసం ఆరాటపడుతున్నారు. జానపద స్త్రీకి ఈ కొరత లేదు. నిరంతరం చెమటోడ్చే శరీరం గనుక మంచి ఆరోగ్యానికి చిహ్నంగా సమంచితమైన కేశసంపద ఆమెకు నిసర్గంగానే సంప్రాప్తించింది.

పాణిని తలదువ్వుకోవటంలో ఎన్నో రీతుల్ని, రకరకాలుగా ముడులు ముడుచుకోవటంలోని తీరుతెన్నుల్ని పేర్కొన్నట్లు శ్రీమతి జె.వరలక్ష్మిగారు వివరించారు.[157]

జానపద స్త్రీకి జడలల్లుకోవటం కన్నా కొప్పులు దిద్దుకోవటంలోనే ఎక్కువ ఆసక్తి ఉన్నట్లు తోస్తున్నది. ఎప్పుడూ పనిపాటలలో నిమగ్నమయ్యే ఆమెకు కేశాలు పాశాలు కాకూడదని భావించి ఉండవచ్చు. అందుకేనేమో పరిశీలిత జానపద వాఙ్మయంలో ఒకటి రెండు చోట్ల తప్ప జడల ప్రసక్తి కనిపించటం లేదు.

"పువ్వాడ చిన్నదానా
పువ్వాల జడదానా
పువ్వాల జడమీద
మనసంత నీకే"[158]

అని ప్రియుడు జడ అల్లుకొని పువ్వులు పెట్టుకొన్న జానపద కన్యకు తన మనసునర్పించుకోవటంలో విడ్డూరం లేదు.

అంతటితో తృప్తిపడక ఆ జడ పొడవును కూడా వర్ణిస్తున్నాడు. బారెడంత జడట.[159] బారెడంత జడతో ముద్దు లొలుకుతున్న తన ప్రియురాలిని చూస్తే మనసు నిలవదట.

వాలుజడ జానపద ప్రియుడ్నే కాదు అటు శిష్టకవుల్నీ, ఇటు సినీదర్శకుల్ని, చిత్రకారుల్ని, నృత్య కళాకారుల్ని కూడా విశేషంగా ఆకర్షించింది. సత్యభామ

157 యుగయుగాల్లో భారతీయ మహిళ, పుట – 128.
158 జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 13.
159 పల్లెపదాలు, పుట – 168.

వాలుజడ ఎంతో ప్రసిద్ధి పొందింది. ఆ జడతో సత్యభామచేసిన విన్యాసాలు, సత్యాకృష్ణుల మధ్య శృంగారోద్దీపనకు ఆ జడ ఏవిధంగా కారణయిందో, కోపం వహించినప్పుడు ఆ జడ పోషించిన పాత్ర ఎట్టిదో సహృదయరంజకంగా వర్ణించారు శ్రీ నందితిమ్మనగారు పారిజాతాపహరణ కావ్యంలో. ఆ సన్నివేశాలు తెలుగు పాఠకుల మనసులలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నాయి. అందుకే కూచిపూడి నాట్యంలో సత్యభామ జడ ఒక ప్రత్యేకతను సంపాదించుకుంది. ఆ జడ ప్రదర్శనతోనే నాట్యం ప్రారంభమవుతుంది.

రంగులకే హంగులద్ది, గీతను నాతిని చేసి, కుంచెతో ప్రాణంపోసే అపరబ్రహ్మ, చిత్రకారుడు, సినీ దర్శకుడు అయిన శ్రీ బాపూగారికి వాలుజడంటే ప్రాణం. ఆయన కుంచెతో ప్రాణంపోసుకున్న స్త్రీమూర్తులకు తెగబారెడు జడ ఉంటుంది. అది పిరుదులు దాటి, మోకాళ్లు దాటి ఠీవిగా ఉంటుంది. ప్రపంచవ్యాప్తంగా 'బాపూగారి బొమ్మ'గా ముద్రవేసుకొని ప్రఖ్యాతి వహించిన చిత్రంలోని స్త్రీమూర్తివల్ల ఆ జడకు అందం వచ్చిందో, ఆ జడవల్ల స్త్రీమూర్తికి అందం వచ్చిందో తేల్చి చెప్పటం కష్టం. ఆ రెంటికీ అవినాభావ సంబంధం. హరివిల్లు అందాలు, సెలయేటి వంపులూ వయ్యారాలూ ఆ జడకే స్వంతం. బొమ్మలలోనే కాదు తాను దర్శకత్వం వహించిన సినిమాలలోనూ ఆయన జడను ప్రత్యేకంగా చూపిస్తుంటారు.

జానపద స్త్రీకి అంత పొడవైన జడవేసుకోవటానికి సరిపడా కేశసంపద ఉన్నప్పటికీ కొప్పులనే తీర్చిదిద్దుకుంటుంది. జుట్టున్నమ్మ ఏ కొప్పు పెట్టుకొన్నా అందమే. ముంతంత కొప్పులు,[160] తవ్వంత కొప్పులు,[161] కడవంత కొప్పులు,[162] కొండంత కొప్పులు,[163] చిన్నారి కొప్పులు,[164] కోరకొప్పులు[165] పెట్టుకొన్న స్త్రీలు

160 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 76.
161 పల్లెపదాలు, పుట -50.
162 పైదే, పుట – 109.
163 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 57.
164 పైదే, పుట – 18.
165 మిన్నేరు, పుట – 334.

వేరువేరుగా కనుల పండువుగా కన్పిస్తారు. ముంతంత కొప్పు మీద మూడు చేమంతి పూలు ఏ రాజు పెట్టాడే పిల్లా అని ప్రశ్నించటంలో వారి సుస్నిగ్ధ నిసర్గ ప్రణయ నిస్తుల భావన ప్రస్తుతింప దగ్గది. తవ్వంత కొప్పుమీద గుప్పెడేసి పూలు పెట్టుకొని ఒకమారు, కడవంత కొప్పుచుట్టూ కలువపూలు చుట్టుకొని వేరొకమారు, కొండంత కొప్పుమీద జాజులలంకరించుకొని మరొక మారు, కోరకొప్పుమీద కోరింట (గోరింట) పూలు చక్కదిద్దుకొని వేరొక పర్యాయం జానపదస్త్రీలు ఆయా సమయాలలో అందాల రాజ్యమేలే రాణులుగా జానపదుల్ని ఆకర్షించేవారు.

కొండంత కొప్పుతో కోర్కెలు తీర్చే కులీన జానపద స్త్రీ. పూలచీర కట్టుకొని, పూసలరైక తొడుక్కొని, నీలాల కొప్పు పెట్టుకొని దానిపై పూలదండలు చుట్టుకొని సాక్షాత్కరించే జానపద స్త్రీ సాక్షాత్తుగా సౌందర్య దేవతే అని భావించవచ్చు.[166]

## 3. ఆభరణాలంకరణం

" 'అలంకారప్రియో విష్ణుః' అని హిందువులు విశ్వసింతురు. అలంకరణము మానవుని స్వభావం కూడ. అలంకరణము మానవుని హృదయమును రంజింపచేసి ఆహ్లాదమును కూర్చును. 'సత్యం', 'శివం', 'సుందరం' అనునట్టి ఆ పరతత్త్వ పరిణతదశను సౌందర్య స్వరూపముననే ఆరాధించుట గాంచగా సౌందర్యము ఇహపరములు రెంటికిని సాధనమని తెలయగలదు. సౌందర్యము ప్రతి వస్తువులోను అంతర్గతముగ వెలుగుచున్న యొక శివి."[167]

అటువంటి సౌందర్యాన్ని కలకాలం కాపాడుకోవాలని స్త్రీలు తాపత్రయ పడటంలో వింత ఏమీలేదు. సౌందర్యోద్దీపనానికుపయోగించే సాధన సామగ్రిలో ముఖ్యమైనవి ఆభరణాలు. స్త్రీ సహజంగా ఆభరణాలంకార ప్రియ అంటుంటారు. కానీ ఇది పూర్తిగా నిజం కాదనిపిస్తుంది. ఎందుకంటే పురుషులు కూడా ఆభరణాలు ధరిస్తారు.

అమరావతీ స్తూప నిర్మాణ కాలంలోని స్త్రీ పురుషుల వేషాదికాల్ని వర్ణిస్తూ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "స్త్రీలును పురుషులును కొన్ని సమానాభరణములను

[166] పల్లెపదాలు, పుట – 241.

[167] సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశం మొదటి సంపుటం, పుట – 337.

ధరించిరి. వారిలో కొందరు చెవులలో బరువైన పోగులను మరికొందరు ఒక్కొక్క చెవికి రెండు పోగులను, వేరొక కొందరు పూసల వరుసలు జోడించిన పోగులను కూడ ధరించుచుండిరి. స్త్రీ పురుషులుభయులును దండకడెములును, కంకణములను ధరించువారు" అని పేర్కొన్నారు.[168]

పైన పేర్కొన్న ఆభరణాలేగాక వివాహిత స్త్రీలు ధరించే మట్టెలు కూడ పురుషులు ధరించటం కొంత ఆశ్చర్యమనిపిస్తుంది. "మట్టియలొండొంటిబిట్టు దాకగ నేలనందంద మునిగాళ్ల నప్పళించు"[169] అని తిక్కన కీచకుడు మట్టెలు ధరించినట్లు వర్ణిస్తాడు. ఇప్పటికీ రాయలసీమలోని కొన్ని నిమ్నజాతుల పురుషులు మట్టెలు ధరించటం సర్వసామాన్యం. నేటి కాలపు పురుషులు కూడ చెవులకు, ముక్కుకు, మెడకు, ముంజేతికి, వ్రేళ్లకు ఆభరణాలు ధరించటం చూస్తూనే ఉన్నాం.

స్త్రీలను పరిశీలించినప్పుడు ఈ ఆభరణ ప్రీతి భారతీయ స్త్రీలలోనే ఎక్కువనిపిస్తుంది. భారతీయ స్త్రీలు ఆభరణాలు అలంకరించుకోవటం తమ జన్మహక్కు అనుకోవటమే గాదు అవి సౌభాగ్య చిహ్నమని భావిస్తారు. అసలు సహజ సౌందర్యం గల స్త్రీకి ఈ ఆభరణాలు అవసరం లేదేమో! అందుకే కవికుల గురువు కాళిదాసు ఆశ్రమాల్లో స్త్రీలు సహజాలంకార సంశోభితలనీ మధురమైన ఆకారానికి మండనాలు అవసరం లేదని పేర్కొన్నాడు.[170]

అంతమాత్రంచేత అభరణాలు అసలే అవసరంలేదని భావించాల్సిన పనిలేదు. ఆభరణాలు సహజ సౌందర్యాన్ని ఇనుమడింపచేస్తాయి. కాంత ఎంత ఆకర్షణీయురాలైనప్పటికి భూషణరహిత అయినప్పుడు ఆ ముఖం శోభించదు.[171]

---

168 విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట – 135.

169 శ్రీమదాంధ్ర మహాభారతం, విరాట పర్వం, 2-250.

170 "సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయమధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వి
కిమివహి మధురాణాం మణ్డనం నాకృతీనామ్?" – అభిజ్ఞాన శాకున్తలమ్,1-15

171 "నకాంతమపి నిర్భూషం విభాతి వనితా ముఖమ్" – కావ్యాలంకారం,
సాహిత్యదర్పణ నుండి, పుట -64.

అలంకార శాస్త్రజ్ఞులు అలంకారాలు ఉద్దీపన విభావాలుగా భావించారు. శృంగార రసావిష్కారానికి ఇవి విశేషంగా తోడ్పడుతుంటాయి. జానపద సాహిత్యంలోనూ ఈ ఉద్దీపన విభావాలు గోచరిస్తున్నాయి.

సహజ సౌందర్య శోభిత అయినప్పటికీ జానపద స్త్రీ యథోచితంగా ఆభరణాల్ని ఆకాంక్షించినట్లు, అలంకరించుకొన్నట్లు జానపద వాఙ్మయం నిరూపిస్తున్నది. ఆభరణప్రీతి జానపద కన్యలలో కంటే వివాహితులలోనే విశేషంగా కన్పిస్తుంది.

నాగరక స్త్రీలు తమ తమ ఐశ్వర్యం కొలదీ వివిధాభరణాలు విశేషంగా ధరిస్తుంటారు. విశేష ధన సంపన్నులైన స్త్రీలు ఏడువారపు నగలు ధరిస్తారు.[172] ఇంతటి ఆభరణ భారం జానపద స్త్రీకి లేకపోవచ్చు. అసలే నిరాభరణ కాదు.

జానపద సాహిత్యంలో నిరూపితమైనంత మేరకు జానపద స్త్రీ ధరించిన వివిధాభరణాల్ని వింగడించి వివరించటానికి ప్రయత్నిస్తాను.

ఆభరణాల్ని ప్రధానంగా రెండు రకాలుగా విభజించవచ్చు. 1. అత్యవసరాలు - గాజులు, కమ్మలు, ముక్కుపుడక, కడియాలు, అందెలు, వివాహిత ధరించే మాంగల్యం, మట్టెలు, నల్లపూసలు మొదలైనవి. 2. ఆడంబరాలు – మెడలో వేసుకునే చంద్రహారం వంటి హారాలు, గొలుసులు, శిరోభూషలు, బాజాబందులు, వంకీలు, వడ్డాణం మొదలైనవి.

భరతముని నాట్యశాస్త్రం ప్రకారం రూపకానికి ఆహార్యం ప్రాణం వంటిది. 'నాట్యప్రయోగంతయు నాహార్యనిష్టమైయున్నదని భరతముని భావము'.[173] పుస్తము, అలంకారము, అంగరచన, సంజీవము అనే ఈ నాలుగు ఆహార్యంలోని అంశాలు. రూపకం లోకవృత్త ప్రతిబింబితం. కనుక భరతముని రూపకానికి చెప్పిన విశేషాలు సామాజికపరంగా అన్వయించుకోవచ్చు. నాట్యశాస్త్రం ప్రకారం ఆభరణాలు

---

172 వారంపు సొమ్ములు మందపమ్మూలు

- - - - - - - - - - - - - - - - - -

ఇవిగోనె చెల్లెలా అరణమ్ము నీకు – మున్నీరు, పుట – 62.

173 "ప్రయోగః సర్వోయ మాహార్యాభినయ స్థితః" – నాట్యవేదము, పుట -489.

నాలుగు విధాలు.[174] ముక్కు, చెవులు కుట్టి ధరించే ఆభరణాలు ఆవేధ్యాలు, మొలనూలు, భుజకీర్తులు, దండకడియాలు, హస్త కడియాలు మొదలైనవి బంధనీయాలు. నూపురం మొదలైన కాలి ఆభరణాలు ప్రణేప్యాలు, కంఠహారాదులు ఆరోప్యాలు.

**1. అత్యవసరాలు :**

**హస్తాభరణాలు** : స్త్రీ ధరించే అత్యవసరాభరణాల్లో గాజులు ముఖ్యమైనవి. ఈ గాజులు రకరకాలు. మట్టి, రబ్బరు, వెండి, బంగారం, ముత్యాలు, అద్దాలు వంటివి ఉపయోగించి వైవిధ్యభరితమైన గాజులు తయారు చేస్తారు. ఆడపిల్ల పుట్టినప్పటినుండీ గాజులు అలంకరిస్తారు. భర్త చనిపోయినప్పుడు భార్యకు బొట్టు, పూలతో పాటు గాజుల్ని కూడా తీసివేసే ఆచారం ప్రబలిన తర్వాత మట్టిగాజులు అలంకరించుకోవటం ముత్తయిదువ లక్షణాలలో ఒకటిగా భావింపబడుతున్నది. (ముత్తయిదువ=ఐందువ=ఐదు లక్షణాలు కలది. బొట్టు, పూలు, గాజులు, తాళి, మట్టెలు).

జానపద స్త్రీ వివిధ రకాల గాజుల్ని శోభాయమానంగా ధరించినట్లు ఎన్నో గేయాలు నిరూపిస్తున్నాయి. తల్లి పసిపాపని ఆడిస్తూ గాజుల శెట్టిని తన పాపకోసం తేనెగాజులు (తేనె రంగు గాజులు), ఎఱ్ఱ గాజులు, నీలి గాజులు, పచ్చ గాజులు, నల్ల గాజులు, గుడ్ల గాజులు (చుక్కలగాజులు) తెమ్మని కోరటంలో[175] ఇవి కేవలం పసిపాపకు తొడగటానికే గాక ఆనాటి స్త్రీలు వీటిని ధరించి ఉంటారని చెప్పవచ్చు. పైన పేర్కొన్నవి మట్టిగాజులు. ఇటువంటి మట్టిగాజుల్నేగాక ఎన్నో ఆడంబరోపేతమైన గాజుల్ని కూడ జానపద స్త్రీ ధరించింది. వాటిలో కాకినాడ గాజులు[176]

---

[174] "ఆవేధ్యం కుండలాదీహ యత్స్యాత్ శ్రవణ భూషణం
శ్రోణీ సూత్రాంగదే ముక్తాబంధనీయాని సర్వదా
ప్రణేప్యం నూపురం విద్యాద్వస్త్రాభరణ మేవచ
ఆరోప్యం హనుసూత్రాది హారాశ్చ వివిధాశ్రయాః" – నాట్యశాస్త్రం, పుటలు- 602-603,
- నాట్య వేదము నుండి , పుట – 492.

[175] సెలయేరు, పుట – 23.

[176] పల్లెపదాలు, పుట -95.

ఒకరకం. ఇవి కాకినాడలో తయారయి ప్రసిద్ధిగాంచినవి అయ్యుండవచ్చు. సూడి గాజులనే వేరొక రకపు గాజులు కూడ ఈమె ధరించింది. సూడిగములు,[177] సూడిగాజులు ఒకటేనని భావించవచ్చు.

ఇంకా నాజూకు తెలిన జానపద నారీమణులు బిళ్లారిగాజులు[178] చేమంతి గాజులు,[179] సెనగపూ గాజులు,[180] చీరించు గాజులు,[181] గీరు గాజులు,[182] అద్దాల గాజులు,[183] రాళ్ల గాజులు,[184] బంగారు గాజులు,[185] పట్టెగాజులు[186] మొదలైన వివిధరకాలైన గాజులతో అలరారేవారు. బిళ్లారి గాజులంటే సన్నని కడియంపై అక్కడక్కడ డైమండ్ ఆకారంలోగాని గుండ్రంగాగాని బిళ్లలు తాపడం చేసి ఉండేవి. ఈ బిళ్లల్నే చేమంతిపూల ఆకారంలోగాని శనగపువ్వుల ఆకారంలోగాని తాపడం చేస్తే ఆయా పేర్లతో పిలుస్తారు. రవికలపై అద్దాల్ని కుట్టినట్లుగానే చిన్న చిన్న అద్దాల బిళ్లల్ని కడియంపై పొదిగినట్లయితే వాటిని అద్దాల గాజులంటారు. రాళ్లగాజులు రాళ్లతో చేసేవి. ఈ రాళ్లు తెలుపువి కావచ్చు రంగులవి కావచ్చు. బంగారు గాజులు కేవలం బంగారంతో చేసేవి. పట్టె గాజులు కేవలం వలయంలా పైన ఉబ్బెత్తుగా కాకుండా పైన అణచినట్లుగా వెడల్పుగా ఉండేవి. చీరించు గాజులంటే గాజుకి రెండు వైపులా రంపపు పళ్ల మాదిరిగా పొడుచుకొని వచ్చిన కొనలుంటాయి. గీరుగాజులంటే ఏమిటో సరియైన అర్థం స్పష్టపడటంలేదు.

---

177 సూడిగము = 1. చేతి కడియము, ఆభరణము, 2. ఆడుదాని చేతి గాజులు.
"లలన సాక్షాత్కరించిన లక్ష్మివోలె, గంకణంబులతో సూడిగ
ములరయ విశ్వనాథుని కల్యాణవేదియందు ముగ్గువెట్టంగ"
— కాశీఖండం, పుట -5-145. – సూ.ని.

178 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 61.

179 మున్నీరు, పుట – 315.

180 త్రివేణి, పుట- 138.

181 మున్నీరు, పుట – 315.

182 త్రివేణి, పుట – 40.

183 పైదే.

184 పైదే.

185 తెలంగాణ పల్లెపాటలు, పుట – 78.

186 త్రివేణి, పుట – 40.

ఇవేకాకుండా

"చూలింత గాజుల్లు చుక్కగాజుల్లు"
"బాలింత గాజులు భద్రకేళీలు"[187]

అనే ప్రయోగాల వల్ల ఆయా ప్రత్యేక సందర్భాలకోసం తయారుచేసిన ప్రత్యేకమైన గాజుల్ని కూడా జానపద స్త్రీలు వాడినట్లు తెలుస్తున్నది.

కేవలం గాజులేకాకుండా ఆడంబరోపేతమైన కంకణాలు[188] (వీటికే హస్తకంకణాలని కూడా పేరు),[189] మురుగులు,[190] మురిడీ గొలుసులు,[191] కడియాలు,[192] చామంతి కడియాలు,[193] పచ్చల కడియాలు[194] మొదలైన ఆభరణాలతో తమ ముంజేతులకు మురువు చేకూర్చే వారని జానపదసాహిత్యం సాక్ష్యమిస్తున్నది.

కంకణము అంటే ముత్తెములు, పగడములు లోనగు వాని జేర్చి గ్రువ్వబడిన చేసరము అని శ.ర., జానపద స్త్రీ ముత్యాలు, పగడాలు చేర్చిన కంకణాలు ధరించకపోయినా బంగారంతో చేసిన కంకణాలనయినా ధరిస్తుంది. సుమారు చిటికెనవ్రేలి లావు గల బంగారు కడ్డీని వలయంలా మారిస్తే ఏర్పడేదే కడియం. ఈ కడియానికి పైన చేమంతి పువ్వు ఆకారంలో బిళ్లలు తాపడం చేస్తే దాన్ని చామంతి కడియం అంటారు. నవరత్నాలలో ఒక రకమైన పచ్చలతో గాని లేదా ఆకుపచ్చ రాళ్లతోగాని పొదగబడిన కడియం పచ్చల కడియం.

---

187 త్రివేణి, పుట – 68.
188 పల్లెపదాలు, పుట -34.
189 మున్నీరు, పుట – 16.
190 మిన్నేరు, పుట – 129
191 సరాగాలు, పుట – 60.
192 పల్లెపదాలు, పుట – 171.
193 సరాగాలు, పుట – 149.
194 మిన్నేరు, పుట – 124.

కేవలం ముంజేతికేగాక ఆపై భాగమైన దండకి కూడా బాజాబందులు[195] వంటి ఆభరణాన్ని ఆడంబరోపేతంగా ధరించిన జానపద స్త్రీలు ఈ సాహిత్యంలో సాక్షాత్కరిస్తున్నారు.

చేతి వ్రేళ్లను కూడా అలంకరించుకోవటం జానపదాంగనకు ప్రీతిపాత్రం. వ్రేళ్లకు అలంకరించుకునే ఆభరణాలు ఉంగరాలు.[196]

**నాసికాభరణాలు** : అత్యవసరాభరణాల్లో ముక్కుపుడక మరొక ప్రధానమైన ఆభరణం. షోడశ జాతక కర్మలలో ముక్కు చెవులు కుట్టించటం ఒక కర్మ (చౌలవిధి). అందుకే సంవత్సరం లోపునే పిల్లలకు అబ్బాయిలైనా అమ్మాయిలైనా బేసి సంఖ్య నెలల్లో వారి వారి కుటుంబ సంప్రదాయాన్ని బట్టి పుట్టల వద్దగానీ, దేవాలయాల్లో గానీ లేదా ఇళ్లవద్దగానీ పుట్టువెంట్రుకలు తీయించటం, చెవులు ముక్కులు కుట్టించటం జరుగుతుంది. ఆ రంధ్రాలు కొంచెం పెద్దవయ్యే వరకు రాగితో గాని, బంగారంతోగాని సన్నని తీగలాచేసి దాన్ని వలయంగా మార్చి చెవులకు, ముక్కుకు అలంకరిస్తారు. రంధ్రాలు కొంచెం పెద్దవయ్యాక వారి వారి ఆర్థిక స్తోమతను బట్టి రకరకాల ఆభరణాలు ధరిస్తారు. సామాన్య స్త్రీలు ఒంటి రాయి పొదిగిన కేవలం కాడలాంటి ముక్కుపుడకను ధరిస్తారు.[197] సంపన్నులైన స్త్రీలు వివిధ రంగుల రాళ్లు, మణులు, ముత్యాలు లేదా వజ్రం పొదిగిన ముక్కుపుడకను అలంకరించు కొంటారు.[198] ముక్కుపోగు[199] నుకూడా ధరిస్తారు. కాడవలె ఉండేది ముక్కుపుడక. ముక్కురంధ్రంలో పైనుండి లోపలికి దూర్చి సీలను బిగిస్తారు. పైన రాయి ఉంటుంది. ముక్కపోగు అనేది వలయంలా ఉంటుంది. ముక్కు పై నుండి ముందుకు రానిచ్చి మరల లోపలి నుండి పైకి తిప్పి మెలిక వేస్తారు. పైన రాయి ఉంటుంది. ఇటువంటి ముక్కుపోగులను రాయి లేకుండా పురుషులు కూడా ధరిస్తారు. అంతేగాక బేసరి[200]

---

195 పల్లెపదాలు, పుట- 34.
196 త్రివేణి, పుట – 104.
197 పల్లెపదాలు, పుట – 155.
198 తెలంగాణ పల్లె పాటలు, పుట – 121.
199 పల్లెపదాలు, పుట – 160.
200 మున్నీరు, పుట – 194.

అనే నాసికాభూషణాన్ని కూడా జానపద స్త్రీలు ధరించేవారని తెలుస్తున్నది. ఈ బేసరిలో చాలా భేదాలున్నాయి. ముద్ద బేసరి, 'ఆ' బేసరి, కళావర్ బేసరి, శ్రీ బేసరి, పట్నం బేసరి మొదలైనవి. మూడు రాళ్లతో చేసేది కళావర్ బేసరి. మూడు లేక ఐదు రాళ్లతో చేసేది 'ఆ' బేసరి. శ్రీ బేసరి కూడా ఐదు రాళ్లతోనే చేస్తారు. అయితే ఒక్కొక్క రకానికీ ఆకారంలో తేడా ఉంటుంది. జానపద స్త్రీ బేసరి ధరించినట్లు తెలిసినా ఎటువంటి బేసరి ధరించిందో గేయాలలో స్పష్టతలేదు.

ముక్కర[201] అనే వేరొక నాసికా భూషణాన్ని కూడా జానపదాంగనలు అలంకరించుకొనేవారు. దీనికే ముక్కెర, ముంగర అనే పేర్లు కూడా వ్యవహారంలో ఉన్నాయి. ముత్యాల ముక్కర[202] కూడా ఆనాడు వాడుకలో ఉంది. శ్రీనాథుని చాటువులలో[203] ఈ ముక్కర ప్రసక్తి గోచరిస్తుంది.

నత్తు[204] అనే నాసికా భరణాన్ని కూడా జానపదాంగనలు ధరించినట్లు తెలుస్తున్నది. ఆధునిక కాలంలోని చెవిరింగువలె వలయంలా ఉండి ఒక సీలతో ముక్కులో పెట్టుకొనే ఆభరణాన్నే నత్తు అంటారు. ఈ వలయాన్ని సన్నని గొలుసుతో చెవిపోగుకు కలుపుతారు. జానపద స్త్రీ ముత్యాల నత్తు[205] కూడా విలాసంగా ధరించినట్లు జానపద గేయాలలో నిరూపితం.

అడ్డబాస[206] అనే ఆభరణాన్ని కూడా స్త్రీలు సామాన్యంగా ధరించేవారు. అడ్డబాస (భాషకి అడ్డం) ముక్కు ముందు భాగం నుండిపై పెదవి మీదికి వ్రేలాడుతుంటుంది. దీనికే ముక్కు బాస అని కూడా పేరు. దీనికే బులాకి[207] అనే వ్యవహారం ప్రచురంగా తెలంగాణ ప్రాంతంలో ఉంది.[208] క్రీ.శ. 1650 నుండి 1800 వరకు ఆంధ్రదేశం అరాచక స్థితిలో ఉండి నవాబుల పాలనకు లోబడటాన తురకల

---

[201] మున్నీరు, పుట – 127.
[202] మిన్నేరు, పుట – 133.
[203] "---హురుమంజి ముత్యాల ముంగర" – చాటు పద్య మణిమంజరి, పుట -122.
[204] మిన్నేరు, పుట – 431.
[205] మున్నీరు, పుట – 23.
[206] మిన్నేరు, పుట – 426.
[207] బులాకి = అడ్డబాస, సూ.ని.
[208] మున్నీరు, పుట – 153.

ఆచారాలు కొన్ని వాడుకలోనికి వచ్చినట్లు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొన్నారు.[209] తురకల ఆచారాలతోపాటు కొన్ని ఆభరణాలు కూడా వ్యవహారంలోనికి వచ్చినట్లు, బులాకి అనేది అటువంటిదేనని, అసలది 'బులాఖ్' అనే పదమని కూడా వారు పేర్కొన్నారు.

**కర్ణాభరణాలు** : స్త్రీకి కర్ణాభరణం అనివార్యమైంది. జానపద స్త్రీ కూడా ఈ కనీసా వసరాన్ని అలంకరించుకోకుండ ఉండలేదు.

"మిట్ట పల్లలాగ మిడిసి మిడిసి పడుతుంది.
కోక కట్టుకుంది సెన్వాకు పెట్టుకుంది"[210]

అని ప్రియుడు ప్రియురాల్ని వర్ణించటాన్ని బట్టి స్త్రీలకు చెవులలో ఆకును మడిచి పెట్టుకొనే అలవాటు ఉన్నట్లు తెలుస్తున్నది. "ద్రావిడులు చెవులలో రంధ్రములు చేసి యందు తాటియాకును పెట్టుకొనుచుండిరి. ఇప్పటికిని క్రింది కులముల ముత్తైదువలు చెవ్వాకులు ధరింతురు. అది యైదువ లక్షణములలో నొక్కటి"[211] అనే శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి వివరణ వల్ల నాటి ద్రావిడాచారమే నేటికీ జానపద స్త్రీలలో నిలిచి ఉన్నట్లు భావించవచ్చు.

కానీ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సంపాదకవర్గాధ్యక్షులుగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన 'తెలుగు సామెతలు' అనే గ్రంథంలో 'చెవ్వాకు' అంటే రంగుపూసిన తాటి ఆకు చుట్టని, పేదలలో ముసలివారు చెవులలో కమ్మలకు బదులు పెట్టుకొంటారని వివరించారు.[212] కాని జానపద గేయాల్ని పరిశీలించినట్లయితే యువతులే వీటిని ధరించినట్లు నిరూపితమవుతున్నది.

క్రమక్రమంగా ఈ ఆకు బదులు లోహంతో చేసిన ఆభరణాల్ని ధరించటం అలవాటయి ఉంటుంది. కర్ణ సంబంధమైన ఆభరణాల్లో పోగులు[213] అతి

[209] విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట – 140.
[210] జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, పుట -89.
[211] విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట -1140.
[212] పుట – 179.
[213] పల్లెపదాలు, పుట – 192.

సామాన్యమైనవి. వీటినే దుద్దులు,[214] కమ్మలు,[215] కమలాలు,[216] జోడు[217] అని వివిధ ప్రాంతాల్లో వ్యవహరిస్తారు.

రాజమండ్రి రవ్వలజోడు[218] ధరించాలని, పెద్దాపురం దుద్దులజత[219] సరిదిద్దుకోవాలని జానపదస్త్రీ ఆకాంక్ష. కొన్ని ప్రాంతాలు చీరల ఉత్పత్తిలో ప్రసిద్ధిపొందినట్లుగానే ఆభరణాల ఉత్పత్తికికూడా కొన్ని ప్రదేశాలు పేరుపొందినట్లు పై గేయం వల్ల స్పష్టమవుతున్నది. ఐశ్వర్యవంతులైన స్త్రీలు ఆడంబరోపేతంగా బంగారు కర్ణపుష్పాలే[220] గాక ముత్యాల కమ్మలు[221] (ముత్యాలు పొదిగినవి) కూడా ధరించేవారు. ఇవేగాక తమ్మంట్లు[222] (తమ్మకు బాగా అతుక్కుపోయిన కమ్మలు) కూడా జానపద స్త్రీలు అలంకరించుకొనేవారు. తాటంకములు[223] కూడా వాడుకలో ఉండేవి. వీటిని దంతంతో తయారు చేస్తారు. 'తాటంకములు' అనే శబ్దం కూడా 'తాటాకు' నుండి ఏర్పడినదని, చెవ్వాకు అనేది క్రమంగా కమ్మ అనే ఆభరణమై తాటంకమన చెల్లిందనీ శ్రీసురవం ప్రతాపరెడ్డిగారి వివరణ.[224]

అవివాహితులైన స్త్రీలు లోలాకులు[225] ధరిస్తారు. ఇది చెవి కమ్మ నుండి వ్రేలాడుతూ ఉండే ఆభరణం. సంస్కృతంలో లోలకం అంటే వ్రేలాడేది అని అర్థం. కానీ ఆభరణాల పరంగా ఈ పదం ఆంగ్లభాష నుండి ఏర్పడిందే. లోలాకులనే పదం low luck అనే ఆంగ్ల పదం నుండి ఏర్పడింది. గోడ గడియారం లోలకం వలె చెవి

---

[214] మధురకవితలు, పుట 307.
[215] పల్లెపదాలు, పుట – 200.
[216] జానపద గేయాలు, ద్వి.సం, పుట – 24.
[217] మిన్నేరు, పుట -479.
[218] పైదే.
[219] పైదే.
[220] పైదే, పుట – 239.
[221] తెలంగాణ పల్లెపాటలు, పుట – 144.
[222] పల్లెపదాలు, పుట – 214.
[223] మధుర కవితలు, పుట -132.
[224] విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట -1138.
[225] మిన్నేరు, పుట – 448.

నుండి వేలాడుతూ ఊగేది కాబట్టి ఈ పేరు ఏర్పడి ఉండవచ్చు. ఆంగ్ల పదాన్ని బట్టి ఈ గేయం ఆధునికంగా కల్పింపబడిందిగా ఊహించవచ్చు.

గంటీలు[226] అనే వేరొక కర్ణభూషణాన్ని కూడా జానపద స్త్రీలు ధరించినట్లు తెలుస్తున్నది. కంటీలు గంటీలు ఒకటే. కంటీలు అనగా చెవులకు పెట్టుకొనెడు పోగులు అని సూర్యరాయాంధ్ర, బ్రౌణ్య నిఘంటువులు పేర్కొన్నాయి. వీటికి 'ఘంటీలు' అని కూడా పేరున్నట్లు సూర్యయాంధ్ర నిఘంటువు పేర్కొన్నది.

చెవి తమ్మకే కాకుండా చెవి పైభాగాన బావిలీ[227] అనే ఆభరణాన్ని ఆపేక్షతో ధరించినట్లు తెలుస్తున్నది. వీటినే బావినీలు అని కూడా అంటారు. ఈ బావినీలు కూడా మహమ్మదీయుల పరిపాలన తరువాత వారి నుండి గ్రహించినవేనని శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు అభిప్రాయపడ్డారు.[228] బావిలీలలో చిలకలబావిలీ[229] (చిలుకఆకారంలో తయారుచేసినది), నీలంపు బావిలీ[230] (నీలాలతో చేసినది), కనకపు బావిలీ[231] (కేవలం బంగారతో చేసినది), ముత్యాల బావిలీ[232] (ముత్యాలు కూర్చిచేసినది) లు ముఖ్యమైనవి. జానపదాంగన చెంప బిల్లలు కూడా మక్కువతో ధరించినట్లు నిరూపితమవుతున్నది. చెంపబిల్లలు[233] అంటే వెడల్పాటి చిన్న గొలుసువలె ఉంటుంది. దీనిని ఒక వైపు ముందువైపు చెవిపోగు గొట్టానికి తగిలించి రెండవ వైపు కొక్కెం సహాయంతో చెవిపైగాన వెంట్రుకలకు గుచ్చుతారు.

---

226 త్రివేణి, పుట – 244.

227 బావిలీ = ఆడుది కొన చెవులందు పెట్టుకొను నలంకారవిశేషము – సూ.ని.
బావిలీ = ఆడుదాని కొన చెవినగ - ఆంధ్రవాచస్పత్యము

228 విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట – 1140.

229 మిన్నేరు, పుట – 167.

230 పల్లెపదాలు, పుట – 166.

231 సరాగాలు, పుట – 49.

232 పైదే. పుట – 250.

233 తెలంగాణ పల్లెపాటలు,పుట – 107.

**కాలి ఆభరణాలు** : వివాహిత స్త్రీ ధరించే ఆభరణాలలో మట్టెలు[234] కూడా ముఖ్యమైనవి. వీటిని వివాహ సమయంలో మాంగల్యధారణ తరువాత వధువుకు మేనమామ చదివించే ఆభరణాలు. మేనమామ భార్య వాటిని వధువు కాలివ్రేలికి (బొటనవేలు ప్రక్కవేలు) తొడుగుతుంది. మట్టెల్ని సాధారణంగా వెండితో తయారు చేస్తారు. సుమారు బలపం లావు వెండి కడ్డీని వృత్తాకారంలో మలిచి చేసేదే మట్టె. ఆయా ప్రాంతాలలో వారి వారి ఆచారాలనుబట్టి ఇంతకంటే సన్నటివి లేక లావు పాటివి కూడా వాడుతుంటారు. ఒక్కొక్క వ్రేలికి రెండేసి చొప్పున ధరిస్తారు.

తెలుగు శిష్ట సాహిత్యంలో మట్టెల్ని వర్ణించిన ప్రప్రథమ కవి తిక్కన. వ్యాస భారతంలో లేకపోయినా ద్రౌపది మట్టెల్ని ధరించినట్లు వర్ణించటంలో తెలుగువారి సంప్రదాయాన్ని ఎత్తిచూపినట్లయింది.[235] మట్టెలు కేవలం వివాహిత స్త్రీలు మాత్రమే ధరిస్తారనేది అందరికీ తెలిసిన విషయమే. కాని పెద్దన మనుచరిత్రలో కన్య అయిన మనోరమ మట్టెలు ధరించినట్లు వర్ణిస్తాడు.[236] ఈ వర్ణన చిత్రమనిపిస్తుంది. ఒకవేళ పెద్దనకు సమకాలీన కాలంలో (క్రీ.శ.16వ శ.) కన్యలు మట్టెలు ధరించే ఆచారమేమైనా ఉన్నదేమో తెలియదు. ఒకవేళ ఉంటే కన్యలు ధరించే మట్టెలు, వివాహిత స్త్రీలు ధరించే మట్టెలు ఒకటే అవునో కాదో తెలియదు. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో విజయనగర సామ్రాజ్యకాలంలోని స్త్రీలు మట్టెలు ధరించినట్లు పేర్కొన్నారు గాని ప్రత్యేకంగా కన్యలు మట్టెలు ధరించినట్లు ఎక్కడా వివరించలేదు.

మట్టెలు సామాన్యంగా వెండివే అయినా సకృత్తుగా కంచు మట్టెలు[237] కూడా ధరించేవారని కొన్ని జానపద గేయాల వల్ల స్పష్టమవుతున్నది. తాళ్లపాక తిరువేంగళనాథుడు పరమయోగి విలాసంలో భోగముసానుల దగ్గర ఉండే దాసీలు

---

[234] మున్నీరు, పుట – 149.

[235] "లలితంబులగు మట్టియల చప్పుడింపార, నంచకైవడి
నల్లనలవచ్చి ---" శ్రీమదాంధ్రమహాభారతం, విరాట పర్వం, 2-64.

[236] "మట్టెల్ మ్రోయగ గబ్బిచన్నుగవ గంపంబంద వేణీ భరం బట్టిట్టై కటి జిమ్మ చీకటులుగా ---"
మనుచరిత్ర, 4-68.

[237] త్రివేణి, పుట – 175.

కంచుమట్టెలు ధరించినట్లు వర్ణించాడని శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు తమ ఆంధ్రుల సాంఘిక చరిత్రలో వివరించారు.[238]

కేవలం సాదా మట్టెలే కాకుండా గురుగు మట్టెలు,[239] గిలుకు మట్టెలు,[240] చుక్కమట్టెలు,[241] కంకెడు కంకెడు మట్టెలు[242] కూడా జానపద స్త్రీలు ధరించినట్లు తెలుస్తున్నది. మట్టెల పైభాగాన గజ్జలుండేటట్లు (మ్రోగని) చేసేవి గురుగు మట్టెలు. మెరుస్తుండేవి గిలుకు మట్టెలు. మట్టెల పైభాగాన నక్షత్రం ఆకారంతో చేసేవి చుక్కమట్టెలు. కంకెడు కంకెడు మట్టెలంటే సన్నని మ్రోగని గజ్జెలను పై భాగంలో గుత్తిగా ఏర్పాటు చేసేవి. కంకెడు కంకెడు మట్టెలనగా పెద్ద పెద్ద మట్టెలని అర్థం. చుట్లు[243] అనేవి కూడా ఒక రకం మట్టెలే. సన్నని వెండి తీగతో రెండు వలయాలుగా చుడతారు. పైకి రెండు మట్టెలుగా కనిపిపించినా ఇవి రెండు కాదు. ఒకే తీగను రెండుగా చుట్టి అడుగు భాగాన కొనలు వదిలివేస్తారు. చుట్టగా (గుండ్రంగా) చుట్టి చేసేవి కనుక వీటికి చుట్లు అనే పేరు వచ్చింది. కొన్ని ప్రాంతాల జానపదాంగనలు వీటిని కూడా ధరించినట్లు తెలుస్తున్నది.

"సూరన్న యిచ్చాడూ
చుట్లూ మట్టెల్లూ"[244]

అని అనటంలో చుట్లు, మట్టెలు రెండూ ధరించినట్లు తెలుస్తున్నది. కానీ రెండూ ఒకేసారి ధరించరు. ఒక్కొక్కసారి ఒక్కొక్కటి మాత్రమే ధరిస్తారు.

వివాహ సమయంలో వధువుకు మట్టెలతో పాటు పిల్లాండ్లు[245] కూడా పెడతారు. అందుకే 'మట్టెల పిల్లేళ్లు' అని జన వ్యవహారం. పిల్లాడి (ణి) అంటే

---

[238] పుట – 234.
[239] తెలంగాణ పల్లెపాటలు, పుట – 188.
[240] పల్లెపదాలు, పుట – 166.
[241] మిన్నేరు, పుట -55.
[242] తెలంగాణ పల్లెపాటలు, పుట -72.
[243] మధుర కవితలు, పుట – 315.
[244] మున్నీరు, పుట – 312.
[245] తెలంగాణ పల్లెపాటలు, పుట – 72.

'ఆడుదాని కాలి నాలుగవ వ్రేలి యాభరణమని' సూ.ని. పేర్కొన్నది. సన్నని వెండి తీగతో వృత్తంలా మలిచి పైభాగాన పల్చని సన్నని దీర్ఘచతురస్రాకారపు దిమ్మ ఉండేటట్లు చేస్తారు. ఇది చూడటానికి ఉంగరంలా ఉంటుంది దీనినే పిల్లాణి అంటారు. రగమెట్టి పిల్లాండ్లు[246] అనే వాటిని కూడా జానపదాంగనలు ధరించినట్లు తెలుస్తున్నది. వీటిని తెలంగాణ ప్రాంత స్త్రీలు ఎక్కువగా ఉపయోగిస్తుంటారు.

కాలి వ్రేళ్లకు ధరించే ఆభరణాల్లో బొబ్బిలి కాయలు[247] ఒక రకం. ఈ పదం నిఘంటువులలో లేదని, కాలి మూడవ వ్రేలి మట్టెలను బొబ్బలికాయలంటారని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొన్నారు[248].

ఇవేగాక ఇంకా కడియాలు,[249] పావడాలు,[250] గొలుసులు,[251] పట్టాలు,[252] అందెలు,[253] గజ్జెలు,[254] మువ్వలు,[255] పాంజెవులు[256] అనే ఆభరణాల్ని కూడా కాళ్లకు ధరించేవారు. ఇవి సీలమండలం దగ్గర ధరించే ఆభరణాలు. సుమారు చూపుడు వ్రేలు లావుగల వెండి కడ్డీని వృత్తంలాగ మలిచి చేసేవి కడియాలు. పావడాలు కూడా కడియాల వంటి ఆభరణాలే. కానీ ఈ పావడాలకి క్రింది భాగంలో మూడు, ఐదు లేక ఏడు వరుసల్లో కోణాలు తేలిన జాలరి ఉంటుంది. పాతకాలపు తలుపు కొక్కాలులాగ ఉండేవే గొలుసులు. సన్నని వెండి తీగతో జడలాగ అల్లి జేసే ఆభరణాలు పట్టాలు. దండకి ధరించే వంకెల వంటి

---

[246] త్రివేణి, పుట – 46.
[247] మిన్నేరు, పుట – 306.
[248] ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట – 303.
[249] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 122.
[250] పైదే.
[251] మిన్నేరు, పుట -258.
[252] జానపద గేయాలు, ప్ర.సం., పుట – 93.
[253] పల్లెపదాలు, పుట -93.
[254] మధుర కవితలు, పుట – 292.
[255] త్రివేణి, పుట – 59.
[256] తెలంగాణ పల్లెపాటలు, పుట – 79.

ఆభరణాలు అందెలు. మువ్వలు, గజ్జెలు నడిచేటప్పుడు శబ్దం చేసేవి. గజ్జెలలో సిరిగజ్జెలు[257] మరొక రకం.

పాంజెవులనే పాంజేబులని కూడా వ్యవహిరిస్తారు. పట్టాల క్రింది భాగాన రెండు లేక మూడు వరుసల్లో గజ్జెలు గుత్తులుగా వ్రేలాడుతుండే దానిని పాంజేబు అంటారు. ఇది కూడా తురక స్త్రీల నుండి గ్రహించి ధరిస్తున్న ఆభరణమేననీ, 'పాయ్‌జేబు' (కాల ధరించు గొలుసు) నుండి ఏర్పడిన పదమేనని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొన్నారు.[258]

సాధారణంగా ఈ ఆభరణాలన్నీ వెండితో చేసినవే. కానీ విశేష ధనసంపన్నులైన స్త్రీలు బంగారు కాలి ఆభరణాలు ధరించటం కూడా కద్దు. పైడి కడియాలు[259] అటువంటివే. స్త్రీ వీటినన్నింటినీ ధరించటంలో ముఖ్యోద్దేశం ఆమె పాద విన్యాసంలోని లయను నిరూపించటమే గాక, ఆమె వస్తున్నదనే సంకేతం. అది తెలిసి పురుషులు వైదొలగి దారివ్వటమనేది మర్యాదాలాంఛనం.

**తాళిబొట్టు** : అత్యవసరాభరణాల్లో వివాహిత స్త్రీకి అతిముఖ్యమైంది తాళిబొట్టు.[260] ఇది స్త్రీ కావాలనుకుంటే పెట్టుకొని అక్కరలేదనుకుంటే తీసివేసే ఆభరణం కాదు. వివాహ సమయంలో స్త్రీకి పురుషుడు కట్టేది తాళిబొట్టు. అందుకే

"గచ్చా గజ్జియలు పెడతా, పచ్చాకు తాళిగడతా,
నన్నూ పెళ్లాడతావా కన్నెగోరా"[261]

అని జానపద ప్రియుడు ప్రియురాలి వెంట పడతాడు.

వివాహ సమయంలో తాళికట్టే ఆచారం ఈనాటిది కాదు. "తాళిబొట్టు వివాహమందు స్త్రీకి పురుషుడు కట్టుట కేవలము దాక్షిణాత్య ద్రావిడాచారమే. మొదట తాటియాకును కంఠమందు కట్టుచుండిరని 'తాళి' పదము తెలుపుతున్నది. తర్వాత

---

257 పల్లెపదాలు, పుట – 35.
258 విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట -1140.
259 తెలంగాణ పల్లెపాటలు, పుట -145.
260 తాళి=తాడి. రూపాంతరము తాళి – ఆంధ్రవాచస్పత్యం.
261 పల్లెపదాలు, పుట – 217.

దాని పేరుతో దాని రూపముగా బంగారుతో రేకులను జేసి కట్టుచుండి రనవలెను"[262] అని శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారి వక్కణ.

ఇదే విషయాన్ని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు కూడా తమ 'తెలుగు మెరుగులు' గ్రంథంలో నిర్ధారించారు.[263]

ఈ తాళిబొట్టుకే శతమానం, పుస్తెలు, మంగళసూత్రం, ఆడవారి తాడు అనే పేర్లు వ్యవహారంలో ఉన్నాయని, ఇది భర్త యొక్క జీవితానికి సంబంధించినదిగా చెప్పుచున్నారని వివరిస్తూ శ్రీ నేదునూరి గంగాధరంగారు వీటికి తగిన ఉదాహరణల్ని శిష్ట సాహిత్యం నుండి ఎత్తి చూపారు.[264]

కాశీ ఖండంలో దక్షయజ్ఞ సందర్భంలో దధీచి శివుని వ్యతిరేకులను తమ యాండ్ర తాళ్లు దెగవె అని తిడతాడు.[265] శివుడు హాలాహలం ఖ్రింగబోతున్నప్పుడు పార్వతి తన మంగళసూత్రాన్ని మదినెంత నమ్మిందోనని పోతన భాగవతంలో వర్ణిస్తాడు.[266] ఈ వర్ణన సంస్కృత భాగవతంలో లేనప్పటికీ తెలుగువారి ఆచారాన్ని పట్టి చూపాడు పోతన. వీరభద్ర విజయంలో భస్మమయిన మన్మథుని చూచి రతీదేవి తన భర్తను దీర్ఘాయుషోపేతుని చేయు మంగళసూత్ర బంధనాన్నిమ్మని దేవతల్ని ప్రార్థిస్తుంది.[267]

---

262 విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట-140.

263 "తెలుగు వారిలో వివాహము లందు మంగళసూత్రము కట్టుట అనాది యాచారము. ఈ యాచారము ఉత్తర దేశీయులకు లేదు. ఆర్యుల గృహ్యసూత్ర గ్రంథములో లేనే లేదు. ప్రాచీన కాలమున నుండి ఆంధ్ర స్త్రీలకు వివాహములుంద తాటియాకును చుట్టగా చుట్టి పసుపు పూసి నూలిబొందుతో కట్టి వధువు కంఠమున వరునిచే మూడు ముళ్లు వేయించుట యాచారము. కనుకనే దానికి తాళిబొట్టని పేరయ్యెను. తాళియనగా తాడియే" – మున్నీరు, పుట -14.

264 పైదే, పుట – 14.

265 "పంచవదనుని కను జేగురించెనేని
తక్షణంబున తమ యాండ్ర తాళ్లు దెగవె" – 7-50 – పైదే.

266 "ఖ్రింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంత మది నమ్మినదో" – 8-24, పైదే.

267 "తేరే దేవరవేడి నా పెనిమిటిన్ దీర్ఘాయుషోపేతుగా
నీరే మంగళసూత్ర బంధనము మీకెంతేని పుణ్యంబగున్" – 2-126. – పైదే.

ఇంకా ఈ తాళిబొట్టు ప్రాముఖ్యాన్ని వివరిస్తూ శ్రీ గంగాధరంగారు హైందవ నారీమణులు దీన్ని చాలా పవిత్రమైందిగా భావించి కళ్లకద్దుకొని మెడలో ధరిస్తుంటారని, మెడలో ధరించిన ఏ ఆభరణాన్నయినా తీస్తారుగాని తాళిబొట్టును మాత్రం తియ్యరని[268] అందుకే 'భాగవతంలో శ్రీరామచరిత్ర ఘట్టంలో రాములవారు, సీతాదేవి అన్నీ దానం చేస్తారుగాని సీతాదేవి మంగళసూత్రాన్ని మాత్రం ఉంచుకొంటుంది'[269] అని అన్నారు.

తాళిబొట్టును బంగారు హారాలలోగుచ్చి ధరించటం అత్యవసరంతో పాటు ఆడంబరాన్ని ప్రదర్శించటమే. అందుకే కొంచెం సంపద గల జానపద స్త్రీ నానుతో పుస్తె[270] ధరిస్తుంది. నాను అనేది బంగారు హారం, బంగారంతో చేసిన తాళిబొట్టునే పుస్తె[271] అంటారు. మరింత సంపన్న అయిన స్త్రీ ముత్యాలు తాపిన మంగళసూత్రాన్ని కూడా ధరిస్తుంది.[272]

జానపద సాహిత్యంలో మాత్రం పుస్తెలు, మంగళసూత్రం అనే పేర్లకే ప్రయోగాలున్నాయి తప్ప శతమానం, ఆడువారి తాడు అనే పేర్లకు ప్రయోగాలు మృగ్యం.

## 2. ఆడంబరాలు :

**నడుము ఆభరణాలు** : జానపద స్త్రీలు నడుముకు కూడ ఆభరణాలు ధరించేవారు. వాటిలో మొలనూలు ఒకటి. రెడ్డి రాజుల కాలం నాటి స్త్రీలకు మొలనూలు ధరించే ఆచారం ఉన్నట్లు శ్రీనాథుని వర్ణనను బట్టి తెలుస్తున్నది[273]. ఇందులో ఘంటల

---

268 మున్నీరు, పుట – 14.

269 "తనకు రెండు పుట్టంబులు దనకునైన
మెలత మంగళసూత్రంబు మినుకు దక్క
వినతుడై యుండె రాముని వితరణంబు
పాండవోత్తమ! ఏమని పలుకవచ్చు – 9-341 – పైదే, పుట -15.

270 సరాగాలు పుట -124.

271 వాడు పెండ్లాము పుస్తెలు గూడ తాకట్టు పెట్టినాడు, సూ.ని.

272 మున్నీరు, పుట – 9.

273 "ముత్యాల మొలనూలు మురువు సూపడునట్టి,
జఘనంబుపై మౌంజి సవదరించె" - హరవిలాసము, 4-11.

మొలనూలు[274] వేరొక రకం. బిళ్లల మొలత్రాడు[275] కూడా స్త్రీలు నడుముకు ధరించేవారు. ఆడంబరోపేతమైన వడ్డాణాన్ని[276] కూడా ధరించేవారు. కేవలం సాదావడ్డాణమే కాకుండా గంటల వడ్డాణం,[277] వజ్రాల వడ్డాణం,[278] మువ్వల వడ్డాణం,[279] బెంగుళూరు వడ్డాణం[280] అనే రకరకాల వడ్డాణాలను ధరించటానికి ఆసక్తి చూపేవారు.

అమరావతి శిల్పాలలోని స్త్రీల ఆభరణాల్ని పరిశీలిస్తే ముక్కుపుడక, నత్తు, ముక్కర, వడ్డాణం మొదలైన ఆభరణాలు కనిపంచవని ఇవన్నీ తదనంతర కాలంలో అంటే క్రీ.శ. 11వ శ. తరువాత వాడుకలోకి వచ్చినట్లు తెలుస్తున్నదనీ శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు పేర్కొన్నారు.[281]

**శిరోజాలంకారాలు** : శిరోజాలంకారాలలో నాగరం[282]ముఖ్యమైనది. నాగుపాము పడగ ఆకారంలో ఉండటం చేత దీనికి ఆ పేరు వచ్చినట్లు చెప్పవచ్చు. మధ్యలో లక్ష్మీదేవి బొమ్మ, చుట్టూ రెండుమూడు వరుసల్లో గజ్జె ఉంటుంది. అడుగు వైపున వెంట్రుకలు దూర్చటానికి చిన్న వలయం వంటిది ఉంటుంది. చూడటానికి గొట్టం లాగ ఉంటుంది. ఈ ఆభరణాన్ని తల వెనుక భాగాన నడినెత్తిపై అలంకరించు కొంటారు. అడుగు భాగాన గల వలయంలో నుండి ఒక సన్నిని పాయవలె వెంట్రుకలను దూర్చి మరి రెండు సన్నపాయల్ని తీసుకొని సన్నని జడవలె అల్లి దానిని ముచ్చలిగుంటలో ప్రధాన జడతో కలుపుతారు. అప్పుడే నాగరం జారిపోకుండా ఉంటుంది. దీనిని ధరించటం చాలా శుభ్రప్రదంగా భావిస్తారు.

---

274 మిన్నేరు, పుట – 258.
275 పల్లెపదాలు, పుట – 175,
276 పైదే. పుట -105.
277 తెలంగాణ పల్లెపాటలు, పుట-78.
278 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 172.
279 మిన్నేరు, పుట – 440.
280 సరాగాలు, పుట – 60.
281 విజ్ఞాన సర్వస్వం, నాలుగవ సంపుటం, పుట – 1136.
282 మధుర కవితలు, పుట – 233.

నాగరం స్థానంలో అలంకరించుకొనే మరొక ఆభరణం రాగిడి.[283] ఇది గుండ్రంగా ఉండి రాళ్లతో పొదగబడి ఉంటుంది. ఈ రాళ్లు ఒకే రంగువి కావచ్చు, వేరు వేరు రంగులవి కావచ్చు లేదా అచ్చం తెలుపువి కావచ్చు. శ్రీమంతులైన వారు దీనిని రవ్వలతో చేయించుకొంటారు. ఇట్టి రవ్వలు చెక్కిన రాగిడి[284] ధరించాలనే ఆకాంక్ష జానపద స్త్రీలలో జాలువారుతుంది. కుందనపు రాగిడి[285] కూడా జానపద స్త్రీ ధరిస్తుంది.

పాపటకు రెండు వైపులా అంటే శిరోపార్శ్వాలలో ధరించే ఆభరణం చంద్రరేఖ. ఇది అర్ధచంద్రాకారంలో రాళ్లతో పొదగబడిన ఆభరణం. దీనిని వంక,[286] చంద్రవంక[287] అని కూడా అంటారు. ఇందులో చెక్కుల చంద్రరేఖ[288] అనేది వేరొక రకం. చంద్రభాను[289] కూడా శిరోపార్శ్వాలలో ధరించే ఆభరణమే. బంగారంతో సన్నని వలయంలా చేసి అందులో అర్ధచంద్రాకృతి వచ్చేటట్లు రాళ్లు పొదుగుతారు.

పూర్వం జడలకన్న కొప్పులు తీర్చి దిద్దుకోవటంలోనే కొమ్మలకెక్కువ అభిలాష ఉండేది. జానపద స్త్రీల కేశాలంకరణాన్ని పరిశీలించినప్పుడు ఈ విషయం నిరూపితమయింది. ఈ కొప్పులపై అలంకరించుకొనేదే కొప్పుబిళ్ల.[290] ఇది గుండ్రంగా ఉండి రాళ్లతో పొదగబడి ఉంటుంది. కాని రాగిడి కన్నా చిన్నది. దీనిని జడలో అలంకరించుకొంటే జడబిళ్ల అంటారు. కొప్పుబిళ్లను కెంపులతో పొదిగితే కెంపులబిళ్ల[291] అంటారు. గప్పుకొప్పున బిళ్ల[292] అంటే ఏమిటో స్పష్టపడటం లేదు.

---

[283] సరాగాలు, పుట- 164.
[284] మిన్నేరు, పుట – 125.
[285] పైదే, పుట – 121.
[286] తెలంగాణ పల్లెపాటలు, పుట – 139.
[287] మిన్నేరు, పుట -258.
[288] తెలంగాణ పల్లెపాటలు, పుట -72
[289] మిన్నేరు, పుట-258.
[290] పల్లెపదాలు, పుట – 153.
[291] సరాగాలు, పుట -60.
[292] పైదే, పుట -14.

ఒకవైపు చెవిపోగుకు తగిలించి రెండవవైపు కొప్పులో తగిలించే గొలుసువంటి ఆభరణాన్ని కొప్పుగొలుసు[293] అంటారు. ఇట్టి ఆభరణాన్ని కూడా జానపద స్త్రీలు కొందరు అలంకరించుకోవటం కద్దు.

ఇవేగాకుండా మొగలిరేకులు,[294] తమలపాకులు,[295] పోకచెక్కలు[296] మొదలైన ఆకారాల్లో బంగారంతో తయారు చేసిన ఆభరణాల్ని శిరస్సుపై ధరించినట్లు జానపద గేయాల్లో ప్రమాణాలు లభిస్తున్నాయి.

పాపట్లో ధరించే ఆభరణం పాపటబొట్టు.[297] దీనిని పూర్తిగా బంగారంతోగాని లేక రాళ్లతో పొదిగి గాని తయారు చేస్తారు. గొలుసు వంటి భాగాన్ని పాపట్లో అమర్చి ఇరువైపులా కొక్కాల సహాయంతో వెంట్రుకలలో దూరుస్తారు. ఈ గొలుసు చివర బిళ్ల వంటి భాగం ఉంటుంది. ఇది నుదిటిపై వ్రేలాడుతుంటుంది.

జడసంబంధమైన ఆభరణాల్లో సర్వసామాన్యమైనవి కుచ్చులు.[298] వీటిని జడలో అమర్చుకోవటానికి వీలుగా మూడు లావుపాటి నల్లని తాళ్లు ఉంటాయి. వీటికి చివరన నల్లని పట్టుదారంతో చేసిన కుచ్చులు అమరుస్తారు. ఈ కుచ్చులకు పై భాగంలో గంట ఆకారంలో బంగారంతో చేసిన డిప్పల్ని తొడుగుతారు. వీటికే బంగారు కుచ్చులనీ,[299] జడ కుచ్చులనీ,[300] జడకుప్పెలనీ,[301] కచ్చాల కుచ్చులనీ[302] వ్యవహారం. పట్టు కుచ్చులు రెండు మాత్రమే ఉంటే అవి సుమారు రెండు బెత్తల పొడవుతో ఉంటాయి. అటువంటి వాటిని బంగారు కుచ్చులు అంటారు. అలా

[293] పల్లె పదాలు, పుట -218.
[294] మిన్నేరు, పుట – 259.
[295] పైదే.
[296] పైదే.
[297] సరాగాలు, పుట -10.
[298] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి,పుట – 88.
[299] పల్లెపదాలు, పుట – 90.
[300] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 35.
[301] మిన్నేరు, పుట -257.
[302] పైదే, పుట – 479.

కాకుండా పట్టు కుచ్చులు గుండ్రంగా చిన్న నిమ్మకాయ పరిమాణంలో నాలుగు, ఆరు లేక ఎనిమిది గుత్తిగా ఉంటే అటువంటి వాటిని జడకుప్పెలు అంటారు.

ఈ కుచ్చులే కాకుండా జడపై అలంకరించుకోవటానికి వీలుగా తయారు చేసిన బంగారు జడను[303] కూడా జానపదాంగనలు ధరించినట్లు జానపద వాఙ్మయంలో సాక్ష్యాలు లభిస్తున్నాయి.

**కంఠాభరణాలు** : కంఠాభరణాల్ని ధరించటమంటే జానపద స్త్రీకి మక్కువ ఎక్కువ. చిత్ర విచిత్రమైన కంఠాభరణాల్ని వీరు అలంకరిచుకొన్నట్లు తెలుస్తున్నది. వీటిలో కంటె[304] చాలా ప్రాచీనమైనది, ప్రముఖమైనది. దీనిని వక్రాకారమైన కంఠాభరణంగా సూ.ని. పేర్కొన్నది. ఈ కంటెలో రెండు రకాలున్నాయి. గట్టి గుళ్లకంటె, సాదా బోలు కంటె. గట్టి గుళ్లకంటె అంటే కంటె పై భాగంలో గుళ్లు చెక్కుతారు. లోపలి భాగమంతా బంగారమే ఉంటుంది. సాదాబోలు కంటె అంటే కంటె పైభాగంలో పలకలుగా ఉంటుంది. లోపల బోలుగా ఉంటుంది. ఈ బోలు భాగంలో లక్క నింపుతారు. ఈ కంటెను గొప్పా బీదా తేడా లేకుండా అందరూ ధరిస్తుంటారు. ఎక్కువ స్తోమత లేనివాళ్లు కూడా వెండి కంటెనయినా అలంకరించుకుంటారు. క్రమక్రమంగా ఈ కంఠాభరణం అదృశ్యమవుతున్నది.

పట్టెడ వేరొక కంఠాభరణం. రాళ్లు పొదిగిన నలుచదరపు దిమ్మల్ని హారంగా చేయటం వల్ల పట్టెడ తయారవుతుంది. ఒక్కొక్క దిమ్మపై నాలుగు వరుసల్లో రాళ్లు పొదిగి ఉంటాయి. సాధారణంగా ఇటువంటి దిమ్మెలు ముప్పయి అయిదుతో పట్టెడ చేస్తారు. ఇందులో నానుపట్టెడ,[305] పట్టెళ్ల నాను,[306] తీగ పట్టెడ[307] అనే రకాలు కూడా ఉన్నాయి. నాను తాడుకి మధ్యలో అక్కడక్కడ పట్టెళ్లు పొదిగితే దానిని నానుపట్టెడ అంటారు. కంఠానికి సన్నిహితంగా ఉండేటట్లుగా రెండేసి

---

[303] సరాగాలు, పుట – 60.
[304] మిన్నేరు, పుట – 257.
[305] పైదే, పుట – 183.
[306] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 70.
[307] పల్లెపదాలు, పుట166.

పట్టెళ్లను నానుతాడుకి బిగించి చేసే ఆభరణం పట్టెళ్లనాను. గంగిగళ్ల పట్టెడ[308] అనే పేరు చిత్రమైంది. బహుశః దిమ్మలపై రాళ్లు పొదగకుండా పెద్ద పెద్ద గళ్లు చెక్కుతారేమో! ఇట్టి ఆభరణాలపై మోజుపడటం స్త్రీ స్వభావోచిత ఆభరణ ప్రీతికి నిదర్శనం.

కాసులపేరు[309] మరొక ముఖ్యమైన కంఠాభరణం. బంగారు నాణాలను దండగా కూర్చి చేసే ఆభరణం కాసుల పేరు. కాసు[310] అనేది పూర్వం వ్యవహారంలో ఉన్న ఒకానొక నాణెం. హారంలో ఉండే కాసుల సంఖ్య వారి వారి ధన సంపత్తి పై ఆధారపడి ఉంటుంది. పది నుండి డెబ్బై కాసుల వరకు ఉపయోగిస్తుంటారు. తక్కువ కాసులనుపయోగించేటప్పుడు కాసుకి కాసుకి మధ్యలో నానుకోడు (చిన్నగొట్టం) నుపయోగిస్తారు. ఎక్కువ కాసులనుపయోగించేటప్పుడు ఒక కాసుపై మరొకటి పడి చూడటానికి కాసు సగభాగం మాత్రమే కనిపిస్తుంది. కాసుపై భాగంలో వారి వారి ఇష్టాన్ని బట్టి లక్ష్మీదేవి, సీతారామలక్ష్మణులు మొదలైన బొమ్మలు చెక్కించుకుంటారు.

సాదా కాసుల పేరు కాకుండా వజ్రాల పేరు[311] (వజ్రాలు పొదిగినది), ముత్యాల పేరు[312] (ముత్యాలు పొదిగినది), నీలాల పేరు[313] (నీలాలు పొదిగినది), రత్నాల పేరు[314] (రత్నాలు పొదిగినది), గుళ్ల పేరు[315] (కాసికాయగుండ్ల వంటి గుళ్లు పొదిగినది), పతకాల పేరు[316] (హారం మధ్యలో పతకం ఉన్నది), నానుపేరు[317]

308 మిన్నేరు, పుట – 428.
309 పల్లెపదాలు, పుట – 220.
310 కాసు= (1) పదునొకండు అణాల యెత్తుగల బంగారపు నాణెము (2) దుగ్గాణిలో పదియవపాలు, దమ్మిడిలోనైదవవంతు (దుగ్గానిలో నాల్గవ భాగము, శ.ర) – సూ.ని.
311 పల్లెపదాలు, పుట -9.
312 పైదే. పుట – 217.
313 తెలంగాణ పల్లెపాటలు, పుట- 67.
314 పైదే, పుట – 118.
315 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి , పుట -13.
316 మున్నీరు, పుట -62.
317 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట- 14.

(నానుత్రాడు), జామాలపేరు[318] (దీని స్వరూపం తెలియటంలేదు) మొదలైన ఎన్నోరకాల పేర్లు జానపద వాఙ్మయంలో గోచరిస్తున్నాయి. విశేష సంఖ్యలో వర్ణించబడిన ఈ ఆభరణాల ప్రసక్తిని బట్టి వీటిపై జానపద స్త్రీకి గల మక్కువ ఎంతటిదో తెలుస్తున్నది.

ఇంకా ఎన్నో రకాల హారాలను జానపద స్త్రీ ధరించినట్లు జానపద గేయాల ద్వారా నిరూపితమవుతున్నది. పగడాల దండలు,[319] ముత్యాల దండలు[320] వంటి దండలు; చంద్రహారం,[321] ముత్యాల హారం,[322] కులుకుహారం,[323] వంటి హారాలేగాక రెంటాల చెండ్లు,[324] నాటాల చెండ్లు[325] మొదలైన ఆభరణాల్ని కూడా మక్కువతో ధరించినట్లు తెలుస్తున్నది. కులుకుహారం, రెంటాలచెండు, నాటాలచెండు వీటి స్వరూపమేమిటో ఇతమిత్థంగా తెలియటం లేదు.

బంగారు పతకంలో పొదిగిన పులిగోరు[326] ధరించటం శుభప్రదమని భావించేవారు. ఆడ మగ భేదం లేకుండా పసి పిల్లలకు ఈ పతకాన్ని ధరింపచేయటం జానపదులకు అలవాటు. కేవలం సాదా పులిగోరే కాకుండా చామంతి పులిగోరు[327] ప్రసక్తి ఒక గేయంలో వస్తుంది. చామంతి పువ్వు ఆకారంలో పతకాన్ని తయారుచేసి పులిగోరు అతికిన ఆభరణం అని ఊహించవచ్చు.

---

[318] పల్లెపదాలు, పుట -9.
[319] పల్లెపదాలు, పుట – 164.
[320] తెలంగాణ పల్లెపాటలు, పుట -127.
[321] జానపద గేయాలు (ప్ర.సం.) పుట – 66.
[322] మిన్నేరు, పుట – 258.
[323] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 107.
[324] తెలంగాన పల్లెపాటలు, పుట -127.
[325] పైదే.
[326] జానపద కళా సందప, పుట – 171.
[327] సరాగాలు, పుట – 189.

అయ్యలరాజు నారాయణామాత్యుడు తన హంసవింశతిలో స్త్రీలు ధరించిన ఎన్నో ఆభరణాల్ని పేర్కొన్నాడు.[328] ఇతడే కాకుండా ఇంకా ఎందరో శిష్ట సాహిత్య కవులు వర్ణించిన ఆభరణాలన్నింటినీ 'శ్రీ కృష్ణరాయాంధ్ర విజ్ఞాన సర్వస్వము'[329]లో 'ఆభరణాలు' శీర్షిక క్రింద పేర్కొనటం జరిగింది.

జానపద సాహిత్యంలో నిరూపితమైన ఆభరణాలన్నింటినీ జానపదాంగన ధరించి ఉండకపోవచ్చు. ఆనాటి సమసమాజంలో వాడుకలో ఉండి ఉండవచ్చు. ఆ నగలను ధరించాలనే ఆకాంక్ష జానపద స్త్రీలో పొడగట్టటం సహజం. అందుకే పురుషులు స్త్రీలలోని ఈ బలహీనతను కనిపెట్టి రకరకాల నగలు చేయించి పెడతామని స్త్రీలను మభ్యపెట్టి ప్రేమ చూపే సన్నివేశాలు జానపద సాహిత్యంలో ఎన్నో గోచరిస్తాయి. ఏది ఏమైనా స్త్రీ ఆభరణాలు ధరించటం పురుషునికి ఎంతో ఆయుర్వృద్ధికరమనే అభిప్రాయం హైందవ నారీమణులలో ప్రబలంగా ఉంది.




---

328 "కుప్పె రాగడిబిళ్ల కుంకుమ రేఖ పా
    పటబొట్టు కమ్మలు బావిలీలు
లలి సూర్య చంద్రవంకలు సూసకము కెంపు
    రవల పల్లెరు బూవు రావిరేక
బొగడలు నానుగ్రోవులు తీగమెడనూలు
    కుతికంటు సరము గుండ్లపేరు
సరిగె ముక్కర బన్నసరము నుత్తండాలు
    కంకణంబులు తట్ల కడియములును
సందిదండలు నొడ్డాణ మందమైన
ముద్రికలు హంసకంబులు మ్రోయుగజ్జె
లలరు బొబ్బలికాయలు గిలుకుమట్టె
లాదియగు సొమ్ము దాల్చి యయ్యబల మెఱయ" -2-190.

329 పుటలు -539-544.

II

# గుణాలంకార విశేషాలు

1. గుణ సంపద
2. కోడళ్ళ గుణాలు
3. అత్తల గుణాలు
4. ఆశలు-ఆకాంక్షలు



# II గుణాలంకార విశేషాలు

## 1. గుణ సంపద

బాహ్యాలంకారాలకన్న గుణాలంకారాలుమిన్న. ఈ గుణసంపదే ప్రతి వ్యక్తికీ ఒక ప్రత్యేకతను సంతరించి పెడుతుంది. శారీరక అందం యవ్వనంలో మురిపిస్తుంది. ముసలితనంలో మాయమై పోతుంది. కానీ గుణసంపద జీవితాంతమే కాదు జీవితానంతరం కూడా కీర్తిని సంపాదించి పెడుతుంది.

ఈ గుణసంపద జానపద స్త్రీలలో వారి కుటుంబాలలో ఏవిధంగా ఉందో పరిశీలించాలి. పురుషుడు పుట్టినప్పటి నుండి మరణించే వరకు ఒకే ఇంటిలో జీవిస్తాడు. కానీ స్త్రీ అలా కాదు. వివాహమయ్యే వరకు పుట్టింట్లో, వివిహానంతరం అత్తవారింట్లో గడపాలి. ఇరుదరులను కలిపే వంతెన వంటిది స్త్రీ. ఇటు పుట్టినిల్లు, అటు అత్తవారిల్లు రెండూ ఆమెకు సమానమే. అష్టాచెమ్మా, అచ్చన గాయలు, ఓమన గుంటలు, వైకుంఠపాళి, ఒప్పులకుప్ప, దొంగాట వంటి ఆటలు ఆడుకుంటూ బొమ్మలపెళ్లిళ్లు చేసుకొంటూ స్వచ్ఛమైన, నిర్మలమైన మనసుతో అమాయకంగా తన బాల్యాన్ని గడిపే స్త్రీ యవ్వనవతి కాగానే వివాహం జరిగి క్రొత్త ప్రపంచంలోకి అడుగుపెడుతుంది. తెలిసీ తెలియని వయసుతో, సిగ్గుతో, బిడియంతో; తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్లు, అన్నదమ్ములమీది బెంగతో; భర్తచూపించబోయే అనురాగం పట్ల నమ్మకంతో; మనసులో ముసురుకొంటున్న ఎన్నెన్నో ఊహలు ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే బెరుకు, బెరుకుగా భర్త చిటికెన వ్రేలు పట్టుకొని అత్తవారింట్లోకి ప్రవేశిస్తుంది. అక్కడికి వచ్చే వరకు ఆమెకు తెలియదు ఆ ఇంట్లోని మనుషుల మనస్తత్వాలు ఎటువంటివో అక్కడి పరిస్థితులు ఏమిటో. అన్నీ సవ్యంగా ఉంటే ఆమె జీవితం ఉద్యానవనం నుండి నందన వనంలోకి ప్రవేశించినట్లే. లేదంటే పూలబుట్టలో నుండి పొయ్యిలో పడినట్లే. కానీ ఆశ్చర్యం. ఎటువంటి పరిస్థితులు ఎదురైనా ఆమె వెనుకంజ వేయదు. ధైర్యంగా వాటిని ఎదుర్కొంటుంది. అక్కడే ఆమె ఓర్పు, నేర్పు ఒరపిడి పొందుతాయి. అన్నిటికీ ఆమెకున్న సహనమే శ్రీరామరక్ష.

## 2. కోడళ్ల గుణాలు

సమష్టి కుటుంబాలలో కోడంట్రికం అనుభవించటం అంత ఆషామాషీ కాదు. కోడలిని ఆరళ్లు పెట్టటానికి అత్తగారికి పెద్దగా కారణాలు అవసరంలేదు. పచ్చి పాలమీద మీగడ ఏదని? వేడి పాలమీద వెన్నలేవని? నూనె ముంతల మీద నురుగులేవని? చిత్రాతిచిత్రంగా ప్రశ్నించే అత్తగారికి కోడలు ఏం సమాధానం చెప్తుంది? ఇరుగు పొరుగు వారిని ఆలకించమనటం తప్ప.[330]

కొన్నిసార్లు ఆడబ్రతుకే అన్యాయమనే నిరాశలో, నిస్పృహతో బాధ పడుతుంది కోడలు. అందుకే ఆడదానిగా పుట్టేకన్న గండ్రగొడ్డలి క్రింద కొమ్మై పుట్టటం మేలని భావిస్తుంది.[331] అయినా జీవితాన్ని కొనసాగించక తప్పదు. ముందుకు పోతే నుయ్యి వెనక్కు పోతే గొయ్యి.

"పాటలు పాడితే పలువదంటారు
పాడకుంటే జనులు మూగదంటారు."[332]

ఇటువంటి ఆరళ్లకన్నిటికీ మందు సహనమే. ఆ సహనంతోనే పరిస్థితులనెదుర్కొని చివరకు విజయం సాధిస్తుంది కోడలు. అప్పుడు అత్తగారే నా కోడలంతటి ఉత్తమురాలు లేదని పదిమందికీ చాటుతుంది.

"మా యింటి కోడాలు - మంచి ముత్తాము
సీటి మాటికి తాను - సీరాకు పడదు
పెందలా కడలేచి - పాసి సేసేసి
యిల్లలికి ముగ్గెట్టి - యీదిలో తుడిసి
కల్లాపు జల్లేసి - గొడ్ల మేతేసి
నీలాటి రేవుకు - నెమ్మదిగ బోయి
నీళ్లు తెత్తాదమ్మ - నిత్తెముత్తైదు

330 మిన్నేరు, పుట – 180.
331 పైదే, పుట – 51.
332 పైదే.

అత్తమామలాకు - ఎత్తళ్లు బెడ్తు
పెనిమిటిని సిరికంట - పలకరిత్తాది
మరుదులను మంచిగా - మందలిస్తాది
తోడికోడళ్లనూ - తోటోళ్ల వలెనే
గౌరవిత్తాదమ్మ - గౌరమ్మ తల్లి."[333]

అత్తమామల సేవచేస్తూ, ఇంట్లో పనంతా చేసి బయటకు పోయి నీళ్లు తెచ్చి, పశువులకు గడ్డి వేసి, మరుదుల్ని మందలిస్తూ, తోడికోడళ్లను గౌరవిస్తూ, భర్తను కడగంటి చూపులతో అలరిస్తూ అత్తగారి మెప్పుపొందే సాధుస్వభావం కలిగిన చానలే కాదు అత్తల నోళ్లు మూయించే గడసరి కోడళ్లు కూడా ఉంటారు. కోడలి ప్రవర్తనపై అనుమానంతో ప్రశ్నలతో వేధించే అత్తగారిని కుక్కకాటుకి చెప్పుదెబ్బలాగ గడుసుగా సమాధానం చెప్పి నోరు మూయిస్తుంది.

"కోడలా కోడలా కొడుకు పెళ్లామా
కొడుకూరిలో లేడు కోక యెక్కడిదె?" అంటే
"అత్తా! అత్తా! ఓ అత్తగారా!
మామ ఊళ్లో లేడు మల్లెలెక్కడివె?"[334] అని అంటుంది.

ఓర్పుతోనైనా ఉండాలి నేర్పుగా సమాధానాలైనా చెప్పగలిగాలి. రెండూ చేతగాని వాళ్ళు పుట్టింటికి ప్రయాణమవుతారు.

"అత్తగారు పోరు గుమ్మడి
ఆడుబిడ్డల పోరు గుమ్మడి
పడలేక నేనూ గుమ్మడి
మావూరు పోతున్నా గుమ్మడి."[335]

అత్తవారింట్లో ఆరళ్లకు తట్టుకోలేక పుట్టిళ్లకు వెళ్లటమేగాని గట్టిగా పదిరోజులుండేటప్పటికి అక్కడా కలతలుపుట్టుకొస్తాయి. అన్న తనవాడైనా వదిన

333 జానపద గేయాలు, ప్ర.సం. పుట. 61.
334 తెలుగు హాస్యము, పుట – 54.
335 మిన్నేరు, పుట – 195.

తనదవుతందా? పెళ్లికాకముందు పుట్టిల్లు తనదిగాని పెళ్లయిన తర్వాత ఆడపడుచు ఆగమనం చుట్టుపు చూపే. ఈ రహస్యాన్ని గుర్తించిన కోడళ్లు పుట్టింటికి పోవటానికి ఇష్టపడరు. అత్తవారింట్లో ఉండలేరు. అందుకే వేరు కాపురం పెట్టమని భర్తను కోరుతారు.

"సందమామకన్న సక్కాని మొగుడా
వేరే పోదామా వేరే పోదామా."[336]

"చాయ పసుపులాగ నను దెచ్చినావు
సరసుడా! మీ తల్లి సాధింపు చూడు
ముద్ద పసుపులాగ నను దెచ్చినావు
ముద్దుడా! నీ తల్లి మూతిరుపు చూడు."[337]

ఎక్కువగా పనులు చేయటంవల్ల ఉంగరాల వంటి తన చెయ్యి ఊగిందని, కందిరీగ నడుము కదిలిందని, కొండంత కొప్పు చెదిరిందని, కొప్పుపై జాజులు వాడాయని తన కష్టాన్ని భర్తముందు వెళ్లబోసుకుంటుంది. వేరే కాపురం పెడితే బాగుపడతామని ఇంత శ్రమపడనక్కరలేదని కోడలి ఆరాటం. ఆ ఆరాటమే ఈ క్రింది గేయంలో ప్రతిబింబిస్తుంది.

"వేరే వుంటే మేలురా నాథా కూడివుంటే పోరురా!"[338]

అయితే అందరు కోడళ్లదీ కష్టాల కాపురమని భావించనక్కరలేదు. అదృష్టవంతులు కూడా అక్కడక్కడా ఉండకపోరు. పుట్టింటివారు శ్రీమంతులైతే వారు అత్తవారింట్లో కూడా సుఖపడతారేమో!

వడ్లు దంచే మరిది ఒకడు, వండి పెట్టే మరిది ఇంకొకడు, పేడకల్లాపి చల్లటానికి పెద్దబావగారు, ఇల్లలికి ముగ్గుపెట్టటానికి ఇంటి మగవాడు. అన్నీ అయితేగాని ఇంటి కోడలు లేవదట. ఆమె లేచే సరికి పళ్లు తోముకోవటానికి పుల్ల, చెంబుతో నీళ్లు, స్నానానికి చాయ పసుపు ఏర్పాటు చేయాలి. తరువాత పళ్లెంలో

[336] మిన్నేరు, పుట – 197.
[337] పైదే.
[338] పైదే.

అన్నం వడ్డించి కట్లపీట వెయ్యాలి. అన్నం తినగానే పడుకోవటానికి మంచం, పరుపు సిద్ధం చేయ్యాలి. ఈ విధంగా జరుగుబాటుగల జాణలు కూడా ఈ సాహిత్యంలో అక్కడక్కడ పొడగడతారు.[339]

ఇటువంటిదే మరొక స్త్రీ విపరీతపు పోకడ. దొడ్డవారిబిడ్డ ఎంతో హెచ్చరిస్తే గాని నిద్రలేవదు. విసనకర్రలతో విసిరిలేపినా ఆ విరజాజిమొగ్గ లేవదు. కొబ్బరి పుడకలతో కొట్టినా లేవదు. దొప్పల గంధం కుప్పించినా లేవదు. దొడ్లో పశువులు వెళ్లినా, దోర ఎండ తగిలినా, మందపశువులు వెళ్లినా, మారెండలెక్కినా ఎప్పటికో గాని మేల్కొనదట.[340]

ఈ విధంగా కష్టాలకు, సుఖాలకు ఆలవాలమైన జీవితాన్ని ధైర్యంగా కొనసాగించే స్త్రీ జనోచితమైన ఇతివృత్తంతో కూడిన మౌఖిక వాఙ్మయమెంతో కన్పిస్తుంది.

## 3. అత్తల గుణాలు

సమష్టి కుటుంబాలలో అత్తగారిది పెద్దస్థానం. ఆమె కనుసన్నలలో కోడళ్లు పనులు చేయాలని ఆమె భావం. అత్తగారి అధికారానికి సంబంధించి ఒక సన్నివేశం లోకప్రసిద్ధం. బిచ్చగాడు బిచ్చం కోసం ఇంటిముందుకు వస్తే పెట్టటానికి ఏమీలేదని ఇంటికోడలు పొమ్మంటుంది. అది గమనించిన అత్తగారు వాడ్ని రమ్మంటుంది. ఆహా! అత్త ఎంత మంచిదో బిచ్చం పెడుతుందని గంపెడంత ఆశతో వస్తాడు. అప్పుడామె "ఫోరా! ఫో!" అంటుంది. దిగాలుపడి బిచ్చగాడు పొమ్మని నీ కోడలే చెప్పిందిగదా అంటాడు. అప్పడత్తగారు అందుకొని 'పొమ్మంటానికైనా రమ్మంటానికైనా అదెవరురా? నాదీ అధికారం' అంటుంది. అత్తగారి హోదా పొందగానే అంతటి అధికారం వస్తుందేమో!

ఒంటరిగా ఉన్న కోడలిపై పెత్తనం సాగించే అత్తగారు కొడుకు ముందు నయగారాన్ని నటిస్తుంది. ఏవో ఎండబెట్టమని పురమాయిస్తే కోడలు చేటలో

[339] మిన్నేరు, పుట – 175.

[340] పల్లె పదాలు, పుట – 10.

చెయ్యేట్టి నిద్రపోతుంటే చూచిన అత్తగారు 'ఏ తల్లి గన్నదే ఏబ్రాసి నిన్ను' అని ప్రశ్నిస్తుంది. ఉలిక్కిపడిన కోడలు ఉగ్రాన లేచి రచ్చలో కూర్చున్న తన భర్తను పిలుస్తుంది. నీవు తెచ్చిన కోడల్ని ఏమన్నావని కొడుకు ప్రశ్నిస్తే నేనేమీ అనలేదురా

"పొద్దున్న పొరుగిళ్ల కెళ్లవద్దంటి
మూడిళ్ల ముంజూరు దుయ్యవద్దంటి
నడుస్తూ తలకురులు విప్పవద్దంటి
పొద్దోయి చాకింటికెళ్ల వద్దంటి"[341] అంటుంది.

అనేదొకటి చెప్పేదొకటి. అదే అత్తగారి నయగారితనం.

అత్తగారు సాగినంతకాలం సాగించుకుంటుంది. సాగకపోతే చతికిల పడుతుంది. అందితే జుట్టు అందకపోతే కాళ్లు. అప్పుడు కోడలు

"చాలు చాలత్తయ్య చాలత్తగారు
నీ కొడుకు వెయ్యేళ్లు మొదలు కావాలి
నీ కోడలు పట్టంపు దేవి కావాలి
నువ్వెళ్లి పంచల్ల పాలు కావాలి"[342]

అని తన అక్కసు తీర్చుకుంటుంది.

సాధారణంగా ఈ అత్తపోరు సంతానం లేని కోడళ్ల పట్లనే ఎక్కువగా ఉంటుందేమో! ఈ మాట నిజమనిపించే సంఘటన నేటి సభ్య సమాజంలోనూ జరిగింది.[343] కోడలు గర్భవతి అయి సంతానాన్ని పొందినప్పుడు అత్తగారి పెత్తనం కొంత తగ్గుతుంది. కోడలిపై ప్రేమ కలుగుతుంది. ఎందుకంటే తనకు వారసులనిచ్చినందుకు. ఆమె దృష్టి మనవళ్లు, మనవరాళ్లపై కేంద్రీకృతమవుతుంది.

[341] మిన్నేరు, పుట – 136.
[342] సాంప్రదాయిక విజ్ఞానం పుట – 23.
[343] "The mother-in-law poured kerosene on her body and set her clothes ablaze with the assistance of her son. Hearing the screams of the helpless Jaya, neighbours rushed to hospital. In her diying declaration she stated that the attempt was made on her due to her sterility" – Indian Express, 05-09-1979.

ఆమె ఆలోచనలలో క్రమక్రమంగా మార్పు చోటు చేసుకుంటుంది. కూతుళ్లు, కోడళ్లు, మనవరాళ్లతో అలరారే తన ఇల్లు చిలుకలు, హంసలు, పార్వాలుగల వనసరోరుహం వంటిదని భావించి మురిసిపోతుంది.

"చిలుకల్లు మా యింటి చిన్న కోడళ్లు
కోయిల్లు మా యింటి కొత్త కోడళ్లు
హంసల్లు మా యింటి ఆడపడుచుల్లు
పార్వాలు మా యింటి బాలపాపల్లు."[344]

ప్రకృతి కన్నా గృహ ప్రకృతి ఏవిధంగా శోభావహమో ఈపాట నిరూపిస్తుంది.




## 4. ఆశలు – ఆకాంక్షలు

సమష్టి కుటుంబ జీవనం షడ్రుచుల ఉగాది పచ్చడి వంటిది. అందులో కష్టం, సుఖం, ఆనందం, దుఃఖం, గౌరవం, అవమానం అన్నీ ఉంటాయి. అన్నీ సమపాళ్లలో ఉన్నప్పుడు ఏ ఇబ్బందీ ఉండదు. అలా కాకుండా కష్టాలు, కన్నీళ్లు, బాధలు, అవమానాలూ తప్ప ఆనందం లేనప్పుడు మనసు మరోదారి కోసం అన్వేషిస్తుంది. కుటుంబంలో అందరూ కష్టపడి సంపాదిస్తుంటే అందరూ సుఖంగా ఉండవచ్చు. కానీ కష్టం ఒక్కరిదే తినే వాళ్లు ఎక్కువ మంది అయినప్పుడు సమస్యలు

[344] మిన్నేరు, పుట – 160.

మొదలవుతాయి. అప్పుడే వేరు కాపురం ఆలోచన వస్తుంది. భర్త తల్లిదండ్రుల చాటు బిడ్డగా, పరాధీనుడుగా ఉండకూడదని, స్వతంత్ర ఆలోచనలతో, స్వశక్తితో ఎదిగి సమాజంలో రాణించాలని కోరుకుంటుంది భార్య. స్త్రీలోని ఈ ఆశ, ఆకాంక్ష జానపద సాహిత్యంలో ఒక పల్లవిగా రూపొందింది.

"వేరేవుంటే మేలురా నాథా కూడివుంటే పోరురా."[345]

మరి వేరు కాపురం పెడితేజరుగుబాటు ఎలా?

అందుకే తన పాలు పంచుకు రమ్మంటుంది. వేన్నీళ్లకు చన్నీళ్లు లాగా తాను కూడా కూలీనాలీ చేసి సంపాదిస్తానని భర్తకు భరోసా ఇస్తుంది. తాను ఎంతగా కష్టపడుతుందో, కుటుంబాన్ని పొదుపుగా నిర్వహించి డబ్బులు ఎలా వెనకేస్తుందో, భవిష్యత్తులో వేరు కాపురం వల్ల తామెంతగా సుఖపడబోతున్నామో అనే అద్భుత దృశ్యాన్ని భర్త కళ్లముందు సాక్షాత్కరింప చేస్తుంది.

రాట్నం కొనిస్తే పూటకు ఏడుపుంజాలు నూలొడికి నీటైన తలగుడ్డ నేయిస్తా నంటుంది. మిగిలిన నూలుతో కోట బొమ్మంచు కోక నేయించుకుంటా నంటుంది.

పదిరూకల్తో ఒక పాడిగేదెను కొనిస్తే బాగా గడ్డిమేపి, కుడితి పెట్టి, పాలు పిండుతానంటుంది. ముదర గాచిన పాలు ముందుగా భర్తకు పోసి మిగిలిన వాటితో కడవ నెయ్యి చేసి అమ్మి డబ్బు సంపాదిస్తానంటుంది.

మర్రిచెట్టు చేను తన పాలు కొస్తే బర్రెపాలమీద ఇంటి ఖర్చు గడిపి వ్యవసాయం వృద్ధి చేయిస్తానంటుంది.

తెల్లవారుజామున లేచి ఏకులువడుకుతానని, నిమ్మల బావి నీటితో అన్నంవండి ఆకు కంచంలో అదిమదిమి పెడతానని, తానొక్కతే వడ్లు దంచి, కూడొండి, వంకాయ కూరతో తినిపిస్తానని - ఇలా ఎన్నో ఆశలు, ఆకాంక్షలు మూటగట్టి భర్త కళ్లముందు ఒలకపోస్తుంది.[346]

---

[345] మిన్నేరు, పుట – 197.
[346] పైదే.

ఉమ్మడి కుటుంబంలో పొలం పోయి పనిచేసే వాళ్లులేరు. బావ పెత్తందారు, బయట తిరిగివస్తాడు. కష్టమంతా భర్తదే. తోడికోడలు చోద్యం చూడటమే తప్ప పనికి సాయం రాదు. ఇంటి పనంతా తానే చెయ్యాలి. అంతేకాదు మొక్కజొన్న చేను నక్కలపాలు కాకుండా, కాకివాలకుండా కాపలా కాయాలి. ఇంతచేసినా సరైన భోజనం కూడా ఉండదు. మాడుచెక్కలే తినాలి. తానూ, తన బిడ్డలు సుఖంగా ఉండాలన్నా, తన భర్త కష్టారితం తమకు మాత్రమే దక్కాలన్నా వేరుకాపురం పెట్టక తప్పదంటుంది. అంతేకాదు తన పుట్టింటి వాళ్లు కరువు కాటకాలు వచ్చినప్పుడు ఆదుకోగల సమర్ధులని ధైర్యం చెబుతుంది.[347] ఇంత విన్న తరువాత భర్త వేరు కాపురం పెట్టకుండా ఉండగలడా!

**కొడుకును కనాలనే ఆకాంక్ష** : ప్రతి స్త్రీ వివాహానంతరం ఎంతో కాలం గడవకుండానే సంతానం కోసం ఆరాటపడుతుంది. తల్లి అయినప్పుడే జీవితానికి సార్ధక్యం అనుకుంటుంది.

"తింటేను తియదోసపండ్లే తినాలి
కంటేను కొడుకుల్ల కాన్పే కనాలి"[348]

అనేది ఆమె జీవితంలో గొప్ప ఆకాంక్ష. ఆ ఆకాంక్షను నెరవేర్చుకోవటం కోసం ఎన్నో నోములు నోస్తుంది. వ్రతాలు చేస్తుంది. ఎందరో దేవుళ్లకు మ్రొక్కుకుంటుంది. ఆ మ్రొక్కుల్లో ఒకటి

"కోటయ్య నీవంటి కొడుకుల్లనిస్తే
కోటి ప్రభలతోటి కొండలెక్కేము"[349] అనేది.

కోటి ప్రభలు కట్టించటం ఆమెకు సాధ్యమా! ఎంతటి అతిశయోక్తి! ఈ మ్రొక్కు మ్రొక్కేటప్పుడు ఆమె సాధ్యాసాధ్యాల గురించి ఆలోచించదు. ఆమె ఆకాంక్ష

[347] మిన్నేరు, పుట – 137.
[348] పైదే. పుట -98.
[349] పైదే, పుట – 61.

అంతటి బలీయమైంది. నిజంగా కొడుకు పుడితే కోటి ప్రభలు కట్టించినంత ఆనందం మాత్రం పొందుతుంది. ఇది నిజం.

ఈ ఆకాంక్ష వెనుక మరొక కారణం కూడా లేకపోలేదు.

"అందితే అన్నతో వియ్యమందాలి
ఆడితే వదినతో జగడమాడాలి."[350]

మేనగోడలిని కోడలిగా చేసుకొని వియ్యపురాలి హోదా పొందాలనుకుంటుంది. అప్పుడే తన జీవితం పరిపూర్ణమవుతుందని భావిస్తుంది.

ఆ శుభదినం వచ్చినట్లుగా ఒక సన్నివేశాన్ని ఈ విధంగా ఊహించుకొంటుంది. ఇరుగు పొరుగు వారిలో ఎవరో ఒకరు ప్రశ్నించినట్లు మరెవరో సమాధానం చెప్పినట్లు ఆ ఊహ సాగుతుంది. ఇల్లలికి ముగ్గెట్టి ఇంత పనిచేసి ఈ ఇంటి సుందరి ఎందు పోయింది అని ప్రశ్నిస్తే, 'సుందరి పుట్టిల్లు చూడబోయింది అన్నతో వియ్యమ్ము అందబోయింది. వదినలతో వాదులాడ బోయింది' అని సమాధానం. ఇది వరకు వదిన మాటలు తాను వినేది. ఇప్పుడు తన మాట వదిన వినాలి. తాను మగపిల్లవాడిని కన్న తల్లి కనుక అన్నా వదినలు తనకు విధేయులుగా ఉండాలని కోరుకొంటుంది. ఆడపిల్ల పుడితే ఈ బలం ఉండదు, తానే దాసోహం అనాలి. కొడుకు పుడితే అబల సబల అవుతుంది. అందుకే కొడుకును కనాలనే ఆకాంక్ష.

**ఏరాలు వద్దనే ఆకాంక్ష** : కావాలని కోరుకోవటం ఆకాంక్ష. వద్దని కోరుకోవటం కూడా వ్యతిరేకమైన ఆకాంక్షే. స్త్రీని ఉడికించటానికి లేదా బెదిరించి తన చెప్పుచేతల్లో ఉంచుకొని అన్ని పనులూ చేయించుకోవటానికి మగవాడు సంధించే గొప్ప బాణం ఏరాల్ని (సవతిని) తీసుకువస్తాననటం. స్త్రీ ఎన్ని కష్టాలనైనా బాధలనైనా తట్టుకొంటుంది గాని సవతి పోరు మాత్రం సహించలేదు. భర్త ప్రేమని ఎవరికీ పంచలేదు. అది తనకి మాత్రమే స్వంతం కావాలనుకొంటుంది. అయినా మగవాడు ఊరుకోడు. ఇటువంటి సందర్భంలో భార్యాభర్తల మధ్య జరిగే సంవాదం గేయరూపాన్ని

[350] మిన్నేరు, పుట – 98.

వహించింది.[351] 'ఏరాల్ని తెస్తాను, ఇంటిలో పెడతాను, ఏరాలి మాట వినాలి, నాయుడోలమ్మి' అని నాయుడు బావ బెదరిస్తాడు. అప్పుడామె 'ఏకులొడుకుతాను, వేరే అన్నం వండి పెడతాను కానీ ఏరాలిపోరు పడలేను' తేవద్దని ప్రాధేయ పడుతుంది. 'బంగారపు బొమ్మ, బెంగుళూరి గుంట, నడుము నాగబంధము, నడక హంసనడక' తెస్తానంటాడు. అప్పుడు నాయుడోలమ్మి దాని మాయలో పడవద్దని, దాని మాటలు వినవద్దని సోకుదారి మగడ్ని అనేక విధాల ప్రాధేయపడుతుంది. అటువంటి ఉత్కంఠభరిత సన్నివేశాన్ని తేలిక పరుస్తూ భర్త అంతా తమాషాకేనంటూ తాను తీసుకువచ్చిన వడ్డాణాన్ని భార్యకిస్తాడు. కుదుటపడ్డ మనసుతో భర్త ఇచ్చిన కానుకను తీసుకొని పండక్కు పెట్టుకొంటానని సంతోషంగా చెబుతుంది. భార్యా భర్తల మధ్య ఈ విధమైన సరసాలు రసవత్తర ఘట్టాలు. సపత్నీ మాత్సర్యం ఎన్ని అనర్థాలకు దారితీస్తుందో తెలియజేసే గంగ-గౌరీ సంవాదం ఆంధ్ర జానపద సాహిత్యంలో సుప్రసిద్ధం. కానీ అది పౌరాణిక గేయం కనుక ఇక్కడ పరిశీలించటం లేదు.

**పచ్చబొట్టు ఆకాంక్ష:** పచ్చబొట్టునే పచ్చాకు బొట్టని, పచ్చపొడిపించుకోవటమని, పచ్చపోయించుకోవమటమని పలు రకాలుగా వ్యవహరిస్తుంటారు. ఈ పద్ధతి ప్రపంచవ్యాప్తంగా ఉంది. "ఆకుపచ్చరంగు (కొన్ని ఆకుల పసరులు) తమ శరీరమున సన్నసూదితో చిన్న రంధ్రాలు పొడిచి అందు రంగును జొప్పించి మాన్పడం చేత పచ్చపొడిపించుకొనుట" అనే పేరు వచ్చిందని శ్రీ నేదునూరి గంగాధరంగారు పేర్కొన్నారు.[352]

పూర్వం పల్లెప్రాంత ప్రజలే ఎక్కువగా పచ్చపొడిపించుకొనేవారు. జానపద స్త్రీకి కూడా అందుకే పచ్చబొట్టు ఆకాంక్ష విశేషంగా కలిగినట్లు కొన్ని గేయాలు

[351] మిన్నేరు, పుట – 202.
[352] పైదే, పుట – 472.

తెలియజేస్తున్నాయి. "పచ్చబోయించుబావా!"[353] "పచ్చబొట్టు పొడిపించుబావా!"[354] అనేవి అందుకు నిదర్శనాలు.

పచ్చబొట్టు మీద ఎందుకింత ఆకాంక్ష? యువతీయువకులు దానినొక ప్రేమచిహ్నంగా భావిస్తారు. బావను పచ్చబొట్టు పొడిపించమనటంలో అంతరార్థ మిదే. పచ్చబొట్టు పొడిపించినవాడు తనకు భర్త అవుతాడని, అతనికే తన జీవితం అంకితమని అదో చెరగని చిహ్నమని జానపద స్త్రీ భావించినట్లు తెలుస్తున్నది.

పచ్చబొట్టుగా ఎటువంటి చిత్రాలను ఎన్నుకొనే వారో ఈ క్రింది గేయం నిరూపిస్తున్నది.

"అడవిమల్లె పొడమల్లె
ఆకాశ పొడమల్లె
రామన్న పాదాలు
లచ్చుమన్న[355] బాణాలు."

"ఆకులు ఎండిపోయినా పచ్చగానే ఉండటం వల్ల వీటికి 'పచ్చాకు' అనే పేరు వచ్చింది. చిత్తోద్రేకాన్ని కలిగిస్తుంది. వాత నొప్పులు హరిస్తాయి. మొదట హిందూదేశంలో సౌందర్యాధిక్యతను కాంక్షించి నుదుట చిన్నదిగ ఒక పచ్చ పొడిపించుకోవటం ఆచారంగా ఉండేది. బైబిలు పాత గ్రంథంలో యూదులకు పచ్చబొట్టు నిషేధింపబడింది. ఐరోపాదేశంలో సైనికులు చేతుల మీద వివిధాకారాలలో పచ్చపొడిపించుకొనేవారు. ఆంగ్లసైనికులు పారిపోయిన వారికి, దుష్టప్రవర్తన గల వారికి 'డి' అక్షరంగాని 'బి', 'సి' అక్షరాలుగాని పచ్చపొడిపించి అందరికీ కనబడేటట్లుగా చేయడం శిక్షగా క్రీ.శ. 1390 వ సం. ప్రాంతంలో ఉండేదంటారు. కొందరు తమ ఇష్టదైవాల పేర్లను, కొందరు తమ ప్రియుల పేర్లను పొడిపించుకొంటారు. అడవులలో నివసించే కొన్ని తెగల వాళ్లు తమ పగవారిని భయపెట్టటానికి వికారంగాను, భయంకరంగాను ముఖాలమీద పచ్చాకుబొట్లు

353 మిన్నేరు, పుట – 472.
354 పైదే.
355 పైదే, పుట – 474.

పాడిపించుకొంటారు - ఈ మొదలైన వివరాల నెన్నిటినో శ్రీ గంగాధరంగారు విపులంగా చర్చించారు.[356]

పూర్వకాలంలో కులాచారంగానో, కుటుంబ సంప్రదాయంగానో, వ్యక్తిగత ఇష్టంగానో వేయించుకొనే ఈ పచ్చబొట్టు అలవాటు ఆధునిక కాలంలో అలంకరణ సంస్కృతిలో ఒక భాగమయింది. ఫ్యాషనుగా మారింది. కొన్ని వర్గాలకే పరిమితమైన ఈ అలవాటు అన్ని వర్గాల వారిని ఆకట్టుకొంటున్నది. అయితే ఈ పచ్చపొడిచే విధానం పాతకాలంలో వలె మోటుగా కాకుండా ఆధునిక యంత్రాల ద్వారా నొప్పిలేకుండా వేస్తున్నారు. పూర్వం నుదురు లేక ముంచేతుల మీద కనిపించే ఈ పచ్చబొట్టు నేటికాలంలో శరీరం మొత్తం ఆక్రమించింది. టాటూయింగు పేరుతో నేటి కాలంలో ఈ అలవాటు క్రొత్తపుంతలు తొక్కుతున్నది. పశ్చిమ ఆసియా ప్రజలు ఎగిరేగ్రద్ద, సర్పంవంటి బొమ్మలంటే ఎక్కువ మక్కువ పడుతున్నట్లు వార్తాపత్రికల వల్ల తెలుస్తున్నది.[357]

ప్రపంచ ప్రజలందర్నీ ఆకర్షిస్తున్న ఈ పచ్చబొట్టు జానపద స్త్రీని ఆకర్షించడంలో వింతేముంది? బావతో సంతకెళ్లినప్పుడు నోరు తెరిచి పచ్చబొట్టు పొడిపించమని అడగటం హృదయంలో నిహితమైన ప్రేమభావాన్ని బహిర్గతం చేయటమే అని భావించవచ్చు.

**సంతకేగే ఆకాంక్ష :**

సంత = 1. సంతంటే నిర్ణయించబడిన దినమునందుంచెడి యంగళ్ల వరుస (శ.ర.).

2. కొనువారి యొక్కయు నమ్మెడు వారి యొక్కయు గూటమి (సూ.ని).

3.కొండొక సన్నికృష్ట విప్రకృష్ట భూములనుండు గ్రామంబుల నుండి బేహారులు నానారూప వస్తుకూటంబులొక్క యూరికిందెచ్చి సంకేత స్థలమున నమ్ముటయు సంతయనంబడు (సూ.ని).

---

356 మిన్నేరు, పుటలు – 473,74.

357 ఆంధ్రప్రభ, దినపత్రిక, 17-12-1978.

తాము ఉత్పత్తి చేసిన వస్తువుల్ని సమీపప్రాంతాల వారందరూ ఒకానొక ప్రసిద్ధ కేంద్రంలో అమ్మకానికి పెట్టడాన్నే 'సంత' అనవచ్చు. పరిసర గ్రామాల నుండి స్త్రీలు, పురుషులు అక్కడికి వచ్చి తమకు అవసరమైన వస్తువుల్ని కొనుగోలు చేస్తుంటారు. పదిమంది జనం చేరే చోటు కాబట్టి వినోద కార్యక్రమాలూ ప్రదర్శితమవుతాయి. ఆధునిక కాలంలో ఇటువంటి పదర్శనలు exhibitions పేరుతో నిర్వహింపబడుతున్నాయి. ముఖ్యంగా వీటిని వేసవి కాలంలో ఏర్పాటు చేస్తారు. విద్యార్థులందరికీ సెలవులు కనుక లాభదాయంకంగా ఉంటుందని.

సంత ఒక రోజు కానీ, మూడు లేక ఐదు రోజులు కానీ లేదా ప్రతివారం జరుగుతుంటాయి. వస్తూత్పత్తిని బట్టి లేదా అమ్మకాలను బట్టి ఈ ఏర్పాట్లు ఉంటాయి. స్త్రీ పురుషులు ఒక చోట చేరటం వల్ల పరస్పర ఆకర్షణలు, ప్రేమలు చోటుచేసుకోవటం సర్వసాధారణమే. క్రొత్త పరిచయాలూ అవుతుంటాయి. యవ్వనపు పొంగుతో త్రుళ్లిపడే యువతీయువకుల కేరింతలతో, కళా ప్రదర్శనలతో ఆప్రాంతమంతా సందడిగా ఉంటుంది. వారమంతా శ్రమపడిన ఆ కష్టజీవులకు వారాంతంలోని సంత ఆటవిడుపు. అటువంటి సంతలకు వెళ్లటానికి ఇష్టపడని వారెవరు? అందుకే ఒకానొక జానపదంగాన సంతకు వెళ్లటమంటే ఎంత సంతోషమో తెలియజేస్తున్నది గేయారూపంలో.[358] పని అంటే బద్ధకమట. సంతంటే సరదా అట. గోంగూర కొయ్యమంటే గోళ్లన్నీ కందుతాయట. ధాన్యం దంచమంటే దగ్గొస్తుందట. ఏకులు వడకమంటే ఏడుపొస్తుందట. ఎల్ల వెయ్యమంటే అదేమిటో తెలియదట, చాప నెయ్యమంటే చక్కెడుతుందట కాని సంతకు వెళ్లమంటే 'సంతంటే సంతోషమయ్యానాకు' అంటుంది.

వడ్లుదంచే పడుచు తనకాపని ఆపూట పూర్తికాదని, ఏలూరి సంతకు వెళ్లలేనేమోనని, ఏగాణీకి గోంగూర తెచ్చుకోలేనేమోనని విచారపడుతూ దంపుడు పాట పాడుతుంది.[359]

---

[358] జానపద గేయాలు, ప్ర.సం. పుట- 22.

[359] సరాగాలు, పుట – 231.

తనకిష్టమైన కూరగాయలో, సరుకులో, చీరో, రవికో తెచ్చుకోవాలంటే సంతకు వెళ్లాల్సిందే. ఆ వెళ్లటంకూడా ఒంటరిగా వెళితే ఆనందం ఉండదు. ప్రేమ విహారం చెయ్యటానికి వీలుండదు. అందుకే ఒకానొక జానపద స్త్రీ తన ప్రియుడితో కలిసి పేటంచు రైక కోసం పెనుగొండ సంతకు, గోటంచు పంచె కోసం గోరంట్ల సంతకు, కొప్పిరి (కొబ్బరి) బెల్లానికి కొడికొండ సంతకు వెళ్లిందట.[360]

సంతలో ఒక ప్రియురాలు తనను చూచి నవ్వుతున్న ప్రియుడ్ని అలా నవ్వవద్దని హెచ్చరిస్తూ ఆనూరి సంతకు రమ్మని సూచిస్తుంది. ఆకులకు వక్కలకు ఒక కాసిచ్చి పొమ్మంటుంది. తన దగ్గర కాసులు లేవంటాడు. నుగులూరి సంతకు రమ్మంటుంది. సున్నానికి ఒక కాసిచ్చి పొమ్మంటుంది. లేదంటాడు. పుంగనూరి సంతకు రమ్మంటుంది. పూలకు ఓకాసిచ్చి పొమ్మంటుంది. దానికీ లేదంటాడు. ఈ విధంగా సరసంగా సంతకు రమ్మని సంకేతిస్తుంది యువనారీజనం.[361]

సంతలో సరాగాలు కొందరికి మధుర జ్ఞాపకాలు. పెద్దాపురం సంతకు వెళ్లి పెద్దిగాడ్ని కలుసుకుంటే చిలకారావే అంటూ రెండు బుగ్గలూ పట్టుకొని బూరి ముక్కలా తిన్నాడని తలచి తలచి మురిసి మురిసి పరవశిస్తుంది ఒకానొక పడతి.[362]

వేరొక మరదలిది మరొక అనుభవం. శుక్రవారం సంతలో బావ తన కాలిమట్టెల మీద తొక్కాడట. అందుకు తనకుఏడుపు రాలేదని బావ సుకుమారమైన కాలికి ఎంత బాధ కలిగిందోనని విలపించానంటుంది. ఆదివారం సంతలో జన సమ్మర్థంలో కసికొద్దీ గుద్దాదట. గుద్దినందుకు ఏడుపు రాలేదని బావ గుత్తినొప్పికి ఏడిచానంటుంది. బుధవారం సంతలో బుగ్గలట్టుకు కరిచాడట. కరిచినందుకు కాదు గాని బావ పళ్లనొప్పికేడ్చానంటుంది. కొంత మొరటుగా ఉన్నా వారి హృదయోద్వేగాన్ని నిరూపిస్తాయి ఇటువంటి గేయాలు.[363] శిష్ట సాహిత్యంలో

---

[360] జానపద కళాసందప, పుట – 43.
[361] తెలుగు - కన్నడ జానపద గేయాలు, పుట – 185.
[362] పల్లెపదాలు, పుట – 212.
[363] పైదే, పుట – 202.

శ్రీకృష్ణుడు ఇటువంటి విచారాన్నే[364] వ్యక్తం చేస్తాడు. దీనిని బట్టి జానపద సాహిత్యమైనా శిష్ట సాహిత్యమైనా భాష, ఛందస్సు వేరుగాని భావనలు ఒకటేనని నిరూపితమవుతున్నది.

**తిరునాళ్ల ఆకాంక్ష** : శ్రీ = తిరు, నాడు = నాడు (రోజు). శ్రీనాడు అనే సంస్కృత పదానికి తెలుగు రూపమే తిరునాడు. నాడుకు బహువచనం నాళ్లు గనుక తిరునాళ్లు అయింది. దేవాలయాల్లో జరిగే దేవతా సంబంధమైన ఉత్సవాలకే 'తిరునాళ్లు' అని పేరు. దేవాలయంలోని దేవతను బట్టి సంవత్సరంలో ఒక ప్రత్యేకమైన రోజు ఉంటుంది. ఆ రోజు తిరునాళ్లు జరపటం సంప్రదాయం. ముఖ్యంగా గ్రామదేవతలకు ఈ తిరునాళ్లు భారీయెత్తున జరుగుతుంటాయి. గ్రామ ప్రజలు, పరిసరగ్రామవాసులే గాక ఆ ఊరి నుండి వలస వెళ్లినవారు, పెళ్లయి వేరే ఊళ్లలో ఉంటున్న ఆడపడుచులు అందరూ తప్పనిసరిగా సకుటుంబంగా ఈ కార్యక్రమంలో పాల్గొంటారు. ఎక్కడ జనసంద్రత ఉంటుందో అక్కడ భిన్నమనస్తత్వాలవారూ ఉంటారు. భక్తిభావంతో వచ్చేవారు కొందరైతే, ముక్తికీ రక్తికీ ఉభయ తారకమని భావించేవారు మరికొందరు. భావన ఏదైనా అందరూ ఉత్సాహంగా, ఉల్లాసంగా ఈ వేడుకలో పాల్గొంటారు.

కనుకనే అటువంటి తిరునాళ్లకు వెళ్లాలని జానపద స్త్రీ ఆకాంక్షిస్తుంది. నిత్యం సంసార భారంతో క్రుంగిపోయే ఆమెకు కొంత విరామం దొరుకుతుంది. గుంటూరు పరిసరప్రాంతాలలోని ఒకనొక జానపదాంగనకు రెండు కోరిక లున్నాయట. ఒకటి కోటప్పకొండ తిరునాళ్లు[365] చూచి రావటం. రెండు తిరుపతి వెళ్లి అలివేలు మంగమ్మ అలుగులు తీర్చి కుంకుమ అందుకొని ఆనందించటం. తన

---

[364] "ననుభవదీయదాసుని మనంబున నెయ్యపు గిన్కబూని తా
చిన యది నాకు మన్ననయ చెల్వగు నీ పదపల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వితానము దాకిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవుగదా యికనైన నరాళకుంతలా" –పారిజాతాపహరణం, 1-123.

[365] కోటప్పకొండ గుంటూరు జిల్లాలోని నర్సరావుపేటకు సుమారు 12 కి.మీ. దూరంలో ఉంది.

జీవిత పరమార్థాలైన ఆ రెండు కోరికలను లయాత్మకంగా గేయరూపంలో ప్రకటిస్తుంది.[366]

రాయలసీమలో నంది తిరునాళ్లు[367] (మహానంది) చాలా ప్రసిద్ధం. ఆ తిరునాళ్లకు వెళ్లాలని పరితపిస్తుంది ఆ ప్రాంతానికి చెందిన మరొక జానపద వనిత.[368] కానీ ఆమె సంసారమనే పద్మవ్యూహంలో చిక్కుకొన్న నిస్సహాయ సైనికురాలు. సమష్టి కుటుంబంలో అందరి అనుమతీ తీసుకోవాలి. ముందుగా పట్టెమంచం మీద పడుకొనుండే మామ నడిగింది. మామ పెత్తనమేముంది? అత్తనడుగమన్నాడు. గద్దెపీటల మీద గౌరి పెద్దత్తనడిగింది. ఆమె రచ్చకట్టమీద రాజా పెద బావనడగమంది. పెదబావ పెత్తనం మాత్రం ఏముంది? వంట గదిలోవున్న వయ్యారి తోడికోడల్ని అడగమన్నాడు. చివరకు ఎద్దులగాచే ముద్దుల మరిదిని కూడా ప్రాధేయపడింది. అటు తిరిగి ఇటుతిరిగి చివరకు సందుల్లో ఉండే మొగలిరేకు తన మగడ్ని అభ్యర్థించింది. ఇంతలో తిరునాళ్లు ముగిసాయి. తాను తిరునాళ్లు చూచే అదృష్టానికి నోచుకోలేదంటుంది. అయినా ఆమె ఆకాంక్ష అక్షరబద్ధమై, గేయాత్మకమై సహృదయ హృదయాలలో గిర్రున తిరుగుతూనే ఉంటుంది.

వేరొక చిన్నది తన చిన్న మామయ్యతో మాచర్ల చెన్నకేశవస్వామి తిరునాళ్లకు వెళ్లింది. తీర్థంలో స్నానం చేసింది. దేవుడి ముందు దీపం వెలిగించింది. టెంకాయ కొట్టింది. తరువాత ఉల్లడం క్రిందగా ఊరేగుతుంటే చిలిపి వాడెవ్వడో చిన్నగా వెనకాలకు వచ్చి చంకలో చెయ్యిపెట్టి సరసమాడాడు. వెనక్కి తిరిగిచూస్తే ఎవరూ లేరు. కానీ ఆ వెళ్లిన వాడెవడో అని ఆమె బాధపడలేదు. ఈమెది భక్తి భావనే గాని రక్తిభావన కాదు. కనుక ఆ వచ్చిన వాడిని 'మాచర్ల చెన్నడే మాయల్లవాడే' అని సంభావించుకుంది. అలా అనటంలో ఆమె ఉదాత్త భక్తిభావన ఉట్టిపడుతుంది.[369]

---

[366] పల్లెపదాలు, పుట -111.

[367] మహానంది కర్నూలు జిల్లాలోని నంద్యాలకు సుమారు 16 కి.మీ. దూరంలో ఉంది.

[368] పల్లెపదాలు, పుట – 111.

[369] పైదే, పుట-112.

సంతలు కేవలం ఇహలోక సంబంధమైన ప్రయోజనాలు మాత్రమే చేకూర్చితే తిరునాళ్లు ఇహ పర ప్రయోజనాలు రెండూ సమకూర్చేవి. జీవితంలో ఇవన్నీ వేడుకలు, వినోదాలూ కూడా. నిత్యనైమిత్తిక జీవితంలోని నైరాశ్యాన్ని నిర్మూలించి నూతనోత్సాహాన్ని నింపగలిగేవి గాబట్టే అట్టి వాటిలో పాల్గొనాలనే ఆకాంక్ష జానపద స్త్రీకి ఉండటం సమంజసం.

**పుట్టింటి ఆకాంక్ష** : స్త్రీకి పుట్టిల్లన్నా, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లన్నా ఎంతో అభిమానం. తరచుగా పుట్టించికి వెళ్లాలని ఆకాంక్షిస్తుంది. కానీ అది వీలుకాని పని. అందుకే పుట్టింటివైభవాన్ని సదాస్మరించుకొంటూ అత్తవారింట్లో సంతృప్తిగా జీవించటం జానపద స్త్రీకి పరిపాటి.

"అడుగడుగు నిమ్మల్లు ఆకు దోటల్లూ
అరిచంద్రుని పూదోట అమ్మ పుట్టిల్లూ"[370] అని భావిస్తుంది.

హరిశ్చంద్రుని పూదోట ఎలా ఉంటుందో తనకు తెలియకపోయినా ఎంతో గొప్పగా ఉంటుందని ఊహించుకొంటుంది. ఆకుమళ్లతో, నిమ్మ మొక్కలతో, వివిధ ఫల పుష్పభరిత వృక్షజాతుల మధ్య తన పుట్టిల్లు అందగించి ఉంటుందని అభివర్ణించుకొంటుంది. ఇంకా

"టెంకాయ వనముల్లు తేరి వాకిండ్లు
దేవేంద్రుని పూదోట నాదిపుట్టిల్లూ"[371]

అని తన పుట్టింటి వైభవాన్ని పొగుడుకొంటుంది. తాను పుట్టిన ఇంటి వాకిలి రథం పట్టేటంత పెద్దదని వర్ణిస్తుంది. ఇంతకన్నా గొప్ప అతిశయోక్తి ఉండదేమో!

భార్య ఆలోచనలు గమనించిన భర్త ఏవిధంగానైనా ఆమె ధ్యాస మళ్లించాలని పట్టుబడతాడు.

---

370 తెలుగు దేశపు జానపద గీతాలు, పుట -13.
371 పైదే.

"పులిపాలబడ్డావె పుట్టిల్లుమరువు[372]
నాపాల బడ్డావె నా యిల్లు నెరువు"[373]

అని దౌర్జన్యంగా ఆమె మనసు మరల్చాలనుకొనే మగనికి దీనంగా మగువ ఇచ్చే సమాధానమిది.

"పుట్టినానాటి నుండి పువ్వల్లె సాకి
పున్నుడానేనెట్లు పుట్టిల్లు మరతు
కన్ననాటి నుండి గారానసాకి
కాముడా నేనెట్లు కన్నోరి మరుతు
ఏరుపారినపోదు ఏటిమీదిసుక
తలుచుకున్నాపోదు తల్లిపై మరులు."[374]

ఇవి హృదయాన్ని కదిలించే పలుకులు. భర్త పుణ్యపురుషుడే కావచ్చు. అందానికి రాముడే కావచ్చు. అయినా పుట్టింటిని విస్మరించటం అసంభం.

కనుకనే పుట్టింటికి వెళ్లాలంటే ఎక్కడలేని ఉత్సాహం వస్తుంది. వేరే ఏదైనా ఊరు వెళ్లాలంటే ఉత్సాహం ఉండదు.

"కాశికెళదామంటే కదలనే కాళ్లు
ఢిల్లికెళదామంటే తిరగదే మనసు
నారాచ పుట్టించి కెళదాము అంటె
నాకాళ్లు పన్నిన్న రథముల్లై నడచు
నా చేతులుయ్యాల చేరులై యూగు."[375]

---

[372] మిన్నేరు, పుట – 182.

[373] 'నెరువు' అని ఉచ్చారణలో ఉన్నా ఈ శబ్దం నిఘంటువులలో లేదు. బహుశః ఇది నెరవు అయ్యుండవచ్చు. నెరవు= పూర్తి, వ్యాపనము, యుక్తము, విశాలము, వ్యాపకము అని అర్థాలు. స్వరాకర్షణచే నెరవు నెరువు అయ్యుండవచ్చు.

[374] మిన్నేరు, పుట – 182.

[375] తెలుగు - కన్నడ జానపద గేయాలు, పుట – 114.

కాశీకి వెళ్లాలంటే కాళ్లు కదలటంలేదట. ఢిల్లీకి వెళ్లాలంటే మనసు రావటం లేదట. కానీ పుట్టింటికి వెళ్లాలనుకుంటే మాత్రం తనకాళ్లు 'పన్నిన్న రథాలై' పరుగులు తీస్తున్నాయట. చేతులు 'ఉయ్యాల చేరులై' ఊగుతున్నాయట. జానపద స్త్రీకి పుట్టింటిపై గల ఆపేక్షకు నిలువెత్తు నిదర్శనమీ గేయం.

పుట్టింటికి పోవాలనే అభిలాష ఇల్లాండ్ర కందరికీ ఉండటం సహజమే కానీ అందరికీ ఆ అవకాశం రాదు. మంది ఎక్కువున్న చోట మగువనిస్తే అంతేమరి. అత్తవారింట్లో వారెవ్వరూ ఆమె వెళ్లటానికి అనుమతివ్వరు. మంది ఎక్కువున్న చోట తన్నిచ్చినందుకు తల్లడిల్లుతూ తరుణి ఈ విధంగా అనుకొంటుంది.

"మాయమ్మ కనింది మందికిచ్చింది
పుట్టిల్లు దొవ్వాయె పోరు మోపాయె
సంగటి జారగాయె తెడ్డు కురసాయె."[376]

సంకటి పలచగా ఉన్నప్పుడు తెడ్డు పొట్టిదయితే ఎంతకీ పాత్ర నుండి బయటికి రాక ఇబ్బందవుతుంది. అదేవిధంగా అత్తవారింట్లో చాకిరీ ఎక్కువయి నప్పుడు, పండగైనా పబ్బమైనా పుట్టింటికి పోవటానికి అవకాశం రానప్పుడు తరుణి తల్లడిల్లుతుంది.

అయితే పుట్టిల్లు, అత్తవారిల్లు అత్యంత సమీపంగా ఉన్నా ఇబ్బందే. ఎక్కువ దూరమైనా బాధే. ఆరళ్లు పెట్టే అత్తను, సవతి పోరును, పుట్టిల్లు దూరంగా ఉండటాన్ని భరించలేకపోతుంది జానపద భామామణి.[377]

అందుకే జీవితానుభవంతో తన ఇల్లు ఎక్కడ కట్టుకోవాలో ఖచ్చితంగా నిర్ణయించుకొంటుంది. ఆ ఇల్లు సవతి పొరుగున ఉండకూడదు. అలా ఉంటే ఏటిగాలికెత్తిన దాలిపొయ్యి వలె అవుతుందని ఆమె భయం. అదే కన్నతల్లి పొరుగున

---

[376] త్రివేణి, పుట – 87.
[377] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట- 55.

ఉంటే అన్ని కష్టాలలోను తనను ఆదుకొంటుంది. అలా కట్టిన ఇల్లు పాలుపోసి వండిన పాశంలా ఉంటుందని అభిప్రాయపడుతుంది.[378]

పుట్టింటి సౌభాగ్యం ఎప్పటి వరకుంటుంది? కన్నతల్లి బ్రతికున్నంత వరకే. ఆమె కన్ను మూస్తే అన్నలకు అంతగా పట్టదు. అడవిలో తమ్మికాయకాస్తే ఎంత ప్రయోజనమో అమ్మలేని పుట్టింటికి వెళ్లినా అంతే ప్రయోజనం. అడిగి తద్దినం పెట్టించుకొన్నట్లు పుట్టింటికి వస్తాను తీసుకువెళ్లు అన్నయ్యా అని వారిని బ్రతిమలాడాలి.

"నాగప్పల పండక్కి[379] నేనొస్తనన్నా
నాగుబడిగల రైక నాకి తేరన్నా"[380]
"బెనకప్ప పండక్కి[381] నేనొస్తనన్నా
బెల్లపచ్చులరైక నాకి తేరన్నా"[382]

అని తన ఉల్లాన్ని వ్రెళ్లగక్కుతుంది. తల్లి బ్రతికున్నంత వరకు తనపై ఎంతో వ్యామోహం. ఆ తల్లి అదృశ్యమయింతరువాత పుట్టింటికి తనకు ఎంతో దూరమని బాధపడుతుంది పడతి.

ఆడపిల్లను సుదూర ప్రాంతాలకిస్తే పుట్టిల్లు దూరమై ఆ అతివ మానసికంగా ఎంత వ్యధచెందుతుందో తెలియజేసే పాట చాలా ప్రసిద్ధి చెందింది.[383]

"నల్లగొండలపైని నన్నిచ్చినారు
నన్నిచ్చిన కన్నోరు ననుచూడరారు"

అని లోలోన కుమిలిపోతుంది.

---

378 జానపద కళాసంపద, పుట -25.

379 నాగులచవితి పండుగగకు
రాయలసీమలో శ్రావణ శుద్ధ చతుర్థి నాగుల చవితి.
సర్కారులలో కార్తీక శుద్ధ చతుర్థి నాగుల చవితి. - అథస్సూచిక, త్రివేణి, పుట – 87.

380 పైదే.

381 వినాయకచవితి పండుగకు.
వెనకప్ప – వినాయకుడు. ఇది రాయల సీమ ప్రాంతపు గేయం. పొరుగున గల కన్నడ భాషా ప్రభావం చేత వకారం బకారమయింది.

382 త్రివేణి, పుట. 87.

383 మిన్నేరు, పుట – 183.

ఎంత కాలమైంది పుట్టింటికి వెళ్లి? ఇందుకు ప్రకృతే సాక్షి.

"బూరుగులు పూచాయి భూమి కొరిగాయి
మావుళ్లు పూచాయి మన్ను కొరిగాయి
తంగుళ్లు వూచాయి ధరిణి కొరిగాయి."

కానీ అన్నదమ్ములెవరూ తనకు తీసుకువెళ్లటానికి రాలేదు. వాళ్లు తన ఇంటికి దారి కూడా మరిచిపోయారేమో అని తల్లడిల్లుతుంది. ఎన్నోసార్లు 'కుండపోత' వర్షాలు కురిసాయి. ఎన్నో సార్లు పెద్దగాలులు వీచాయి. చెట్లు విరిగి పడ్డాయి. ఇప్పుడు వారికి దారేం తెలుస్తుంది? అని విచారిస్తుంది. చిన్నన్న ఇచ్చిన 'చిన్నావుపడ్డ' పెద్దదయింది. నడిపన్న ఇచ్చిన 'నానుపట్టెడ' అరిగిపోయింది. అయినా పుట్టింటివారు తిరిగి చూడలేదు. ఎంత ఐశ్వర్యమిచ్చినా కాంతకు కావలసింది ప్రేమ. ప్రేమకు మించిన కానుక, అభిమానానికి మించిన వేడుక ఏ వెలదికి ఉందదనటం సత్యం.

అందుకే యమధర్మరాజు పిలుస్తున్నప్పుడు కూడా వనితకు జ్ఞాపకం వచ్చేది పుట్టిన బిడ్డలు, పుట్టిల్లు.[384]

"ఎంత దొడ్డ వాడు యమధర్మరాజు
యిన్ని పనులు విడిచి వెంట రమ్మనెను
పుట్టిన బిడ్డల విడిచి పుట్టిల్లు విడిచి
కలికి వైకుంఠము కలదు రమ్మనెను."[385]

యమధర్మరాజు మూడోసారి వరం కోరుకోమన్నప్పుడు సావిత్రి తన పుట్టింటిని విస్మరించకుండా తన తండ్రి "మద్రేశ్వరుండపుత్రకుండతనికి బుత్రశత లాభంబగునట్లుగా"[386] అభ్యర్థించింది. స్త్రీకి పుట్టింటిపైగల ఆకాంక్ష అంతటి విశిష్టమైంది.

[384] మిన్నేరు, పుట – 53.
[385] పైదే.
[386] శ్రీమదాంధ్ర మహాభారతం, అరణ్య పర్వం, 7-240.

**ఆజీవితాకాంక్ష**: హైందవ స్త్రీ జీవితాంతం ఆకాంక్షించేది ఒక్కటే. తన పసుపుకుంకుమలు చల్లగా ఉండాలని. అంటే భర్త క్షేమంగా ఉండాలని. ఆమె ఏ నోములు నోచినా, ఏ వ్రతాలు ఆచరించినా, ఏ దేవుళ్లకు మ్రొక్కుకున్నా సంపదలు కోరుకోదు. సౌభాగ్యాన్ని మాత్రమే కోరుకుంటుంది.

"అమ్మ మంచిదమ్మ అలివేలుమంగ
అలివేలు మంగమ్మ ఆటకూటానా
అడిగి తెచ్చుకుందు అయిదవ తనము."[387]

* * *

[387] మున్నీరు, పుట – 234.

# III భావాలంకార విశేషాలు

## 1. సోదర భావన

స్త్రీ పుట్టుక చాలా విచిత్రమైంది. ఆడపిల్ల 'ఆడ' (అత్తింటికి పోవలసిన) పిల్లే అయినా పుట్టినప్పటి నుండి ఇంటి మహాలక్ష్మిగా సంభావింపబడుతూ కుటుంబ సభ్యుల ప్రేమానురాగాల మధ్య పెరిగి పెద్దదవుతుంది. పెళ్లయిన తరువాత మెట్టినింట్లో ఉన్నప్పటికీ ఆ ఇంటి ఉన్నతినే గాక పుట్టింటి సౌభాగ్యాన్నీ, సహోదరుల అభివృద్ధినీ అహరహం ఆకాంక్షిస్తుంటుంది. తనకింతమంది సోదరులని చెప్పుకొని గర్విస్తుంది. వారు మంచి స్థితిగతుల్లో ఉంటే ఆనందిస్తుంది. జరుగుబాటు తక్కువైతే బాధపడుతుంది.

రామాయణంలో శాంత, శూర్పణఖ, భారతంలో ద్రౌపది తమ సోదరుల పట్ల అత్యంత ప్రేమాభిమానాలు కల స్త్రీమూర్తులుగా గణుతికెక్కారు. ఈ కావ్యాల కంటే ప్రాచీనమైన జానపద సాహిత్యంలో స్త్రీకిగల సోదరాభిమానం అడుగుడుగునా నిరూపితం. ఆమె ప్రేమకు సీమలుండవు. ఆమె అభిమానానికి అంతూపొంతూ నిర్ణయించలేం. ఏకోదరులనేకాక పరిసరాలకు, గ్రామానికి చెందిన మగవారి నందరినీ సోదరభావనతో సంభావించటం ఆమె హృదయవైశాల్యానికి నిదర్శనం. పనిపాటలలో నిమగ్నమైనా, ఇతరులతో మాట్లాడుతున్నా సోదరుల ప్రస్తావనతో తన అభిమానాన్ని చాటుకొంటుంది.

దండుబోయిన అన్న దండలు తెస్తాడని సూర్యాపేట పోయిన అన్న చూచిన రైకలు తెస్తాడని, నల్లగొండ పోయిన అన్న నక్కీరైకలు తెస్తాడని, పట్నం పోయిన అన్న పట్టు చీరలు తెస్తాడని, కంభం పోయిన అన్న గాజులు తెస్తాడని, మట్టెవాడ పోయిన అన్న మట్టెలు తెస్తాడని ఆశతో నిరీక్షిస్తుంది.[388] ఆడపిల్ల ఆకాంక్షించేవి ఇవే కదా!

[388] తెలంగాణ పల్లెపాటలు,పుట -33.

పై కోర్కెలన్నీ విలాసానికి సంబంధించనవి. కానీ తెల్లవారిలేస్తే ధాన్యం దంచుకొని కుటుంబాన్ని నిర్వహించుకోవలసిన స్త్రీ తన అన్నయ్యను చేవరోకళ్లు చేయించి పెట్టమనీ, వాటికి వెండి పొన్నులు వేయించి పెట్టమనీ కోరుతుంది.[389] అలా కోరటంలో అవసరంతో పాటు ఆడంబరం కూడా సూచితం.

ఆ విధంగా తన అన్నయ్య చేయించి ఇచ్చిన రోకలితో పోటు వేస్తే 'చుక్కలు పిక్కటిల్లుతాయని', 'సూరన్న కదులుతాడని', 'అసలు ఆకాశమే అల్లాడిపోతుందని' కాస్త అతిశయమే అయినా గర్వంగా చెప్పుకొంటుంది.[390]

ఏ స్త్రీ తాను ఒంటరిగా పుట్టాలని కోరుకోదు. ఎంతమంది సోదరులుంటే ఆమెకంత బలం. ముగ్గురన్నలతో పుడితే ఆమె నడుము మువ్వంచు చీరను కోరు తుందట. నలుగురన్నలతో పుడితే నల్లంచు చీర కోరుతుందట. అయిదుగురన్నల తోబుట్టువయితే అద్దాల రవికను కోరుకుంటుందట. అన్నలెక్కువయ్యేకొద్దీ ఆమె అంతస్తు పెరుగుతుంది.[391] ఈ సోదర సంపదే ఆమెకు పెన్నిధి.

జానపద వనిత తన అన్నల ప్రతాపాన్ని వర్ణించి తన సోదరాభిమానాన్ని చాటుకొంటుంది. గుర్రపు స్వారీలో తన అన్న దిట్ట అనీ, దాన్ని దుమ్మురేగేట్టు నడిపించగలడనీ అభివర్ణిస్తుంది. తన అన్న అందచందాల్ని వర్ణించుకొని పరవ శిస్తుంది. అతని ముక్కుమీద చెమట ముత్యంలా మెరుస్తుందట. ఎదమీద పతకం అద్దంలా ప్రకాశిస్తుందట. అతని బంగారు జులపాలు పాముపడగల్లాగా అల్లల్లాడు తుంటయ్యట.[392]

తన అన్నని వర్ణించటంలో అతివ వ్యక్తం చేసే సోదరాభిమానం నిరుపమానం.[393] ఇంకా ఇంటికి రాని తన అన్నయ్య గురించి ఆందోళన పడు తుంది. దారి వెంట పోయే దానయ్యకు తన అన్న ఎక్కడైనా ఎదురయ్యాడేమోనని

---

389 పల్లెపదాలు, పుట- 47.
390 పైదే.
391 పైదే.
392 త్రివేణి, పుట -90.
393 పైదే, పుట – 83.

ప్రశ్నిస్తుంది. అతడు ఆమె అన్న ఆనవాళ్లేమిటని అడిగితే బంగారు వన్నెవాడని, పట్టుధోవతి, పదివేళ్లకి ఉంగరాలు, జలతారు పేటగల సన్నని పచ్చడం, మంజేతికి కడియాలు, ముద్దుటుంగరం, చెవులకు పోగులు, సేరు వెండి కడియాలు ధరించిన వాడంటుంది. ఆ వర్ణనలో ఎంతటి అతిశయం! ఎంతటి మురిపం! నిజంగా ఆమె అన్న అవన్నీ ధరించకపోయినా ఆ వర్ణనలో ఆమె సోదరాభిమానం కళ్లకు కట్టినట్లయింది.

అరణ్య ప్రాంతాల్లో ఉండే జానపద స్త్రీలు తమ సోదరులు వేటకు పోయేటప్పుడు జరిగే సంబరాన్ని అభివర్ణిస్తూ పాడుకున్న పాటలు వారి వారి అభిమానాన్ని ప్రస్ఫుటం చేస్తాయి బల్లాలు, బాణాలు, బరిసెలు, గొడ్డళ్లు తీసుకొని తమ సోదరులు వేటకు పోతుంటే తప్పెట్లు, తాళాలు, తాశామర్పాలు మ్రోగిస్తూ ఊరంతా కదిలి ఉరుకులు పెట్టేదని, వారు పులుల్నీ, మేకల్నీ వేటాడి తిరిగి వస్తుంటే బోరుబోరున మేళాలు మ్రోగేవని, భోగమాటలు ఆడించేవారని, మల్లెపూల దండలు వేసి మంగళారతులు పట్టేవారని వర్ణించి మురిసిపోతుంది.[394]

యుక్తవయసు వచ్చిన కన్యకు కన్యాదానం చేయక తప్పదు. ఆడదానికి వివాహం ఎప్పుడూ సమస్యే. బరువు బాధ్యతలు తీరిపోతాయని మగవాళ్లు తొందరపడి ఎవరికో ఒకరికి అంటగట్టటానికి ప్రయత్నిస్తుంటారు. అందులోనూ తల్లిదండ్రులు లేని ఆడపిల్ల బ్రతుకు మరీ అన్యాయం. తొందరపడి అన్న తనను ఎవరికో ఒకరికిచ్చి కట్టబెడతాడేమోననే భయంతో అన్నతో తనకున్న చనువు కొద్దీ తనకెటువంటి సంబంధం కావాలో చెప్పటానికి ప్రయత్నిస్తుంది ఒకానొక జానపదకన్య.

బావలున్న చోటుకివ్వద్దని, ఏరాలున్న చోటుకివ్వద్దని, మరుదులెక్కువగా ఉన్నచోటుకివ్వద్దని కోరటమే కాకుండా ఆ ఇచ్చే చోట బావి ఎంత లోతుగా ఉందో చూసి ఇమ్మంటుంది. ఒకవేళ బావి లేకపోతే ఏరెంత దూరంలో ఉందో చూసి

394 త్రివేణి, పుట – 35.

ఇవ్వమంటుంది.[395] పెళ్లయినప్పటినుండి చేతులు కాయలు కాచేలాగా నీళ్లు తోడుతూ, ఏటి నుండి నీళ్లు మోస్తూ బ్రతుకు దైన్యం కాకూడదని ఆకన్య ఆకాంక్ష.

ఇన్ని జాగ్రత్తలు తీసుకొని పెళ్లి చేసినా ఆమె జీవితం పూలబాట కాదు కంటకావృతమని నిరూపితమవుతుంది. తనను చూడటానికి పుట్టింటి నుండి అన్నలొచ్చినప్పుడు కాళ్లకు నీళ్లిచ్చి కన్నీళ్లు పెట్టుకొంటుంది. నూరామడల్లో, తన్నిచ్చారని, పుట్టిల్లు దూరమైందని, పోరు బలమయిందని, కలవాళ్లని మోసపోయి ఇచ్చారని, చివరకు కలివికాయలు తినే బ్రతుకయిందని, భాగ్యవంతులని తన్నిచ్చారని, బారకాయలు కాయించి బానకేసే చోటని, ఏరాళ్ల పోరు పడలేకుండా ఉన్నానని అన్నలతో మొరపెట్టుకొంటుంది అతివ.[396] ఆమె దీనస్థితికి కరిగి పోయిన అన్నలు చీరలు పంపుతామని, ఒడిబ్రాలు పంపుతామని ఓదారుస్తారు.

ఈ ఓదార్పు ఎంతకాలం పనిచేస్తుంది? కాలం గడిచే కొద్దీ పుట్టింటిమీది బెంగ ఆమెను క్రుంగదీస్తుంది. చాలా కాలం తరువాత పెద్దన్న చెల్లిలింటికొస్తాడు. ఆ సమయంలో చెల్లెలు పప్పు కడవలోపోసి కడుగుతున్నది. అన్నను చూడగానే దుఃఖం ఆగలేదు. తన కన్నీళ్లే పాద్యంగా సమర్పిస్తుందా అన్నట్లుగా కాళ్లు కడుక్కోవటానికి నీళ్లిస్తుంది. కలవారింట్లో ఇచ్చినా ఆమెకు కడగండ్లు తప్పలేదు. ఆమె కన్నీళ్లు చూచి అన్నకు పరిస్థితి అర్థమయింది.

"ఎందుకు కన్నీళ్లు ఏమి కష్టమ్మ
తుడుచుకో చెల్లెలా ముడుచుకో కురులు
ఎత్తుకో బిడ్డను ఎక్కు అందలము
మీ అత్తమామలకు చెప్పిరావమ్మ"[397]

[395] త్రివేణి, పుట -103.
[396] పైదే, పుట – 95.
[397] పల్లెపదాలు, పుట – 110.

అని అన్నగారు ఆప్యాయంగా ఆదేశిస్తాడు. అదే ఆమె కడగళ్లకు మందు. ఆమెకు వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది. పుట్టింటికి వెళ్లటానికి సంసిద్ధమవుతుంది.

అత్తవారింటి నుండి బయట పడటం అంత సులభమైన విషయమేమీ కాదు. అది ఒక పద్మవ్యూహం. ముందుగా కుర్చీపీట మీద కూర్చున్న అత్తగారిని "మా అన్నలొచ్చారు మమ్మంపుతారా?"[398] అని దీనంగా ప్రాధేయ పడుతుంది. నాకు తెలియదు మామగార్ని అడగమంటుంది. పట్టెమంచం మీద పడుకున్న మామగార్ని అడుగుతుంది. ఆయన బావగార్ని అడగమంటాడు. భారతం చదువుతున్న ఆయన నాకు తెలియదు మీ అక్కయ్యనడుగు అంటాడు. తోడికోడల్ని అడిగితే ఆమె కూడా నాకు తెలియదు నీ భర్తనడుగు అంటుంది. రచ్చలో రాజేంద్రభోగిలా వెలుగుతున్న భర్తను పిలిపించి తన ముద్దు చెల్లించమని ఆ ముద్దియ కోరగా ఎట్టకేలకు అనుమతి లభిస్తుంది. సుఖంగా పోయిరమ్మని, మంచి చీర కట్టుకొని సొమ్ములు పెట్టుకొని తన అంతస్థుకు తగినట్లుగా వెళ్లమని ఆదేశిస్తాడు భర్త. ఇదీ కలవారి కోడలి చరిత్ర. ఎంత కలవారి కోడలైనా అన్నవస్త్రాలకు లోటు లేకపోయినా ఆరళ్లకు లోటుండదు. ఈ గేయం ద్వారా ఉమ్మడి కుటుంబ వ్యవస్థలో అత్త, మామ, బావ, తోడికోడలు, భర్త ఎవరి స్థానం ఏమిటో వరుస క్రమంలో చెప్పకనే చెప్పినట్లయింది.

ఈ విధంగా పుట్టింటికి చేరుకొన్న ఆడపడుచు ఏ విధమైన ఆరళ్లూ లేకుండా కొంతకాలం గడుపుతుంది. ఎల్లకాలం అక్కడే ఉండలేదు గదా! అత్త వారింటికి వెళ్లకా తప్పదు. కోడంత్రికం అనుభవించకా తప్పదు. ఆ అనుభవంలోనే ఆమె జీవితం ఆరితేరుతుంది.

అత్తవారింటికి బయలుదేరేటప్పుడు ఆడపడుచును చీర సారెతో సాగనంపటం సంప్రదాయం. ఆమె కోరిన వస్త్రాలు కట్టబెడతారు. నల్లచీరన్నా నెమలివన్నె రవికన్నా ఆమె కిష్టం. తనకే కాకుండా చిన్న వాడికి చీటంగి, సిలుకు కుళ్లాయి, పసివాడికి పొట్లంగి, పాలుపోసే గిన్నె కూడా పుట్టింటి వారు

398 పల్లెపదాలు, పుట -110.

బహుకరిస్తారు.[399] ఈ బహుమానాలన్నీ ఒక ఎత్తు, ఒడిబ్రాలు ఒక ఎత్తు. అది పుట్టింటి సౌభాగ్యానికి చిహ్నం. దానికోసమే స్త్రీలు పుట్టింటిపై ఆశ పెంచుకుంటారు. ఈ విషయాన్నే చేమకూర వేంకటకవి హృద్యంగా ఒక పద్యంలో వర్ణించాడు.[400]

సంతానవతి అయ్యేటప్పటికి అబల సబల అవుతుంది. కోడంట్రికం తగ్గుతుంది. స్వతంత్ర ప్రతిపత్తి కలుగుతుంది. హోదా పెరుగుతుంది.

మగబిడ్డకు తల్లి అయిన స్త్రీ తన సోదరుడికి కూతురు పుట్టిందని తెలిసినప్పుడు పరమానందభరితురాలవుతుంది. తన అన్నతో వియ్యంమందాలని, వదినచేత వియ్యపురాలి మర్యాదలు పొందాలని ఉవ్విళ్లూరుతుంది. దీని కంగీకరించిన భర్త,

"బీరెల్లివారింట్ల కన్యపుట్టింది
చూచిరావె లక్ష్మి చేసుకుందామె"[401]

అంటాడు. ఈ విధమైన వివాహాల్నే మేనరికాలు[402] అంటారు. కానీ కొన్ని ప్రాంతాల్లో అన్నగారు తన కొడుక్కి సోదరి కూతుర్ని చేసుకొంటాడు. దీన్నే ఎదురు మేనరికం[403] అంటారు.

ఆ కాలంలో మగపిల్లలకు పెళ్లి కావటం పెద్ద సమస్యగా ఉండేది. బహుశా ఆడపిల్లల సంఖ్య తక్కువ మగపిల్లల సంఖ్య ఎక్కువ కావటం వల్లనేమో! "నరత్న మన్విష్యతి మృగ్యతేహి తత్"[404] అని కవికుల గురువు కాళిదాసు అన్నట్లుగా కన్యారత్నాన్ని అన్వేషించేవాళ్లు. ఆ విధంగానే అన్నగారు చెల్లెలింటికి వచ్చి తన

---

399 పల్లెపదాలు, పుట – 39.

400 "అత్తవారింట సకల భాగ్యంబులున్న
మగని మీదట తనకెంత మక్కువున్న
నాడు బుట్టువు పుట్టింటి కాసపడును
గావున సుభద్ర యొక తీరుగాగ నుండె." – విజయవిలాసము, 1-133.

401 తెలంగాణ పల్లెపాటలు, పుట – 103.

402 మేనరికమనగా అన్నదమ్ముల కూతుళ్లను స్త్రీ తన కొడుక్కి పెళ్లి చేసుకోవటం, – ఖిన్నేరు , పుట – 134.

403 ఎదురు మేనరికమనగా అక్క చెల్లెళ్ల కూతుళ్లను మగవాడు తన కొడుక్కి చేసుకోవటం. – పైదే.

404 కుమారసంభవం, 5-45.

కొడుక్కి పిల్లనివ్వమని అర్థిస్తాడు. చెల్లిలిది జరుగుబాటు లేని కాపురం. వచ్చిన అన్నయ్యతో చెల్లెలంటుంది

"ఏపాచెట్టూ కాడ నా బొమ్మరిల్లూ
కూకోర అన్నయ్య కూడొండుతాను"[405]

అని. ఈ మాటలలోనే ఆమె కాపుర స్థితి ధ్వనిస్తుంది. అన్నయ్య తాను అన్నానికి రాలేదని మేనగోడల్ని కోడలిగా చేసుకోటానికొచ్చానని తన అభిలాషను వ్యక్తం చేస్తాడు.

కూతురు చిన్నది. అల్లుడు బాగా వయసొచ్చినవాడు. తన కుటుంబం ఆర్థికంగా దీనావస్థలో ఉంది. అందుకే అన్నగారనికూడా చూడకుండా "ఓలేమిస్తావని"[406] అడుగుతుంది. ఈ సన్నివేశం ఆనాటి వివాహ వ్యవస్థలోని ఆచార వ్యవహారాలకు అద్దం పడుతుంది.

సమష్టి కుటుంబాల్లోని స్త్రీల జీవితం కత్తిమీద సామువంటిది. వారికి ఎన్నో అవమానాలు ఎదురవుతుంటాయి. కామంతో కళ్లు మూసుకుపోయి ఎదిగిన మేనగోడలిపై కన్నేసే మేనమామలుంటారు. అటువంటి నీచుల నుండి మాన సంరక్షణ చేసుకోవటం అంత సులభమైన పనేమీకాదు. అమాయకులు కొందరు బలి అవుతారు. మరి కొందరు ధైర్యంగా వారిని ఎదుర్కొంటారు.

ఇటువంటి గాథను తెలియజేసే ప్రసిద్ధ గేయమొకటి ప్రచారంలో ఉంది. సిక్కురుడు అనేవాడు మేనగోడల్ని బలాత్కరిస్తాడు. ఆ పిల్ల తెలివిగా అతని బారి నుండి తప్పించుకొని తల్లి వద్దకు వెళ్లి తనకు జరిగిన పరాభవాన్ని తెలియజేస్తుంద. ఈ ఉదంతం విన్న కన్య సోదరుడి రక్తం ఉడికి పోతుంది. ఎలాగైనా సిక్కురుడికి బుద్ధి చెప్పాలనుకుంటాడు. ఆడవేషం వేసుకొని తన సోదరి నిర్ధేశించిన సంకేత స్థలానికి పోయి

405 జానపద గేయాలు, ప్ర.సం. పుట – 36.
406 పైదే.

"సిక్కురిడి మెడమీద గొబ్బియాలో
పిడిబాకు దింపినాడు గొబ్బియాలో
నెత్తురూ కాలువలై గొబ్బియాలో
వీధిలోకి పారినాది గొబ్బియాలో
ఇంటి ముందు రక్తమడుగులో గొబ్బియాలో
ఓలలాడగను గొబ్బియాలో
ఇంటి ముందు మడుగులో గొబ్బియాలో
కాకులాడంగాను గొబ్బియాలో"[407]

పగతీర్చుకుంటాడు. ఈ కథ కీచకవధా వృత్తాంతాన్ని తలపిస్తుంది. కీచక ప్రవృత్తిగల 'మేనమామలందరికీ ఇదొక హెచ్చరిక. ఇలాంటి ఆర్ధ్రమైన వృత్తాంతాలెన్నో ఆడబ్రతుకులోని దైన్యాన్ని ఆవిష్కరిస్తూనే ఉన్నాయి.

ఇటువంటిదే మరొక వృత్తాంతం. నారమ్మ అత్తింటి కోడలు. ఉదయాన్నే లేచి ఇల్లు, వాకిలి ఊడ్చి, కసువెత్తి పోసి, కలయంపి చల్లి ముగ్గులు పెడుతుంది. తరువాత చక్కగా తలదువ్వుకొని ముస్తాబయ్యి కడవెత్తుకొని నీళ్లకోసం ఏటికి వెళుతుంది. కడవ కడిగి నీళ్లు ముంచుకుంటుంది. కడవెత్తటానికెవరూ కనిపించరు. త్రోవలో వెళుతున్న బాటసారిని కడవెత్తమంటుంది. అందుకతడు లంచ మడుగుతాడు. కన్నవారిచ్చిన కాసులిస్తానంటుంది. అత్తవారు పెట్టిన తొడుగు లిస్తానంటుంది. అయినా ఆ దుష్టుడు ఒప్పుకోక కుచ్చులు లాగి బలాత్కరిస్తాడు. గత్యంతరం లేక నారమ్మ రాత్రికి వస్తానని చేతిగాజుల మీద ఒట్టేసి చెపుతుంది. ఇంటికి వెళ్లిన నారమ్మ ఈ అవమానాన్ని ఎవరికి చెప్పుకోవాలా అని తల్లడిల్లుతుంది. భర్తతో చెపితే అపార్థం చేసుకోవచ్చు అందుకే అన్నతో చెపుతుంది. అన్న ఆవేశం పట్టలేక చెల్లెలి గాజులు తాను తొడుకొని, కాలి మట్టెలు, కడియాలు పెట్టుకొని, నొసట కుంకుమ దిద్దుకొని, చెల్లెలి చీర కట్టుకొని, ఆమె వలెనే సిగ ముడుచుకొని

[407] మున్నీరు, పుట – 262.

చెల్లెలి వేషంలో వెళ్లి ఆ కామాంధుడ్ని హతమారుస్తాడు.[408] అజ్ఞాతవాసంలో ఉన్న భీముడు (వలలుడు) ఆడవేషంలో వెళ్లి కీచకుడ్ని సంహరించిన వృత్తాంతాన్ని తలపిస్తుందీ సన్నివేశం. సంఘంలో ఇటువంటి సంఘటనలు జరగటం వల్లే జానపదులు వాటిని పాటలుగా పాడుకొని స్త్రీల శీలాన్ని పరిరక్షించటానికి తగిన ఉత్తేజాన్ని పొందుతారు.

సోదరులంటే కేవలం ప్రేమాభిమానాలను పంచి ముద్దు మురిపాలతో సోదరిని లాలించే వాళ్లేకాక ఆమె మానాభిమాలను రక్షించే వీరులు, శూరులు. అందుకే జానపద స్త్రీకి తన సోదరులపట్ల అంతటి ఆదరాభిమానాలు.




[408] పైదే, పుట – 275.

# 2. శృంగార భావన

సకల ప్రాణి సృష్టికి కారణభూతం శృంగారం. అంతేగాదు సర్వప్రాణి సమైక్యానికి, సుఖజీవనానికి హేతువు శృంగార భావన. అనురాగం, ప్రేమ, ప్రణయం, వాత్సల్యం, భక్తి మొదలైన హృదయ భావాలన్నీ శృంగార గర్భితాలై జీవులను పరమానందభరితులను చేస్తున్నాయి.

మానవ జీవిత పరమావధి జీవేశ్వరైక్యం. శృంగారరసం ఆ ఆధ్యాత్మిక సిద్ధికి ఛాయ అవటమే గాక దాన్ని ప్రతిఫలింపజేసే ముకురం కూడా అవుతుంది. శృంగార రసానుభవశాలి తన ఆత్మను పరమాత్మలో సుకరంగా లీనం చేయగలడని విజ్ఞుల భావన.[409] ఇటువంటి శృంగారరసానుభవం జానపద సాహిత్యంలో సుసంపన్నంగా గోచరిస్తుంది.

జానపద సాహిత్యంలో ప్రణయభావ బంధురమైన గేయాలు అధిక సంఖ్యలో ఉన్నాయి. నిసర్గమనోహరత్వం ఆగేయాల్లో నిగ్గుతేలిన ధర్మం. ఇవి మూడు విధాలు.

1. స్త్రీ ముఖమైనవి. అంటే స్త్రీలు తమ మనోగత ప్రేమ భావావేశాన్ని ప్రకటించేవి. ఇవి విశేషంగా పరిశీలితం.
2. పురుషముఖమైనవి. అనగా పురుషుడు తన భావ నిర్భరత్వాన్ని నిరూపించేవి. వీటిలో స్త్రీ పరమైన వస్తువు కలిగిన గేయాలే పరిశీలితం. (పురుషముఖమైన గేయాల్లోనూ వస్తువు స్త్రీ పరమైంది కావటం చేతా, అంతటా స్త్రీ స్వభావమే సరసంగా సమాలోచితం కావటం చేతా జానపద ప్రేమగేయాలన్నీ జానపద స్త్రీ సమారాధనా సముత్పన్నాలుగా భావించవచ్చు).

---

[409] సాహిత్య శిల్ప సమీక్ష, పుట -173.

3. ఉభయ ముఖమైనవి. ఇవి విశేషంగా స్త్రీ పురుష సంవాదాత్మకం. ప్రశ్నకు సమాధానం, ప్రశ్నకు ప్రశ్న ఈ రీతిగా ఇవి చమత్కార జనకాలు. ఇవి చాలావరకు పరిశీలితం.

**నిసర్గమనోహరప్రేమ:** జానపద స్త్రీల ప్రేమానురాగాలు నిసర్గ మనోహర భావ విరాజితాలు. నాగరిక సాహిత్య వ్యామోహ చిత్తులైన పండితులు ఈ నైసర్గిక మనోధర్మాన్ని అవగాహన చేసుకోలేక నిందించటానికి కూడ పూనుకుంటారు.[410]

ఒక వంక నిందించే పండితులిలా ఉండగా, అభినందించి" వెర్రితలలు వేసిన, వేస్తున్న యీ మాయదారి నాగరికంలో మన జాతి అలవాటులన్నీ పోవడమేగాక జాతిలో వుండే నీతీ, స్వభావం, అందం, శృంగారం, ఉత్సాహం, ముంపు, పెంపు,శక్తి, సామర్థ్యం, శౌర్యం, సాహసం, ధైర్యం, వీర్యం, పని పాటల మీది మోజు, నిజమైన చక్కదనాన్ని గ్రహించే తెలివి, ఆదరించే పాటి ఓర్పు, అభినందించే పాటి నేర్పు,నెమ్మదీ కూడా నశించి పోయినవి" అనీ జానపద వాఙ్మయం వీటన్నిటినీ తిరిగి అనుభవంలోకి తెప్పిస్తుందని పేర్కొన్న విద్వత్శిరోమణులూ ఉన్నారు.[411]

దండివయసు వచ్చిన జానపద స్త్రీ తన నిర్భరమైన ప్రేమ భావాన్ని ఎంతో ఆర్ద్రంగా వ్యక్తం చేస్తుంది. కాయకష్టం చేయనిదే జీవనం జరగదు. అయితే ఏ పని చేస్తున్నా మనసు మాత్రం ప్రియుడిమీదే లగ్నం చేస్తుంది. దంపుళ్లకు వెళుతుంది. ధాన్యం దంచుతూ మధ్యమధ్యలో ప్రియుడ్ని తొంగిచూస్తుంది.

---

410 "పండిత శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు జానపద గేయములందలి శృంగారమంతయు నీచమనియు, దుష్టమనియు, కేవలము కామప్రేరితమనియు నిందించిరి. వెంకయ్య- చంద్రమ్మ పాట, నారాయణమ్మ నాయుడు బావ పాట వంటివి వారియాగ్రహమునకు గురియైనవి."
— నేటి కాలపు కవిత్వం — జానపద గేయ సాహిత్యం, పుటలు — 522-523.
"విద్యాశేఖరులవారి ఆగ్రహానికి గురియైన గేయాల్లో వెంకయ్య-చంద్రమ్మ పాట ఒకటి." "పరిణయ నియమబద్ధ శృంగారం కాదని, అసభ్యమైందని రసాభాసయైన నీచ శృంగారమని విద్యాశేఖరులు భావించి నిరసించారు". —జానపద గేయ వాఙ్మయ పరిచయం, పుటలు-11-13.

411 శిరోమణి వేదాల తిరువేంగళాచార్యుల వారి ముందుమాట. —పల్లెపదాలు.

"దంచి దంచి నిన్నె చూతు దంచలేక నిన్నె చూతు
దండి వయసు నిలుపలేనయ్యో
కల్యాణరామా! ధరనివయసు నిలుపలేనయ్యో!"[412]

అని వయసులో ఉప్పొంగిన తన శృంగార భావాన్ని పాటలో రంగరిస్తుంది. చక్కని సంబోధన. దంచుతూ తొంగిచూడటం, దంచలేక విశ్రాంతి తీసుకొనేటప్పుడూ తొంగిచూడటం వంటి చర్యలు ఆమె మనసు చేత ఎంతగా వికలం పొందిందో సూచిస్తున్నాయి. ఇదే విధంగా

"చెరిగి చెరిగి నిన్నె చూతూ చెరగలేక నిన్నె చూతూ
చేడె వయసు నిలుపలేనయ్యో! కల్యాణ రామా!"[413]

అని ఆక్రోశిస్తుంది. ప్రియుని కోసం ప్రత్తిపోసిన రాశినెక్కి చూస్తుంది. కొమిరెకొయ్యలెక్కి చూస్తుంది. కోడె వయసు నిలుపలేనంటుంది. ఎంతటి ఆరాటం.

ఒకానొక జానపద యువతి వాలు కన్నుల ముద్దు యెంకట సామిని ప్రేమించింది. మనసంతా అతనిమీదే లగ్నమయింది. అతడ్ని చూడకుండా ఉండలేనంటుంది. దంచి దంచి ఒకమారు అతనివంక చూస్తే ఆమెకు 'ధరణి మీద కాలు నిలువద'ట అందుకే

"ఉంటే ఊళ్లో ఉండూ
పోతే పొరుగూరెల్లు
సుట్టుపట్ల ఏ మూలనువున్నా
సూడక నా మనసుండదు యెంకట సామి"[414]

అని తన నిస్సహాయతను వ్యక్తం చేస్తుంది. ప్రియుడు ఆమెను చూడటానికి సందకాడ గోడ దూకితే ఆ చప్పుడుకెవరో తొంగిచూస్తారు. గడబిడ అవుతుంది. అప్పుడు యెంకటసామి వంగి వంగి తప్పించుకుంటాడు. అతడు పడ్డపాటు ప్రేమకు

412 మిన్నేరు, పుట – 500.
413 పైదే.
414 పైదే.

భంగపాటే అయినా వలపు కత్తె మనసును మాత్రం గెలుచుకుంటాడు. అందుకే ఆమె వంగి వంగి నడిచిన యెంకటసామిని మరువలేనంటుంది.

అందమైన ఆడపిల్ల బ్రతుకు అడకత్తెరలో పోక వంటిది. అందరి కళ్లూ ఆమె మీదనే ఉంటాయి. ప్రేమించామని వెంటపడతారు. లొంగదీసుకోవటానికి ఎన్నో ఆశలు చూపిస్తారు. మరెన్నో కానుకలిస్తామంటారు. అందలాలెక్కిస్తామంటారు. వేటికీ లొంగక తన దృఢచిత్తాన్ని తెలియజేస్తుంది స్త్రీ. ఇటువంటి ఉదంతాన్ని తెలియజేసే సంభాషణాత్మక గేయం "చంద్రి – బాలయ్య."[415] చంద్రి లేడి కన్నులు, లేతనవ్వులు, తీగ సొగసులు, నడకజోరులు, రంగుపింగులు చూస్తే చంద్రయ్యకు ఆమె రంభలా గోచరించింది. రంగమెళ్లిపోదామని చంద్రిని పరిపరివిధాల ప్రాధేయపడతాడు. కాని చంద్రి ఒప్పుకోదు. తాను కైకాల[416] చిన్నదాన్ననీ, అమ్మబాబూ లేని దాన్ననీ, తన వెంటపడి ఆరళ్లు పెట్టటం మంచిది కాదనీ, ఇరుగు పొరుగు వాళ్లు చూస్తే మాట వస్తుందనీ ఎంతగానో బ్రతిమలాడి వివరిస్తుంది. అయినా బాలయ్య వ్యామోహం ఉపశమించదు. వివిధ భంగిమల్లోని చంద్రి సౌందర్యానికి పరవశుడవుతాడు. కమ్మోరి బాయికాడ కడవ నెత్తిన బెట్టుకోని సందుగొందుల్లోంచి చిందులు ద్రొక్కుతూ వస్తున్న చంద్రి అందం అతని డెందానికి హత్తుకొంది. ఆ కొప్పుల తిప్పులు కోరికలూరించాయి. ఆ కాళ్ల కడియాల గలగలలు, ఆ గిలుకుమట్టెల చిరుమ్రోతలు అతని హృదయంలో మారుమ్రోగాయి. ఒక్క మాటలో చెప్పాలంటే చంద్రిని 'సూపులో సూపెడితే సుక్కలాగున్నావని పొగుడుతాడు. చిట్టిముక్కు చంద్రి అతనికి చిలకలాగా గోచరించిందట. మాయదారి చంద్రి మత్తు మందు చల్లితే తాను మరలుగొన్నానని, తనవి ఉత్తమాటలు కావని, తనకు వెర్రెత్తిపోతున్నదని బాలయ్య ఎంతగానో ఆవేశపడతాడు. లక్కరైకలిస్తానని, నీలం బావిసీలు, తీగపట్టెడ, వడ్డాణం వంటి సొమ్ములు చేయిస్తానని ఆశ పెడతాడు బాలయ్య. చంద్రి తొణకలేదు. బెణకలేదు. విసుగు పుట్టింది బాలయ్యకు. నీవెంత

[415] పల్లెపదాలు, పుట – 135.

[416] ఇది కైకోల అయ్యుండవచ్చు. సాలె జాతి స్త్రీ అని భావించవచ్చు. శ.ర.

పాపివి అని పెదవి కొరుక్కున్నాడు. బాలయ్య ఎన్ని వ్యామోహాలు ప్రదర్శించినా వాస్తవిక దృష్టిగల చంద్రి వేటికీ లొంగకుండా తనను పెంచి పెద్ద చేసిన మేనత్త పట్ల కృతజ్ఞత కలిగిఉన్నట్లు, మేనత్త కొడుకు పట్ల అచంచలమైన ప్రేమాభిమానాల్ని ప్రదర్శించినట్లు తెలుస్తున్నది. దృఢ చిత్తంగల స్త్రీగా చంద్రి పాత్ర పోషణ చక్కగా జరిగింది. శృంగార రసాత్మకంగా, సంభాషణాత్మకంగా తీర్చిదిద్దిన ఈ గేయాన్నొక కావ్యంగానే భావించవచ్చు.

జానపద యువతి నిగ్రహం ప్రదర్శించినట్లు రూపొందించిన సంభాషణాత్మక గేయాలు మరికొన్ని విశ్రుతం. 'లగ్గోపిల్ల' గేయం ఇటువంటిదే.[417] యువతీయువకులకు ప్రక్కప్రక్కనే చేలున్నాయి. ఇరువురూ ఒంటరిగా చేని దగ్గర తారసపడతారు. ఒంటరిగా కనిపించిన ఆ పడతిని చూచి చిన్నోడి మనసు చలించింది. ఆమె అందచందాలకెంతగానో ఆకర్షితుడవుతాడు. నేరేడు చెట్టు నీడలో ఆ యువతి చారెడేసి కళ్లు, మారేడు చెట్టు నీడలో ఆమె బారెడంత జడ చూచి విభ్రాంతుడవుతాడు. పిల్ల బాగా లగ్గుగా ఉంది. అందుకే 'లగ్గోపిల్లా!' అని సంబోధిస్తూ తన మనసులోని కోరికను వ్యక్తం చేస్తాడు. పండువెన్నెల కాస్తుంటే, ఆ వెన్నెల్లో చిన్నది తన కళ్లకు పండుగ చెయ్యాలంటాడు. ఆమెకు పొన్నపూలు తెచ్చిస్తానని బదులుగా తనకు తెల్లజొన్న రొట్టెలపై వెన్నపూసి పెట్టాలంటాడు. తన చేను పండింది. లగ్గోపిల్ల చేనింకా పండలేదు. చేను చేను కలిసినట్లుగానే మేను మేను కూడ కలిస్తే బాగుంటుందనే ఆకాంక్షను వ్యక్తం చేస్తాడు. కాని లగ్గోపిల్ల అతని మాటల వలలో పడదు. కారుమాటలాడవద్దని హెచ్చరిస్తుంది. ఒంటరిగా కనిపించిన ఆడదాన్ని జంటగా చేసుకోవాలనే తొందరపాటు బుద్ధి పనికిరాదంటుంది.

ఇంతలో కారుమబ్బులు కమ్మాయి. వర్షం పడుతుందేమో 'అలుకు' మీద ఎండబెట్టిన పిడకలు తడుస్తాయని ఆరాటపడుతుంది. పిల్లవాడ్ని దారి చూపమని అడుగుతుంది. అంతలోనే వర్షం మొదలైంది. దగ్గరకు రమ్మని, సిగ్గుపడితే తడుస్తావని, తన దగ్గర అంగట్లో మొన్నకొన్న క్రొత్త గొంగళి ఉంది కప్పుకోమని

---

417 పల్లెపదాలు, పుట-158.

అంటాడు చిన్నోడు. అయినా ఆమె వినదు. వర్షంలో ఇద్దరూ తడిసారు. ఇది పెళ్లిముందు జరిగే మంగళస్నానంగా భావించమంటాడు పిల్లవాడు. వేరేలగ్నం దేనికి పెళ్లాడుదామని ఆత్రుతను వ్యక్తం చేస్తాడు. కానీ ఆ యువతి ఊరు పల్లె వదిలి ఊరి బయట పెళ్లేమిటని ప్రశ్నిస్తుంది. బాజాభజంత్రీలు లేకుండా, బంధుమిత్రులు లేకుండా గాంధర్వవివాహం చేసుకోవటం లగ్గోపిల్లకేమాత్రం ఇష్టం లేదు. 'కులము కులము కలసినంక పొలము కాడ తొందరేమి?' అని నిగ్రహాన్ని పాటిస్తుంది.

గాంధర్వ వివాహం ఎంతటి ప్రమాదభరితమో భారతంలోని శకుంతలో పాఖ్యానం నిరూపిస్తున్నది. పురుష స్వభావంలోని వ్యామోహాన్ని సముచితంగా నిలువరించిన జానపద యువతి నిజంగా అభినందనీయ.

ఒంటరిగా కంటికింపైన ఆడది కంటబడితే పురుషుడు తన తుంటరితనం చూపిస్తుంటాడు. లోబరుచుకోవటానికి యత్నిస్తాడు. మంచెమీద వంచిన తల ఎత్తకుండా చేనుకు కాపలా కాస్తున్న పంచవన్నెల చిలకను చూచి మంచెదిగిరమ్మని వంచించటానికి ప్రయత్నిస్తాడు చెవిపోగుల కుర్రవాడు. తన బావ విన్నా, కన్నా మర్యాద దక్కదని మంచె దిగనని, కంచె దాటిరానని సంకోచించకుండా జవాబిస్తుంది.

అయినా ఏవో ఆశలూరించి తన ఆశయాన్ని నెరవేర్చుకోవటానికి ఆ యువకుడు ఆరాటపడతాడు. అల్లము, బెల్లము తెల్లకొంగున కడతాను (పెళ్లాడుతానని) మంచె దిగమని మారాం చేస్తాడు. అందుకూ ఆ పడతి అంగీకరించదు. ఆమెలోని కనికరాన్ని వినియోగించుకోవాలని

"పూలరైకాదాన వాలూ సూపులదానా
కాలులో ములుదిగెనూ కాసింత ములుతీయే"[418]

అని వేడుకొంటాడు. కానీ అతని ఆటలు సాగవు. కాలిలో ములు దిగితె కట్టెమంగలున్నాడు పొమ్మంటుంది. దృఢచిత్తంగల పడతుల మనసును సడలించటానికి పురుషుడి శక్తి చాలదు.

[418] పల్లెపదాలు, పుట – 151.

అయితే అందరూ ఇటువంటి నిగ్రహాన్ని పాటించే వనితలే ఉండరు. చపల చిత్తులు కూడా ఉంటారు. వాసి వన్నె చూడకుండా ప్రేమించిన ప్రియునితో ఉన్న ఊళ్లో ఉంటే విన్న వారు నవ్వుతారని ప్రియురాలి భయం. అందుకు ప్రియుడు ఏ ఊరైనా లేచిపోయి చిలకాగోరింకలలాగ కలిసిమెలిసి ఉందామంటాడు. అందుకామె సరే అంటుంది.

"ఇరుగు పొరుగు వారితోను ఇసుమంత చెప్పకుండ
చిలకా గోరింకలముగా చెంగుచెంగున లేచి మనము
లింగాలపురికి పోదామె రమణి ముద్దుల గుమ్మా"[419]

అని ప్రియుడు ఉత్సాహంగా అంటాడు. ఈ విధంగా ప్రేమయాత్ర సాగించే జంటలు కూడ అక్కడక్కడ సాక్షాత్కరిస్తుంటాయి.

కట్టుబాట్లు తెంచుకుని మరదల్ని లేవదీసుకుపోవాలనుకునే బావ ఈ కోవలోనివాడే. మరదలితో స్వేచ్ఛగా విహరించాలనే కోరికతో ఆమెను లేవదీసుకు పోవటం బావ ప్రేమ సామర్థ్యానికి నిదర్శనం.

"అద్దరేతిరికాడ నిద్దరోతుంటేను
బండెక్కు బండెక్కు మన్నాడె బావ."[420]

మరదలు ఆ మాటతో ప్రయాణానికి సంసిద్ధురాలవుతుంది. జల్తారు చీరకట్టి, జడకుచ్చులు పెట్టుకొని క్షణంలో తయారువుతుంది. నిలుచున్న మరదలివంక ఎగాదిగా చూచాడు బావ. ఆమె సొగసు చూచి పొంగిపోయాడు. ప్రయాణానికి బండికూడా అందంగా సిద్ధం చేశాడు. ఒకటి పుల్లెద్దు. మరొకటి వెల్లెద్దు. బండెక్కి పయనమయ్యారు. బండి అలవోకగా సాగిపోతుంటే పరుగులు తీస్తున్న ఎద్దుల మెడలోని మువ్వల సవ్వడులు ఒకవైపు, మరదలి తలలోని పువ్వుల వాసనలు మరొక వైపు బావను పరవశింపచేశాయి. బావామరదళ్లు ప్రేమమైకంలో చొక్కిపోయారు. ఆ పారవశ్యంలో నెలబండి గట్లు, పుట్టలు దాటిపోవటం వారు

---

[419] పైదే. పుట – 133.
[420] పల్లెపదాలు, పుట -215.

గమనించలేదు. చివరకు బండి గతుకుల్లో పడితే బావ చతికిల పడ్డాడు. అంతలో వర్షం కురిసింది. ఇద్దరూ తడిసారు. అయినా వారి ప్రేమ ప్రయాణం ఆగలేదు. చిట్టడవి, పొట్టడవి అన్ని అడవులూ దాటి అనంతపథాలకు సాగిపోయారు. వారు పొందని ప్రేమానుభవాలు లేవు. ఎంతటి మనోజ్ఞమైంది ఈ జానపద ప్రేమ జీవితం!

ధనిక, పేద అంతరం ప్రేమకు అడ్డుకాదని నిరూపిస్తుందొక జంట. బావ శ్రీమంతుడు. మరదలు బీదది. అయినా ఈ వ్యత్యాసం వారి ప్రేమకు అడ్డుగోడలు కట్టలేకపోయింది.

"ఎన్నటికి నిన్నే నేనేలుకొంటానోయీ
నేవున్న దాన్ని గాను, నావుసురుపోసుకోకు"[421]

అంటుంది మరదలు. అంతేకాదు నీకన్న ఎవరు నాకు, ఏ అడ్డు చెప్పకుండా నన్నొడ్డునెయ్యి అని ప్రాధేయపడటంలో మరదలికి బావపట్ల గల ప్రేమాభిమానాలు విదితమవుతున్నాయి.

పురుషుడు వివిధాభరణాలతో, వస్త్రాలతో స్త్రీ ప్రేమను పొందటానికి ప్రయత్నిస్తుంటాడు. కానీ నిజంగా స్త్రీ వాంఛించేది ఇవి కావు. ఆమెకు కావలసింది స్వచ్ఛమైన మనసు. అది లేకుండా ఏమిచ్చినా ఆనందంలేదు. అది ఉండి ఏమిచ్చినా ఏమివ్వకున్నా ఆనందమే. జానపద స్త్రీ నిసర్గ ప్రేమకు కాణాచి. చెవులకు కమ్మలు, కాళ్లకు అందెలు, బాణాల చీరలు, బొమ్మంచు రవికలు, బంగారు సొమ్ములు –ఇలా ఏవేవో తెస్తానని ఆశలూరించే ప్రియునితో ప్రియురాలు వాస్తవిక దృష్టితో ఇలా అంటుంది.

"తెల్పిందిలేరా యేమీ తేవద్దులేరా
కట్టుకోను కోక తేరా
తెల్పిందిలేరా యేమీ తేవద్దులేరా
చిట్టేటి[422] సొమ్ములు తేరా
చిల్లకూర బెల్లం తేరా."[423]

---

[421] మిన్నేరు, పుట – 404.
[422] చిట్టె=వెదురు గనుపు – శ.ర. వెదురుతో చేసిన ఆభరణాలు – గాజులుమొదలైనవి కావచ్చు.

శక్తికి మించి ఏవో తెస్తానని ఊరించే మగవాని ఉబలాటానికి అడ్డుకట్టవేస్తుంది స్త్రీ. ప్రియుడు మనసిచ్చాడు. ఆమె మనసివ్వకపోతే బావిలో పడి చస్తానంటాడు. ఆ మనసే ఆమెకు సకలాభరణం. నాగరక జీవనంలోని ధనాకాంక్ష, వస్తు వ్యామోహం ఈ గ్రామీణ ప్రేమలో ఏమాత్రం చోటుచేసుకోకపోవటం గమనార్హం.

మానవుడు సంఘజీవి. ఆ సంఘంలో సుఖంగా, సంతోషంగా జీవించటానికి ఏవేవో కట్టుబాట్లు, సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు ఏర్పాటు చేసుకున్నాడు. మతం, కులం అంటూ అడ్డుగోడలు కట్టుకున్నాడు. ఎవరైనా వాటిని అతిక్రమించినా, అతిక్రమించాలనిచూసినా సంఘం కనెర్ర చేస్తుంది. వారిపై వేటు వేస్తుంది. హైందవ సంఘం పంచముల్ని అస్పృశ్యులని వేరు చేసింది. వారు పొలాల్లో, ఇళ్లలో కాయకష్టం చేయటానికి తప్ప సంబంధ బాంధవ్యాలు కలుపుకోవటానికి పనికిరారు. కానీ ప్రేమ గుడ్డిది. సంఘ నియమాలు దానికి పట్టవు. హైందవ స్త్రీ హరిజనుడ్ని ప్రేమించినా హరిజన స్త్రీ హైందవ పురుషుడ్ని ప్రేమించినా వారు చాటుమాటున ప్రేమయాత్ర సాగించాల్సిందే తప్ప వేరే దారి లేదు. కానీ ఈ చీకటి వ్యవహారం ఎంతకాలం సాగుతుంది? ఏదో ఒక నాడు బహిర్గతమవుతుంది. అప్పుడు సంఘం కులమతాలనే విషపుకోరలతో వారిని కాటువేస్తుంది.

ఇటువంటి ఇతివృత్తంతో కూడిందే 'వెంకయ్య–చంద్రమ్మ'ల ప్రణయ గాథ.[424] వీరిది శృంగార కరుణ రసాత్మక ప్రేమ. సంభాషణాత్మక గేయంగా రూపొందింది. దీనిని చదివి కన్నీరు పెట్టని పాఠకులుండరు అనటం అతిశయోక్తి కాదు.

చంద్రమ్మ హైందవ సవర్ణ స్త్రీ. వెంకయ్య హరిజనుడు. చంద్రమ్మకు వెంకయ్య మీద వల్లమాలిన వలపు. అతని అందచందాలకు పొంగిపోతుంది. చంద్రమ్మ

[423] మిన్నేరు,పుట – 494.
[424] మిన్నేరు, పుట – 406.

సౌకుమార్యం వెంకయ్యను ఎంతగానో ఆకర్షించింది. ఇరువురి మనసులలో ప్రేమ మొలకెత్తింది. మిడిమిడి యెండలో చంద్రమ్మ నడిచి వస్తుంటే చూడలేక ఆకు చెప్పులు కుట్టుకొచ్చి ఇస్తాడు వెంకయ్య. తరచుగా కలుసుకొంటారు. పండువెన్నెల్లో వాళ్లిద్దరూ పడుకొంటే పూలపాన్పుమీద పడుకొన్నట్లు ఆనందిస్తారు. వెంకయ్య తొడమీద చంద్రమ్మ శిరసునానించి సిరినవ్వు నవ్వితే వెంకయ్యకు చింతలూ వంతలూ మాయమయ్యాయి. వారిద్దరూ కౌగిలిలో ఏకమైతే ఆకాశంలో చుక్కలు నవ్వాయి. చుక్కల పూలవాన కురిసినట్లు ఆనందిస్తారు. నవమినాడు భద్రాద్రికి పోదామని, గోదావరి తీరాన కోటిలింగాల స్వామికి కొబ్బరి కాయలు కొట్టాలని, ఏడుకొండల రేడు వేంకటేశ్వరస్వామికి మ్రొక్కులివ్వాలని అనుకొంటారు. కానీ చంద్రమ్మ మనసు మార్చుకొంటుంది. బయటకు పోవటం ఇష్టంలేదు. నలుగురూ చూస్తారని భయం. అందుకే "ఇద్దరము కలిసి యేకముగ వుంటేను, ఏడులోకాలు మనకాడనే వుంటాయి. ఎక్కడికీ యెల్లొద్దురోరెంకన్న" అంటుంది. చెరువు గట్టుమీద చింతచెట్టుక్రింద ఇద్దరూ సిగ్గు విడిచి మాట్లాడుకుంటారు. హాయిగా చిలుకల పాటలు వింటారు. వారిప్రేమలత పెరిగి పెద్దదై వారిని ఒకటిగా బంధించింది. ఇక వారికి ఏ చీకూ చింతాలేదు.

కానీ చంద్రమ్మకు ఒకటే కొరత. వారిప్రేమ పెళ్లిగా మారలేదు. ప్రేమకు సీమలు లేకపోయినా పెళ్లికి హద్దులుంటాయని తెలిసిన వెంకయ్య ఎంతగానో బాధపడతాడు. చంద్రమ్మను పెళ్లాడితే అతడ్ని నిలవనియ్యరు. కులం తక్కువని కొట్టవస్తారు. ఎందుకొచ్చిన బ్రతుకు? బ్రతకలేనంటాడు వెంకయ్య. ఇది అతని సమస్య. చంద్రమ్మది మరొక సమస్య. కూతురికి పెళ్లి చేయలేదని చంద్రమ్మ తండ్రిని వెలివేస్తామని బెదిరిస్తుంది సంఘం. తన వల్ల తండ్రి అప్రదిష్టపాలైనాడని ఎంతగానో క్రుంగిపోతుంది చంద్రమ్మ. ముందుకు పోతే నుయ్యి. వెనుకకు పోతే గొయ్యి. వీరిద్దరి సమస్యకూ పరిష్కారం ఒకటే. కలిసి జీవించలేరు. కలయక జీవించలేరు. ఈ సువిశాలమైన భూమి మీద వారికి జానెడంత చోటులేదు. తన దారి గోదారిగా చంద్రమ్మ చెబితే తానూ వెంటవస్తానంటాడు వెంకయ్య. "సొరగలోకంలోను సల్లనీ

సోటులో" హాయిగా జీవిద్దామనుకొంటారు. అక్కడ అస్పృశ్యత ఉండదని వారి భావన ఏమో!

వెంకయ్య – చంద్రమ్మల ప్రేమహృదయాలు ఆధునిక భావకవులెందరికో కవితారసాన్ని సూరలిచ్చాయని ఈ గేయంలోని అనేక పంక్తుల్ని ఆచార్య రామరాజుగారు అసంస్కృతంగానే ఉద్ధరించారు.[425] విషాదాంతమైన వెంకయ్య – చంద్రమ్మల ప్రేమగాథ త్యాగభరితమైంది. ఇది ఆలంకారికుల దృష్టిలో రసాభాసమేమోకాని సామాన్యుల దృష్టిలో నిసర్గమనోహర ప్రేమకు నిదర్శనం. పరిణయాన్ని నిబంధించవచ్చుగాని ప్రణయాన్ని నిబంధించటం మానవమాత్రులకు సాధ్యంకాని పని. పరిణయం కన్న ప్రణయం ప్రబలమైంది. ప్రణయం ముందు మహాసామ్రాజ్యాలు సైతం కూలవలసిందే. రాజరికం కూడా సమాధి కావలసిందే. ఎటువంటి నిమ్నోన్నతాలనైనా సమంచేసే సామర్థ్యంగల మహాశక్తి ప్రణయం. త్యాగంలో అది మరింతగా రాగభరితమవుతుంది.

శృంగార రసాత్మక గేయాల్లో పరాకాష్టకెక్కింది "చల్ మోహనరంగ"[426] అనే గేయం. ఈ గేయంలో అనేక పాఠాంతరాలున్నాయి. ఈ పాఠాంతరాలు అనంతర కాలంలో నాగరక కరస్పర్శచే ఏర్పడ్డవిగా గ్రహించవచ్చు. అందుచేత వీటిలో కృతకత్వం కొంచెం అధికంగానే గోచరిస్తుంది. కృష్ణశ్రీ సంకలిత 'పల్లెపదాల్లో' ఈ పాట చాలావరకు సహజంగానే ఉంది. ఏదిఏమైనా అత్యంత ప్రాచుర్యం పొందింది ఈ శృంగారగేయం.[427]

---

425 "చింత చెట్టెక్కేవు, చిగురాకుకోసేవు కొమ్మయిరిగితె ముండకొడుకోరెంకయ్య, కూలిపోతావు, ముండకొడుకోరెంకయ్య" – జానపద గేయ సాహిత్యం, పుట- 533.

426 "తెలుగు పొలిమేరలు దాటిపోయిన గేయము లందిది యొకటి. శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు తమ Meet my people గ్రంథమున దాని ననువదించి ప్రకటించియున్నారు. వెంకయ్య-చంద్రమ్మ పాట కన్న నీగేయమున మధురములు కోమలములునగు భావములధికముగా నున్నవి. కానీ భాష, పదబంధములు మున్నగునవి కొంత కృతకత్వమును చెప్పక చెప్పుచున్నవి. ఎవరో గొప్ప భావుకుని చేతిలో కమ్మెచ్చులో తీగె సాగినట్లు సాగిపోయినది" -జా.గే.సా., పుటలు – 534-535.

427 "ఈ గేయం కల్పించే మధుర చిత్ర సన్నివేశాలకి ముగ్ధులై శ్రీ సి.పుల్లయ్యగారు సినిమా తెరమీద దీనికి రూపమిచ్చారు" - జానపద గేయ వాఙ్మయ పరిచయం, పుట -11.

ఈ గేయంలో నవయవ్వనం ఉప్పొంగే యువతి పట్టరాని తమకంతో ప్రియుడ్ని చేపట్టి స్వేచ్ఛామయలోకాల్లో ఆనందంగా విహరించాలని చూపే ఉబలాటం భావోద్విగ్నభరితమై అక్షర రూపం వహించింది.

ప్రేయసీ ప్రియులిరువురూ స్వేచ్ఛాజీవులు. నా అనే ప్రతి బంధకం వారికి లేదు. అందువల్లనే వారిద్దరికీ జోడు కలిసింది. సమస్త ప్రకృతి వారి ప్రేమకు నీరాజనం పడుతున్నది. రంగారు చెట్టుమీద బంగారు గోరువంక వినిపించే 'కతలు' వింటూ చివురాకు పళ్లెంలో పండ్లారగిస్తూ విహరించాలని వారి ఉబలాటం. పొగడపూల దండ మెడలో ధరించి 'సిరిమంచుకోటలో' గురుతైన మంచె మీద సిరిపాట పాడాలని వారి ఆకాంక్ష. తుమ్మెదలు వారి ప్రేమకు గూడుకట్టి బాజాలు పాడుతూ తిరుగుతున్నాయి. గుబురైన చింతమీద గాసటైన రామచిలుక ప్రేమ సందేశం అందిస్తున్నది. తాము కూడా ఆ ప్రకృతిలో కలిసిపోవాలని ఆరాటం.

ప్రియుడైన మోహనరంగడి కోసం ప్రియురాలు పడిన ఆరాటం వర్ణనాతీతం. ప్రియుడు కనిపించకపోతే వెర్రెత్తిపోతుంది. శనివారం సంతలో అతని కోసం వెదుకుతుంది. ప్రియుడు కనిపించగానే పరిగెత్తుకుంటూ వెళ్లి పట్టు కుంటుంది. ఇక తననెక్కడికీ పోనీయకుండా బొండుమల్లెల దండ మెడలోవేసి కౌగిలింతలో కట్టిపడవేసింది. చీకటిరాత్రినాడు నల్లకోక కట్టుకొని తిమిసా భిసారికయై ప్రియుడి కోసం బయలుదేరుతుంది. సంకేత స్థలంలో ప్రియుడ్ని కలుసుకోవటానికి వెళ్లి అక్కడ మోడుగా మిగిలిన తుమ్మచెట్టును చూచి దడుసుకొంటుంది. గట్టులూ, పుట్టలూ దాటి ఘనమైన అడవిని దాటి ప్రియుడి కోసం అన్వేషిస్తుంది. అప్పుడెక్కడలేని సాహసం. ప్రియుడు వెంట పడుతుంటే మాత్రం అతని నీడచూచి దడుసుకొంటుంది. అప్పుడెక్కడ లేని పిరికితనం.

తన వలపు తీగను నీలాల పేరుగా చేసి ప్రియుని కంఠానికి చుడుతుంది. చేతిలో చెయ్యివేసి న్యాయమార్గం తప్పకుండా తనను ప్రేమించమని ప్రియుడ్ని వేడుకొంటుంది.

వారి ప్రేమ ఊహలకు హద్దులు లేవు. వెన్నెల రాత్రి ఆరుబయట పడుకొని చంద్రుడికీ వెన్నెలకూ వియోగం లేనట్లే తమకూ ఎడబాటు ఉండకూడదను కుంటారు. వారిద్దరి ప్రేమను చూచి పున్నమి చంద్రుడు నవ్వుకొని నవ్వుకొని చిక్కి శల్యమైనాడట. విరజాజి పూలతోటలో గురివిందలేరుకొన్నారు. బలమైన అలలు రేగే సముద్రంలో సంగీతం ఆలకించారు. నరులు కనపడని చోట సురలు చెన్నారు వీట అందంగా ఆడుకొన్నారు. తెలితామరాకు జెండాగా పూలరథం మీద దేశాలు తిరిగారు. అమృత ప్రవాహమైన ఆకాశగంగలో సరిగంగలాడారు. ప్రియురాలు మానససరోవరమైతే ప్రియుడు అందులో విహరించే రాజహంస. ఆ ప్రేమసామ్రాజ్యం ఎల్లలు లేనిది. ఆ భావుకతా విహాయసం దిక్చక్రం లేనిది. ప్రియురాలు ప్రియుడికి కస్తూరిబొట్టుపెట్టి, కలికితురాయి గట్టి తన ప్రేమ సామ్రాజ్యానికి రాజును చేస్తుంది. కల్యాణమందిరంలో బంగారు సింహాసనంపై కూర్చోబెట్టి మంగళ హారతులు పాడుతుంది. ఎంతటి మనోజ్ఞ శృంగారభావన! జానపద సాహిత్యంలో ముగ్ధమనోహర శృంగార రసోల్లసిత గేయరాజం 'చల్ మోహన రంగ' అని చెప్పవచ్చు.

'నారాయణమ్మ' పాట ప్రసిద్ధమే అయినా ఇంతటి నాజూకుతనం లేదు. 'బంగారుమామ' పాటలో గూడ ఇంతగా రంగరించిన భావజాలం లేదు.

జానపద కన్య సరైన వరుడ్ని ఎన్నుకోగల సామర్థ్యం కలిగినదిగా అభివర్ణించే గేయాలున్నాయి. అందులో 'సిన్నీ-సూరీ'[428] అనే గేయం ఒకటి. చిన్ని చూసిన కుర్రవాడు కులం గలవాడు, గుణం గలవాడు, నోరులేనివాడు, మంచి రైతుబిడ్డ. అటువంటి మారాజును 'చిన్ని' సిగ్గుల చూపుతో చూడగానే 'సూరి' సూదులు చూపుచూచాడట. వారిచూపులు కలిశాయి, మాటలూ, మనసులూ కూడా కలిశాయి. చివరకు వారి ప్రేమ ఫలించినప్పుడు మబ్బుల్లో చంద్రుడు కూడా సిగ్గుపడ్డాడట. చుక్కలన్నీ చేరి పక్కున నవ్వి వారిరువురి తలల మీద తలంబ్రాలు చల్లాయట. ముగ్ధమనోహర హృదయాలు గల జంట మనోజ్ఞంగా కలుసుకొని

[428] జానపద గేయాలు,ద్వి.సం., పుట – 25.

పరిణయ మాడితే అది ప్రకృతికే పులకింత కలిగించటం ఆనందదాయకం. జానపదుల ప్రేమ అరమరికలు లేనిది. అందుకే అది ఫలించి ప్రకృతిని కూడ సంతోషపెట్టేది అవుతుంది.

**సంభోగ శృంగారం:** జానపద స్త్రీలందరూ దృఢచిత్తులు కారు. బలహీన మనస్కులు కూడా ఉన్నారు. కమ్మగెగ్గెరి వాసనకు నిలువరించుకోలేక తన బంగారుసామిని సరసకురమ్మని ఆహ్వానిస్తుంది ఒకానొక స్త్రీ. 'అన్నెకారి' కోడి కూసిందని "ఉండలేదుర ముండ నా మనసు"[429] అని తొట్రుపడుతూ ప్రియుడ్ని చేరుకోవాలని ఆరాటపడుతుంది. ఈ విధమైన తొందరపాటు తనాన్ని ప్రకటించే అతివలు వైవిధ్యవిలసితమైన జానపద స్త్రీల మనస్తత్వానికి ప్రబల నిదర్శనం.

క్రొత్తకుండ నీరు తీపి అన్నట్లు కోరిన మగవాడు తీపి అని భావించే మగువలూ ఉన్నారు. పెరుమాళ్ల చిన్నవాడ్ని బందరు పోదామని ప్రోత్సహిస్తుందొక ప్రౌఢ జానపద నాయిక.

"నీకూ నీ వారు లేరు నాకూ నా వారు లేరు
ఏటియొడ్డున ఇల్లు గట్టబ్బ పెరుమాళ్ల చిన్నా
ఏరువస్తె కూడ బోదాము"[430]

అని తన స్వేచ్ఛా ప్రవృత్తిని ప్రకటిస్తుంది. ఈమె పెట్టుకొన్న బన్నసరపు కొలుకులూడిపోయాయి. బిళ్లల మొలత్రాడు తెగింది. బావిలోపల బల్లి పలికింది. ఈ మాటల్ని బట్టి ఈమె భర్తృ వియోగాన్ని పొందినట్లు అన్యాపదేశంగా సూచింపబడుతున్నది. శీలాన్ని కాపాడుకొనే ఓర్పు నేర్పు ఆమెకు లేవు. ఏటి ఒడ్డున ఇంట్లో నివసిస్తూ ఏరువస్తే దానితోపాటే కొట్టుకుపోదామనే సాహసప్రవృత్తి ఆశ్చర్యమనిపిస్తుంది.

---

[429] పల్లెపదాలు, పుట – 174.
[430] పల్లెపదాలు, పుట -173.

మిట్టపల్లలాగ మిడిసి మిడిసి పడటం, మగవాళ్లను చూసి నవ్వటం, చల్లగా చేయితాకితే ఊరుకోవటం మొదలైన కామవికారాలు పోయే 'దేశోళ్ల చిన్నదాని' వైఖరీవర్ణనం జానపద సాహిత్యంలో అక్కడక్కడ గోచరిస్తుంది.[431]

భర్త అమాయకుడైతే అతడ్ని ఆటపట్టించి శంకలపాలు చేసి నవ్వుకొనే కొంటె కోణంగిలు కూడా ఈ సాహిత్యంలో గోచరిస్తారు. స్త్రీ అంటుంది

"ఒకరికి చెయ్యినిచ్చీ, ఒకరికి కాలునిచ్చీ
ఒకరికి నడుమునిచ్చీ,కూకున్నా నోయ్ బావా
కూకున్నానోయ్ !"[432]

దానికి ఉలిక్కిపడ్డ మగవాడు ఎవరికి? ఎవరికి? అని ఉద్వేగంతో ప్రశ్నిస్తాడు.

"గాజుల్కి చేయినిచ్చీ, అందెల్కి కాలునిచ్చీ
వడ్డాణాన్కి నడుము నిచ్చీ, కూకున్నానోయ్ బావా!
కూకున్నానోయ్!"[433]

అని చెబుతుంది. ఇదే విధంగా ఎవడ్ని లోపలబెట్టి, ఎవడ్ని బయటపెట్టి, ఎవడ్ని పట్టుకొని కూర్చున్నావంటే – కాటుక లోపల బెట్టి, బొట్టు బయట బెట్టి, అద్దాన్ని పట్టుకొని కూర్చున్నానని; ఎవడ్ని చేరవేసి, ఎవడ్ని వాల్చేసి, ఎవరికి చెంగువిసిరి పడుకున్నా వంటే –తలుపు చేరవేసి, మంచాన్ని వాల్చి, దీపానికి చెంగు విసిరి పడుకున్నానని; ఎవరీని కట్టబెట్టి, ఎవరీని విడిచిపెట్టి, ఎవరీని పట్టుకొని కూర్చున్నావంటే – గేదెను కట్టిపెట్టి, దూడను విడిచిపెట్టి, పాలముంత పట్టుకొని కూర్చున్నానని; ఎవడీని నొక్కిపెట్టి, ఎవడీని చుట్టబెట్టి, ఎవరికోసం ఎదురు చూస్తున్నావంటే – వక్కను నొక్కిపెట్టి, ఆకును చుట్టబెట్టి, సున్నం కోసం ఎదురు చూస్తున్నానని చెప్పే సమాధానాలు సరసమైనవి. సమాధానాలన్నీ విన్న తర్వాత

431 పైదే, పుట – 135.
432 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట-114.
433 ఇటువంటిదే ఒక గేయం కొద్దిపాటి పాఠాంతరంతో పల్లెపదాల్లో ప్రచురితం, పుట- 33.

ఉత్కంఠతో వేగిపోయిన భర్త కూడా హాయిగా నవ్వుకుంటాడు. శంక తీరిన తర్వాత వారి కలయిక ఇరువుర్నీ మరింత సన్నిహితుల్ని చేస్తుంది.

అమాయకులైన కొందరు వివాహిత స్త్రీలను లోబరచుకొని, భర్త అనుమానిస్తే ఏవిధంగా సమాధానం చెప్పాలో శిక్షణ ఇస్తున్న పురుషుల ప్రస్తావన కూడా కొన్ని గేయాలలో కనిపిస్తుంది.[434] చేతిగాజులు ఏమయ్యాయంటే రోకలిపోటుకు పోయాయని, ఒంటిమీది రక్కులు ఏమిటంటే చీకట్లో పిల్లి గీరిందని, నుదుట బొట్టు చెరిగిందేమంటే చిరు చెమటకు కరిగిందని, ముక్కు నత్తు ఏమైందంటే చెరువులో మునిగితే పోయిందని భర్త ప్రశ్నిస్తే చెప్పమని పరపురుషుడు ఆమెకు నేర్పుతాడు. నయవంచకుల మాటలకు మోసపోయే ఇటువంటి మహిళలు ఎందరో!

జానపద స్త్రీలలో కుంతీదేవులు కూడా లేకపోలేదు. కన్నె వయసులోనే తొందరపాటుకు గురియై శీలాన్ని కోల్పోవటమేగాక బిడ్డల తల్లులు కూడా అయిన వృత్తాంతాల్ని గుంభనంగా వర్ణిస్తాయి కొన్ని గేయాలు.[435] ఈదుల కుంటకు నీళ్లకని పోతే ఈతముల్లు తగిలి ఈడేరిందట. కడియాల కుంటకు నీళ్లకనిపోతే కవిలిముల్లు తగిలి కడుపయిందట. తుమ్మలకుంటకు నీళ్లకనిపోతే తుమ్మముల్లు తగిలి చిన్నోడ్ని కన్నదట. గుంభనంగా తన పతనాన్ని ఈ విధంగా సంకేతిస్తుంది పడతి.

**వియోగ శృంగారం**: వియోగం లేనిదే శృంగారం పుష్టిమంతం కాదని ఆలంకారికుల ఉద్ఘాటన.[436] కేవల ఇంద్రియానందం పాశవికం. పశు సంబంధమైంది. మానవుడు మానసిక జీవి. నిరీక్షణలో, నిర్నిద్రలో ఉన్న నైశిత్యం వీక్షణలో, నిద్రలో ఉండదు. నిరంతరాయంగా సాగిపోతున్న దాంపత్య జీవితంలో నీరసం, నిస్పృహ చోటు చేసుకునే అవకాశం ఉంది. అటువంటివేమీ లేకుండా జీవితం నవనవోన్మేషణంగా సాగాలంటే వియోగం కూడా అవసరమే. ఎందుకంటే వియోగం తర్వాత కలయిక

[434] పల్లెపదాలు, పుట – 218.'
[435] పల్లెపదాలు, పుట – 218.
[436] "నవినా విప్రలంభేన శృంగారం పుష్టిమత్నుతే"

మధురాతిమధురం. విష్ణువు లక్ష్మీదేవిని వక్షస్థలంలో నిలుపుకున్నా, శివుడు శరీరంలో సగభాగం పార్వతికిచ్చినా వారి దాంపత్యం కన్నా సీతారాముల దాంపత్యమే లోకానికాదర్శం. ఎందుకంటే వియోగంలో వారి దాంపత్య భావన మరింతగా పదునుదేలటమే. మానసిక పరితాపం, ఆర్ద్రత వియోగంలో ఉన్నంత సంయోగంలో ఉండదు. వియోగ సమయంలో వారిలో చెలరేగే భావావేశం గేయరూపాన్ని వహిస్తుంది. ఇందులోనూ పురుషునికన్న స్త్రీకే అగ్రస్థానం. కారణం పురుషుడు బహిర్ముఖుడు. కర్తవ్యపాలనలోనూ, బాహ్య విషయాసక్తివల్లనూ భార్యను విస్మరించి బ్రతకగలడు. స్త్రీ అంతర్ముఖి. బాహ్యంగా ఏ పని పాటలలో నిమగ్నమైనా అంతర్ముఖంగా భర్తృచింతన విస్మరించదు.

ఇటువంటి దాంపత్య వియోగాన్ని, ప్రేయసీప్రియుల విరహాన్ని వర్ణించే జానపద గేయాలు ఎన్నో ఉన్నాయి. ఏకారణం చేతనో భార్యను పుట్టింటికి పంపుతాడు భర్త. తిరిగి తీసుకురావటానికి తీరిక చిక్కలేదు. పెళ్లయి ఏడాదైనా కాలేదు. అంతలోనే ఈ మాయదారి వియోగం సంభవించింది.

"గడియసేపయిన నన్ విడిసినోడు కాదు
పడనార యేడాదిపాటైనా కాలేదు
నడిమంత్రమున యింత మిడిమేలమైపోయె
కడకు నా కాపురము కడగళ్లపాలాయె"[437]

అని పుట్టింట్లో ఉన్న ఆకాంత తల్లడిల్లుతుంది.

"వలరాజు అందాల వన్నె చిన్నెల రాజు
నిలువెత్తు నట్టిల్లు నిండినారాజు
మెలిరాని నూనూగు మీసాల నారాజు"[438]

అని తన భర్త రూపాన్ని మనోనేత్రాల ముందు సాక్షాత్కరింపజేసుకొని ఒకింత సేపు నిద్రిస్తే కలలో కూడ అతడే కనిపిస్తాడు. ఈ విధంగా ఇటు భార్య అటు భర్త పరస్పర వియోగంతో క్షణమొక యుగంలా గడుపుతారు. ఎండలో నడిచిన

[437] పల్లెపదాలు, పుట -109.
[438] పైదే.

తర్వాతే నీడ సుఖం తెలుస్తుంది. వియోగంలో కాగితేనే సంయోగ సౌఖ్యం అవగతమవుతుంది.

ఒకానొక బావగారు గిత్తల బేరానికని వేరే ప్రాంతానికి వెళుతూ ఏరువాక నాటికి తిరిగివస్తానని వాగ్దానం చేస్తాడు. ఏరువాక కోసం, బావ రాకకోసం నిరీక్షిస్తుంటుంది మరదలు. ఆ నిరీక్షణలో కోర్కెలపై కోర్కెలు, ఊహలపై ఊహలు. పొలాల దగ్గర, నీలాటి రేవు దగ్గర ఒంటరిగా ప్రకృతిని పరిశీలిస్తూ బావ చేసిన బాసల్ని స్మరించుకొంటుంది.

"పిట్టా పిట్టా ముద్దు పెట్టుకొన్నాయి."[439] ఈ దృశ్యం ఆమెను కలత పెడుతుంది. ఎదురుచూచే గుండెను మరింత చెదరగొడుతుంది.

"నవ్వుతూ మా బావ పువ్వులేరే వేళ
కొంటి కోయిల పైన కూత కూసే వేళ
లేత మనసు విచ్చి పూత పూసే వేళ
బావొచ్చి నాతోటి బాసలెన్నిటొనాడి
ముద్దిచ్చి నాతోటి మురిసిపోవాలి
ఏరువాకమ్మ మాకెదురు కావాలి
తలవంచి మముజూచి దీవించి పోవాలి."[440]

అటువంటి సుదినం కోసం ఎదురు చూస్తుంటుంది. నిరంతరం ప్రకృతిలో మమేకమై జీవిస్తుంటారు గనుకనే జానపదుల దాంపత్య జీవితానికి, ప్రకృతికి అంతటి అవినాభావ సంబంధం.

పరాయి ప్రాంతాలకు వెళ్లిన పురుషులు తమ భార్యలను లేదా ప్రియురాండ్రను మరిచిపోలేదనటానికి గుర్తుగా ఏమైనా కానుకలు పంపుతుండాలి. అలా పంపకపోతే ప్రియుడ్ని

"చంద్రగిరి చీరలంపూ, కాకినాడ గాజులంపూ
రాజమండ్రి రైకలంపుమురా" [441]

[439] మిన్నేరు, పుట – 347.
[440] మిన్నేరు, పుట – 347.

అని సున్నితంగా అర్థిస్తుంది ప్రియురాలు.

భార్యాభర్తల మధ్య విరహాన్ని తెలియజేస్తుంది 'బంగారు మామ'[442] గేయం. భార్యాభర్తల మధ్య దూరమెక్కువైతే నీలికొండలే అడ్డమైతే ఎంతటి బాధాకరమో సూచిస్తుందీ గేయం. 'కొండకెక్కి గొబ్బెమేసిందోయి' అనే చరణంలో భర్తమీద ధ్యాసతో ఏ పనిచేస్తున్నా పరధ్యానమే అని అర్థమవుతుంది. నిమ్మచెట్టుకు నిచ్చెనేసి నిమ్మపళ్లు కొయ్యబోతే నిమ్మముళ్లు రొమ్మునాటాయి. విరహం భరించలేక తన భర్త కాలు జారతాడేమోనని

"నందియాల సందుల్లోన ధర్మలారు దారుల్లోన
కాలుజారితే కదల నివ్వరురా"[443]

అని హెచ్చరిస్తుంది. దక్షణం నుండి వచ్చే నల్లమబ్బులతో తన ఉల్లము అలరేటట్లుగా వన్నెవన్నె వార్తలు పంపమంటుంది. అందగాడైన బంగారు మామ మీద ఆ వన్నెలాడి చిందించే వలపుల్ని ఈ వియోగ గీతిక విపులీకరిస్తుంది.

వియోగం ఎక్కువైతే వికటించే ప్రమాదం లేకపోలేదు. పర స్త్రీ వ్యామోహంలో పడి తనను ఎంతగా నిర్లక్ష్యం చేస్తున్నాడో వివరిస్తుందొక జానపదాంగన. విరహానికి, వెన్నెలకు అవినాభావ సంబంధం. వెన్నెల విరహాన్ని ఇనుమడింపచేస్తుంది. అందుకే ఈ జానపదాంగన తన దీనస్థితిని చందమామకు వివరిస్తుంది.

"మంచినీళ్ల బావి మన పెరటనుంచుకొని
ఉప్పునీళ్లకు బోవ ఉపకారమేమో
మల్లెపూల తోట మన పెరట పెట్టుకొని
చీకిపూలకు బోవ సింగారమేమో"[444]

---

441 పల్లెపదాలు, పుట – 95.
442 పైదే.
443 పైదే.
444 మిన్నేరు, పుట – 506.

చక్కని పూలవనం తమ నివాసం. అయినా ప్రియుడు దాన్ని వదిలిపెట్టి పోయాడు. పెరట్లో మంచినీళ్ల బావిపెట్టుకొని ఉప్పునీళ్లకు పోయే గొప్ప వ్యక్తి అతడు. తన పెరటిలోని మల్లెపూల తోటను కాదని చీకిపూలకు పోయే అతని సింగారం వింతగా ఉందని విమర్శిస్తుంది. అతను వేసిన దవనపు మడి కాపులేక ఏటిపాలయిందంటుంది.

ఈరీతిగా ప్రియురాలు తనను మంచినీటి బావితోను, మల్లెపూల తోటతోను, దవనపు మడితోను సంకేతించుకొని తనను అనుభవించలేని భర్త దురదృష్టాన్ని వ్యంగ్యంగా విమర్శిస్తుంది.

ఒకానొక జానపదాంగన పుట్టిల్లు చేరి మూడు నాలుగేళ్లు గడిచాయి. కానీ కాంతుడు వచ్చి ఆమెను తీసుకువెళ్లలేదు. మనోహరుడ్ని కనీసం కంటితో చూచుకొనే భాగ్యానికి కూడా నోచుకోలేదు ఆమగువ. తల్లిదండ్రులు, అన్నదమ్ములు ఎందరున్నా భర్తలేని లోటు తీర్చలేరు. సిరిసంపదలెన్ని ఉన్నా అనురాగ సిరితో సమానం కావు. ప్రాణేశ్వరుడు కనిపించకపోతే ప్రాణాలు నిలిచే పరిస్థితి లేదు. అందుకే తన తమ్ముడ్ని త్వరగా వెళ్లి భర్త జాడ తెలుసుకొని రమ్మని అర్థిస్తుంది. ఇది పట్టలేని విరహం. పుట్టింటి వారికి తప్ప మెట్టినింటి వారికి పట్టని విషయం. సోదరుడొక్కడే ఆదరం చూపి ఆవేదన చల్లార్చే సాధనమయ్యాడు. హృదయాలను స్పందింపచేసే రసార్ద్ర సన్నివేశమిది.[445]

'నారాయణమ్మ'[446] మకుటం గలిగిన గేయంలో నారాయణమ్మ, నాయుడు బావల ప్రణయం, విరహం చక్కగా వర్ణించబడ్డాయి. ఉన్న ఊళ్లో జరుగుబాటు లేకపోతే వేరే ఎక్కడికైనా వెళ్లి నాలుగురాళ్లు సంపాదించుకొని జీవనయాత్ర సాగించటం జానపదులకు అలవాటు. అదేవిధంగా నాయుడు బావ రంగమెళ్లి (బర్మాదేశం) డబ్బు సంపాదించుకొస్తానని నారాయణమ్మతో అంటాడు. రంగూనులో కూలీ ఎక్కువగా ఇస్తారు. అందుకే ఒకప్పుడు జనం ఎక్కువగా రంగూను

---

445 మధుర కవితలు, పుట- 145.

446 పల్లెపదాలు, పుట- 152.

వెళుతుండేవారు. కానీ నారాయణమ్మ ఒప్పుకోదు. వియోగాన్ని సహించలేనంటుంది. రంగం నుండి రంగు రంగు చీరలు పంపుతానని వ్యామోహపరచటానికి ప్రయత్నిస్తాడు నాయుడుబావ. చీరెలూ, సారెలూ కట్టుకొని నేనెవరితో కులకటానికి అని అమాయకంగా ప్రశ్నిస్తుంది నారాయణమ్మ. పదిరాళ్లు తెస్తాను మనమిద్దరమే కులుకుదామంటాడు నాయుడు బావ. ఏమైనా నారాయణమ్మ మొండికేస్తుంది.

"నన్నిడిచి పోకోయి నాయుడుబావ మన
కిద్దరికి జోడోయి నాయుడుబావ"[447]

అని జాలిగా ప్రాధేయపడుతుంది. ఇది ఆమె ప్రేమభరిత హృదయానికి నిదర్శనం. అయినా ప్రియుడు రంగం (రంగూన్) వెళతాడు.

'సిరిసిరిమువ్వ'[448] మకుటం కలిగిన గేయం కూడా ఇటువంటిదే. ప్రియురాలు వద్దని ఎంత చెప్పినా వినకుండా ప్రియుడు రంగం వెళతాడు. ప్రియురాలికి ప్రియుని మీదనే భ్రాంతి. పనిమీద దృష్టిలేదు. తిండి మీద మనసు లేదు. పొందైన మాటలెన్నో చెపితే మందబుద్ధితో ఆలకించటం వల్లనే తనకీ దుర్గతి పట్టిందని తనను తానే నిందించుకొంటుంది. తనను ఆదరించమని, తిరిగివచ్చి ఒక్క ముద్దిమ్మని, దయ చూపమని, ఒక్క ఉత్తరం ముక్క రాయించమని తన మనోవేదనను చెట్టుకు పుట్టకు చెపుతుంది.

**జారశృంగారం** : జానపద స్త్రీలందరూ పతివ్రతలేనని భావించరాదు. జార స్త్రీలు కూడా ఉన్నట్లు జానపద సాహిత్యం ద్వారా నిరూపితమవుతున్నది. ఏదో విధంగా లోకం కళ్లు గప్పి సంకేతస్థలానికి చేరుకొని తన ప్రియుడితో విహరించాలని ఉబలాటపడే ఉవిదలు గోచరిస్తారు. అయినా ఎక్కడికక్కడే తనకెవరో కాపలాకాస్తూ అడ్డగిస్తున్నట్లు జంకుతుంది. ఊరగాయ కుదురువేసి, చిక్కుడు గాయ చుట్టలల్లి (కొప్పు అలంకారం) మిద్దె మీదకు పోతే చందమామ తనకు కావలి కాస్తున్నట్లు ఉలిక్కిపడుతుంది. మంచినీళ్ల బావి దగ్గర కడవ బెట్టి బాటవెంట పోతుంటే బావగార్లు ఎదురవుతారు.

[447] పైదే.
[448] మిన్నేరు, పుట – 504.

ఎసరులో బియ్యంపోసి, మంటచేసి పోతుంటే తోడికోడళ్లు అడ్డుపడతారు. కడవమీద బట్టలు వేసి గడపదాటి పోదామంటే కన్నతల్లి కాపలా కాస్తుంది. పట్టుచీర కట్టుకొని పట్నం పోదామంటె సిలేదారుడు ఎదురవుతాడు. అడ్డుగోడ లెగిరిపోయి ముద్దులాడి వద్దామంటే కట్టుకున్న పాపిష్టి మగడే అక్కడ కాపు కాస్తున్నాడు. జానపద జారకాంత ఈ విధంగా తన ఆవేదనను వేరొక స్త్రీతో నివేదించు కుంటుంది.[449] ఎంతమంది ఎంతగా కాపలాకాసినా అన్యథాయత్త చిత్తంగల మగువను అడ్డుకోవడం ఎవరికీ సాధ్యం కానిపని.

జారకాంతలు భర్త అనుమానంతో ప్రశ్నించినప్పుడు తాము రంకాడలేదని బొంకాడటానికి కూడా వెనుకాడరు. అటువంటి పూబోండ్లు చెప్పే సమాధానాలు కొంత హాస్యరసస్ఫోరకంగా ఉంటాయి.[450] కట్టెలు తెమ్మని పంపిస్తాడు భర్త. పోయిన భామ కొప్పున పూలు అలంకరించుకొని తిరిగి వస్తుంది. ఆ పూలెక్కడివని గద్దిస్తాడు భర్త. గాలి ధూళి వచ్చిందని కొమ్మ ఊగి కొప్పంతా పూలమయమయిందని ఆ కొమ్మ నెమ్మదిగా సమాధానమిస్తుంది. సరేనని అమాయకుడైన మగడు కొంగునున్న దుమ్మును గూర్చి ప్రశ్నిస్తాడు. పటేలింటికి పాలకుపోతే కర్రికోడె కాలు దువ్విందంటుంది. భర్త దగ్గరకు వచ్చి పరీక్షిస్తే చెంపన కాట్లు కన్పించాయి. దీనికేం చెప్తావంటే కోమటోరింటికి కొబ్బరికని పోతే తక్కెట్లో గుండొచ్చి తగిలింది మగడా అని తప్పించుకోజూస్తుంది. చివరకు ఆమె వంచన శీలం బయట పడుతుంది. మంచం క్రింద యువకుడ్ని దాచి పెడుతుంది. వాడెవడు? అని ప్రశ్నిస్తే ప్రక్కింటి పడుచు పిల్లవాడు పిల్లికి తలనొప్పివస్తే నల్లికోసం వచ్చాడంటుంది. ఎంత చక్కని సాకు!

---

[449] త్రివేణి, పుట – 179.

[450] పల్లెపదాలు, పుట – 61.

పాఠాంతరంతో ఉన్న ఇటువంటి గేయమొకటి జానపద గేయ వాఙ్మయ వ్యాసావళిలో ప్రచురితం. పుట – 81.

ఇటువంటి గేయమే ఒకటి కొద్ది మార్పులతో త్రివేణిలో ప్రచురితం.[451] చినపాపా నీ చీర చిరిగిందేమిటని భర్త ప్రశ్నిస్తే, పటేలింటికి పాలకు పోతే పెనుగడి తగిలి చిరిగిందని; రవికెందుకు చిరిగిందంటే అజాను రోకలి భుజాన పెడితే చిరిగిందని; కుంకుమ చెదిరిందేమంటే ఉడుకుడుకంబలి ఊదుకు తాగితే చెదిరిందని; కాటుక చెదిరిందేమంటే ఎచ్చికట్టె పచ్చికట్టె పొయిలో వేసి ఊదితే పొగవల్ల చెదిరిందని సమాధానాలు చెపుతుంది.

పురుషుడి ఆడంబరోపేతమైన వస్త్రధారణ చూచి ఆకర్షితులవుతుంటారు అతివలు.[452] కత్తి, బల్లెం, సందు కటారి ధరించి, రంగురంగుల అంగీవేసుకొన్న మద్దెలగాడ్ని చూచి మనసు నిలవక మరులు గొంటుంది ఒకానొక మగువ. నీళ్లకు పోయినప్పుడు తన ప్రియుడు నిక్కిచూస్తే ఆమె మనసు పట్టలేక ఉరుకులు పెడుతుంది. కడవ నీటిలో మునగదు. అంగడికి పోయేటప్పుడు అడుగులు ఎంచుతూ ప్రియుడు వెంబడిస్తుంటే ఏమీ కొనలేకపోతుంది. ప్రియదర్శనం ఆమెకంత ప్రేమాతిశయాన్ని కలిగిస్తుంది. ప్రియుడు లింగాపురం పోయి చీర తీసుకువస్తే చీరమంచిదే కాని మూర కొంచెమంటుంది. బోనగిరికిపోయి బొట్టు తెస్తే అది నొసటికి అంటుకోవటం లేదంటుంది. ఆ వస్తువులు నాసిరకంవి అయినప్పటికీ అతడికి ఆమెమీద గల మక్కువకు నిదర్శనాలు. అందుకే ఆ వన్నెగాడు కనిపిస్తే చాలు నిలువలేకపరుగులు తీస్తుంది ఆమె మనసు.

తాను వలచిన ప్రియుడ్ని ఏదో వంకతో చెంతకు చేర్చుకోవటానికి ఎంతగానో ప్రయత్నిస్తుంది ఇంతి. పుట్టమీద పాలపిట్టను కొట్టబోతే తేలు కుట్టిందట. మంత్రం వేసే బాబులుంటే రమ్మంటుంది. ప్రియుడికి చింత చిగురు పప్పు వండిపెడితే తన వలపు తీరుతుందట. అంతేకాదు నెల్లికూర, పాల బలుసు కూర వండిపెడతానని, అరటి పండ్లు అందిస్తానని, మల్లెమొగ్గల పాన్పు వేస్తానని ఊరిస్తుంది. చక్రాల గుట్ట దగ్గర చెక్కగొడుతుంటే ఒక చెక్క చెంపకు తగిలిందని,

[451] పుట – 206.
[452] త్రివేణి, పుట -207.

చెప్పరాని దుఃఖం కలిగిందని వాపోతుంది. ఇది చెక్కగొట్టే వాడిమీద కలిగిన వలపు. మంచినీళ్ల బావి దగ్గర మందు (వశీకరణమందు) నూరే చిన్నవాడ్ని చూచి అది తనను వశపరచుకోవటానికి ప్రయత్నమని భ్రాంతిపడి "మందులేలా మాకులేలా నాసామి మాటాడితె నేను రానా"[453] అంటుంది. ఈ విధంగా ఏదో వంక పెట్టుకొని తాను అనకున్నది సాధించటానికి వలపుగత్తె చేసే ప్రయత్నం ఆశ్చర్యం కలిగించక మానదు.

తాను వలచిన వాడ్ని ఎప్పుడూ తలచుకుంటూ కన్నుల్లో నిలుపుకోవాలని ఆరాటపడుతుంది విరిబోణి ఒకతె.[454] అందుకు ఎన్నెన్నో ఉపాయాల్ని సూచిస్తుంది ప్రియుడికి. బావిగట్టు చేను వ్యవసాయం చేయమంటుంది. అలా చేస్తుంటే చీటికి మాటికి నీళ్లకని వచ్చి తన ప్రియుడ్ని కళ్లారా చూచుకోవటానికి వీలవుతుందని. బావిగట్టు చేను వ్యవయసాయం చేయటానికి 'గుత్తపన్ను' ఎక్కువ చెల్లించాలి. పేదవాడైన ప్రియుడు ఎలా చెల్లించనని సందేహిస్తాడు. తన చెవుల కమ్మలు అమ్మి పన్ను చెల్లిస్తానంటుంది. కమ్మలమ్మితే కట్టుకున్నవాడు ఊరుకుంటాడా? తిట్టడా? అని మిండ మగని ప్రశ్న. అప్పుడు తానే రీతిగా బొంకి భర్తను సమాధానపరుస్తుందో వివరిస్తుంది. కమ్మలుబావిలో పడిపోయాయని జంకూ, గొంకూ లేకుండా చెపుతానంటుంది. అప్పుడు భర్త బావిపూడిక తీయించి వెతికిస్తే ఏంచేస్తావంటే కప్పమ్రింగిందేమోనంటానంటుంది. కప్పకడుపు కోసి చూస్తేనో అని ప్రశ్న. అరిగిపోయుండవచ్చుగదా అని సమాధానం. కామం బహు చెడ్డది. ఎంతటి సాహసానికైనా ఒడిగట్టిస్తుంది. అలవోకగా అబద్ధాలు చెప్పగలిగే శక్తినిస్తుంది. ఇటువంటి స్త్రీల వల్లనే "రంకాడినమ్మ బొంకాడదా!" అనే సామెత ఏర్పడి ఉండవచ్చు.

కాముకీ కాముకులు ఉన్న ఊళ్లో ఆటలు సాగటం లేదని వేరేఊరు లేచిపోతారు. కానీ కొద్ది రోజులకే జరుగుబాటు లేక ఆర్థిక సమస్యలు

[453] పల్లెపదాలు, పుట – 74.
[454] మిన్నేరు, పుట – 474.

మొదలవుతాయి. ఒకరినొకరు విమర్శించుకొంటారు[455] 'కూలిలేదు నాలిలేదేమి, కుంపటోలె కూరుచుంటివి' అని కాముకుడు విమర్శిస్తాడు. 'కత్తిమెరుపు, కటారి మెరుపు' లకు భ్రాంతిపడి బంగారంవంటి భర్తను, సంసారాన్ని వదిలిపెట్టి వచ్చానని కాముకి సమాధానం చెపుతుంది. 'ముక్కుపోగు ముత్తెపు మెరుపులకు' చిత్తం కరిగి ఆలిని విడిచి వచ్చానని కాముకుడు తన తొందరపాటు తనానికి తనను తానే నిందించుకుంటాడు.కామాన్ని అదుపులో ఉంచుకొని భార్యాభర్తలు నియమబద్ధంగా జీవించటంలోనే జీవితసాఫల్యం సమకూరుతుంది. నియమరహిత జీవితం చుక్కానిలేని నావ వంటిది. అది గాలి ఎటు వీస్తే అటు కొట్టుకుపోతుందే తప్ప లక్ష్యాన్ని చేరదు.

ఒకానొక పడతి మనసులేని మనువాడింది. మేనత్త కొడుకును వలచింది. వివాహం వేరొకరితో. అన్యాసక్తమైన మనసు కుదుటపడలేదు. క్రొత్తగా పెళ్లి కావటం వల్ల పూర్వం వలె మేనత్త కొడుకును కలసుకోవటం కుదరటం లేదు. అయినా తన క్రొత్త కాపురంలోని లొసుగులు బావకు తెలియజేసి ఎలాగైనా తనను కలుసుకోమని నిగూఢ సూచన చేస్తుంది. అత్త చెవిటిది. మామ గ్రుడ్డివాడు. మగడు మూర్ఖుడు. మచ్చరపు కళ్లుగల మరిది మాత్రం పైకావలి కాస్తుంటాడు. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలన్నట్లుగా ఆసక్తిలేని కాపురం ఈ విధంగానే రసహీనంగా సాగుతుంది.[456]

ఇటువంటి మరొక నెరజాణ ఇంటి గుట్టు బయటపెట్టి విటుడ్ని ఆహ్వానిస్తుంది.[457] బోటిమీద ఇల్లు. బోటు[458] సంబంధం బోటి అయ్యుండవచ్చు. ఎత్తైన ప్రదేశంలో ఉంది కనుక ఇల్లు సులభంగా కనుక్కోవచ్చని ఆమె భావన. 'బొంగురాల బోలు తలుపు, తమ్మల పాకుల ద్వార బంధము, వంగిరారా వన్నెకాడా' అని ఆహ్వానం పలుకుతుంది. చక్కని చిరుచాపమీద తానొక్కదాన్నె పడుకొంటానని,

---

455 త్రివేణి, పుట – 108.
456 త్రివేణి, పుట – 183.
457 పైదే, పుట – 203.
458 బోటు = కొండ మొదలగు వాని యందు ఉబ్బుగా నుండు చోటు. –శ.ర.

వద్దపడుకొన్న వాడికి (భర్తకు) సద్దుగాకుండా, గాజులు గల్లుమనకుండా చల్లగా లేచి వస్తానని తన ఉల్లాన్ని ప్రకటిస్తుంది. తన శక్తి సామర్థ్యాలు ఎటువంటివో ఏమాత్రం సంకోచం లేకుండా బహిర్గతం చేస్తుంది. సిగ్గుఎగ్గు లేకుండా తెగించిన ఆడది ఎంతటి నీచస్థాయికైనా దిగజారి మాట్లాడగలదని ఈ గేయం ద్వారా నిరూపితమవుతున్నది.

ఈవిధమైన శృంగార భరిత మోటపదాలు ఎన్నో జానపద సాహిత్యంలో చోటుచేసుకున్నాయి. నిజంగా స్త్రీలు జారిణిలు కాకపోయినప్పటికీ మోటతోలే పురుషులు తమకు శ్రమ తెలియకుండా ఉండటానికి, పనిచేయటానికి కావలసిన ఉత్సాహాన్ని పొందటానికి ఇటువంటి గేయాల్ని కల్పించి పాడుకొంటుంటారని స్పష్టమవుతున్నది.

'కామాతురాణాం నభయం నలజ్జ' అన్నట్లుగా కన్న బిడ్డను సహితం వదిలిపెట్టి మిండమగని దగ్గరకు వెళతానని ప్రకటిస్తుందొక సాహసి. పిల్ల తల్లినని వల్లకుంటావేమో ఆ పిల్లను వదిలి నీ వెంట వస్తాను, నీ సత్తా చూస్తాను అని సవాలు చేస్తుంది ఆ కాముకి.[459] కోటయ్య బావ కోసం తన ఒక్కగానొక్క బిడ్డను విడిచి వస్తానని బాసచేసే పడతి ఈ కోవలోనిదే.[460] కామం ఎంత పనైనా చేయిస్తుంది. ఎంత సాహసానికైనా ఒడిగట్టిస్తుంది. ఈ విషయాన్నే నన్నయగారు కూడా స్పష్టం చేశారు.[461]

విటుడ్ని కలుసుకోవటానికి జారిణి ఎంతగా ఆరాటపడుతుందో వివరిస్తుందొక గేయం.[462] అత్తమామలు పెన్నోబళస్వామి (పెన్న అహోబల స్వామి) రథోత్సవం చూడటానికి వెళతారు. ఇంట్లో తానొక్కతే ఉంది. కావలసినంత స్వేచ్ఛ. గుడ్లు పెట్టే కోడ్ని చంపి కూరవండుకొస్తాను ఎట్టైనా పయనమైపోదామంటుంది.

[459] మోటపదాలు, పుట -1.

[460] తెలంగాణ పల్లెపాటలు, పుట – 190.

[461] "సతుల గోష్ఠి చిత్తచలన మొందు రెండు గాము శక్తి నోర్వగలరె జనులు."

– శ్రీమదాంధ్ర మహాభారతం, 1-3-38.

[462] పల్లెపదాలు, పుట – 34.

కారుకోడెని చంపి కమ్మగా వండుకొస్తానని నోరూరిస్తుంది. చిన్న బాలుడికి ఆవు పాలుపట్టి నిద్రబుచ్చి వస్తానంటుంది. నరసింహస్వామికి వత్తిలేని దీపం పెట్టివస్తానంటుంది. (అంటే వత్తివేసి దీపారాధన చేసే సమయం లేదని భక్తితో ఒక నమస్కారం చేసి వస్తానని భావం). ఈ విధంగా పరపురుష సమాగమానికి అలవాటు పడ్డ అంగనలు అత్తమామల కన్నుగప్పి, భర్తను మోసం చేసి ఇల్లు విడిచిపోయే సాహసప్రవృత్తిని కొన్ని గేయాలు నిరూపిస్తున్నాయి.

అదుపు ఆజ్ఞలేకుండా, సిగ్గు ఎగ్గులేకుండా వీధుల్లో తిరుగుతూ విటుల్ని కలుసుకొంటూ విహరించే స్వేచ్ఛా జీవి వృత్తాంతాన్ని 'నాయుడోల్లింటికాడ – నల్లతుమ్మ చెట్టుకాడ' అనే ప్రసిద్ధ గేయం వివరిస్తుంది.[463] నల్లతుమ్మ చెట్టు దగ్గర నాయుడుతో మాట్లాడుతుంది. కోమటోరింటి కాడ గున్నమామిడి చెట్టుకాడ తిరిగి కలుసుకుంటుంది. కరణం గారింటికాడ ములక చెట్టుకాడ మళ్లీ తిరిగి ఆ కాముడు కలుస్తాడు. కాసుల పేరిస్తానని ఆశ పెడతాడు. మునసబు గారింటికాడ ముందర దరవాజులోన ముక్కుపుడక లిస్తానని ఊరిస్తాడు. మాలపల్లి తూముకాడ మల్లెపూల పందిరికింద మళ్లీమళ్లీ రమ్మని వేధిస్తాడు. వట్టిమాటలకు లొంగేది కాదు ఆ జాణ. కామరాజు కడియాలు చేయించాడు. పాపయ్య పావడాలు బహుకరించాడు. నాగరాజు నాగరం అలంకరించాడు. ఇదే విధంగా ఎందరినో ఊరించి సొమ్ములు సంపాదించింది. చివరకు తాళపాలెం రేవు దగ్గర నాయుడు ఈ మిటారిగత్తెను ఎగిరెగిరి తంతాడు. నిర్లజ్జగా, స్వేచ్ఛగా తిరిగే వనితలకు ఇదొక గుణపాఠమని భావించవచ్చు.

**ప్రణయకలహాలు** : ప్రణయ కలహాలు లేని కాపురం ఉప్పులేని పప్పు వంటిది. భార్యాభర్తల మధ్య మాటపట్టింపులూ, మాట రెట్టింపులూ రాకుండా ఉండవు. కానీ అవి తాటాకు మంట వంటివి. ఒక్కసారి మంటలెగసి పడి చప్పున చల్లారినట్లుగా పగలు ఒకరితో ఒకరు కలహించుకొంటారు. రాత్రి అయ్యేటప్పటికి రాజీపడి

[463] పల్లెపదాలు, పుట -230.

ఏకమవుతారు. ఈ కోపం, ఈ కలహం వారి ప్రణయాన్ని మరింత ప్రగాఢం చేస్తుంది. అందుకే వీటికి ప్రణయ కోపాలు అని, ప్రణయ కలహాలు అని వ్యవహారం.

ప్రణయ కలహాలు అనగానే సత్యాకృష్ణులు జ్ఞప్తికి రాక మానరు. సత్యభామ అలకలూ, శ్రీకృష్ణుని అనునయింపులూ లోకప్రసిద్ధాలు. జానపద సాహిత్యంలో ఇట్టి ప్రణయకలహాలను నిరూపించే గేయాలు అనేకం ఉన్నాయి. కలహం వచ్చినప్పుడు మధ్యవర్తి ఎవరో ఒకరు ఉండాలి. తడికను మధ్యవర్తిగా చేసుకొన్న జానపదగేయాలు ఎన్నో కనిపిస్తాయి. 'కొర్రబియ్యం తెచ్చాను, గోంగూర తెచ్చాను వండమని చెప్పవే తడికమ్మా' అంటాడు భర్త. వండనని నిష్కర్షగా చెప్తుంది భార్య. 'తాటి పండు తెచ్చాను, బుర్రగుంజు తెచ్చాను, తినమని చెప్పవే' అని తడికమ్మతో మొరపెట్టు కొంటాడు భర్త. అయినా కోపం తగ్గని భార్య తిననని తడికమ్మకే సమాధానం చెప్తుంది. చివరకు 'నులకమంచం తెచ్చాను, కంబళీ తెచ్చాను, వెయ్యమని చెప్పవే తడికమ్మా' అని మగడు కోరితే సరే రమ్మని చెప్పమంటుంది భార్య.[464] ఆ విధంగా కలహం అంతమవుతుంది.

భార్య కోపిష్టిదయితే భర్త శాంత స్వభావుడిగాను, భర్త ముక్కోపి అయితే భార్య నెమ్మదస్తురాలుగాను ఉండటం లోకసహజంగా కనిపిస్తుంది. భర్త కలహించినప్పుడు అతడికిష్టమైన వంటలు వండి ప్రసన్నం చేసుకోవాలనుకుంటుంది భార్య. 'వరికూడు వార్చేను, వంకాయ వండేను తినమని చెప్పవే తడికా' అంటుంది. వగలాడి మాటలకు వళ్లంతా మండింది, వద్దని చెప్పవే తడికా' అంటాడు భర్త. ఇరువురూ కొంతసేపు బిగదీసుకుని కూర్చుంటారు. ఈ పర్యాయం భర్త భార్యకు కానుక లిచ్చి కోపం తగ్గించాలనుకుంటాడు. 'పట్టుచీర తెచ్చేను, పెట్టెలో పెట్టేను, కట్టుకోమని చెప్పవే తడికా'[465] అని భార్య వినేటట్లు తడికతో చెప్తాడు. ఈ విధంగా ఒకరినొకరు మన్నించుకొంటూ, పలకరించుకుంటూ ప్రేమలోలకబోసుకుంటారు దంపతులు. దాంపత్య జీవనంలో ఇవి రసవత్తరమైన ఘట్టాలు.

---

[464] మిన్నేరు, పుట – 485.
[465] మిన్నేరు, పుట – 485.

పురుషుడు స్త్రీని అనునయించటంలోనే సరసత్వం అధికం. అనునయించే కొద్దీ అభ్యంతరాలు చెపుతూ కోపెక్కి కూర్చోవటం కోమలి స్వభావం. అట్టి స్వభావాన్ని పట్టిచ్చే గేయాలు కనపడుతున్నాయి.

"అలివేణి నా మీద అలిగినదేమో
పెద్ద పల్లంగట్ల పేరు బంపితిని"[466]

అని ఘనంగా చెప్పుకొంటాడు పురుషుడు. పేరుకొన్న తన ప్రేమకది నిరూపణమనుకొంటాడు. భార్య ఎంతగానో తనను అభిమానిస్తుందని ఆశిస్తాడు. కానీ స్త్రీని మెప్పించటం సామాన్యమైన విషయమేమీ కాదు. పంపిన కానుకల్లో ఏదో వంక వెదుకుతుంది భార్య. 'పేరు మంచిదేగాని చాత తక్కువరా' అని ఆక్షేపిస్తుంది అలిగిన అర్ధాంగి. హనుమకొండ అంగట్లో కొన్న అందెలు పంపానుగదా అంటాడు భర్త. అందెలు మంచివే కాని మోత తక్కువని విమర్శిస్తుంది భార్య. ఈ విధంగానే చింతగట్టు అంగటినుండి చీర పంపితే దానికి చెంగు తక్కువని, భువనగిరి అంగటి నుండి బొట్టు పంపితే నొసటికి అతకటం లేదని, మట్టె వాడ అంగటి నుండి మట్టెలు పంపితే గట్టి తక్కువని అన్నింటికీ అన్ని వంకలూ పెట్టి అసంతృప్తిని ప్రకటిస్తుంది స్త్రీ. ఇది పురుషుని సహనానికి పరీక్ష.

భార్య తన మాట వినకపోతే ఏదో ఒక రకంగా శిక్షించి దారికి తెచ్చుకోవాలనుకుంటాడు భర్త. అందుకు ఒకటే మార్గం. యేరాల్ని[467] తెచ్చి పెట్టటం. యేరాల్ని తీసుకువచ్చి ఇంట్లో పెడతానని తన మాట వినాలని భార్యను హెచ్చరిస్తాడు భర్త.[468] ఆ మాటకు భయపడిన భార్య ఏకులు వడుకుతానని, వేరే వండిపెడతానని, యేరాల్ని తేవద్దని మగడ్ని బ్రతిమలాడుతుంది. బ్రతిమలాడే కొద్దీ మగడు కోపెక్కి కూర్చుంటాడు. అది బంగారపు బొమ్మని, బెంగుళూరు గుంటని, దాని నడుము నాగబంధమని, నడక హంస నడకని వర్ణిస్తే, భర్త ఎక్కడ దాని మాయలో పడిపోతాడోనని ఎంతగానో ఆరాటపడుతుంది భార్య. దాని సోకులకు మోజు

[466] తెలంగాణ పల్లెపాటలు, పుట – 123.
[467] వేఋ+ఆలు= వేఋాలు, ఏఋాలు, యేఋాలు, యేరాలు
[468] పల్లెపదాలు, పుట-104.

పడవద్దని, దాని మాటలు వినవద్దని విన్నవించుకొంటుంది. ఆ బెదిరింపుతో భార్య భర్త దారికి వస్తుంది. భార్యకు వడ్డాణం చేయిస్తాడు. భార్య ఆ వడ్డాణం పెట్టుకొంటే నడుం చక్కదనం చూడాలని అభిలషిస్తాడు మగడు. పున్నమి పండగకు పెట్టుకుంటానని మురిపెంగా చెపుతుంది భార్య. భార్యా భర్తల మధ్య ఇటువంటి బెదిరింపులూ, అనునయింపులూ వారి బంధాన్ని మరింత బలోపేతం చేస్తాయి.



# 3. వాత్సల్య భావన

**మాతృ భావన :** స్త్రీ జీవితం బాధ్యతాయుతమైంది. అదొక పవిత్ర యజ్ఞం వంటిది. శారీరక మానసిక పరిణామం ఆమెలో అధికం. కన్యగా ఉన్నప్పుడు బొమ్మల పెళ్లిళ్లు చేసుకొంటూ, బొమ్మరిళ్లు కట్టుకుంటూ హాయిగా ఆటపాటలతో ఆనందంగా కాలం గడుపుతుంది. వయసు వచ్చేటప్పటికి మూడుముళ్లు పడగానే ఎక్కడలేని బాధ్యతలు ఆమె ముందుకు వస్తాయి. వీటిని త్యాగగర్భితో ఎదుర్కొని ఓర్పు, నేర్పు, తీర్పుతో జీవితాన్ని సాఫల్యం చేసుకోవటానికి అహరహం శ్రమిస్తుంది.

స్త్రీ జీవితంలో మధురాతి మధురమైన ఘట్టం మాతృత్వాన్ని వహించటం. ఇది ఆమె జీవితానికి సార్థక్యాన్నిస్తుంది. ఆమెలో శృంగారం పచేళిమమై వాత్సల్యరూపం వహించిన స్థితి. ఈ స్థితిని పొందటానికి ప్రతి మహిళా నిహితంగా మహిత తపస్సు చేస్తుంది. వివాహ సాఫల్యం మాతృత్వంలోనే ఉంది. ధర్మబద్ధమైన దంపతుల కామం సంతానరూపం వహించి సంతోషాన్ని చేకూరుస్తుంది. స్త్రీ జాయగా[469] రూపొందటంలోనే ఆమె జీవితానికి చరితార్థకత. క్షీరసాగర మథనం సాగగా సముత్పన్నమైన అమృతం దేవతలకున్నట్లు గానే మానవులకు సంతాన రూపమైన అమృతం లభించింది.[470] బిడ్డల్ని కన్నమ్మకే సంఘంలో దొడ్డగౌరవం. శుభకార్యాలలో ప్రథమ తాంబూల సత్కారం ఆమెదే.

**గొడ్రాలి బ్రతుకు**: ప్రాచీన కాలం నుండి నేటి ఆధునిక కాలం వరకూ సంతానవతి కాని స్త్రీకి సంఘంలో తగిన గౌరవ మర్యాదలు లభించవు. కోటి ధనమున్నా గొడ్రాలి

---

[469] 'జని' ధాతువుకు 'పుట్టుట' యని యర్థము. జాయనునది యాధాతువు నుండియే వచ్చినది. భర్త తనయం పుట్టుచున్నాడు గావుననే భార్యకు జాయయను పేరు వచ్చినది.

పతిర్జాయాసంప్రవిశతి। గర్భోభూత్వేహ మాతరం।
తస్యాం పునర్నవో భూత్వాననమే మాసిజాయతే।
తజ్జాయా జాయా భవతి యదస్యాం జాయతే పునః। -

ఐత్తరేయ బ్రాహ్మణము, 7-3-13 – వేద కాలపు స్త్రీలు, పుట – 18.

[470] 'ప్రజామను ప్రజాయతే, తదుతే మర్త్యామృతం।'

తైత్తరీయ బ్రాహ్మణము, 1-6-26 -వేదకాలపు స్త్రీలు పుట – 17.

బ్రతుకు సుఖప్రదంకాదు.[471] గండ్రగొడ్డలి క్రింది కొమ్మ పడే కష్టం కన్న గొడ్రాలు పడే కష్టం మిన్న అని జానపద స్త్రీ భావిస్తుంది.[472] గొడ్రాలి బ్రతుకు ఎంత కఠోరమైందో జానపద సాహిత్యంలో చక్కగా వర్ణింపబడింది.

"బిడ్డలు లేరటే గొడ్రాల నీకు
ఆడితివి అంతరేజు[473] గంగతానాలు
ఈశ్వరుని గుళ్లకు ఇటుకలు మోసేవు
రామయ్య గుళ్లకు రాళ్లు మోసేవు
రావియ్య చెట్టుకు ప్రదక్షిణాలు చేసేవు"[474]

అని లోకం ప్రశ్నిస్తుంటే అవమాన భారంతో తనలో తానే కుమిలిపోతుంది. కోటి గొడ్డళ్లతో కొట్టినట్లవుతుంది.

"పసుపు కుంకుమలకు పోలేను నేను
పసి బిడ్డలను నేను ఎత్తుకోలేను
ఇల్లు కలకలలాడ చూడంగలేను
ఒక్క బిడ్డనైనా ముద్దాడలేను
గొడ్రాలి బ్రతుకయ్యె గౌరవం లేదయ్యె"[475]

అని మనోవేదన[476] అనుభవిస్తుంది.

[471] 'గొడ్రాలు బ్రతుకేల కోటి ధనమేల' – మిన్నేరు, పుట - 33

[472] 'ఆడదాన్నీ నేను అయిపుడితిగాని గండ్రగొడ్డలి క్రింద కొమ్మనైన జాలు' – మిన్నేరు, పుట -51.

[473] అంతర్వేది – తూర్పు గోదావరి జిల్లా కొవ్వూరు నుండి కొంత దూరంలో విజ్జేశ్వరం దగ్గర గౌతమి పడమటివైపు ఏరై పారి సముద్రంలో కలుస్తుంది. ఆ ప్రదేశమే అంతర్వేది. ప్రసిద్ధమైన తీర్థస్థలం. – మున్నీరు, పుట -231.

[474] జానపద గేయ సాహిత్యం, పుట – 443.

[475] తెలుగు – కన్నడ జానపద గేయాలు, పుట – 113.

[476] ఇట్టి మనోవేదన వేద కాలంలోనూ నిరూపితం. 'మానో అగ్నేమతయే మా వీరతాయైరి రథః। ఋగ్వేద సంహిత, 3వ మండలం, 16వ సూక్తం, 5వ ఋక్కు- వేదకాలపు స్త్రీలు, పుట – 1.

వేదన దూరం కావాలంటే బిడ్డల్ని కనాలి. మానవ ప్రయత్నంతో ఏ పనీ కానప్పుడు గుర్తుకొచ్చేది దైవమే. అందుకే గుంటూరు పరిసర ప్రాంతాల్లోని జానపద స్త్రీలు ఈ విధంగా తమ ఆకాంక్షను తెలియజేస్తారు.

"కోటయ్య నీవంటి కొడుకుల్లనిస్తే
కోటి ప్రభలతోటి కొండలెక్కేము."[477]

ఈ మ్రొక్కు కొంత అతిశయోక్తితో కూడిందని అనిపించవచ్చు కాని అది ఆమె అంతర్గత ఆరాటానికి నిదర్శనం. అంతేకాదు దీనికి సంబంధించి ఒక కథ ప్రచారంలో ఉంది. ఒకానొక భక్తుడు త్రికూటాద్రిపై వెలసిన త్రికూటేశ్వరస్వామిని 'స్వామీ! ఈ మెట్లన్నీ ఎక్కి కొండపైకి రాలేకపోతున్నాం. కాబట్టి నువ్వే కొండ దిగిరా!' అని వేడుకొంటే అందుకు ఈశ్వరుడు కోటి ప్రభలు తీసుకువస్తే కొండ దిగుతాను అన్నాడట'. కోటి ప్రభలు తీసుకురావటమూ అయ్యే పని కాదు స్వామి కొండ దిగటమూ జరిగే పనికాదు. అందుకే ఎవరైనా త్రికూటేశ్వరుడికి (వాడుకలో కోటయ్యగా ప్రసిద్ధి) మ్రొక్కుకునేటప్పుడు 'కోటి ప్రభలు' అని ప్రస్తావిస్తుంటారు.

విశాఖపట్నం పరిసర ప్రాంతాల స్త్రీలు సింహాద్రి అప్పన్న గుళ్లో ప్రాణాచారాలు పడతారు. అప్పన్నకు ఎన్నో లంచాలు పెడతారు. వస్త్రాలిస్తారు. గుమ్మడి పళ్లు, వడపప్పు, దండు బెల్లాలు[478] సమర్పిస్తారు.[479]

---

477 మిన్నేరు, పుట – 98.

478 బూడిద గుమ్మడి కాయ ఆకారంలో అచ్చులు పోసిన పెద్ద పెద్ద బెల్లపు అచ్చులు.

479 "సింహాద్రి అప్పన్న గుళ్లముందార
పడ్డారె గొడ్రాళ్లు ప్రాణచారమ్ము
ఎందుకు పడ్డారు యేల పడ్డారు
సంతాన మియ్యమని చాలపడ్డారు
బిడ్డలనియ్యమని ప్రియము పడ్డారు
కుమాళ్ల నియ్యమని కోరిపడ్డారు
సింహాద్రి అప్పన్నకు ఏమి లంచమ్ము
గుడిబిరుగు పస్త్రము గుమ్మడి పండు
దాగళ్ల వడపప్పు దండు బెల్లాలు." – సాంప్రదాయిక విజ్ఞానం, పుట – 17.

ఇంత మాత్రమే కాదు ఎన్నో నోములు, వ్రతాలు ఆచరించాలి. ఉపవాసాలు చెయ్యాలి. దీనికోసం ఎవరెవరినో అడుగుతుంది. కృష్ణుడి తల్లి యశోద తన ఎదురుగా ఉన్నట్లు భావించి ఎన్ని నోములు నోచి కృష్ణుడ్ని కన్నావో? అని ప్రశ్నిస్తుంది. ఎన్ని శివరాత్రులో ఉపవాసముండి శివుడు ప్రసాదిస్తే చిన్ని కృష్ణయ్యను కన్నానని, ఒక్క ప్రొద్దులుండి, వరచవుతులుండి వరమిస్తే వాసుదేవుడ్ని కన్నానని యశోద సమాధానమిస్తుంది. అంతేగాదు పచ్చిపిండితిని, పాలారగించి, బాధ్రపద పౌర్ణాలుండి సంతానం పొందానని ఆ యశోద తనతో చెప్పినట్లు[480]గా సమాధానపడి తనూ ఆమెలాగే ఉపవాసవ్రతాలు నిర్వహించి 'గొడ్రాలు' అనే కళంకాన్ని పోగొట్టుకోవటానికి అకలంక చిత్తంతో కృషి చేస్తుంది.[481]

చంకలో బాలుడు లేకపోతే సంతోషమేముంటుంది?[482] సంతోషం పొందాలంటే ఏమి చేయాలో సలహాలిచ్చే గేయాలు[483] కూడా లభ్యమవుతున్నాయి. కనిపించిన ప్రతిబిడ్డనూ ఎత్తుకొని ముద్దాడాలి. ఆటపాటలతో ఆనందించే చిన్నారులకు పండ్లు పంచిపెట్టాలి. వారిని కోలతో కొట్టకూడదు. పసిపిల్లలతో కళకళలాడే ప్రదేశానికి పోయి వారికి తల్లిలాగ మెలగాలి. ఇటువంటి వేమీ చెయ్యకుండా గొడ్రాలి బ్రతుకుకు గౌరవంలేదని మధనపడటం మంచిదికాదని ఈ గేయాల ద్వారా సూచితం. లోకారాధన, దైవారాధన ఎంత తీవ్రంగా ఉంటే స్త్రీ జీవితం అంత సంతోషంగా సాగిపోతుందని ఈ గేయాలు స్పష్టం చేస్తున్నాయి.

విచిత్రమైన విషయం ఏమిటంటే సంతానం లేక బాధపడే దంపతులు ఏ బిడ్డ అయినా ఒకటే అని భావించక పుత్ర సంతానాన్నే కోరుకుంటారు. వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు అన్నింటిలోనూ దంపతులు పుత్ర సంతానాన్నే

480 మున్నీరు, పుట -101.

481 సాహిత్యంలో గొడ్రాలి భావనను, జానపద సాహిత్యంలో భావనను శ్రీ టేకుమళ్ల అచ్చుతరావుగారు తమ 'ఆంధ్రపదములు – పాటలు' అనే గ్రంథంలో తులనాత్మకంగా కొంత వివక్షించారు. జానపద స్త్రీ భావన నిసర్గమనోహరమైనదని వారి నిరూపణం. –పుటలు -9-10.

482 జానపద కళాసంపద, పుట – 182.

483 త్రివేణి, పుట – 109.

కోరుకోవటం గమనించవచ్చు. 'పున్నామ' అనే నరకం నుండి తప్పించే వాడు పుత్రుడు అనే విశ్వాసం ప్రజలలో నాటుకుపోవటం వల్లనేమో నేటి కాలంలోనూ ప్రజలు అదే భావనతో ఉండటమే గాక అభివృద్ధి చెందిన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందిపుచ్చుకొని స్కానింగ్ ద్వారా పుట్టబోయేది ఆడపిల్ల అని తెలుసుకొని భ్రూణహత్యకు పాల్పడటం ఆశ్చర్యకరం. జానపద వాఙ్మయం కూడా ఇందుకు అతీతమేమీ కాదని ఋజువవుతున్నది.

"తింటేను తియదోస పండ్లే తినాలి
కంటేను కొడుకుల్ల కాన్పే కనాలి."[484]

"కొడుకుల కననాళ్ల కడుపేమి కడుపు."[485]

పై గేయాల వల్ల పుత్ర సంతానాపేక్ష ఎంత బలీయంగా ప్రజల మనసులలో నాటుకుపోయిందో స్పష్టమవుతుంది.

"కూతురూ పుట్టినది, కుందుపుట్టినది"[486]

అని అనటంలో ఆడపిల్ల పుట్టినప్పటి నుండి దుఃఖం ప్రారంభమైనట్లుగా భావింపబడుతున్నట్లు తెలుస్తున్నది. అందుకే ఆడపిల్ల పుట్టటం ఇష్టం లేనట్లు తెలుస్తున్నది. అంతేకాదు

"దండాన కోకలకి దాతా పుట్టినది"[487]

అనటంలో ఆడపిల్ల అయితే బట్టల ఖర్చు ఎక్కువవుతుందనే గాక పెంచి పెద్ద చేయటం, వివాహం జరిపించటం అన్నీ ఖర్చుతో కూడినవి కాబట్టి ఆర్థిక భారం గనుక ఆడపుట్టుకను అపేక్షించటంలేదని భావించవచ్చు.

కానీ స్త్రీ సంతతి ఇరువైపులా పదితరాల వాళ్లను తరింప చేస్తుందనీ, పుట్టినింటికి మెట్టినింటికి ఖ్యాతి తెచ్చేది స్త్రీ అని పరిపరివిధాల

484 మిన్నేరు, పుట – 98.
485 పైదే, పుట – 63.
486 పైదే, పుట – 52.
487 పైదే.

ప్రశంసిస్తున్నా,[488] కన్యాదానఫలం అశ్వమేధయాగ ఫలంతో సమానమని వేదాలు, పురాణాలు ఘోషిస్తున్నా స్త్రీ సంతాన్నాన్ని కోరుకునే గేయాలు మృగ్యం.

**చూలింత** : ఎట్టకేలకు వనిత వాంఛ నెరవేరి నెల తప్పుతుంది. ఇది స్త్రీ జీవితంలో గొప్ప పరిణామం. ఈ సమయంలో మనసు ఎన్నో కోర్కెలు కోరుతుంది. చూలింత కోర్కెలు ఒక్కొక్క నెలలో ఒక్కొక్క విధంగా ఉంటాయి. మొదటి నెలలో ఊరగాయలు, రెండవ నెలలో పుల్లటి రేగు పండ్లు, మూడవ నెలలో ములక పండ్లు, నాల్గవ నెలలో నారికేళం లేదా నారింజ పండ్లు, ఐదవ నెలలో అరటిపండ్లు, ఆరోమాసంలో ఆవుపాలు, ఏడవ మాసంలో వెన్నముద్దలు, ఎనిమిదవ మాసంలో వెలగపండ్లు, తొమ్మిదవ మాసంలో దోసపండ్లు తిని పదో మాసంలో పండంటి బిడ్డకు జన్మనిస్తుంది.[489]

ఈ గేయంలో గర్భిణి స్త్రీ మనోవాంఛలు సవివరంగా తెలియజేయబడ్డాయి. ప్రతిచర్యనూ గేయంలో ఇమిడ్చి లయాత్మకంగా దానికి అక్షరత్వాన్ని చేకూర్చే ప్రయత్నం జానపద స్త్రీలలో ఎంతగా ఉందో చెప్పటానికి పై గేయమే నిదర్శనమని చెప్పవచ్చు.

కొందరు చూలింతలు పండ్లే కాకుండా సుద్దలు, మట్టి పెళ్లలు ఇష్టంగా తింటుంటారు. 'అత్తను సుద్దడుగే చెలియా'[490] అనే చరణం ఈ విషయాన్నే స్పష్టం చేస్తుంది. మట్టి కోరుతున్నట్లుగా గేయాలలో ఎక్కడా కనిపించలేదు. శరీరంలో విటమిన్లు ముఖ్యంగా విటమిను బి12, కాల్షియమ్ లోపించినప్పుడు ఇటువంటి కోర్కెలు కలుగుతాయని వైద్యుల[491] వివరణ.

[488] "మయా సహదశ పూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం
పితౄణాం నరకా దుత్తీర్య శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం
స్వగృహ్యోక్త ప్రకారేణ సాలంకృత సహిరణ్యోదక కన్యాదాన మహంకరిష్యే"
హిందూ వివాహ ప్రాశస్త్యము, విశ్వహిందూ పరిషత్ ప్రచురణ, గుంటూరు, 4వ ముద్రణ, 1976.

[489] తెలంగాణ పల్లెపాటలు, పుట – 81.

[490] త్రివేణి, పుట -77.

[491] డా. కాసరనేని సదాశివరావుగారితో ముఖాముఖి చర్చల ద్వారా సేకరణ

పండ్లు బాగా తింటే గర్భిణి స్త్రీ ఆరోగ్యంగా ఉండి, కడుపులో శిశువు దిన దిన ప్రవర్థమానమయి సుఖప్రసవం జరుగుతుంది.

ఒక వివాహిత గర్భవతి అయితే అది ఆమె భర్తకు, ఆ కుటుంబ సభ్యులకే కాదు సమాజానికి కూడా సంతోషకర విషయమే. అదే ఒక అవివాహిత గర్భం ధరిస్తే ఆ కుటుంబమే కాదు సంఘమూ హర్షించదు. కానీ ఇది దాచేస్తే దాగే విషయం కాదు. నెలలు గడిచే కొద్దీ ఆమెలో కలిగే మార్పులను అందరూ గమనిస్తే ఛీ కొడతారు. ఎక్కడ ఈ రహస్యం బయట పడుతుందోనని ఆవేదన చెందుతుంది ఆ స్త్రీ. నెలలు గడిచే కొద్దీ గర్భస్థమైన పిండం మూలంగా స్త్రీ దేహంలో కలిగే మార్పులను వైద్య పరిభాషలో చెప్పినట్లుగానే జానపదులు వర్ణించిన తీరు పరమాశ్చర్యకరం.[492]

పూచిన తంగేడులాగ పుట్టింట్లో ఉన్న ఒక పడతి బుద్ధి చెదరి చుక్కలలో చంద్రుని లాంటి చక్కని చిన్నవాడితో గడియ పోయిందట. ఈ విషయంలో పురుషుడికున్న స్వేచ్ఛ స్త్రీకి లేదు. ప్రకృతి ఆమెకెన్నో అవరోధాలు కల్పించింది. ఫలితంగా ఆ పడతి నెల తప్పింది. ఇక శరీరంలో క్రమంగా మార్పులు కలగసాగాయి. రెండవ నెలలో వేవిళ్లు వచ్చాయి. మూడవ నెలలో ముద్ద పిండమయింది. నాలుగవ నెలలో కుచాలు నలుపెక్కాయి. అయిదవ నెలలో అవయవాలు అమిరాయి. ఆరవ నెల అర్థపిండమయింది. ఏడవ నెలలో ఎదురు పిండమయింది. ఎనిమిదవ నెలలో వెన్ను పట్టి బరువెక్కింది. ఏలాగున ప్రసవించటమని ఆక్రోశిస్తుంది. తన మనోవేదనను సాటి స్త్రీతో చెప్పుకొని తరుణోపాయం చెప్పమంటుంది.[493]

---

492 చేమకూర వేంకట కవి తన 'విజయవిలాసం' లో చిత్రాంగదకు నెల తప్పినప్పుడు ఆమె శరీరంలో కలిగే క్రమ పరిణామాల్ని ఇదే రీతిలో వర్ణించాడు.

"మించెన్ బోరటి కోరికల్, కడు విజృంభించెన్ దనుగ్లాని; గా
న్పించెన్ మేచకకాంతి చూచుకములన్; చెక్కిళ్లపై చెల్వు రె
ట్టించెన్; గూర్కులు సందడించె; నడచండించెన్ హృదామోదమున్
గాంచెన్ వాతెఱ యొసరించె త్రివళుల్ నానాటికిన్ బోటికిన్" – 3-35.

493 మిన్నేరు, పుట – 65.

కుంతీమహాసాధ్వి అంతటిదే లోకనిందకు భయపడి కన్యగా తాను కన్న బిడ్డను నీటిపాలు చేసింది. ఇక ఈ సామాన్య స్త్రీ పాట్లు చెప్పాలా!

ఒక స్త్రీ గర్భవతిగా ఉంటే ఆమె బాధ్యత సంఘానిదే. అందుకే ఇరుగు పొరుగు వృద్ధ మహిళలు ఆప్యాయంగా పరామర్శిస్తారు. చనువుతో కూడిన ఆ పరామర్శ కూడా పాట రూపంలోనే సాగుతుంది.

"కడుపుతో నున్నావు కమలాక్షి నీవు
పురుడెవ్వరోసేరు ఓ పుణ్యశాలి?"[494]

అని ఆప్యాయంగా అడుగుతారు. తన పురుడు పుట్టింటి వారుపోస్తారని, ఆ పురుడు వెన్నెలై కాస్తుందని ఎంతో అభిమాన పురస్సరంగా చెప్పుకొంటుంది ఆ గర్భవతి. కానీ ఇంత వరకు పుట్టించి వారెవరూ వచ్చినట్లు గాని, సూడిదలు తెచ్చి సీమంతపు వేడుకలు జరిపినట్లుగాని కనిపించదు. ఒకవేళ వారికి ఈ వార్త తెలియదు కాబోలని ఆ వృద్ధ కాంతలు విమర్శిస్తారు.[495]

**ప్రసవ వేదన** : ప్రసవం స్త్రీకి పునర్జన్మ వంటిది. బిడ్డను భూమ్మీదికి చేర్చటం తల్లికి 'ప్రాణగొడ్డం.' ఎంత బాధననుభవిస్తుందో వర్ణనా తీతం. అయినా జానపద స్త్రీలు ఆ బాధను వర్ణించటానికే సాహసిస్తారు.

ప్రసవ సమయం దగ్గరపడేకొద్దీ బాధ అధికమవుతుంది. ఘడియ ఘడియకూ నడుము కలుక్కుమంటుంది. కడుపులో నులిపెట్టినట్లవుతుంది. సహాయం కోసం వచ్చిన మహిళల్ని కడుపు కొంచెం నొక్కమంటుంది. సుడివడి పోతుంది. వడివడిగా తన వారిని అటు రమ్మంటుంది. మంత్రసానిని పిలవమంటుంది. అభిమంత్రించిన జలం అందివ్వమంటుంది. పక్కలు నొక్కమంటుంది. పిక్కలు పొక్కి పోయాయంటుంది. బాధకు చిక్కిన తనకు

[494] సెలయేరు, పుట – 51.
[495] పైదే.

దిక్కెవరంటుంది. కూర్చోవటానికి కుదిరిక ఉండదు. కష్టం తీర్చమంటుంది. ప్రాణం వేసారి పోతుంది, తన దోసకారిపనికి ఈసడించుకొంటుంది.[496]

ఈ ప్రసవ వేదనలోనే స్త్రీకి ఒక రకమైన వైరాగ్యం కలుగుతుంది. ఈ విధమైన బాధననుభవించటం తన వల్ల కాదని, మన్మథుడైనా మగడిక వద్దని తనను ఓదారుస్తున్న నాగమతల్లికి విన్నవించుకొంటుంది. ఇలాంటి బాధ ఇంకొకసారి కలిగితే పెళ్లాడినా పెనిమిటిని వదిలివేస్తానంటుంది. భరించరాని ఆ బాధకు ఓర్వలేక 'ఇంత వేదన గల్గితె యెందుకె మగడు' అని ప్రశ్నిస్తుంది. అయితే ఎందుకు పెళ్లాడనట్లు అని నాగమతల్లి ప్రశ్నిస్తే బుద్ధిగడ్డి తిన్నదంటుంది.[497]

ఈ విధంగానే ప్రసవపు నొప్పులను వర్ణించే పాటలు ఒకటి రెండు కనిస్తున్నాయి. లోపలి పిండం కదలగానే తనకు సహాయపడటానికి వచ్చిన అమ్మలక్కల్ని 'అండబాయక నుండరమ్మా' అని అర్థిస్తుంది. దూలానికి తాడేయ మంటుంది. దానిని ఊతం చేసుకొని నిలబడాలని. కడుపులో ఉరుములు ఉరిమినట్లయిందంటుంది. అయినా మురిపాల బిడ్డ కలుగుతాడని అంతటి బాధనూ సహిస్తుంది.[498]

ప్రసవం పరిసరాల్లోని స్త్రీలందరికీ ఆరాటం కలిగిస్తుంది. ఆ ఆరాటం కూడా గేయరూనం వహించింది. అనుభవజ్ఞులైన స్త్రీలు పురుడు పోయటానికి వస్తారు. పడిపోతున్న పడతిని లేవదీయమని ఒకామె హెచ్చరిస్తే జాగుచేయకుండా జావకాచి తాగించమంటుంది మరొక స్త్రీ. దూలానికి తాడువెయ్యమంటుంది వేరొక స్త్రీ. ఇంతలోనే పదిమందీ పోగవుతారు. అక్కలారా దేవతలకు మ్రొక్కండంటారు. మ్రొక్కిన దేవతలకు ముడుపు కట్టండంటారు. సుఖప్రసవం జరిగితే ఆలయంలో నందిని త్రిప్పుతానని మ్రొక్కుకోమని ఆ పడతిని ఆదేశిస్తారు. ఇటువంటి పనులు చేయాలి తప్ప అనవసరంగా మగవారిని ఎంచటం భావ్యం కాదని ఆ అతివలు

---

[496] మిన్నేరు, పుట -66.

[497] పైదే.

[498] సెలయేరు, పుట- 78.

సూచిస్తారు.[499] గ్రామ సీమలలో స్త్రీ ప్రసవాన్ని ఆ గ్రామ స్త్రీలందరూ సమష్టి బాధ్యతగా భావించటం ముదావహం. సుఖ ప్రసవం జరిగితే ఒక పెద్ద ఆపద గడిచినట్లే. ఒక్కొక్క పురుడు స్త్రీకి ఒక్కొక్క తను త్యాగం. ఇట్టి త్యాగాన్ని భరించగలిగే శక్తి సామర్థ్యాలు స్త్రీకి ప్రకృతి వరప్రసాదాలు.

ప్రసవం జరిగిన తరువాత ఆ విషయం పదిమందికీ చాటటం కూడా తమ బాధ్యతగా భావిస్తారు గ్రామ స్త్రీలు.

"పురుడని చాటండి తుమ్మెదాలో
ఇంటికీ కడివెడు తుమ్మెదాలో
నీళ్లని చాటండి తుమ్మెదాలో
గడపకి కావెడు తుమ్మెదాలో
పసుపని చాటండి తుమ్మెదాలో"[500]

అని ఆ వీధిలోని వారికే గాక ఊరూరా చాటాలని హెచరిస్తారు. ఉల్లితోటలుదాటి, కాకులు దూరని కారడవిదాటి, పెద్దడవి దాటి, గుబురుగా పెరిగిన గురివెందలు దాటి సమీపంలోని పట్నం వరకు చాటింపు వేయాలని చానలు ఎలుగెత్తి చెబుతారు. దీనివల్ల బంధుకోటి కందరికీ శుభవార్త తెలుస్తుందని వారి అభిప్రాయం. ఉత్తరాలు లేని ఆకాలంలో పరిసర ప్రాంతాలకు పనిమీద వెళుతున్న వ్యక్తుల ద్వారా ఇటువంటి వార్తలు వ్యాపింపచేసేవారు.

బాలింతకు నాలుగవ రోజు ఉడకుకాయం[501] పెడతారు. అదే విధంగా పురిటాలు ఏమి కోరుకుంటుందో కూడా పాటల రూపంలో వివరించబడింది

---

499 మిన్నేరు, పుట – 68.

500 త్రివేణి, పుట -75.

501 నేల ఉసిరిక, ఉసిరిక, లేత అరటి కాయ, తుత్తురు బెండ, నేలతాడి, బోళసరం, మంచి గంధం, అతిమధురం, మాను పసుపు, నేలతంగేడు, నాగభస్మం, అత్తరు, పల్లేరు కాయల పప్పు – వీటన్నింటినీ కలిపి చూర్ణం చెయ్యాలి. దీనినే లేహ్యంగా తయారు చేయ్యాలనుకంటే బెల్లం పాకం పట్టి అందులో ఈ చూర్ణాన్ని వేసి కొంచెం గట్టి పడేలా చేసి వాడుకోవాలి. దీనిని రోజుకు రెండుసార్లు ఉసిరిక గింజ పరిమాణంలో తీసుకోవాలి. వేడివల్ల కలిగే బాధల్ని తగ్గించటమే గాక శరీరానికి కావలసిన పటుత్వాన్ని ఇస్తుంది.

కుక్కిమంచం, దాని క్రింద వెచ్చగా ఉండటానికి గూనె కుంపటి, ఎర్రని తాంబూలం, కాటుక, పిప్పలిఖాయం.[502] ఉల్లికారం, సొంఠి కోరుతుందట. చక్కని చలువలు కట్టగోరుతుందట. ఇటువంటి విశేషాలన్నీ గేయరూపం వహించాయి.[503]

అంతేకాదు పురిటిబిడ్డలను ఎంత జాగ్రత్తగా కాపాడుకోవాలో, ఎటువంటి సంప్రదాయాలు పాటించాలో కూడా గేయాలలో చక్కగా వివరించబడింది. తెలుగునాట ఇవన్నీ ప్రచారంలో ఉండటం వల్ల వాటిని విని, చూచి పాల్కురికి సోమనాథుడు తన బసవ పురాణంలో వివరించాడు. శివభక్తురాలైన బెజ్జమహాదేవి శివుడికి తల్లి లేదని తెలిసి తానే తల్లిగామారి చేసిన ఉపచారాలు, రోగం వస్తే వాడిన మందు మ్రాకులు తెలుగు తల్లులు పాటించేవే. నేటికీ పిల్లల పెంపకంలో వీటన్నింటినీ పాటిస్తున్నారంటే అనుస్యూతంగా వస్తున్న సంప్రదాయమే అందుకు కారణం.

**ఎన్నెమ్మ:** "పురుటి నాల్గవ రోజు ఉదయం తల్లికి ఉడుకుకాయం పెడతారు. ఆ సాయంకాలం గుమ్మంవద్ద కాపలాగా ద్వారానికి రెండువైపులా పేడ బొమ్మల్ని పెట్టి, భూ తులసి, హనుమంత జీర, పాత చెప్పు ముంగిట కట్టి సంధ్యా కాలములందు ఎడతెరిపిలేకుండా ఎవరికి తీరుబడిగా వుంటే వారు పురిటి గుమ్మం వద్దకూర్చొని 'ఎన్నెమ్మ' పాట పాడుతూ వుంటారు."[504]

ఎన్నెమ్మ అనే శబ్దానికి అర్థాలు –

1. పురిటి పురుగు.[505]
2. (అ) పురిటిలో పిల్లలను పీడించెడి భూత విశేషము.

---

[502] దీనినే చూచిక అని కూడా అంటారు. శొంఠి, పిప్పలి మూలం, పిప్పళ్లు, ఇంగువ తీగ, పెన్నేరు గడ్డ, లవంగాలు, చిన్నఉల్లి, కస్తూరి- వీటన్నింటినీ కలిపి చూర్ణం చెయ్యాలి. లేహ్యంగా కావాలంటే బెల్లం పాకంలో వెయ్యాలి. రోజూ రెండు సార్లు ఉసిరిక గింజ పరిమాణంలో తీసుకోవాలి. బాలెంతవాతం, బాలెంత రోగాలు రాకుండా నివారిస్తుంది

డా. శ్రీమన్నారాయణ గారితో ముఖాముఖి చర్చల ద్వారా సేకరణ.

[503] జానపద గేయాలు, ప్ర.సం., పుట – 72.

[504] మిన్నేరు, పుట- 68.

[505] శ.ర.

(ఆ) ఎన్నెమ్మ పురుగు.

(ఇ) ఎన్నెమ్మ పురుగు – పురుగు రూపముగా వచ్చిన యెన్నెమ్మ.

ఒకానొక పురుగు.[506]

పురిటి బిడ్డకు ఎన్నెమ్మ వల్ల ఎటువంటి ఆపదారాకుండా ఎన్నెమ్మను వేడుకొంటారు. ఎన్నెమ్మను రమ్మని ఆహ్వానిస్తారు. పొమ్మని వీడ్కొలుపుతారు. చీరెలు పెడతామంటారు, పూజిస్తామంటారు. మొదటి రోజు ఒప్పుగా ఉన్న ఎన్నెమ్మ రెండవ నాడు లోగిలిలో ప్రవేశించింది. మూడవనాడు మూల్గసాగింది. నాల్గవ నాడు నవ్వసాగింది. అయివదవ నాడు అంగిలిలో ఉంది. ఆరవనాడు అరవసాగింది. ఏడవ నాడు ఏడ్వసాగింది. ఎనిమిదవనాడు ఏరుదాటి పోయింది. తొమ్మిదవనాడు తోరణాలు కట్టారు. పదవనాడు పరుగెత్తుకుపోయింది. పదకొండవనాడు బారసాల జరిగింది. ఈ విషయమంతా పాటలో వివరింపబడింది.[507] ఇంతకూ ఎవరీ ఎన్నెమ్మ అనే ప్రశ్నకు సమాధానంగా చివరి చరణంలో 'బ్రాహ్మడి కూతురు, మాలవాడి పెళ్లాం' అని మాత్రం పేర్కనబడింది.

**ఎన్నెమ్మ కథ**[508] : ఒకానొక బ్రాహ్మణుడి కూతురు స్నానానికి ముందు ఒంటికి పెట్టుకొన్న నలుగును పెరట్లో ఒక మూలన పోస్తే అందులో నుండి ఒక మొలక మొలిచింది. కూతురికి వివాహ వయస్సు వచ్చిన తర్వాత బ్రాహ్మణుడు ఇదేం మొలకో చెప్పిన వారికి తన కూతురునిచ్చి పెళ్లిచేస్తానంటాడు. ఆ మాట విన్న ఆ ఇంటి మాలపాలేరు బ్రాహ్మణ రూపంలో వచ్చి అది 'నలుగు మొలక' అని చెపుతాడు. బ్రాహ్మణుడు అన్న మాట ప్రకారం తన కూతురిని అతనికిచ్చి పెళ్లి చేస్తాడు. కొన్నాళ్లకామెకు అతడు మాలవాడుఅని తెలుస్తుంది. అప్పుడు కూతురు తండ్రిని 'కుక్కముట్టిన కుండని ఏం చెయ్యాలి?' అని ప్రశ్నిస్తుంది. అప్పుడు తండ్రి 'అగ్నిహోత్రంతో పవిత్రం చెయ్యాలి' అని సమాధానం చెప్తాడు. ఆ సూచన గ్రహించిన కూతురు తాను, భర్త నివసిస్తున్న గుడిసెకు నిప్పు పెడుతుంది. ఆ దంపతులు

---

506 సూ.ని.

507 మిన్నేరు, పుట -69.

508 శ్రీమతి విష్ణుభొట్ల లక్ష్మమ్మ గారిచే ముఖాముఖి చర్చల ద్వారా సేకరణ.

అగ్నిహోత్రుడికి బలి అవుతారు. అప్పటి నుండి ఆహుతియైన ఆ బ్రాహ్మణ పడతి 'ఎన్నెమ్మ' అనే భూత రూపంలో పురుటి గదుల్లో ప్రవేశించి బిడ్డల్ని అపహరించుకు పోతుందనే భీతి ప్రజలలో నాటుకుపోయింది. అందుకే పురిటి నాల్గవ రోజు నుండి పదవ రోజు వరకు కాపలా కాస్తారు. ఈ ఎన్నెమ్మ పేడపురుగు రూపంలో కూడ వస్తుందని జాగ్రత్త వహిస్తారు. తీరని కోర్కెలతో అగ్నికి ఆహుతియైన బ్రాహ్మణ పుత్రిక బ్రతుకు అన్యాయం కావటం వల్ల ఈ విధంగా కనితీర్చుకొంటున్నదని అందరూ నమ్ముతారు. తీరని కోర్కెలతో మరణించిన వారు భూతరూపంలో కసితీర్చు కొంటారని హిందువుల నమ్మకం. దీని ఔచిత్యం ఎలా ఉన్నా ప్రకృతిలో విజృంభించే దుష్ట శక్తులకు ప్రతినిధిగా ఎన్నెమ్మను భావించవచ్చు. ఈ విధంగా పురుటి బిడ్డను రక్షించుకోవటానికి స్త్రీలు ఎన్నో జాగత్రలు వహిస్తారని గ్రహించవచ్చు.

**లాలిపాటలు** : స్త్రీకి ప్రసవ వేదన ఎంత కష్టమైందో పుట్టిన బిడ్డను పెంచటం అంతకు తక్కువ కష్టమేమీ కాదు. బిడ్డకు పాలిచ్చి కమ్మగా నిద్రపుచ్చటానికి తనకున్న గాత్ర మాధుర్యంతో పాటలు పాడుతుంది. లాలి[509] కట్టి అందులో పట్టిని పరుండబెట్టి పాడే పాటలు కాబట్టి వీటిని లాలి పాటలు అంటారు.[510] 'జో' కొడుతూ పాడే పాటలు కాబట్టి జోలపాటలనీ వ్యవహారం.

లాలి పాటలకూ, జోల పాటలకూ సూక్ష్మమైన భేదాన్ని గుర్తించవచ్చు. లాలిపాటలు బిడ్డల్ని వినోదపరచటానికి కాని, వేడుకకోసం కాని పాడతారని, జోలపాటలు కేవలం జోకొట్టి నిద్రపుచ్చటానికేనని ఊహించబడుతున్నది.

ఈ లాలి, జోల పాటలు అతి ప్రాచీన కాలం నుండి ప్రచారంలో ఉన్నవే. ఇవి శిష్టసాహిత్యంలోనూ అక్కడక్కడా సందర్భోచితంగా చోటుచేసుకున్నాయి. అప్పకవీ యంలోను, గణపవరపు ప్రబంధరాజు వేంకటేశ్వర విజయవిలాసంలోను ఈ

[509] లాలి=ఉయ్యెల, శ.ర.

[510] పిల్లలను లాలించుటకు పాడు పాటలని రామరాజుగారు భావించారు, జా.గే.సా.పుట -444. కాని నిఘంటువులు లాలి అంటే ఉయ్యెల అని అర్థమిస్తున్నాయి. లాలించుట అనేది సంస్కృత సమక్రియ. లాలి దేశ్యము.

లాలిపాటల లక్షణాలు పేర్కొనబడినట్లు శ్రీమతి శిష్టా లక్ష్మీనరసమ్మగారు తమ వ్యాసంలో వివరించారు.[511]

జోజో ! కమల దళేక్షణ! జోజో! మృగరాజ మధ్య! జోజో! కృష్ణా!
జోజో! పల్లవకరపద్మ! జోజో! పూర్ణేందు వదన! జోజో!"[512]

లోకాలన్నీ నిద్రపోతుంటే తాను నిద్రపోకుండా ఉండే ఆ శుభగుడ్ని రమణులు లాలిపాడి నిద్రపుచ్చినట్లు పోతనగారు భాగవతంలో వర్ణించిన పద్యం లోకప్రసిద్ధం.

రాజశేఖర చరిత్రాదుల్లోను సమాసభాయిష్టంగా జోలపాటలు పాడిన ఘట్టాలు వర్ణింపబడ్డాయి.

ఈ విధమైన లాలిపాటలు అన్ని భాషల్లోను ఉంటాయి. ఆంగ్లంలో వీటిని 'లల్లబీలు' అంటారు. హిందీలో 'లోరియా' లంటారు[513].

**ఉయ్యాల**[514]: బిడ్డను సుఖంగా నిద్రపుచ్చే ఉపకరణమే ఉయ్యాల. దీన్ని ఎంతగా లాగి ఊపితే అంతగా గాలి వీస్తుంది. ఆగాలి సోకితే పాప పరవశించి నిద్రిస్తుంది. ప్రయోజనాత్మకమైన ఇటువంటి ఉపకరణాన్ని అభివర్ణించకుండా ఉండలేదు జానపద స్త్రీ.

"చక్కని పాపడి ఉయ్యాల
నిలుపుంచు ఉయ్యాల
నిద్రపుచ్చు ఉయ్యాల
అంగటనున్న ఉయ్యాల"[515]

---

[511] నవభారతి, 1980, ఆగష్టు, పుట – 48.
[512] దశమ స్కంధము, 190.
[513] నవభారతి, 1980, ఆగష్టు, పుట – 49.
[514] ఊచెడి ఎల కనుక ఉయ్యెల అయిందని అప్పకవి ఈ పదాన్ని విభజించి నిరూపించారు. అప్పకవీయం, 2-135. కానీ 'ఊఇచ్చల్' అనే ద్రావిడ పదమే తెలుగులో 'ఊయల' అయింది.
[515] సెలయేరు, పుట – 86.

అని పేర్కొంటూ అది తన బిడ్డకు అంగరక్షణ కలిగించేదిగా భావిస్తుంది. జోలతో లాగి ఊచబడేది ఉయ్యాల. సాగిపట్టి ఒదిలిపెడితే ఊగేది ఉయ్యాల. ఈ ఉయ్యాలను ఎవరి ఆర్థిక స్తోమతకు తగినట్లు వారు చేయించుకొంటారు. చక్కగా చెక్కతో గిలకలు పెట్టి బిడ్డ కనీసం ఒక సంవత్సరం పాటు పడుకొనేటట్లుగా విశాలంగా చేయిస్తారు. మధ్యలో పడుకొనే భాగంలో నవ్వారుతో గాని, నులకతో గాని అల్లుతారు. దానిపై చిన్న పరుపు వేసి, దానిపై మెత్తటి వస్త్రాలను పరిచి బిడ్డను పడుకోబెట్టి సుఖనిద్ర కలిగేలా చేస్తారు. ఉయ్యాలపై భాగంలో ఉన్న రింగులకు తాళ్లను గాని, ఇనుపలేక ఇత్తడి గొలుసులను గాని ఉపయోగించి దూలానికి వేలాడ దీస్తారు. ఇటువంటి ఉయ్యాలలను ఆర్థికంగా స్థితిమంతులైన వాళ్లు చేయించు కొంటారు. ఈ ఉయ్యాలలను తరతరాలుగా ఉపయోగిస్తుంటారు. కొత్త ఉయ్యాలను చేయించటం కన్నా, కొనటం కన్నా కలిసొచ్చిన పాత ఉయ్యాలలనే ఉపయోగిం చటానికి ఇష్టపడతారు. ఒక్కొక్క ఇంటి ఉయ్యాల వంశాభివృద్ధిని కలిగిస్తుందని నమ్ముతారు. ఏ ఇంట్లో బిడ్డలు అనారోగ్యాలు, కష్టాలు లేకుండా పెరిగి పెద్దవారయ్యారో అటువంటి ఇంటి ఉయ్యాలను ఎరవు అడిగి మరీ తమ బిడ్డలకు ఉపయోగిస్తుంటారు. ఇచ్చే వారు కూడా మనస్ఫూర్తిగా మరో ఇంటి బిడ్డ కూడ చక్కగా పెరిగి పెద్దవ్వాలని వాటిని ఇస్తుంటారు. ఆర్థిక స్తోమత లేని వాళ్లు దూలానికో లేక ఏ చెట్టు కొమ్మకో గుడ్డ కట్టి ఉయ్యాలను ఏర్పాటు చేస్తారు. ఉయ్యాల ఏదైనా బిడ్డ సుఖంగా నిద్రపోవటమే ముఖ్యం.

ఉయ్యాలను ఊపుతూ తల్లి ఏదో ఒక పాట పాడాలి. ఆ పాటలో ఇతివృత్తం ఉయ్యాల మీద కావచ్చు. బిడ్డ చక్కదనం మీద కావచ్చు లేదా దైవపరం కావచ్చు. అప్పటికప్పుడు ఏదితోస్తే దాన్ని లయాత్మకంగా పాటపాడే ఉవిద ఊహాశక్తికి ఆశ్చర్యం కలగక మానదు.

ఈ గేయాలను క్రింది విధంగా విభజించవచ్చు.




**బాలురకు సంబంధించినవి:**

**లౌకికార్థపరమైనవి** : కొన్నిపాటలు అర్థవంతమైనవి. అందులో హృదయగతమైన ఆశలు, ఆశయాలు, ఆకాంక్షలు నిండి ఉంటాయి. అభంశుభం తెలియని పిల్లలకు ఏవేవో ఆశలు పెట్టి నిద్రపుచ్చటానికి ప్రయత్నిస్తుంటారు అమాయకులైన తల్లులు. తమ పాటల్లో వారు వెలిబుచ్చిన భావాలు పిల్లలకు అర్థమౌతాయా? కావని వారికి తెలియదా? అయితే ఈ పాటలనెందుకు పాడుతున్నట్లు? ఇదంతా ఒక విశ్వాసాత్మకమైన జగత్తు (make believe world) తన పాటలోని భావాలు బిడ్డ ఆలకిస్తున్నట్లే భావించి ఆనందిస్తుంది తల్లి. ఆ అమాయక శిశువులు గ్రహించటం అసంభవమే గాని లోకం మాత్రం ఆ మాతృహృదయ స్పందనకు కందళిస్తుంది.

బిడ్డను ఉయ్యాలలో పడుకోబెట్టి ఊపుతూ అతడి రూపురేఖలను వర్ణించే పాట తల్లికి బిడ్డపై గల మమకారాన్ని తెలియజేస్తుంది. ప్రతి తల్లికీ తన బిడ్డ అందాల మూర్తే. కాకిపిల్ల కాకికి ముద్దుగదా! పాపాయి కన్నులు కలువరేకులని, జులపాలు పట్టుకుచ్చులని, దంతాలు మంచిముత్యాలని, చేతులు పొట్ల కాయలని, పిక్కలు మొక్కజొన్న పొత్తులని, చెక్కులు పసివెన్నముద్దలనీ, వన్నెలు పసినిమ్మ పండ్లనీ[516]

[516] "పసినిమ్మ పండ్ల చాయలు
కొసరెడియా కుసుమగంధి కోమలపు టొడల్
కసుగందిన కవటాకన వసివాడి నిదాఘతాప పరిపీడనసేన్" అని రాయప్రోలు వారు తమ తృణకంకణంలో కావించిన ప్రయోగం అపూర్వమైనదిగా భావిస్తారు. కానీ ఈ వర్ణన ఎంతో ప్రాచీన కాలంలోనే జానపద సాహిత్యంలో ఉండటం మరెంత అపురూపమోగదా!

పలుకులు పంచదార చిలకలనీ, చిన్నెలు బాలకృష్ణ వన్నెలనీ వర్ణిస్తుంది[517]. ఎంత చక్కటి ఉపమా సామగ్రి. ప్రతినిత్యం తన కళ్లముందు కనిపించే వస్తువుల్నే ఉపమానాలుగా చేసుకొని అలవోకగా సాగిన పాట సహృదయ రంజకం.

జోలలు పాడితే జొన్నలు సండుతాయట. కానీ జోలలకే జొన్న బువ్వ పెడతాను నీకు మాత్రం వరి బువ్వ పెడతాను అంటుంది.[518] తన బిడ్డ గట్టిగా ఉండే జొన్నకూడు తినలేడని అది పరులకు పెట్టి వరి బువ్వ తన బిడ్డకు పెడతాననటంలో ఆ తల్లి ఆర్ద్ర హృదయం వ్యక్తమవుతుంది.

పక్కింటి పిల్లవాడు ఎంతకూ నిద్రపోవటం లేదనీ, ఆ ఏడ్చే అబ్బాయికి ఎర్రావు పాలేనని, నిద్రపోతే తనకు మాత్రం నల్లావు పాలు[519] పోస్తానని ఆశ చూపుతుంది తల్లి.

ఒకవేళ బిడ్డ నిద్రపోకపోతే బూచివాడొస్తున్నాడనీ, అతడికి బువ్వ పెట్టనసీ, పెడితే నిన్నెత్తుకుపోతాడనీ భయపెడుతుంది.[520]

దేవతా సంబోధన నామ మాత్రంగా ఉన్నా కొన్ని పాటలు విశేషంగా లౌకికార్థపరమైనవి.

---

517 సెలయేరు, పుట- 22.

518 సాంప్రదాయిక విజ్ఞానం, పుట – 9.

519 దీనిని బట్టి జానపదుల ఆలోచనల్లో నల్లావుపాలు శ్రేష్ఠమని తెలుస్తుంది. కాని కపిల (ఎర్రని) గోవును ఉత్తమంగా పెద్దలు పేర్కొంటుంటారు.
"అమల సువర్ణ శృంగ ఖురమై కపిలంబగు గోశతంబును
త్తమ బహు పేద విప్రులకు దానము సేసిన తత్ఫలంబు" అని నన్నయ గారి భారతావతారిక.
కపిల అంటే పుల్లావని అర్థం. ఇందులో నల్లావు అని కాకుండా పుల్లావు అని ఉంటే ఈ విభేదం వచ్చేది కాదు. కపిల గోవుపాలే పవిత్రమైనవిగా అప్పకవీయంలోని ఈ క్రింది పద్యం వివరిస్తుంది.
"వివరించె యజుర్వేదము
కవియగు విప్రుండు శుచి జగంబులసే త
త్పవిమల కావ్యము మిక్కిలి
పవిత్రమగు గపిలగోవు పాల తెఱగునన్" 1-25

520 సరాగాలు, పుట – 180.

"హాయీ హాయీ ఆపదలు కాయి
చిన్న వాళ్లను గాయీ శ్రీవేంకటేశ"[521]

తన బిడ్డ రోజురోజుకూ ఎట్లా ఎదిగి ఆటపాటలతో వర్థిల్లాలో ఈ క్రింది లాలిపాటలో వర్ణిస్తూ తన ఆకాంక్షను వ్యక్తం చేస్తుంది తల్లి.

"ఆడితే పాడితే అవ్వలకు ముద్దు
చప్పట్లు తట్టితే తాతలకు ముద్దు."[522]

'బాలయ్య' (చంటిబిడ్డ) ను ఉయ్యాలలో పడుకోబెట్టి లోకాభిరామాయణం సుదీర్ఘమైన పాటగా ఆలపిస్తుంది జానపద స్త్రీ. ఆ పాటలో వారి మనోగతమైన వాంఛలన్నీ అనేక విధాలుగా వ్యక్తమవుతాయి. సత్యం మామ మాణిక్యాల కంటె తెచ్చాడని, సీతమ్మ అత్త అద్దాల అంగీ తెచ్చిందని, పెదమామ పులిదండ తెచ్చాడని, చినమామ చిలకల తొట్టె తెచ్చాడని ఏవేవో ఊసులు చెపుతుంది ఉయ్యాలలోని బిడ్డకు. తరుణయ్య మామను మందలోకి పోయి ఆవుపాలు తెమ్మంటుంది. తన చేతి గాజు అమ్మి గంటల బండి కొనిస్తానంటుంది. వెండి పుస్తకం కొనిస్తాను వేదాలు చదవమంటుంది. పైడి పుస్తకం తెస్తాను భారతం చదవమంటుంది. కాళ్లకు గజ్జెలు, కడియాలు పెట్టుకొని, వేళ్లకు మద్దుటుంగరాలు అమర్చుకొని శ్రీరంగంపోయే వైష్ణవులతో తన కొడుకును కూడా పంపుతాననీ వాళ్లు తన బిడ్డకు గాలిగోపురం చూపాలని ఇలా ఏవేవో పగటి కలలు కంటూ పాటలు పాడుతుంది.[523] ఆమె ఆకాంక్షలకు అంతులేదు.

వెన్న కోసం బాలయ్య ఏడుస్తున్నాడని ఊహించి మీ అమ్మ తాత వెల్లావు పంపుతాడు ఊరుకో అని ఓదారుస్తుంది.[524]

[521] సరాగాలు, పుట – 180.
[522] పైదే.
[523] మున్నీరు, పుటలు- 301-303.
[524] పైదే, పుట – 304.

ఇటువంటి ఊహలు తెలిపే పాటల్లో క్రమం గోచరించదు. అప్పటికప్పుడు ఊహా జగత్తు నుండి మారిపోతూ సమయోచితంగా పదాలు అల్లుకుంటూ పాడే ఈ పాటల్లో విశేషార్థస్ఫూర్తి లేకపోయినా వినడానాకి వినోదంగా ఉంటాయి.

తన బిడ్డ కన్నులు బీరపువ్వులని, కలువరేకులని అభివర్ణించుకొంటుంది తల్లి. కలువ రేకుల వంటి బిడ్డ కళ్లకు కాటుక పెడితే ఆ కళ్లు ఎంతో అందగిస్తాయి. స్నానం చేయించి కళ్లకు కాటుక పెట్టి నిద్రపుచ్చిన పిల్లవాడు ఏడుస్తుంటే దొర్లే కన్నీళ్లు తల్లిపాలిట నీలాలు. తన బిడ్డను భద్రకన్యకలొచ్చి నిద్రపుచ్చుతున్నారని, కాకమ్మలూ పిచ్చుకమ్మలూ వచ్చి కథలు చెప్తున్నాయని మురుసు కొంటుంది. అంతేకాదు అబ్బాయి మామలు వీరులు, శూరులు, విక్రమార్కులూనని పొగుడుకుంటుంది. చెవికి బారెడేసి కమలాలవారని, అడ్డపాగల వారని, వేట గుఱ్ఱాలెక్కి వేటాడగల నేర్పరులని, తన బిడ్డకూడా అంతటివాడు కావాలని ఎంతగానో హృదయ ముప్పొంగేటట్లుగా జోలపాటలను పాడుతుంది. కేవలం మామల్నే కాదు తండ్రిని, పినతండ్రిని కూడా రాజ్యాలేలే రామలక్ష్మణులతో పోల్చి తన బిడ్డకూడా అంతగా ఎదగాలని కోరుకుంటుంది.[525] పుట్టినింటికి, మెట్టినింటికి ప్రాతినిధ్యం వహించే వనితలు రెండిళ్లకూ తుల్యప్రాధాన్యాన్నిస్తారు.

ఆయుర్దాయం తన బిడ్డకే కాకుండా "నీతోటి బాలురకు నిండు వెయ్యేళ్లు"[526] అని పాడటంలో తల్లి అంటే తన బిడ్డకు మాత్రమే తల్లికాదని సకల శిశు సమూహానికి తల్లి అనే విశ్వజనీనభావం గోచరిస్తుంది.

**కేవల శబ్ద పరమైనవి** : లయాత్మకమైన విన్యాసంతో మాటకు సరిపోయిన మాట పేర్చుకుంటూ ఛందోభరితంగా పాడే పాటలివి. ఇవి కేవలం శబ్ద ప్రధానమైనవి. వీటిని ఆంగ్లంలో nonsense rhymes అంటారు. ఈ పాటలలో కూర్చే పదాలు ఎక్కువ భాగం ఆది, అంత్య ప్రాసలతో కూడి వినసొంపుగా ఉంటాయి. ఈ శబ్దవిన్యాసానికి పరవశించి శిశువులు త్వరగా నిద్రపోతారు.

---

[525] మిన్నేరు, పుటలు 77-78.

[526] సరాగాలు, పుట- 181.

"లాలమ్మ గుర్రాలు లంకల్లో మేసే
అప్పన్న గుర్రాలు అడవుల్లో మేసే
ఉగ్గెట్టు మీయమ్మ ఊరుకెళ్లింది
పాలిచ్చు మీయమ్మ పట్టా మెళ్లింది
నీలోసె మీయమ్మ నీళ్లకెళ్లింది."[527]

యతిమైత్రితో కూడిన ఈ పాట ఆలోచించటానికి తగిన అర్థం లేనిదై కేవలం శబ్ద పరంగానే గోచరిస్తుంది. ఉయ్యాల ఊపులకు ఈ పదాల ఊపులు తోడై మృదు పవన స్పర్శతో పాటు మృదు శ్రవణ స్పర్శ శిశువులకు ఎంతో హాయిని కలిగిస్తుంది.

ఏవేవో శబ్దాల్ని ఊతగా చేసుకొని జోలపాటలల్లటంలో సిద్ధహస్తులు స్త్రీలు.

"ఓయల్ల పండెరుపు వంగ పండెరుపూ
తాయెరుపు నాయిన్న తన వారిలోనూ
ఓయల్ల ఓయల్ల వంకాయ పుల్ల
నల్లావుల చల్ల నీయత్త కనుమెల్ల."[528]

నల్లావుల చల్లకు మేనత్త కంటి మెల్లకు ఏమాత్రం సంబంధం లేకపోయినా ఆ విధంగా వర్ణించటంలో ఆమె సరసమైన జాణతనం ప్రకటితమవుతుంది.

బిడ్డను నిద్రపుచ్చి తల్లి ఊళ్లోకి వెళుతుంది. ఇంతలో బిడ్డ నిద్రలేచి ఏడుస్తుంటే ప్రక్కింటావిడవచ్చి జోలపాడి బిడ్డను నిద్రపుచ్చటానికి ప్రయత్నిస్తుంది.

"ఊడుగూ చెట్టుకు ఉయ్యాల గట్టి
ఊగమని మీయమ్మ ఊళ్లోకి పోయె
పంది కొక్కా రావె పాలిచ్చి పోవె
ఉడుతమ్మా నువురావె ఊకుండి పోవె
ఎలుకమ్మా నువు రావె ఎత్తుకొని పోవె."[529]

---

527 జానపద గేయాలు, ప్ర.సం.,పుట – 44.
528 తెల్లంగాణ పల్లెపాటలు, పుట -1
529 పైదే, పుట-9.

శబ్దంకోసం వెతుక్కోకుండా పాదపూరణం చేసే ఆమె అల్లికలోని పటుత్వం వినడానికి ఆహ్లాదంగా ఉంటుంది.

**దేవతాపరమైనవి** : ధర్మానికి గ్లాని కలిగినప్పుడు, అధర్మం పెచ్చుపెరిగినప్పుడు తనకు తానై పరమాత్మ భూమిమీద పుడతానని, సాధువుల్ని రక్షిస్తానని, దుర్మార్గుల్ని శిక్షిస్తానని, ధర్మసంస్థాపనగావిస్తానని శ్రీమద్భగవద్గీతలో పేర్కొన్నాడు.[530]

తదనుగుణంగా హైందవ పురాణాలు దశావతారాల గురించి వివరించాయి. ఈ దశావతారాలలో సృష్టి పరిణామ క్రమం గోచరిస్తుంది. ఇందులో మొదటిది మత్స్యావతారం. ప్రపంచమంతా జలమయమైనప్పుడు భగవంతుడు చేప రూపంలో అవతరించాడు. ఆ తరువాత జలచర భూచర స్వభావం గల కూర్మావతార మెత్తాడు. ఆ మీద కేవలం భూచరమే అయిన వరహరూపాన్ని వహించి భూమిని సముద్ధరించాడు. ఆ పిమ్మట సగం జంతువు, సగం నరుడు అయిన నరసింహావ తారమెత్తాడు. తదనంతరం పూర్తిగా ఎదగని వామనావతారమెత్తాడు. ఆ మీదట పరాక్రమోపేతుడైన పరశురామావతారమెత్తాడు. ఆపై మోహన రూపుడు, ధర్మ స్వరూపుడు అయిన పరిపూర్ణ మానవావతారం రామావతారం ధరించాడు. ఆ తరువాతది అతిమానుషమైన కృష్ణావతారం.

డార్విన్ చెప్పిన జీవ పరిణామ సిద్ధాంతం ప్రకారం ఏక కణ జీవి నుండి పరిపూర్ణ మానవుడుగా పరిణామం చెందే వరకు జరిగిన పరిణామ క్రమం ఈ దశావతారాలలో కనిపించటం అత్యంత ఆశ్చర్యకరం. ప్రపంచం కళ్లు తెరవకముందే మనపురాణాలలో ఇటువంటి జీవ పరిణామ క్రమం కనిపించటం మన పూర్వీకుల మేధాశక్తికి నిదర్శనం.

పిల్లలు దైవ స్వరూపులంటారు. వారి స్వచ్ఛమైన చిరునవ్వుల్లో, కేరింతల్లో దైవాన్ని చూడవచ్చు. అందుకే హైందవ స్త్రీ తన బిడ్డను ఏ రాముడిగానో,

---

530 “పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే” – శ్రీమద్భగవద్గీత, జ్ఞానయోగము, 4-8.

కృష్ణుడిగానో, విష్ణుమూర్తిగానో, వేంకటేశ్వరుడిగానో లాలించి, ప్రేమించి నిద్రపుచ్చుతుంది. ఇటువంటి లాలిపాటలను సంబోధననుసరించి విభజించవచ్చు.

**రామ సంబంధి** : రామాయణ గాథపట్ల, రాముని పట్ల జానపద స్త్రీలకు గల అభిమానం వారి లాలిపాటల్లోనూ గోచరిస్తుంది. మాతృప్రేమ అగాథమైంది. ఆ ప్రేమ ప్రతిపాటలో పల్లవిస్తుంది. తన బిడ్డను రాముడిగా భావించి అతడెంతకూ నిద్రపోవటం లేదని, బెదిరిపోయాడని, బెదురుచూపులు చూస్తున్నాడని, ఆటల్లో ఏదో గాలి సోకిందని తల్లడిల్లుతుంది. కలలో పదితలల రావణాసురుడు ఎదురుగా నిలిచినట్లు పలవరిస్తున్నాడనీ, ఖరదూషణాదుల వల్ల తాను దురవస్థలు పడినట్లు పరమ పురుషులతో చెప్పుకొని పరితాపమొందుతున్నాడని ఆ తల్లి కలవర పడుతుంది. భూత వైద్యుడ్ని పిలిపించి రక్షరేఖ కట్టించాలంటుంది. వశిష్టుడ్ని పిలిపించి దిష్టి విభూతి పెట్టించాలంటుంది పచ్చి పసుపు, సున్నం కలిపి వసంతం చేసి ఎఱ్ఱనీళ్లు దిష్టి తీసి పోయాలంటుంది.[531] రాముడ్ని కన్న కౌసల్యకు ఈ బాధలేదు. ఎందుకంటే ఆమెకు రామాయణగాథ తెలియదు. రాముడుగాని రాముడ్ని కన్న రమామణులందరికి రామయణగాథ సువిదితం కావటం వల్ల అసలు రాముడు ధీరోదాత్తుడైనా ఈ తల్లులు భావించే రాముడు మాత్రం సామాన్య మానవుడిలాగా భయభ్రాంతులకు లోనవుతున్నట్లు వర్ణించటం వారి అమాయ కత్వానికి, మాతృప్రేమకు నిదర్శనం. నిరంతరం బిడ్డల క్షేమాన్ని ఆకాంక్షించే తల్లి తాను ఎత్తుకొని కౌగిలించుకుంటే నిద్రపోకపోతే అతని భద్రతకేదో ముప్పు వాటిల్లిందని కంగారు పడుతుంది. పైన చెప్పిన పనులన్నీ అటువంటి సమయంలో ప్రతి తెలుగు తల్లీ తన బిడ్డకు చేసేవే. ప్రతి మాతృహృదయ స్పందనా ఈ రీతిగానే ఉంటుంది.

శ్రీరాముని అభివర్ణించే లాలిపాటలెన్నో ఉన్నాయి. శ్రీరాముని జననగాథ గేయరూపం వహించింది.[532] బాల రఘురాముడు మాధవుడని, గోవిందుడని,

[531] సరాగాలు, పుట – 174.
[532] పైదే, పుటలు -19-22.

అచ్యుతుడని, కేశవుడని, సాక్షాత్తు శ్రీహరియని నిర్దేశించి అతడే అయోధ్యలో దశరథుని పుత్రుడిగా పుట్టాడని కీర్తిస్తూ లాలిపాట ప్రారంభమవుతుంది. పుత్రకామేష్ఠి, పరమాన్నదానం, సీమంతం, పుత్రోద్భవం, వశిష్టుడు నామకరణం చేయటం, బంగారు పతకంతో రాముడ్ని అలంకరిచంటం, తొట్టెలో పడుకోబెట్టటం, శ్రీరాముని సౌందర్యం చూచి అంగనామణులు ఆశ్చర్యపడటం; సత్యస్వరూపుడని, ఆదినారాయణుడని, వీరాధివీరుడని, వేదాంత శూరుడని, భక్త వత్సలుడని, కరుణాకటాక్షుడని, కరిరాజవరదుడని, నీలమేఘశ్యాముడని శ్రీరాముని రూపు రేఖాదుల్ని, గుణగణాల్ని కీర్తించటంతో లాలిపాట ఎంతో హాయిగా సాగిపోతుంది. వటపత్రశయనుడు, వైకుంఠపురవాసుడు అయిన రాముడు కౌసల్య భాగ్యం కొద్దీ పుట్టాడని, శ్రీరామ జననంతో దశరథుని కోర్కెలీడేరాయని, స్త్రీలు రాముడికి దిష్టితీసి హారతులిచ్చారని కూడా పాటలో వర్ణితం. కౌసల్యాదేవి రాముడ్ని తొట్టిలో పడుకోబెట్టి లాలిపాడుతున్నట్లు, అప్పుడు స్త్రీలు పేరంటానికి వచ్చినట్లు, వారికి శనగలు, తాంబూలాదులు సమర్పించినట్లు కూడా గేయంలో పేర్కొనబడింది. బారసాల (బాలసారె) సమయంలో ముత్తయిదువులకు శనగలతో కూడిన తాంబూలాదులిచ్చి సత్కరించటం తెలుగు వారి సంప్రదాయం, జానపదులు ఈ తెలుగువారి సంప్రదాయాన్ని కూడా కౌసల్యకు అంటగట్టటం వారు ఆ కథతో ఎంతగా మమేకమయ్యారో సూచిస్తుంది.

ఈ విధంగా శ్రీరామ జననగాథా సంస్మరణంతో లాలిపాట పాడుకుంటూ హైందవ వనిత తన బిడ్డల్ని నిద్రపుచ్చుతుంది.

ఇంకా జయరాముడైన రాముడ్ని, శృంగార రాముడ్ని, చారు విక్రమ రాముడ్ని వర్ణించే పాటలెన్నో ఉన్నాయి. ఏ స్త్రీ బిడ్డను కన్నా ఇరుగుపొరుగు తల్లులందరికీ అది ఉల్లాన్ని ఉప్పొంగింపచేసే విషయం. ఆ బిడ్డకు నీళ్లు పోసి నిద్రపుచ్చటంలో ఆ తల్లికి సహకరిస్తారు. అదే విధంగా కొందరు స్త్రీలు తామేరీతిగా రాముడికి జలకాలాడించిందీ, మెత్తని పాన్పుపై పడుకోబెట్టి రత్నాల రావిరేకుల మర్చిందీ, కర్పూర ధూపం వేసిందీ వివరిస్తూ తమ సౌభాగ్యానికి మురిసిపోతారు.

అంత సుందరుడ్ని కన్న ఆ సుదతి (కౌసల్య) సౌభాగ్యం అపూర్వమైందంటారు. ఆ ఆజాను బాహువులు, ఆ హస్తాబ్జాలు, ఆ పద్మకులిశరేఖా సంశోభిత పాదాలు, ఆసర్వాంగ సౌందర్యం కన్న తల్లికే కాక ఇరుగు పొరుగు తల్లులకు సందర్శన మాత్రం చేత జన్మలకు సాఫల్యం చేకూర్చేదని భావిస్తారు.[533]

ఒక స్త్రీ ప్రసవించినప్పుడు, బిడ్డను పెంచేటప్పుడు చుట్టు ప్రక్కల స్త్రీలందరూ సహాయపడటం లోక సహజం. ఈ విషయాన్నే రాజసౌధంలోని రాముడికి కూడా అంటగట్టటం జానపదులు రాముడ్ని తమ బిడ్డగా భావించటం వల్లనే.

**లవకుశ సంబంధి** : వాల్మీకి ముని ఆశ్రమంలో సీతామహాసాధ్వి లవకుశులకు పాడిన జోలపాట కరుణ రసాత్మకమైంది. కౌసల్య, యశోదలు రామకృష్ణులకు పాడినట్లు భావించబడే జోల పాట కన్నా సీతాదేవి లవకుశులకు పాడిన లాలిపాట ప్రజాహృదయాల్ని సంచలింపచేస్తుంది. సమస్త బంధుగణానికి, సకల శుభాలకు దూరమై ముని ఆశ్రమంలో పెరుగుతున్న లవకుశులకు సీత నార చీరనే ఉయ్యాలగా కట్టి జాలిగా లాలిపాట పాడి వారిని నిద్రపుచ్చటం చింతా దీక్షితులు గార్ని కూడా చింతాక్రాంతుల్ని చేసింది.

"బంగారు తూగుటుయ్యలలో పవళింపవలసిన చక్రవర్తి కుమాళ్లు నార చీరల ఉయ్యాలల్లో పండుకొని నిద్రపోకుండా అల్లరి చేస్తూ, తల్లిచేత పాటలు పాడించుకొంటున్నారు. ఈ చిన్న పిల్లలకు కట్టుకునేటందుకు మంచి బట్టలు లేవు. నగలు లేవు. అందెలు లేవు. గజ్జెలు లేవు. పులిగోరు లేదు. ఉంగరాలు లేవు." అంటూ దీక్షితులుగారు సీత ఏ విధంగా వాళ్లను ఓదారుస్తూ జోల పాడిందో తమ రచన (ప్రజావాఙ్మయం) ఎత్తుగడలోనే ఈ మెత్తని భావాల్ని హృదయాలకు హత్తుకునేలా చేశారు.[534]

సీత పొన్నమానుకు నార చీరను ఉయ్యాలగాకట్టి బిడ్డల్ని పడుకోబెట్టి ఊపుతుంది.

[533] తెలంగాణ పల్లెపాటలు, పుట – 4.
[534] ప్రజా వాఙ్మయం, పుట – 9.

"ఇటునుండి వూపితే యింద్రుల్ల మోత
అటునుండి వూపితే చంద్రుల్ల మోత."[535]

సీత పెద్ద పెద్ద ఊపులూపుతుంటే ఉయ్యాల ఇంద్రలోకాన్ని చంద్రలోకాన్ని తాకిందని అతిశయోక్తి. ఉయ్యాల ఆలోకాల్ని తాకినా తాకకపోయినా సీతాదేవి మనోడోలిక వాటిని అధిగమిస్తుంది.

అయోధ్యకు దూరం కావటం వల్ల లవకుశుల పుట్టుక తండ్రికి, పినతండ్రులకు, పినతల్లులకు, మేనత్తకు, నాయనమ్మలకు ఎవరికీ తెలియదు. వారెవరూ రారు. తన బిడ్డలు దిక్కులేని వాళ్లు కాదని, గొప్ప బలగముందని, వారందరూ తగిన బహుమానాలతో వస్తారని బిడ్డలకు ఆశలు రేకెత్తిస్తూ

"వచ్చెనేడవకు కొడుక వచ్చెనేడవకు"[536]

అంటూ భంగ్యంతరంగా తనను తానే ఓదార్చుకుంటుంది.

మేనత్త శాంతమ్మ పులిగోరు; తన తల్లి భూదేవి అంగీలు, కుళ్లాయిలు; తాత దశరథుడు దండ కడియాలు, దస్తీలు (ఆయన లేడన్న విషయం జానపదులు మరిచారేమో); కౌసల్య కాళ్ల కడియాలు, గజ్జెలు; కైకేయి, సుమిత్రలు కంకణాలు, కంఠీలు; పినతల్లి ఊర్మిళ ఉగ్గు గిన్నెలు, ఉయ్యాల; మాళవి, శృతకీర్తులు మణిహారాలు; బంటు హనుమంతుడు రావిరేక తీసుకొస్తారని తన పాటల ద్వారా బిడ్డల్ని ఊరడిస్తుంది సీత.[537] ఇవన్నీ సీత కోరికలు కావు. సామాన్యుల ఇంట బిడ్డ పుట్టినప్పుడు పుట్టింటి వారూ, అత్తింటి వారూ తమ స్తోమతును బట్టి కానుకలు తేవటం ఆచారం, ఆ ఆచారాన్నే జానపద స్త్రీ సీతమ్మకు ఆపాదించింది.

ఇటువంటిదే మరొక గేయంలో సీత కౌసల్య వస్తుందని సేకట్లు తెస్తుందని, లక్ష్మన్న వస్తాడని భుజకీర్తులు తెస్తాడని, రాములవారు వస్తారని కిరీటాలు తెస్తారని కొడుకుల్ని ఓదార్చే తీరు హృదయాల్ని కుదిపివేస్తుంది. ఎప్పటికైనా వారు

---

535 మున్నీరు, పుట – 47.
536 పైదే, పుట – 48.
537 ప్రజా వాఙ్మయం, పుట – 9.

రాచబిడ్డలేనని, ఆ రాచబిడ్డల్ని అయోధ్యకు చేర్చటానికే తన తనువును నిలుపుకొన్నానని, బండరాళ్ల చాటున కోనేటి వద్ద తానా బిడ్డల్ని కన్నానని సీత ఆ పాటలో తన ఆవేదనను వెళ్లబోసుకుంటుంది.[538] దానిని బట్టి గర్భవతియైన సీతగాక పుత్రవతియైన సీతే వాల్మీకి ఆశ్రమానికి చేరినట్లు జానపదులు భావించి ఉంటారు.

పినతండ్రి లచ్చుమయ్య ఉండీలు, ఊసలు తెచ్చాడు ఏడవ వద్దని, కన్నతండ్రి రఘురాముడు బంగారు బొంగరాలు తెచ్చాడని సీతాదేవి బిడ్డల్ని ఓదారుస్తూ పాడే జోలపాట[539] ఆ పసిహృదయాలకు బోధపడేది కాదు. మరి ఎందుకుపాడినట్లు? తనను తాను ఉపశమింప చేసుకోవటానికి. అన్నీ ఉండి అనాథయైన సీత జీవితం ఒక విషాదగీతం. ఆ విషాద హృదయంలో పాటమరించిన కోర్కెలే ఈ లాలిపాటల్లో గోచరిస్తాయి.

మరొక విధంగా భారతీయ దార్శనిక దృష్టితో ఆలోచిస్తే పసిపిల్లలకు మన మాటలు, పాటలు తెలయవనుకోవటం పొరపాటు. మన ఋషులు వాక్కును నాలుగు విధాలుగా విభజించారు. అవే పర, పశ్యంతి, మధ్యమ, వైఖరులు. మనం మాట్లాడేది వైఖరీ వాక్కు. అది ఎదుటివారి మధ్యమావాక్కును కదిపి అర్థవంత మవుతుంది. బాలల్లో కూడా ఈ మధ్యమా వాక్కు ఉంటుంది. అందుకే ఈ పాటలు వారి మధ్యమా వాక్కును కదిలించగలవని భావించవచ్చు. పసిపిల్లలు తమ భావాలు వ్యక్తం చేయలేరు. అంటే వారిలో వైఖరీ వాక్కు ప్రవర్ధమానం కాలేదని అర్థం.

ఈ పాటలు పాడుకొంటూ జానపద స్త్రీలు తద్భావనలో తాదాత్మ్యం చెంది తమ వాత్సల్య భావనను ప్రవర్ధమానం చేసుకొంటారు.

**కృష్ణసంబంధి** : రాముడు ధర్మావతారుడు. కృష్ణుడు లీలావతారుడు. బాల్యంలోనే ఎన్నో అతిమానుష కృత్యాలు చేసి అందరినీ ఆశ్చర్యచకితులను చేశాడు కృష్ణుడు. తన అల్లరి పనులతో చిలిపి కృష్ణుడిగా ప్రజల మనసులలో చెరగని ముద్ర వేశాడు.

---

[538] మున్నీరు, పుట -48.
[539] పైదే.

అందుకే బుద్ధిమంతులైన పిల్లల్ని రాముడితోను, అల్లరి పిల్లల్ని కృష్ణుడితోను పోలుస్తుంటారు.

చలువ పాన్పుమీద పడుకోబెట్టినా, ఉయ్యాల ఎంతగా ఊపినా నిద్రపోక మారాం చేసే కృష్ణుడ్ని యశోదా దేవి ఏ విధంగా నిద్రపుచ్చిందో వర్ణిస్తూ స్త్రీలు లాలిపాట పాడుకుంటారు.[540] యశోదాదేవి కృష్ణుడితో నీకొక కథ చెబుతాను ఊ కొడుతూ నిద్రపొమ్మంటుంది. కృష్ణుడికి ఏ కథ చెప్తే బావుంటుంది? అతడికి నచ్చేది ఒకే ఒక కథ. అదే రామ కథ. ఆ కథ చెబుతుండగా రావణాసురుడు సన్యాసి వేషంలో వచ్చి సీతనెత్తుకుపోయే సన్నివేశం రాగానే

"హుంకారమున లేచి శ్రీ కృష్ణుడపుడూ
సౌమిత్రి విల్లు యిమ్మనుచు పలికెనూ."[541]

యశోద ఎంతగానో విస్మయ మందుతుంది. తన పట్టి కలవరిస్తున్నాడని ప్రేమతో ఎత్తుకొని గట్టిగా కౌగిట చేర్చుకొంటుంది. హారతులిచ్చి ముద్దు పెట్టుకొని పాలిస్తుంది.

"ఎందుకుర కృష్ణమ్మ – యేల భ్రమసితివి
ఏమి కలగంటివి – నాముద్దులయ్యా
నాతోను చెప్పరా – చిన్న గోపాలా
సనకాది వందితుడ – శ్యామలాకారా
- - - - - - - - - - - - - - - - - - -
లంకను రావణుడు – జొచ్చెననగానే
ఖండింపలేచితివి – గోపాలబాలా"[542]

అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తుంది. ఆమెకప్పుడు సత్యం సాక్షాత్కరించింది.

"నీవు రాముడవనుచు – యిపుడు తెలిసెనురా"[543]

---

540 మిన్నేరు, పుట – 79.
541 పైదే,పుట – 80.
542 పైదే.
543 పైదే.

అంటుంది. కృష్ణుడ్ని ఆనంద పరచటానికి

"ఎనమండ్రు పదహారువేల పడతులను
పెండ్లాడుదువు లేరా దుర్గ సోదరుడా"[544]

అంటుంది. రామాయణ, భాగవత సన్నివేశాలతో కూడిన ఈ గేయం రామకృష్ణులు అభేదులనే విషయాన్ని స్పష్టం చేస్తుంది. రాముడే కృష్ణుడిగా జన్మించినట్లు జానపదులు ఎంత హృద్యంగా, ఎంత సరళంగా తెలియజేశారు!

ఎప్పుడూ అల్లరి పనులు చేస్తూ ఇల్లిల్లూ తిరిగే బాలకృష్ణుడ్ని 'అరగడియ నిద్రించరా' అని యశోద బ్రతిమాలు తున్నట్లుగా లాలిపాట[545] ఒకటుంది. ఏదో రీతిని బుజ్జగించి ఉయ్యాలలో పడుకోబెట్టినా తలెత్తి చూడటం, తల్లిని తంటాలు పెట్టటం ఆ చిలిపి కృష్ణుడికి మామూలే. ఈ విధంగా తంటాలు పెడుతుంటే బూచివాడ్ని పిలుస్తాను 'కనుమూసి వేగిరం నిద్రపొమ్ము' అని యశోద బెదిరిస్తుంది.

శ్రీకృష్ణుని అష్టమహిషులైన జాంబవతి, కాళింది, లక్షణ, మిత్రవింద, సత్యభామ మొదలైనవారు అతనికి చందనం పూసినట్లు, వింజామరలు విసిరినట్లు, అత్తరు పులిమినట్లు, నిలువుటద్దం పట్టినట్లు, సురటీలు వీచినట్లు, చుట్టూ చేరి తొట్టిని ఊపినట్లు పాడుకొనే పాట చిత్రమనిపిస్తుంది.[546] భర్తను భార్య బాలుడిగా భావించటమేమిటి? ఇదే కృష్ణావతార రహస్యం. బాలకృష్ణుడంటేనే వారికి అత్యంతాభిమానం. అతని లీలలే వారికానందం కలిగిస్తాయి.

శ్రీకృష్ణ జననాన్ని అభివర్ణించే లాలిపాట ప్రచురమైంది. ఈ పాటలో 'కస్తూరి రంగ రంగ నాయన్న కావేటి రంగ రంగ' యని శ్రీకృష్ణుడ్ని శ్రీరంగధాముడిగ భావిస్తారు. వైకుంఠ వాసుడైన శ్రీరంగడు వసుదేవుని కుమారునిగా జన్మించి, దేవకి హస్తద్వయాన్నలంకరించి, యశోద ఒడిలో పెరిగి నందగోపాలుడై, నవనీత చోరునిగ

[544] మిన్నేరు, పుట – 80.
[545] పైదే, పుట – 82.
[546] జానపద గేయాలు, ప్ర.సం. పుట -34.

ద్రేపల్లెలో ప్రసిద్ధిపొందినట్లు వర్ణిస్తూ స్త్రీలు ఈ పాటను పాడుకొంటారు.[547] కృష్ణుడ్ని తొట్టెలో వేసి ఉయ్యాల ఊపుతూ

"లాలి శ్రీకృష్ణయ్య నవనీల మేఘ వర్ణ
బాలగోపాల కృష్ణ పవళింపవయ్య"[548]

అనే పల్లవితో సాగేపాటలో బాలకృష్ణుడ్ని ఇందరిలో నీకే ఇందీవరాక్షి కావాలి? రుక్మిణి కావాలా? కాళింది కావాలా? సత్యభామ కావాలా? అని ప్రశ్నించటం ఆశ్చర్యమనిపిస్తుంది.

సాధారణంగా ఇళ్లలోని వృద్ధులు పసి బాలురను అత్తకూతుర్ని చేసుకుంటావా? మామకూతుర్ని చేసుకుంటావా? ఎవరిని చేసుకుంటావు? అని ప్రశ్నిస్తుంటారు. ఆ పసివాళ్లు ఏం సమాధానం చెపుతారు? పెద్దవాళ్లు ఇటువంటి వివాహ ప్రసక్తి తీసుకువచ్చి తమలో తామే ఆనందిస్తుంటారు. అంతే తప్ప ఇది పిల్లలు సంతోషించే విషయంకాదు. ఈ లోక రీతినే జానపదులు కృష్ణుడికి ఆపాదించారు.

కృష్ణావతారంలోని రాక్షస సంహారాలు లాలిపాటల్లో కనిపించవు. శృంగార సంబంధమైన భావాలు అనగా పట్టమహిషులు, గోప స్త్రీలు –వారు చేసే సేవలు మాత్రమే వర్ణితం. బాలకృష్ణుని లీలలు సంస్మరించే పాటలూ కొన్ని ఉన్నాయి. నందగోపకుమారా, నవనీతచోరా, మంధర గిరిధార, మాధవకృష్ణ అంటూ ఒక పాటలో;[549] నీలమేఘవర్ణ బాలగోపాల, శంఖచక్రధరా, స్వామీ నిద్రపోవయ్య అంటూ వేరొక పాటలో[550] ప్రస్తుతించటం గోచరిస్తుంది.

కొన్ని పాటల్లో అలంకార ప్రాభవం పఠితలను అలరింపచేస్తుంది.

"తొలుత బ్రహ్మాండంబు తొట్టిగా సేసి
నాలుగూ వేదములు గొలుసులమరించి

---

[547] తెలంగాణ పల్లెపాటలు, పుట-20.
[548] పైదే, పుట- 31.
[549] జానపద గేయాలు, ద్వి. సం. పుట 63.
[550] మున్నీరు, పుట - 98.

బలుపైనఫణిరాజు పాన్పులమరించి
చిత్తమనియేటి దూలములు వేసి."[551]

రూపకాలంకారంతో సాగిన ఈ పాటలో ఎంతటి తాత్త్వికత! ఈ పాట జానపద స్త్రీల భావనా శక్తికి, కల్పనా పటిమకు పరాకాష్ఠ అని చెప్పవచ్చు.

**శివ సంబంధి :** "ఆది భిక్షువై బూడిద బూసుకు తిరిగే శివునకు కూడా లాలిపాటలు పాడారు"[552] జానపద స్త్రీలు అంటారు చింతా దీక్షితులు గారు. సర్వజ్ఞుడ్ని గూర్చిన లాలిపాటలో సంబోధనలు ఎంత సరస గంభీరంగా, సంస్కృత పద భూయిష్టంగా సాగాయో ఈ క్రింది గేయాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

"లాలి శంకర సదా లాలిత కుమారా
లాలి పటు తాండవోల్లాస ఘనధీరా
లాలి పంచాస్య కైలాస సంచారా
లాలి మధురాలాప లాలి గంభీరా
పతిత పావన రుద్ర ఫణిరాజభూషా"[553]

అని పాడతారు. ఫాలలోచనుడ్ని 'నమశ్శివాయ' అనే పంచాక్షరాల పాన్పుపై పశళింపజేసి, 'ఓం' ప్రణవ నాదాన్ని బాలీసుగా చేసి, 'చిత్కళలనే' దీపాల్ని వెలిగించి లాలిపాట పాడి నిద్రపుచ్చుతారు శైవమతాభిమానులు. ఆ శివుడే వారికి పరమ సద్గురువు. అతడు చిద్రూపాంగుడు, సజ్జనహృదయుడు.[554] అతడికి లాలిపాట పాడి లలనామణులందరు పులకిత గాత్రులవుతారు.

శివ సంబంధమైన 'ఉయ్యాలో! జంపాలో!' పాటలు కొన్ని సీతారామదాసు, శ్రీరామ లింగయ్య వంటి వారు వ్రాసినవి మిన్నేరు[555] లో ప్రచురితమైనాయి.

---

[551] జానపద గేయాలు, ప్ర.సం. పుట – 34.
[552] ప్రజా వాఙ్మయం, పుట -12.
[553] పైదే.
[554] సరాగాలు, పుట -138.
[555] పుటలు – 35-38.

జానపదులే రచించినా కర్తృత్వంతో కూడి, కృతకత్వం నిండిన ఈ పాటలు ఈ వ్యాస పరిధిలోకి రావు. అందులో జానపద స్త్రీ హృదయం అంతగా ప్రతిబింబించటం లేదు.

**వేంకటేశ సంబంధి** : 'కలౌ వేంకట నాయకః' అనగా కలియుగ దైవం వేంకటేశ్వర స్వామి. కలియుగంలో వేంకటేశ నామస్మరణం ఇహపరదాయకం. వేంకటేశ సంబంధమైన లాలిపాటలు ఒకట్రెండు ప్రచారంలో ఉన్నాయి.

"శ్రీ వేంకటప్పయ్య దిక్కు నీవయ్య
శరణన్న వారిని సేకొనుమయ్య"[556]

అనే పాటలో వేంకటేశ్వరస్వామికి ఇద్దరు భార్యలని, పెద్దామె నాంచారనీ, చిన్నామె చక్కనిది అలువేలు మంగని[557] పేర్కొనబడింది. పాటలో మిగతా విషయమంతా వేంకటేశ్వరునికి సంబంధించింది కాదు.

ఈరీతిగానే

"ఆయీ ఆయీ ఆపదలను కాయీ
చిన్నవాడిని కాయీ శ్రీవేంకటేశ."[558]

అనే పాటలో పల్లవి వేంకటేశ సంబంధి అయినా మిగతా చరణాలు వేరే విషయానికి సంబంధించినవి. ఎందుకో వేంకటేశ సంబంధి పాటలు ఎక్కువగా కనిపించటం లేదు.

**తాత్త్విక సంబంధి** : తత్త్వచింతన భారతీయులకు వెన్నతో పెట్టిన విద్య. పురుషులే గాక స్త్రీలు కూడా ఈ విద్యలో నిష్ణాతులు.తాత్త్వికతను చేకూర్చేదే విద్య అనీ, తక్కిన దంతా అవిద్య అనీ ప్రాచీన భారతీయుల నమ్మకం. తాత్త్విక సంబంధమైన లాలిపాటలు కూడా ఉండటం జానపద వాఙ్మయ వైవిధ్యానికి నిదర్శనం.

తాను ఊపుతున్న ఉయ్యాల తొట్టి బ్రహ్మాండమని, దానికున్న గొలుసులు నాలుగు వేదాలని పాన్పు ఫణిరాజని, అందులో పవళించిన బిడ్డలు మూడు లోకాల

---

[556] సరాగాలు, పుట – 180.
[557] అలర్ మేల్ మంగై = పుష్పం మధ్యలో కూర్చున్నది. అనగా లక్ష్మీదేవి.
[558] జానపద గేయాలు, ద్వి.సం., పుట – 70.

నేలే ముమ్మూర్తులని (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు), ఉయ్యాలకు ఆధారభూతమైన ఉక్కుస్తంభాలు ఉదయాస్తమయాలు (ఉదయాస్తమయ పర్వతాలు – ఉదయగిరి, అస్తగిరి) అనీ, అడ్డంగా వేసిన దూలాలు నిండైన ఆకాశమని, భూస్థలం గురుపీఠమనీ, ఉయ్యాలను ఊపటానికి 'ఏడుభువనాల'[559] లోని వారు ఏకమై వచ్చారని, ఈ శరీరం తొమ్మిది వాకిళ్లు[560] గల దొడ్డి అని, అందులో మూర్ఖులు ఆరుగురనీ (కామ, క్రోధ, లోభ, మద, మోహ, మాత్సర్యాలు) జానపద స్త్రీ వర్ణిస్తుంది. త్రిగుణాత్మకమైన (సత్వ, రజః తమో) ఈ శరీరంలో ఆ మూడింటిని బంధించి గుణాతీతుడైన పరమేశ్వరుడ్ని హృదయంలో నిలుపుకొన్నప్పుడు జ్ఞానజ్యోతి వెలుగొందుతుంది. ఆ జ్యోతే వెన్నెలగా పాటలో భావింపబడింది.[561] అసామాన్యమైన తాత్త్విక భావాల్ని సామాన్య సంకేతాల ద్వారా పాటలో ఇమిడ్చిన లలనామణులు అభినందనీయులు. భగవంతుడ్ని బిడ్డగా భావించి అతనికి సపర్యలు చేయటం వాత్సల్య భక్తికి నిదర్శనం.

జంటగా జీవించటం ప్రకృతిలోని ప్రాణుల ధర్మం. పశుపక్ష్యాదులు తమ కామ పరిసమాప్తి వరకే జంటగా జీవిస్తాయి. కాని మానవుడు జీవితాంతం ధర్మాన్ని నిర్వహించుకుంటూ జంటగా జీవిస్తాడు. దీనినే ఆదికవి నన్నపార్యుడు 'స్త్రీ పుంస యోగోద్భవామ్'[562] అని పేర్కొన్నాడు. కేవలం కామోపభోగాల కోసం కాకుండా ధర్మనిర్వహణం కోసం వ్యక్తి జీవితం అంకితమైందా లేదా అని పరిశీలించాలనే అర్థం

---

[559] భూలోకం, భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జనలోకం, తపోర్లోకం, సత్యలోకం

- ఇవి ఏడు ఊర్ధ్వలోకాలు.

అతలము, వితలము, సుతలము, తలాతలము, రసాతలము, మహాతలము, పాతాళము

- ఇవి ఏడు అధోలోకాలు.

[560] కళ్లు, చెవులు, నాసారంధ్రాలు, నోరు, మూత్రద్వారం, మలద్వారం

[561] తెలంగాణ పల్లెపాటలు, పుట – 59.

[562] "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మానహన్త్య విహతాం స్త్రీ పుంసయోగోద్భవామ్,
తే వేదత్రయ, మూర్తయ స్త్రీ పురుషాస్యం పూజితావసురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజ భవ శ్రీకన్దరాశ్శేయసే"

- శ్రీమదాంధ్ర మహా భారతావతారిక, మంగళశ్లోకమ్.

'జంట గూడిన వాని జాడగనవలెను' అనే చరణంలో గోచరిస్తుంది. ఈ విధంగా ధర్మానికంకితమైన ద్వంద్వజీవితం 'బ్రహ్మానందానికి'[563] నిలయమవుతుంది.

బ్రహ్మండం మొదట తొట్టెగా భావించబడింది. ఆ బ్రహ్మండం ఓంకారమనే ప్రణవనాదం నుండి పుట్టింది. ఈ 'విశ్వాన్నే'[564] ఓంకారమని కూడా అంటారు. అందుచేత ఓంకారమే తొట్టెగా ఈ చివరి చరణంలో భావించటం ఎంతో సముచితం. ఇందులో పరచబడ్డ 'చలువ' 'తత్త్వమసి' అనే ఉపనిషద్వాక్యం. తత్+త్వం+అసి= అది నీవై యున్నావు. అది అంటే ఆ పరబ్రహ్మం. నీవు దానికన్నా భిన్నుడవు కావు. నీ వనగా ఆత్మ పదార్థం. ఆత్మ పరమాత్మలకు అభేదమనే ప్రబోధం సుబోధం చేసే ఈ పాట తాత్త్విక చింతనకు పరాకాష్ట.

**యోగ సంబంధి :** యోగసంబంధమైన లాలిపాట ఒకటి మిన్నేరులో ప్రచురితమైంది. భ్రూమధ్యంలో సచ్చిదానంద స్వరూపుడైన భగవంతుడ్ని జ్యోతిగా సందర్శించి ధ్యానించటం ఈ పాటలో పేర్కొనబడింది. దేవుడు చిద్రూపుడు. ఆ చిద్రూపుని గూర్చిన లాలిపాట స్వర, రాగ, తాళ భరితంగా ఉండటం చేత అది మార్గ సంబంధమైన కీర్తనగా భావించవలసి వస్తున్నది. జానపద సాహిత్య పరిధికి చెందదు.

**బాలికలకు సంబంధించినవి :**

బాలురకు సంబంధించినన్ని లాలిపాటలు బాలికలకు సంబంధించినవి లేవు. ఇది పురుష పక్షపాత వైఖరికి నిదర్శనమో లేక సహనానికి మారుపేరైన స్త్రీ చిన్నప్పటినుండే తల్లిని ఎక్కువ శ్రమ పెట్టకుండానే నిద్రపోవటం వల్లనో తెలియదు.

---

563 బ్రహ్మ అనుభవించే ఆనందం బ్రహ్మానందం. ఇది విషయరహితమైన ఆనందం. ఇది అనేక శ్రేణులుగా విభజింపబడినది. చివరకు ప్రజాపతి పొందు ఆనందము కంటె నూరు మడుగులు అధికమైనది బ్రహ్మానందమని 'బ్రహ్మానందవల్లి' వివరించుచున్నది.
"తేయేశతం ప్రజాపతే రానందాః సఏకో బ్రహ్మణ ఆనందాః"
ఉపనిషచ్చన్ద్రిక, ప్రథమ మయూఖం, పుట, 125. – రాయప్రోలు లింగన సోమయాజి వ్యాఖ్యానం.

564 "విశ్వమిత్యోంకార ఏవ బ్రహ్మేత్యర్థః" వాచ్యమైన బ్రహ్మకు, వాచకమైన ఓంకారమునకు అత్యంత భేదము లేదు. కనుక విశ్వమనగా ఓంకారమే.–శంకర గ్రంథ రత్నావళి,
శ్రీవిష్ణు సహస్ర నామస్తోత్ర భాష్యము, సప్తమ సంపుటము, పుట – 86.

**లౌకికార్థపరమైనవి** : ఆడపిల్ల అనగానే సాక్షాత్తుగా లక్ష్మీస్వరూపం అని భావించటం హైందవ సంప్రదాయం. లక్ష్మీదేవి అంటేనే సౌందర్యానికి నిర్వచనం. అందుకే ప్రతి మాతృహృదయం తన బిడ్డ చక్కదనాన్ని వర్ణించి మురిసిపోతుంది. పసిపాప కన్నులు తమ్మిపువ్వులని, చూపులు కమ్మని తేనెలని అభివర్ణించుకుంటుంది. చక్కని తన తల్లి గుక్కపట్టి ఏడిస్తే చెక్కుటద్దాలలో సంధ్యాకాంతులు చెదిరిపోతున్నాయట. బిడ్డ ఏడ్చినప్పుడు బుగ్గలు ఎర్రబడటం సహజం. ఆ ఎరుపుని ఎంత చక్కని పోలికతో వర్ణించిందీ కన్నతల్లి. గుక్కపట్టి ఏడ్వటంతో ఒళ్లంతా చెమటలు పట్టాయి. ఉయ్యాల ఊపులు కూడా సేదతీర్చటం లేదు. చల్లగా తన పాపాయి మీద ప్రసరించి సేద తీర్చమని వాయుదేవుడ్ని వేడుకొంటుంది తల్లి. ఆమె ప్రార్థన విన్నాడు వాయుదేవుడు. శ్రమాపనయనం జరిగింది. దానితో పాప కిలకిలా నవ్వింది. ఆ నవ్వు కలువపువ్వులు పూచినట్లుగా ఉందట. పాప కలికిచూపులు ప్రసరించింది. ఆ చూపులు కలువలే చూచినట్లుగా ఉన్నాయట.[565] ఎంత చక్కటి రూపకం.

బిడ్డ అందాన్ని ఎంతగా వర్ణించినా తల్లికి తనివితీరదు. తన బిడ్డ అందరికన్నా అందగత్తె అనీ, ఎర్రనిదనీ చెబుతూ ప్రకృతిలో ఎర్రదనానికి ప్రతీకలుగా ఉన్న వస్తువులన్నింటితో పోల్చి మురిసిపోతుంది.

"చిక్కుడు పువ్వెరుపు చిలక ముక్కెరుపు
చిలకల్ల దోర పండెరుపు
రక్కిస పండెరుపు రాగి చెంబెరుపు
రాచవారిళ్లలో మాణిక్య మెరుపు
తాయెరుపు అమ్మాయి తనవారిలోన"[566]

నిజంగా పాప ఎంత ఎరుపో తెలయదు గాని మాతృహృదయం మాత్రం వాత్సల్య భావ రాగ రంజితమయింది.

[565] జానపద గేయ సాహిత్యం, పుట – 445.
[566] పైదే.

ఇటువంటిదే మరొక గేయం.

"చిన్ని నా అమ్మాయి నవ్విపలికితె
మునిపండ్ల ముత్యాలు నిగడ పొగడాలు
సెక్కుళ్లు చామంతి రేకులు బోలు"[567]

అని తన బిడ్డ మునిపండ్లను, చెక్కిళ్లను తనివితీరా వర్ణించి మురిసి పోతుంది.

ఇంత అందమైన తన పాపాయిని భవిష్యత్తులో వెయ్యార్ల శుల్కమిచ్చి వియ్యమందటానికి ఎందరో సిద్ధంగా ఉంటారని ఊహించుకొని ఉబ్బితబ్బిబ్బవు తుంది. ఆ శుల్కం మూట మోయగలవా అని కాస్త అతిశయంగా ప్రశ్నిస్తుంది ముత్తవ తల్లి.[568]

తల్లి తన బిడ్డను రకరకాలుగా అలంకరించటానికి ముచ్చట పడుతుంది. మంచి దుస్తులు తొడిగి, ఆభరణాలు పెట్టి చూసి మురిసిపోతుంది. ఆడపిల్లకు అన్నిటికన్నా అందాన్నిచ్చేవి గాజులు. అందుకే ధనికులైనా, పేదవారైనా గాజులు మాత్రం తప్పనిసరిగా అలంకరిస్తారు. రకరకాల గాజుల్ని తొడిగిస్తాను అల్లరి చేయకుండా నిద్రపొమ్మని పాడే జోలపాటలో తల్లి బిడ్డకు ఆశలు రేకెత్తిస్తుంది. ఉయ్యాల ఊపుతూ

"చిన్నారి పొన్నారి గాజుల్లశెట్టి
తేవోయి అమ్మాయికి తేనె గాజులు"[569]

అంటుంది. ఈ క్రమంలో పాడే పాటలో అక్షరాల పొందిక అలవోకగా జరుగుతుంది. గుడి తిరిగి వచ్చి గుండ్ల గాజులు తొడగమని, పట్నం తిరిగివచ్చి పట్నం గాజులు తొడగమని, ఊరు తిరిగి వచ్చి ఉత్తగాజులు తొడగమని కోరటంలో రకరకాల గాజుల్తో తన చిట్టి తల్లిని చూసుకొని మురిసి పోవాలనే తల్లి అభిలాష

567 సరాగాలు, పుట – 180.
568 సెలయేరు, పుట-82.
569 పైదే.

వ్యక్తమవుతుంది. ఆ గాజులు కూడా వదులుగా కాకుండా గుత్తగా వేయ మంటుంది.[570]

మరొక పాటలో ముద్దుల బాలను ఏడవవద్దని మంచి మంచి సుద్దులతో నిద్రపుచ్చటానికి చేసే ప్రయత్నం అభివర్ణితం. పాప ఏడిస్తే చిన్నమోము చిన్నబోతుందని, కన్నతల్లి కన్ను చెదర ఏడిస్తే తాను చూచి సహించలేనని పాడే లాలిపాటలో తల్లికి బాలపై గల అపారాభిమానం సూచితం.[571]

ఎంతకూ నిద్రపోని బిడ్డను భయపెడుతున్నట్లుగా వేరొక గేయంలో నిరూపితం. అటక మీద బూచివాడున్నాడని, వాడు మిట్ల గుడ్లవాడని, పొట్టివాడని, ఏడిస్తే ఎత్తుకు పోతాడని తన చిన్నారిని భయపెడుతుంది తల్లి.[572] పిల్లల్ని భయభ్రాంతుల్ని చేయటం వారి అభివృద్ధికి నిరోధమని, వారిమానసిక శక్తులు వికసించవని ఆధునిక మనస్తత్వ శాస్త్రం చెపుతున్నది, ఈ విషయం పాపం ఆ అమాయకురాలికేం తెలుసు?

పాలుత్రాగే పసివయసులోనే పూతమైన సీతాదేవి చరిత్ర వినాలని పాప ఆకాంక్షించినట్లు తల్లి ఊహించి ఆ పాట పాడుతుంది. తన బిడ్డ భూమిపై కాలు మోపినప్పటి నుండి (నడక మొదలుపెట్టినప్పటి నుండి) సకల విద్యలూ నేర్వసాగిందని గొప్పగా చెపుతుంది. ఈ విధంగా అనేక ఆశయాలతో కూడిన ఈ పాటలో మాతృహృదయ మధురాకాంక్షలు ద్యోతకమవుతున్నాయి.[573]

తల్లి ఇంట్లో లేనప్పుడు పెద్ద అక్క తల్లి స్థానం వహించి చెల్లెలికి జోలపాడుతూ చేసే ఊహలు ఆమె భావనాశక్తికి తార్కాణాలు.

"అందరి మామల్లు చందమామల్లు
చెల్లమ్మ మామల్లు రామలక్ష్మణులు"[574]

---

570 సెలయేరు, పుట - 32
571 సరాగాలు, పుట -185.
572 పైదే, పుట – 194,
573 పైదే, పుట – 185.
574 జానపద గేయాలు, ప్ర.సం. పుట -49.

అంటుంది. చందమామ అందుబాటులోనిది కాదని, మేనమామలు మాత్రం రామలక్ష్మణుల్లాంటి వారని, వారెల్లప్పుడూ తన చెల్లెమ్మకు అండగా ఉండాలని ఆకాంక్షిస్తున్నట్లు ఈ పంక్తులవల్ల తెలుస్తున్నది.

అందరి బుద్ధులొక ఎత్తు, తన చెల్లెమ్మ, బుద్ధులొక ఎత్తని ఉల్లాసపడుతుంది అక్కయ్య

"చెల్లెమ్మా బుద్ధులూ వేణునాదములు"[575]

అని అక్కయ్య వేణుగాన ధర్మం తన చెల్లెమ్మ జీవితంలో వెల్లి విరియాలని ఆకాంక్షిస్తుంది.

"నిండు పున్నమి నాడు చందమామ నిన్ను
కోరి పోయాడమ్మ నీ మేనమామ"[576]

అని పాడటంలో తన చెల్లెలు గృహిణియై అందరి ప్రేమకు పాత్రురాలవుతుందని సోదరి ఆశాభావం వ్యక్తం చేసినట్లు తెలుస్తున్నది.

**కేవల శబ్ద పరమైనవి :**

"పొద్దు పొద్దూ ఒక చాయ పొద్దొక్క చాయ
పొద్దు పోయే చెల్లమ్మ పొన్నపూచాయ
జాము జాము ఒక చాయ జామొక్క చాయ
జామూపై చెల్లమ్మ జాజాపూచాయ."[577]

పూల ఛాయలతో పోల్చుకుంటూ బిడ్డలకు పాడే ఈ జోలపాటను ఉదయిస్తున్న సూర్యుని ఛాయల్ని పెక్కుపూల ఛాయలతో పోల్చి పాడే పాట వంటిదని చెప్పవచ్చు.[578]

---

575 జానపద గేయాలు, ప్ర.సం., పుట -50.
576 పైదే. పుట – 30.
577 పైదే, పుట -31.
578 "పొడుస్తూ బాలుడూ పొన్నపూవూ చాయ
పొన్నపూవూ మీద పొగడ పూవూచాయ
శ్రీ సూర్యనారాయణా మేలుకో
ఉదయిస్తు బాలుడూ ఉల్లి పూవూ చాయ
ఉల్లిపూవూ మీద ఉగ్రంపు పొడి చాయ .. శ్రీసూర్య..

"లాలి లాలి లాలి లాలెమ్మలాలి
లాలిలో అమ్మాయి రాణిలా ఉంది
రాణమ్మ గుర్రాలు లంకల్లో మేసు
అమ్మాయి గుర్రాలు పల్లాల మేసు"[579]

అనే పాటలోని'ల'కారావృత్తి వీనుల విందుగా ఉండి బిడ్డను నిద్రపుచ్చటానికి తోడ్పడుతుంది.

**దేవీ సంబంధి** : బాలను సాక్షాత్తుగా దేవిగా భావించి లాలి పాడటం ఆహ్లాదజనకం. ఆమె జొన్నవాడ కామాక్షీదేవి. మల్లిఖార్జునుని రాణి. మధురవాణి. ఎటువంటి వరాలనైనా ప్రసాదించే కరుణామయి. తమ కోర్కెలు తీర్చుకోవటానికి భక్తులు ఆమె సన్నిధిలో ప్రాణాచారం పడతారు. అప్పుడా తల్లి వారికి కలలో కన్పించి కొడుకుల్ని కనమని దీవిస్తుంది. ఇటువంటి విశేషాలతో కూడిన గేయమొకటి భారతి మాసపత్రికలో ప్రచురితం, ఇది జానపదుడు రచించినా, జానపద ఫణితిలోనే ఉన్నా కర్తృత్వం ఉండటం చేత ఇట్టి గేయాలు ఈ వ్యాసపరిధిలోకి రావు.

**ఉగ్గుపట్టుట** : తల్లి బిడ్డలకు ప్రథమ గురువే కాదు వైద్యురాలు కూడా అని తెలుస్తుంది. జానపద సాహిత్యాన్ని పరిశీలిస్తే బిడ్డ ఆరోగ్యంగా ఎదగటానికి ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటుందో! ఉగ్గు పట్టటం అటువంటిదే. తాగిన పాలు, తీసుకున్న ఆహారం చక్కగా జీర్ణమై బిడ్డ ఆరోగ్యంగా ఎదగటానికి ఈ ఉగ్గు తోడ్పడుతుంది. ఉగ్గు అంటే చనుబాలతో రంగరించిన ఆముదం.[580] ఈ పదం ప్రాచీనాంధ్ర సాహిత్యంలో కనిపించటం లేదు. అర్వాచీన సాహిత్యానికి చెందిన యయాతి చరిత్రలోను, సారంగధర చరిత్రలోను ఈ పదం ప్రయోగింపబడినట్లు నిఘంటు

---

గడియెక్కి బాలుడూ కలువ పూవూ చాయ
కలువ పూవూ మీద కాకరి పూచాయ .. శ్రీసూర్య..
జామెక్కి బాలుడూ జాజి పూవూ చాయ
` జాజి పూవూ మీద సంపంగి పూచాయ ..శ్రీసూర్య..

త్రివేణి' పాములపాటి బుచ్చినాయుడు స్మారక సంచిక, పుట -130.

[579] సాంప్రదాయిక విజ్ఞానం, పుట -18.

[580] సూ.ని.

నిరూపణ. చేమకూర వేంకటకవి ఉగ్గు పట్టటాన్ని జాత్య[581]లంకారంలో వర్ణించాడు.[582]

తల్లి రెండు కాళ్లూ చాపుకొని క్రింద కూర్చొని బిడ్డను కాళ్లపై పడుకోబెట్టుకొని ఒక వేలితో నోరు తెరిచి రెండవ చేతితో ఉగ్గు గిన్నెలోని ఉగ్గును నోట్లో పోస్తుంది. ఉగ్గు తాగేటప్పుడు తన బిడ్డ ఏడవకూడదని లాలిస్తూ చక్కని పాటలు పాడుతుంది.

"గంటెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక క్రక్కక ఖ్రింగన్న
ఊపిరి పట్టక నుండన్న
ముక్కట మింగిన చక్కన్న."[583]

బుద్ధిమంతుడైన బిడ్డ తల్లి మాట విని ఉగ్గు ఖ్రింగిన తర్వాత "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం"[584] అంటూ కాళ్లూ చేతులూ మెలిక వేసి పొట్టపై నొక్కుతుంది. ఇది ఒక రకమైన శారీరక వ్యాయామం (malish). నరాల పటుత్వానికి, ఒడలు పెరగటానికి దోహదపడే చర్య.

తన బిడ్డ వాతాపిని జీర్ణించుకొన్న అగస్త్యుడిలాగ, గుగ్గిళ్లు హరించుకొన్న గుఱ్ఱంలాగా, వెలక్కాయ జీర్ణించుకున్న ఏనుగు లాగా అన్నీ జీర్ణించుకొని జవసత్త్వాలు పొందాలని తల్లి కోరిక. అంతేకాదు క్రమక్రమంగా పెరిగి కుందిలాగ

---

581 "సహృదయ హృదయంగమమై, మహినున్నది యున్నయట్లు మాటల తేటల్, బహుళంబులుగా జెప్పిన, మహితోక్తియె జాతియయ్యె మహినెట్లనన్" – నరసభూపాలీయం, 5-112.

582 "పాలదలోన బోసి చనుబాలు నెయిం గిలకొట్టి కాళ్లపై
బాలకు నుంచి వ్రేల్ సెలవిపై నెడగా నిడి యుగ్గువెట్టి యా
వేలటు బొజ్జపై నిమిరి కెంజిగి సేతుల నెత్తి గట్టురా
చూలి యనుంగు సామికిని జోతలు జోతలంచు బల్కుచున్" సారంగధర చరిత్ర, 1-44, సూ.ని.

583 సెలయేరు, పుట -38.

584 పైదే, పుట – 86.

కూర్చోవాలని, నంది లాగా నడవగలగాలని, గుఱ్ఱంలాగా పరుగులు పెట్టాలని తల్లి ఆకాంక్ష.[585]

యశోద శ్రీకృష్ణుడికి పోసిన ఉగ్గులో ఏమేమి కలిపిందో ఈ క్రింది గేయం తెలియజేస్తుంది.

"వెల్లుల్లి పాయల్లు తోక మిరియాలు
ఉడికించి యశోదమ్మ ఉగ్గుపోయంగ
మందాని తాగేడు మాయ కృష్ణమ్మ
సేదాని తాగేడు చిన్నకృష్ణమ్మ."[586]

ఉగ్గును ప్రతినిత్యం ఒక నిర్ణీత సమయానికి పోస్తారు, తల్లి ఏదైనా పనిలో పడి ఆలస్యమయితే ఉగ్గుపాలకు అలవాటు పడ్డ బిడ్డ ఆ సమయానాకి ఏడుస్తాడు.

"ఉయ్యాలలో బాల ఉగ్గుకేడిస్తే
ఉత్తమ్మ యేశోద వూచి వుగ్గొయ్యి."[587]

వెంటనే తల్లి పనులు మానుకొని వచ్చి ఉగ్గుపడుతుంది.

కొంత మంది ఆముదంలో కేవలం వాము మాత్రం కలిపి పోస్తారు. కొన్ని ప్రాంతాలలో ఉగ్గుమందును[588] ఆముదంలో కలిపి పోస్తారు. భిన్న ప్రాంతాలలో విభిన్న ఆచారాలు వ్యవహారంలో ఉన్నాయి.

ఉగ్గుపట్టిన తర్వాత ఆ వికారం సమసిపోవటానికి తల్లి రొమ్ము కుడుపుతుంది. ఓర్వని 'సయితులు' దృష్టి పెడతారని బిడ్డను పైట చాటున పాలు

---

585 బాల భాష, పుట – 20.
586 మున్నీరు, పుట – 97.
587 సాంప్రదాయిక విజ్ఞానం, పుట – 4.
588 పాదరసం, గంధకం మిశ్రమం చేసి అందులో బాలెంత పూలు పొడి చేసి కలుపుతారు. ఈ పొడిని చిటికెడు పరిమాణంలో ఆముదంలో కలిపి పిల్లలకు పోస్తారు. ఇది అజీర్ణం, విరోచనంలో వాసన లేకుండా చేస్తుంది.
డా. శ్రీ మన్నారాయణ గారితో ముఖాముఖి చర్చల ద్వారా సేకరణ.

తాగమని కోరటంలో ఆ తల్లి కెంతటి మమకారమో ఈ గేయం ద్వారా వ్యక్తమవు తున్నది.[589]

కేవలం ఉగ్గే కాకుండా పిల్లల జీర్ణశక్తిని పెంపొందించటానికి అప్పుడప్పుడు ఇతర మందులుకూడా వాడుతున్నట్లు ఈ క్రింది గేయం ద్వారా అవగతమవుతున్నది.

పాలపండూ తిన్న పాలరుగవన్ని
వోమైన నూరిపొయ్యి ఓ గౌరిదేవి
వాము బాలయ్యకు వోకారమన్ని
ఇక సర్వకాయ [590]మెయ్యి ఓ సకియదేవి
సర్వకాయం మా బాలయ్యకు సంతోషమన్ని."[591]

జీర్ణశక్తి మీదనే బిడ్డ ఆరోగ్యమంతా ఆధారపడి ఉంటుంది. అందుకే ఇన్ని జాగ్రత్తలు. కనుకనే తల్లి ప్రథమ వైద్యురాలు.

**గోరుముద్దలు** : బిడ్డకు ఆరోమాసం వచ్చేటప్పటికి పాలు మాత్రమే సరిపోవు. ఘనాహారం కావాలి. అందుకే తల్లి బియ్యాన్ని వేయించి, నూకగా చేసి, మెత్తగా వండి, చల్లారబెట్టి అందులో నెయ్యి, పప్పు కలిపి గుజ్జుగా చేసి తన చేత్తో గోరుముద్దలుగా చేసి బిడ్డకు తినిపిస్తుంది. ఆ తినిపించటం ఏదో యాంత్రికంగా కాకుండా ప్రేమతో, లాలనతో పాట పాడుతూ తినిపిస్తుంది. పిల్లలకు చందమామ

589 "తల్లి పాలురా తనుపన్న
రొమ్ము కుడువుమురోయన్న
లుంగలు పెట్టక గ్రక్కన్న
పైట బొడనే బొక్కన్న
ఓర్వని సైతుల దృష్టన్న
ఒప్పు మసలరా బుస్సన్న" – సెలయేరు, పుట – 89.

590 కటుక రోహిణి (ఎక్కిళ్లు రాకుండా చేస్తుంది) తుంగముస్తలు, విప్పలి, పిప్పలిమూలం, పసిక, చిత్రకం, శొంఠి – వీటన్నింటినీ చూర్ణం చేసి కుంకుడు గింజ పరిమాణంలో తేనెతో కలిపి రోజుకు రెండుసార్లు ఇవ్వాలి. దీనివల్ల జీర్ణశక్తి పెంపొందుతుంది.
– డా. శ్రీమన్నారాయణ గారితో ముఖాముఖి చర్చల ద్వారా సేకరణ.

591 సాంప్రదాయిక విజ్ఞానం, పుట – 41.

అంటే ఎంతో ఇష్టం. చూడగానే కేరింతలు కొడతారు. అందుకే శుక్లపక్షంలో రాత్రిపూట ఆరుబయట తిప్పుతూ చందమామను చూపించి పాటలు పాడుతూ గోరుముద్దలు తినిపిస్తుంది.

"చందమామ రావె
జాబిల్లి రావె"[592]

అని చందమామను తన బిడ్డ దగ్గరకు రమ్మని పిలవటమే గాక వచ్చేటప్పుడు ఉత్త చేతులతో రావద్దంటుంది. కొండెక్కి రమ్మని గోగుపూలు తెమ్మని, బండెక్కి రమ్మని బంతిపూలు తెమ్మని, పల్లకీలో రమ్మని పారిజాతం తెమ్మని, తేరెక్కి రమ్మని తేనెపట్టు తెమ్మని కోరుతుంది. అవన్నీ నట్టింట్లో పెట్టి అబ్బాయి కిమ్మంటుంది. అబ్బాయితో ఆడుకొని బువ్వారగించి పొమ్మంటుంది.

గోగుపూలు, బంతిపూలు, పారిజాతాలతో సమానమైన సుకుమారులే శిశువులు. అటువంటిపూలు తెమ్మనటంలో ఆ భావననే వ్యక్తీకరించినట్లయింది. ఈ విధంగా పూలు, తేనెపట్టు పెరుగుతున్న బాలుని మనసుకు, హృదయానికి సంకేతాలని చెప్పవచ్చు.

చందమామను దిగివచ్చి బాలునితో ఆడుకోమనటం ఎంతగొప్ప భావన! నీల్ ఆర్మ్ స్ట్రాంగ్ తో కూడిన ముగ్గురు రోదసీయాత్రికుల బృందం క్రీ.శ.1969 సంవత్సరంలో ఎన్నో ప్రయాసల కోర్చి అతి కష్టం మీద చంద్రుడిపై తొలిసారి కాలుమోపింది. కాని జానపద స్త్రీ ఏ ప్రయాసలూ లేకుండానే ఆ చందమామను తన సోదురుడ్ని చేసుకొని మేనల్లుడితో ఆడుకోవటానికి ఆహ్వానించి తన ఇంట్లో కట్టిపడవేసింది.

ఈ విధంగా చిన్నప్పటినుండే బిడ్డ ప్రకృతితో మమేకం కావాలని, ప్రకృతిని ప్రేమించాలని భావిస్తూ ప్రకృతిని పరిచయం చేసే జానపద స్త్రీ గొప్ప పర్యావరణ ప్రేమికురాలు కాదా! కానీ మానవుడు పెరిగే కొద్దీ ప్రకృతికి దూరమై వికృతిలోకి పయనిస్తున్నాడు. అదే శోచనీయం.

[592] తెలంగాణ పల్లెపాటలు, పుట – 12.

ప్రపంచంలో పనికి వచ్చే పదార్థాలు తన బిడ్డకని, పనికి రానివి ఇతరులకు అని చెప్పటంలో కొంత ప్రేమతో కూడిన స్వార్థం కనిపిస్తుంది.

"తినే బెల్లము అబ్బాయికి
తినని బచ్చలి దేముడికి
చీమలెంగిలులు చిచ్చికి
పాల మీగడలు నాయనకు."[593]

'చీమలెంగిలులు' 'చిచ్చి'కి పెట్టమని అనటంలో చిచ్చి అంటే ఇక్కడ నిద్రపుచ్చేటప్పుడు తల్లిచేసే చర్యకు పేరు. దానినొక వ్యక్తిగా భావించినట్లు (personification) కనిపిస్తుంది. పాల మీగడలు తన నాయినకు పెట్టమని

"ఊరేలు ఉత్తముడ జగమేలు స్వామి
మమ్మేలు మాపాలి కోదండ రామా!"[594]

అని ప్రార్థిస్తుంది జానపద జనని. పాలు మీగడలు ఆరగించి, బెల్లాలు తిని తన బిడ్డ దినదినప్రవర్ధమానుడు కావాలని తల్లి ఆకాంక్ష.

తల్లికి తన బిడ్డ చిన్నారి శ్రీకృష్ణుడే. తాను కూర్చుని బిడ్డను పాదాల మీద కూర్చోబెట్టుకొని తన చూపుడు వేళ్లను బిడ్డకు అందించి బిడ్డ వాటిని గుప్పెళ్లతో మూయగానే బిడ్డను ముందుకూ వెనక్కూ ఊపుతూ

"తారంగం తారంగం తాండవ కృష్ణ తారంగం"[595]

అని తరంగంలాంటి పాట పాడుతుంది. బిడ్డ ఆహారం జీర్ణం కావటానికి ఇదొక వ్యాయామం వంటిది.

'అందరు చూడగ ఆడర కృష్ణ' అని ఉత్సాహపరుస్తుంది. అలా ఆడేటప్పుడు తన బిడ్డ చెవుల మద్దికాయలు అల్లల్లాడాలని, పులిగోరు పతకం గొలుసు బొజ్జపై ఓలలాడాలని, మురుగుల గొలుసులుగల చేతులు తిప్పుతూ కిలకిల నవ్వుతూ, తనకు ముద్దులిస్తూ బిడ్డ లయాత్మక విన్యాసంతో, ఆటలతో తనను అలరించాలని తల్లి

593 సెలయేరు, పుట – 87.
594 తెలంపగాణ పల్లెపాటలు, పుట – 1.
595 పైదే, పుట – 49.

కోరిక. ఈ తల్లి శ్రీమంతురాలు కాబోలు! బిడ్డ మగ అయినా ఆడ అయినా తమ తాహతుకు తగినట్లు ఆభరణాలు అలంకరించి మురిసిపోతుంటారు తల్లులు. అలాగే ఈ తల్లి కూడా సాలంకృతుడైన తన తనయుడ్ని చూచి ఆనంద పరవశురాలవుతున్నది. ప్రతి తల్లి ఒక యశోద, ప్రతి బాలుడూ చిన్ని కృష్ణుడు అయితే ఆ ఊరు గోకులం కాదా!

తప్పటడుగులు వేస్తూ బిడ్డ తిరుగాడే సమయంలో తల్లి దగ్గరకు తీసుకొని కుడి అరచేతిని పట్టుకొని

"అన్నం బెట్టి అప్పబెట్టి
అప్పడం బెట్టి దప్పడం బెట్టి
కూరబెట్టి నారబెట్టి
పాలుపోసి పరమాన్నంబోసి
గుంట గట్టి గుంటనిండ నెయ్యిబోసి"[596]

కమ్మగాభోజనం పెట్టినట్లు భావిస్తూ అనంతరం 'మా అబ్బాయి అత్తారింటికి దారేదని?' తనని తానే ప్రశ్న వేసుకొని తాళ్లలో నుంచి, తంగేడు పొదల్లో నుంచి అదే త్రోవ అంటూ చేతిని జరజరా చంకల వరకూ పోనిచ్చి చక్కిలి గింతలు పెడితే బాలుడు పకపకా నవ్వుతాడు. ఈ విధమైన కరస్పర్శ వల్ల కలిగే హాస్యం బాలుని వికాసానికి దోహదపడుతుంది. కడుపార భోజనం చేసి మనసారా నవ్వుకుంటూ తన బిడ్డ ఆనందంగా అత్తవారింట్లో కాలం గడపాలనే తల్లి ఆకాంక్ష ఈ గేయంలో వ్యక్తమవుతున్నది.[597]

---

596 తెలంగాణ పల్లె పాటలు, పుట -14.

597 "ఇటువంటిదే మరొక గేయం.

"చేతులు కడిగి అరిటాకేసి
పప్పు బెట్టి బువ్వ బెట్టి
కూరబెట్టి నెయ్యేసి
చారోసి మజ్జిగోసి
అత్తారింటికి దారేదోయ్
అంబటి కొండకి చిల్లేదోయ్"-సెలయేరు, పుట – 88.

పన్నగశయనుడు, శేషశయనుడు అయిన బాలుడు పందిళ్లలో ఆడుకొని, పాలు తాగి పడుకోవాలని తల్లులు చిన్న చిన్న పాటల్లో[598] తమ మనోవాంఛల్ని వెల్లడిస్తుంటారు.

పిల్లవాడికి పెందలాడే నీళ్లుపోసి, పాలు పట్టి, అన్నం బెట్టి ఆడుకోటానికి పంపితే అక్కడ ఆ బిడ్డకు అదృష్టం కొద్దీ మాడ దొరికినట్లు, ఆ మాడతో చెవులకు మద్దికాయలు చేయించినట్లు ఒక తల్లి పాటలో వ్యక్తం చేస్తుంది. తిరిగి స్నానం చేయించి అన్నం పెడితే పిల్లవాడు క్రమంగా ఎదుగుతాడు. అటువంటి ఆరోగ్యకరమైన పిల్లవాడు నట్టింట్లో తిరుగుతుంటే చూచి తన అల్లుడ్ని చేసుకోవాలని ఆరాటపడుతుంది అత్త.[599]

ఆటలకు వెళ్లివచ్చిన పిల్లవాడు తోటి పిల్లలు తనను ఏనుగన్నారని, గుమ్మడి పండన్నారని, ఆడేటివారిలో అరటి పండన్నారని, పాడేటి వారిలో పనసపండన్నారని తనని వెక్కిరించినట్లుగా భావించి తల్లితో చెపితే ఎవరే మా తండ్రిని ఈ మాటలన్నది అని తల్లి విచారణ ప్రారంభిస్తుంది.[600]

ఆటలకు వెళ్లి ఎంతకూ ఇంటికిరాని బిడ్డ ఆచూకీ కోసం ఆరాటపడుతుంది మరొక తల్లి.

"వీధులనాడేటి ఓ బాలలారా
మా బాలనెందైన కంటిరా మీరు"[601]

అని కనిపించిన పిల్లల్ని ప్రశ్నిస్తే వారు మీ బాలకు ఆనవాలేమిటని ప్రశ్నిస్తారు.

"జడజడారత్నాలు జడరావిరేకు
పాపట పన్నీరు నొసట కస్తూరి"

---

598 తెలంగాణ పల్లెపాటలు, పుట – 3.
599 సెలయేరు, పుట – 85.
600 సాంప్రదాయిక విజ్ఞానం, పుట -22.
601 జానపద గేయాలు, ద్వి. సం., పుట - 78.

అని వివరాలు తెలియచేస్తుంది. ఈ బిడ్డ కలవారి బిడ్డ కాబోలు! పిల్లల్ని ఆటపాటలకు పంపటం తిరిగి వారి రాకకై నిరీక్షించటం, వచ్చిన వాడికి స్నానం చేయించటం, అన్నం పెట్టటం తల్లికి నిత్యకృత్యాలుగా జానపద గేయాల ద్వారా నిరూపితమవుతున్నది.

## 4. హాస్యభావన

భరతాదులు ప్రవచించిన నవరసాల్లో హాస్యం కూడా ఒకటి. పరిహాస శీలమైన మనోవృత్తి విశేషమే హాస్యం. ఇది ఆనందానికి, ఆరోగ్యానికి గుర్తని అంటారు అందరూ. నవ్వు నాలుగందాల చేటని నసుగుతారు కొందరు. ఒక హాస్యం ఏమిటి పరిమితులు దాటిన ఏ ప్రవృత్తి అయినా అనర్థదాయకమే. కాని నవ్వన్నది ప్రసన్నమైన చిత్త ప్రవృత్తిని ప్రతిబింబించే విశుద్ధదర్పణం. ఈ హాస్యరసానాకి ఆలంబనోద్దీపనాలు రకరకాలు.

"వికృతాకార వాగ్వేష చేష్టాదేర్నర్తకాద్భవేత్
హాస్యో హాసః స్థాయి భావః"

అని సాహిత్య దర్పణ వివరణ.[602] ఆకారం, వాక్కు, వేషం,చేష్టల్లోని వికారం హాస్యానికి మూలమని అర్థం. వికృతాకార వేషాల వల్ల జనించే హాస్యం కన్న వికృత వాక్చేష్టల వల్ల కలిగే హాస్యం సున్నితమైంది. అన్నిటికంటే చేష్టాజనితమైన హాస్యం ఉత్తమోత్తమం.

పరిహాసజనకమైన వాక్చాతుర్యాన్ని ఆంగ్లంలోని విట్ (wit) అనే దానితో పోల్చవచ్చు. ఇది శబ్దగతమైనా కావచ్చు. అర్థగతమైనా కావచ్చు. ఒకరి లోపాల్ని గాని బలహీనతల్ని గాని సోపహాసంగా తగుమోతాదులో చిత్రించే సంక్షేప కవిత అధిక్షేపణం. ఆంగ్లంలోని సెటైర్ (satire) దీనికి సమీపం. ప్రత్యాక్షేపం అన్నది రిటార్ట్ (retart) కు దగ్గర. ఉపాలంభం, సర్కాజమ్ (sarcasm) అన్నవి ఇంచుమించు ఒకటే. వ్యంగ్యం, వ్యాజస్తుతీ మొదలైన వాటిని ఐరనీ (irony) అనవచ్చు. వీటన్నింట్లో శ్లేష చమత్కృతి శిరశ్శేఖరం. ఉత్తమ, మధ్యమ, అధమ భేదాలతో హాస్యం ఆరు రకాలని

[602] కావ్యాలంకార సంగ్రహం, పుట – 322.

ఆలంకారికులు నిర్వచించారు. శ్రేష్ఠులకు స్మితహసితాలను కేటాయించారు. బహు శాస్త్ర పరిచయం, విశేష లోకానుభవం, విపుల శబ్దాధికారం, విశిష్ట ప్రతిభా వైభవాలకు తోడు సమయజ్ఞతా, సౌహార్ధమూ సమకూరితే తప్ప హాస్యరసానికి సర్వాంగ సౌందర్యం సమకూరదు.

లాక్షణిక వివేచనాన్ని ప్రక్కన పెడితే భావుకుల దృష్టిలో హాస్యమన్నది కొరడాతో కొట్టినట్లుగాక కుపిత నాయిక వాలుజడతో చరిచినట్లుండాలి. కత్తితో కోసినట్లుగా కాక జవరాలి దంతక్షతంలాగా ఉండాలి. గొంగళి పురుగు పాకినట్లుగా గాక అంగన కౌగిలింత లాగా ఉండాలి. హాస్యానికి అలంబనమైన వ్యక్తుల్లో కూడా ఆనందం తప్ప కసి కలగకూడదని, ఛలోక్తి వినా ఖలోక్తి పనికిరాదని, సరసోక్తేగాని విరసోక్తి వినపడరాదని తక్కిన సవరణలూ, వివరణలూ సూచిస్తాయి. అంటే అంతా కాంతాసమ్మితంగా ఉండాలని తాత్పర్యం.

శిష్ట సాహిత్యపు పేరోలగంలో హాస్యరసానికి వేసిన పీట మాత్రం చాలా చిన్నది. కుర్చీమీద కొలువు దీరిన దేవత శృంగార రసం. ఈ శృంగార రసం ఏమి పుణ్యం చేసుకుందో గాని ఒకయుగంలో అందలమెక్కింది. మరోయుగంలో అంబారీయెక్కింది. ఒక యుగంలో సరదాల మేనాలో పయనించింది. ఇంకో యుగంలో జోడు గుర్రాల బగ్గీలో సవారీ చేసింది. అన్ని యుగాల్లోనూ ఉత్సవాలూ ఊరేగింపులూ చేయించుకుంది. ఆంధ్ర మహాభారతంలోగాని, ప్రబంధ పరంపరలో గానీ కన్పించే హాస్యం మృగ్యం. ఈ రచనలన్నీ దాదాపు సంస్కృత మూలాలకు అనువాదాలో, అనుసరణలో కావటం వల్లనేమో! సంస్కృత కావ్య, నాటకాలలో ఆది నుండీ హాస్యం అస్తి నాస్తి విచికిత్సకు గురవుతూనే వచ్చింది. హాస్యాన్ని అంగిరసంగా రచించిన ప్రహసనాదులు సంస్కృత సాహిత్యంలో చెదురుమదురుగా కన్పిస్తాయి.

అయితే ఆంధ్రులు హాస్యప్రియులు కారనటం సమంజసంకాదు. పరిహాసం లేని ప్రసంగం ఆంధ్రులకు రుచికరం కాదు. నూతన దంపతుల చిలిపి కయ్యాలూ, బావామరదళ్ల హాస్యాలూ, వదినా మరదళ్ల సరసాలూ, వివాహ సమయంలో వియ్యాలవారి పరాచకాలూ – ఒకటేమిటి అడుగుడుగునా అనుక్షణమూ తెలుగు

వారి బ్రతుకు తెరువుల్లో హాస్యరసం వెల్లివిరుస్తూనే ఉంటుంది. తెలుగు నాట వినోదాత్మక ప్రదర్శనలనిండా హాస్యమే కనిపిస్తుంది. అధికార భేదాన్ని బట్టి, అంతస్తుల్ని బట్టి, సన్నివేశస్థాయిని బట్టి అన్ని అంతరువుల హాస్యం వీటిలో ఇమిడి ఉంటుంది. హాస్యగాడు వచ్చి బరాబర్లు చేస్తేనేగాని వీధినాటకాల్లోని ముఖ్యపాత్రలు రంగంమీదికి రావు. చోపుదారు వచ్చి బహుపరాకు పలికితేనే గాని యక్షగానాదుల్లోని నాయకులు సభకు విచ్చేయరు. బంగారక్క, జుట్టు పోలిగాడు, గాంధోలిగాడు తొంగిచూడనిదే తోలు బొమ్మలాటల్లో అసలు బొమ్మ తెరకెక్కదు. కలాపాదుల్లోని సుంకరికొండడు అడపాదడపా కన్పిస్తుంటే తప్ప ఆయా ప్రదర్శనలకు నిండుదనంరాదు. భామాకలాపంలో అయ్యగారికి గానీ, అమ్మగారికి గానీ మాధవి తోడులేకపోతే ఒక్కక్షణం గడవదు. హాస్యరసభరితాలైన సవతుల సంవాదాలు లేని పారిజాత ప్రయోగాలు ఊహించలేం. పగటి భాగోతుల హాస్యం పగ్గాలు వదులైన బాపతు. కొమ్ముదాసర్లు, నక్కదాసర్లు నడిపే ప్రసంగాలు చురుకైన హాస్య తరంగాలు. ఇక వెర్రి వెంగళప్పల పెళ్లికూటం, పరమానందయ్య శిష్యులు అచ్చంగా ఆంధ్రుల సృష్టి. కొంటె కోణంగి తెనాలి రామకృష్ణుడు అసలు సిసలైన తేటతెలుగు కవి. వీరందరి చుట్టూ అల్లుకొన్న సాహిత్యం హాస్యానికి ప్రతినిధి.

జానపదులు మాత్రం హాస్యానికి పెద్ద పీటవేశారు. జానపద సాహిత్యంలోని హాస్యం అన్ని అంతస్తుల వారినీ హాయి అనిపించగల విషయ వైవిధ్యమూ, వస్తు విస్తృతి కలది. ఇందులో ఒకచోట కరుకుదనమూ, మరొకచోట చురుకు దనమూ చూడవచ్చు. సంస్కారుల్ని సహితం 'ఓహో' అనిపించే సరస చమత్కారాల నుండి, మోటు మనుషుల్ని కూడా 'ఛీ' అనిపించే బూతుల పాతర్ల దాకా ఈ సాహిత్యంలో గోచరమవుతున్నాయి. సున్నితమైన హాస్యం జానపదులను అంతగా అలరించదేమో! కొంత కటువుగా, కొంత ఘాటుగా ఉంటేనే వారి హృదయాలను తాకుతుందేమో! ఈ పరిహాసాలను ఒక వాడుకగా ప్రయోగించీ, ఒక వేడుకగా స్వీకరించి ఆనందించే ఆత్మ ప్రవృత్తి జానపదుల విశిష్టతగా చెప్పవచ్చు.

ముట్నూరి సంగమేశంగారు తమ "తెలుగు హాస్యం"లో జానపద హాస్యానికి సముచితస్థానం కల్పించటం ముదావహం. పామర సాహిత్యంలో హాస్యం అపారమని వారి అభిప్రాయం. "అసభ్యత ఏ మాత్రంలేని హాస్యం ఆడవాళ్ల పాటల్లో దొరుకుతుంద"[603] ని వారి అభిప్రాయం. "నలుగుల పాటలు, నాగవల్లి పాటలు, విందు పాటలు వంటివెన్నో హాస్యపు పాటలు ఆడవాళ్లు పాడుతూ ఉంటారు. వీటిలో హాస్యం అతి మృదువుగా ఉండటమే కాదు అత్యంత విశుద్ధమై పండిత హాస్యానికి కూడా చెన్నులు దిద్దడానికి తగినదిగా ఉంటుంది"[604] అనే వారి పరిశీలన గమనించదగింది.

**కుటుంబ పరిహాసం** : గ్రామం సమరస జీవనానికి, సమైక్య భావానికి కాణాచి. గ్రామీణుల్లో వేర్పాటు ధోరణి అసాధారణం. సమష్టి కుటుంబ జీనవమే సర్వసాధారణం. స్త్రీ అత్తమామలు, ఆడపడుచులు, బావలు, మరుదుల మధ్య జీవించాలి. వదినా మరదళ్ల సరసాలూ, బావా మరదళ్ల హాస్యాలూ, నూతన దంపతుల చిలిపి కయ్యాలు హాస్యరస స్ఫోరకాలు.

పుట్టింట్లో ఉన్న భార్యను చూడటానికి బావగారు వస్తే మరదలు పిల్ల కుళ్లిపోయిన గుమ్మడికాయ కూరవండి పెడతానని, పాదుల్లో తొండలు, గోడమీది బల్లులు వండి పెడతానని అంటుంది. కానీ అన్నలంటే చాలు చాలా అభిమానం. వారికి గ్రుడ్లు పెట్టే కోడి పెట్ట, అలచందపప్పు, అడవి కాకరకాయ ఆప్యాయంగా వండి పెడతానంటుంది.[605] ఈ మాటలు పరిహాసజనకాలు. నిజంగానే వండి పెడితే అది క్రియాత్మక హాస్యమవుతుంది.

తన అన్నను పెళ్లాడినందువల్ల ఆమెకెంతో భోగం, యోగం లభించాయని వదినను మేలమాడుతుంది మరదలు పిల్ల. బంకమట్టితో తలరుద్దుకొనే వదినగారు సీకాయతో రుద్దుకొంటున్నదని, తలకు ఆముదం పట్టించే వదినగారు ఇప్పుడు

---

603 తెలుగు హాస్యం, పుట – 55.

604 పైదే.

605 జానపద గేయాలు, ప్ర. సం., పుట -78.

సంపెంగ నూనె వ్రాసుకుంటున్నదని, గోనెలు కట్టుకొనే వదినగారు కర్ణాట చీరల్ని కట్టుకొంటున్నదనీ వివాహ పూర్వస్థితిని, వివాహానంతర స్థితిని పోల్చి ఎగతాళి చేస్తుంది.[606]

మరదళ్ల హాస్యానికి అంతుండదు. తన వదిన వల్లంకి[607] పిట్ట అనీ, ఆమెను గదిలో పెట్టి గంజినీళ్లు పొయ్యాలనీ, ఆమెకు కొడుకు పుడితే తన పేరు పెట్టాలని సంబరపడుతుంది మరదలు.[608]

వివాహం చేసుకొని వెళ్లిపోయిన మరదల్ని చూడటానికి వదినగారు వెళితే ఎటువంటి సత్కారం చేయకుండానే శుష్క ప్రియాలతో రిక్తహస్తాలు చూపించే నెరజాణ మరదండ్రుకూడా ఉన్నారు. వదిన గారు వర్షం పడుతుంటే వచ్చింది. ఆమెను పొమ్మనటానికి బుద్ధి పుట్టలేదు. ఉండమనటం ఇష్టం లేదు. కాళ్లు కడుక్కోవటానికి నీళ్లిద్దామంటే చెంబుకు చిల్లులు పడ్డాయంటుంది. పీటవేసి కూర్చోపెడదామంటే స్థలం కొంచమేనంటుంది. కల్లిచ్చి దప్పిక తీరుద్దామంటే చేతిలో ఉన్నవి చెల్లని పైసలంటుంది. సామలు (సన్నని ధాన్యం) దంచుదామంటే నూకలయిపోతాయని భయమంటుంది. కొఱ్ఱలు దంచుదామంటే క్రొత్తవైనా యంటుంది. వడ్లను దంచుదామంటే విత్తనాలకని ఉంచినవంటుంది. కోడిని కోద్దామంటే గుడ్లను పొదుగుతున్నదంటుంది. పాపం మరదలికి ఏంచెయ్యటానికీ పాలుపోవటం లేదట. పైసా ఖర్చు లేని పని ఆప్యాయంగా కౌగిలించుకుందామంటే కడుపులో బల్ల వంగనీయటం లేదంటుంది. కళ్లారా చూచి ఆనందిద్దామంటే కళ్ల జబ్బు వచ్చిందంటుంది.[609] మరదలి ఈ చమత్కారపు మాటలు శ్రోతలకు

[606] మిన్నేరు, పుట -119.
[607] ఒల్లెంక = ముత్స్యవిశేషము అని నిఘంటువుల అర్థం. వీటిని తినే పిట్ట అయ్యుండవచ్చు.
[608] మిన్నేరు, పుట -161.
[609] త్రివేణి, పుట -237.

హాస్యజనకాలు. జానపదుల జాణతనం గూడార్థాలతో కూడిన వారి మాటల్లో తెలుస్తుంది. దీనినే 'ఛలము'[610] అని అంటారు.

వదన గార్ని సత్కరించలేదు సరిగదా తననే వదినగారు సత్కరించే ఉపాయం చెపుతుంది మరదలు. పొయ్యే దారిలో ఉన్న అంగడిలో కుప్పె కుదువ బెట్టి కొబ్బరి పంపించమంటుంది. మట్టెలంగడిలో మడిమ కుదువ బెట్టి మట్టెలు పంపించమంటుంది. గాజులంగడిలో కాలు కుదువ బెట్టి గాజులు పంపించ మంటుంది.[611] ఏమి జాణతనం! ఇంటికి వచ్చిన వదిన గారికి పచ్చి మంచినీళ్లయినా ఇవ్వకపోగా ఆమె నుండే లాభం పొందాలనే మరదలి గారి మాటలకు కడుపుబ్బా నవ్వుకోకుండా ఉండలేం.

మరిదిగారి చాటుమాటు చేష్టలన్నీ గమనించిన వదిన గారు మంగళహారతి పాడుతూ ఆ రహస్యాల్నిబయట పెడుతుంది "చక్కని మరిదికి జయ మంగళం, చుక్కవంటి మరిదికి జయమంగళం"[612] అంటుంది. సంధ్యవేళ చాకలి దానితో ముచ్చట్లు, విస్తళ్లు కుడుతూ వీథిలో ఈడిగ దానితో మాటలు, గుంటలు తవ్వుతూ కుప్పచాటున కుమ్మరి దానితో గుసగుసలు, ధోవతి కడుతూ దొమ్మరి దాన్ని పలకరించటం, చివరకు సాని ఇంటికి ఉడికిన ఉలవలు వడబోసుకుని తడిచిన కుక్కి నెత్తిన వేసుకుని పోతుంటే రాయి తగిలి పడటం - అన్నీ గమనించానంటుంది. చివరకు ఉల్లిగడ్డ (చిన్నఉల్లి), తవుడు, సున్నం ఉడికించి కట్టు కట్టుకొన్న మరిదికి సానుభూతి తెలియజేస్తుంది. మరిదిగారు రహస్యంగా చేసే పనుల్ని వదినగారు బయటపెట్టటం హాస్యానికి కారణమవుతుంది.

---

[610] ఛలము – ప్రయోజనాంతరమును ఉద్దేశించిన సమాధానము ఒకరికి దోషజనకమును, ఇంకొకరికి అభిసంధిజనమును అయినచో ఛలము. నౌ.శా. పుట 530.
ప్రియము వలె భాసించు అప్రియ వాక్యములు ప్రయోగించి మోసగించటయే ఛలము. ద.రూ. 3-17
ఉదా: వేణీ సంహారములో భీమార్జునులు "కర్తాద్యూతచ్ఛలానాం" అనిన సందర్భము.
సా.చ. పుట – 138. – సాహిత్య పదకోశం.

[611] త్రివేణి, పుట – 237.

[612] మిన్నేరు, పుట – 118.

అత్తాకోడళ్ల సంభాషణల్లో కోపంతోపాటు సునిశిత హాస్యం కూడా చోటు చేసుకుంటుంది. పండగ వచ్చింది పిండి వంటలకు బియ్యమెన్ని పొయ్యాలో అని కోడలడిగితే అత్తగారు దర్జాగా

"వెయ్యవే నిచ్చెనా
తియ్యవే గాదె"[613]

అంటుంది. ఆహా! ఎన్ని బియ్యం పొయ్యమంటుందో! ఎంత గొప్పగా పిండివంటలు చేయిస్తుందో అని ఎదురు చూస్తాం. తీరా చూస్తే

"పొయ్యవే తలగీచి
తవ్వెడు బియ్యం"[614]

అని ఆదేశిస్తుంది. వాటిని దంచి అరిశెలు వండమంటుంది. అవి ఎంతమందికి పెట్టాలని! ఇరుగు పొరుగు వారికి ఇంకింత పెట్టాలట. ఇంట్లో పిల్లలకు కసరకుండా పెట్టాలట. మాపటి వేళకు మామకూ, మరునాటి చల్దులకు మరుదులకూ, ఇంటి పాలేర్లకూ పెట్టి సంతోష పరచాలంటుంది. అత్తగారి ఈ ఆదేశం ఆచరణలో సాధ్యం కాదు. సాధ్యం కానిదాన్ని సాధ్యం చెయ్యమని కోరటంలోనే హాస్యం సముత్పన్నమవుతుంది.

అత్తా కోడళ్ల ఎత్తిపొడుపులు తమాషాగా ఉంటాయి. కోడలయినంత మాత్రం చేత అత్తగారు ఏమన్నా పడాలని లేదు. తన శీలాన్ని శంకిస్తూ మాట్లాడితే సహించదు.

"కోడలా! కోడలా! కొడుకు పెళ్లామా!
కొడుకూరిలో లేడు కోక యెక్కడిది?"[615]

అని అత్తగారు ప్రశ్నిస్తే

"అత్తా! అత్తా! ఓ అత్తగారా!
మామ ఊళ్లో లేడు మల్లెలెక్కడివె?"[616]

[613] మధుర కవితలు, పుట – 385.
[614] పైదే.
[615] తెలుగు హాస్యము, పుట – 54.
[616] పైదే.

అని సూటిగా, ఘాటుగా ఎదురు ప్రశ్న వేస్తుంది. దీనినే ప్రత్యాపేక్షం (retart) అంటారు. అత్తను మించిన కోడలు, కోడల్ని మించిన అత్త. పరస్పర రంధ్రాన్వేషణ చేసుకొనే వారి మాటల నైశిత్యం శ్రోతలకు చమత్కార కారకం.

మోటు సరసాల్ని నిరూపించే పాటలు కూడా జానపద వాఙ్మయంలో అక్కడక్కడా లభిస్తాయి. అత్తకొడుకు వస్తే పందిరివేసి పందిట్లో పీట వెయ్యమంటుందొక జాణ. పీట మందు కోడిగ్రుడ్డు పెట్టాలట. ఆ గ్రుడ్డు మీద కూరారబొయ్యాలట. అదే బావకు ఫలహారం. ఆ తరువాత పల్లేరు తెప్పించి ప్రక్క వెయ్యమంటుంది. నల్లేరు తెప్పించి నలిచి రాయమంటుంది. అప్పటికీ బావకు తిక్క కుదరకపోతే దూలగుండ తెచ్చి దులిపి పంపమంటుంది. ఇంతకూ అత్తకొడుకు చేసిన నేరం ఏమిటి? అతడు తెచ్చిన కోక మొల తిరగలేదట. రైక ముడికందలేదట![617] ఇట్టివి క్రియాత్మక హాస్యానికి నిదర్శనాలు.

**పెళ్లిళ్లలో వరుస లాడటం** : పెళ్లిళ్లు, పేరంటాలు, విందులు, వినోదాలు ఒక విధమైన సాంఘిక సమావేశాలు. బంధువులు రాకపోకలు సాగించటానికి మంచి అవకాశాలు. ఇచ్చిపుచ్చుకోవటం, సంబంధ బాంధవ్యాలు నెరపుకోవటం ఈ సమయాలలో విశేషంగా జరుగుతాయి. హాస్య ప్రవృత్తిగల స్త్రీలకు వదినలతో మరదళ్లతో, బావలతో మరుదులతో, అత్తలతో మామలతో ఓపికకొద్దీ వరుస లాడటానికి మంచి అవకాశం.

పెళ్లిళ్లలో వియ్యాలవారిని ఆటపట్టించే విధానం కాస్త మొరటుగానే అన్పిస్తుంది. వియ్యపురాలిని గయ్యాళిగంపగా కయ్యానికి కాలుదువ్వే కలకంఠిగా అభివర్ణించటంలో హాస్యం ఆవిర్భవిస్తుంది. వియ్యపురాలికి గంధం పూయబోతే దయ్యంలాగ చూసి చేయిపట్టి విదిలించిందట. కాలికి పసుపు పూయబోతే సోలిసొక్కినట్లుండి తాలిమి లేకుండా తూటు మాటలాడిందట. నొసట కుంకం పెట్టబోతే ముఖం తిప్పుకొన్నదట. అత్తరివ్వబోతే మొత్తం తల తిప్పుకొన్నదట. వీటన్నిటికంటే పరాకాష్ట చీర కట్టబోతే సిగ్గు ఎగ్గులేక మగవాళ్లు ఓర కంటితో

[617] మధుర కవితలు, పుట – 393.

చూస్తుంటే చీరె విడిచి పారిపోయిందట.[618] ఈ సంఘటనతో అక్కడున్న వనితలందరూ పగలబడి నవ్వుకొని ఉంటారు. ఇవన్నీ జరిగినవి కావు. జరగక పోయినా జరిగినట్లు భావించి పాటలుపాడి వినోదాన్ని, ప్రమోదాన్ని అనుభవించటం సంప్రదాయం.

పెళ్లిళ్లలో మగపెళ్లివారికి ప్రత్యేకంగా విడిది ఏర్పాటు చేస్తారు. కావలసిన వస్తువులన్నీ విడిదింటికే పంపుతుంటారు. తాము సమృద్ధిగా అన్ని వస్తువులూ పంపిస్తున్నా వాడుకోవటం చేతగాని అనాగరికలు వియ్యాలవారని విమర్శిస్తుంటారు ఆడపెళ్లివారు పళ్లు తోముకోవటానికి పుల్లలు, పది బిందెల నీళ్లు పంపితే అసలు పళ్లే తోముకోలేదని; వేడినీళ్లు, సబ్బుబిళ్లలు పంపితే స్నానమే చేయలేదనీ; అద్దం, దువ్వెన, అత్తరులు పంపితే బట్టతలల వియ్యపురాళ్లు తలే దువ్వుకోలేదనీ పరిహాసపు పాటలు పాడుతూ ఆనందిస్తుంటారు.[619]

వదినగారి వన్నెలూ చిన్నెలూ వర్ణించే పాటలెన్నో ఉన్నాయి. వన్నెలాడి వదినగారు వయ్యారంతో పెళ్లికి వస్తే పెళ్లిపందిరి గడగడ వణికిందట. దీపాలన్నీ తలలు వంచాయట. చక్కని వదినగారు వంకర నడకతో కూలబడితే ప్రక్కనున్న మరదలు లేపి మట్టి దులిపిందట. వియ్యపురాలికి అరటి పండు అందిస్తే తొక్కతోనే మింగి కక్కుకొన్నదట. ఈవిధంగా వదినగారి వన్నెలకు వియ్యపురాలు మంగళ హారతులు పాడుతుంది[620].

ఈ వెటకారానికి అంతుండదు. ఛీఛీ! సిగ్గులేదా! నీకు తగునా! అని ఈసడిస్తూ కొర్రన్నం, గోంగూర తినేదానివి పులిహోరకు వాచిపోయావా! టింగు రంగాయని సోకు చేసుకొని అందరివంకా చూస్తుంటావు, రోజామల్లె చీరగట్టి బట్ట చెంగు చేతబట్టి, బాజాబందొకటి కట్టి బజారున తిరుగుతుంటావు, రాగిడీలు మోటయ్యాయి, నాగరాలు అమిరాయి, నాగరికత నేర్చావు[621] అని వియ్యపురాలిని

618 మిన్నేరు, పుట -137.
619 త్రివేణి, పుట – 246.
620 జానపద గేయాలు, ద్వి.సం., పుట – 29.
621 సరాగాలు, పుట – 165.

నిరసిస్తూ సాగే పాటలో హాస్యం శృతిమించింది. ఈనాడు వినే వారికి ఈ పాటలంత నాజూకుగా ఉండకపోయినా ఆనాడు ఈమాత్రపు మోతాదులో ఉంటేగాని బంధువులు పగలబడి నవ్వేవారు కాదేమో! ఇంతకన్నా మొరటైన హాస్యపు పాటలున్నాయి.

వదినల్ని కుక్కలతో పిల్లులతో పోల్చటం, పందిమూతుల వాళ్లని, బాన కడుపుల వాళ్లని, కోరపండ్లు కలవారని, కూరిమితో తాబేలు నడకలతో కోరివచ్చారని వర్ణించే పాటలు చాలా ఘాటైనవి.[622] అయితే ఈ పోలికలు ఒక విధంగా సమంజసమే అని చెప్పవచ్చు. ఎందుకంటే వదినలు తరువాత పాటలు పాడుతారు. అవి ఈ జంతువుల కూతలుగా ఉండటం చేత నీచోపమలు అయినా తప్పులేదు. వదినల సంగీతానికి మెచ్చి సభలోని వారందరూ చింపి గొంగళి కప్పారట.

పరాచకానికి దిగితే హద్దుండదు. అది ఎంత నీచానికైనా ఒడిగట్టిస్తుంది. గుంపులు గుంపులుగా వదినలు కుక్కపిల్లల్లాగా, ఎలుగుగొడ్లలాగా పీటలెక్కి కూర్చున్నారట. పెద్ద వియ్యపురాలు బియ్యం బొక్కుతున్నదట. పిల్లికి పల్లం[623] వేసి పిలవనంపాము, ఎలుకకు పల్లంవేసి పిలవనంపాము, గాడిదకు పల్లం వేసి పిలవనంపాము త్వరగా నీవు కూడా రా అని గాడిద కాళ్ల వియ్యపు రాలిని గాఢ ప్రేమతో ఆహ్వానించటంలో జనించే పరిహాసం అధమశ్రేణికి చెందిందని చెప్పవచ్చు.[624]

వరసల్లో ఎత్తి పొడుపు పాటలు, మెత్తని చెప్పుతో కొట్టి నట్లుంటాయి. తిండిపోతు వదిన, తిండి పోతు బావ, తిండిపోతు మామ – వీరంతా అప్పుచేసి పప్పుకూడు తినే రకమని మరదలు మెత్తమెత్తగా ఎత్తిపొడుస్తుంది. ఆ చంకలో ఒక పిల్ల, ఈ చంకలో ఒక పిల్ల, కడుపులో ఒక పిల్ల కదలాడుతుంటే సంసారం పెద్దదై

622 తెలంగాణ పల్లెపాటలు, పుట -53.
623 పల్లం = గుఱ్ఱము లోనగువాని నెక్కునపుడు క్రింద మెత్తగా నుండుటకై కుట్టి మీద వేసి కట్టెడు గంత –శ.ర.
624 మిన్నేరు, పుట -163.

పోతున్నదే పొద్దుపు చేసుకోనిదే జీవించటం ఎలా అనే ఆలోచన లేకుండా తిండియావతో జీవించే వదిన గారికి 'జయమంగళం' పాడుతుంది మరదలు. ఆరు చాట్ల (చేటల) అన్నం, మూడు చాట్ల ముద్దపప్పు తిన్నది చాలక తెడ్డునాక్కొనే దొడ్డ వదినను మాటలతో అడ్డగించటానికి ప్రయత్నిస్తుంది మరదలు. అప్పుల వాడొచ్చి చెప్పుతో కొడుతున్నా పప్పుకోసం అప్పిళిస్తాడు బావ. 'చూరులో ఉండే చుంచెలుకకు బావ నెత్తికీ మంగళమని, గుంటలో ఉండే గోండ్రు కప్పకూ, వదిన కొప్పుకూ మంగళమని, అడవిలో తిరిగే నల్లమూతి కోతికి, మామమూతికి మంగళమని, వదిన గొంతుకి కుంటలో తిరిగే గుడ్డి కొంగకూ మంగళమని' పరిహాసం చేస్తూ పాటపాడుతుంది మరదలు. ఈ పోలికలు హాస్యజనకాలు. నవ్వులాటకు పాడుకొనే పాటలుగాబట్టి వీటిలో ఎంత అవహేళనమున్నా హెచ్చరికలో హితవు దాగున్నది గాబట్టి అవతలివారు సరసంగానే స్వీకరిస్తారు[625].

పెళ్లి సరసాలలో వరస పాటలు కొన్ని ఒకే మాదిరిగా ఉంటాయి. తమవంక వారు పుట్టు భోగులని, పోటు బంటులని, అవతలివైపు వారు పిసినిగొట్టులని, పిరికి బంటులని ఆత్మస్తుతి, పరనింద చేసుకోవటం అధికంగా కన్పిస్తుంది. ఆ పిసినిగొట్టుతనాన్ని నిరూపించటంలో కొంత హాస్యం వ్యక్తమవుతుంది. గొణిగి గొణిగి వక్కలిస్తారని, గూడూరు మార్గంలో గుడ్డెద్దు చచ్చిపడి ఉంటే గుండెకాయలకు ఏట్లాడేవారని, గిద్దెడు బియ్యంవండి, గద్దల్ని చంపి అన్నాలు పెట్టేవారని అవతలి వార్ని కించపరచటమే ఇందులోని హాస్యం.[626] ఇది అధమస్థాయికి చెందిన హాస్యంగా పరిగణించవచ్చు.

**పెళ్లి విందుల్లో వినోదం** : వియ్యాలవారు ఎంతో ఖర్చు పెట్టి ఘనంగా విందు భోజనాలు ఏర్పాటు చేసినా ఏమీ బాగాలేవని విమర్శించటం సహజంగా కనిపిస్తుంది. వట్టి కంది పప్పు వడ్డించారని, ముడిబియ్యపన్నం పెట్టారని, ములక్కాయ ఇగురు వేశారని, పచ్చి తామరాకుల మీద వడ్డించారని, భోజనా

625 త్రివేణి, పుట – 232.
626 పైదే, పుట – 230.

నంతరం పుచ్చిపోయిన వక్క, వాడిపోయిన ఆకులు, పొట్లిపోయిన సున్నం ఇచ్చారని ఆక్షేపిస్తారు.[627] భోజనం ఎంతబాగున్నా ఇలా తక్కువ చేసి మాట్లాడటమే ఇందులోని వినోదం.

ఇంద్రవైభవంగా పెళ్లి చేసినా నిష్టూరాలు, ఎత్తి పొడుపులు తప్పవు. ఇద్దరికి ఒక మెతుకు ఇగ్గులాట (గుంజులాట) అయిందట. ముగ్గురికి ఒక మెతుకు ముగ్గులాటయిందట. పని మనిషికొక మెతుకు పంచన వేశారట. పోకల తిత్తిలో అయిదు పోకలే ఉన్నాయని, ఆకుల గంపలో అయిదాకులే ఉన్నాయని దెప్పిపొడుస్తారు. చివరకు 'అవునవునె మనపెండ్లి యెంత సంబరము, బాపల్లు సదివేరు, బట్లు పొగిడేరు' అని నిట్టూరుస్తారు. బ్రాహ్మణులు మంత్రాలు బాగానే చదివారు. భట్రాజులు బాగానే స్తోత్రాలు చేశారు. కానీ విందు బాగాలేదని, వస్తు సమృద్ధి లేదని చేసే విమర్శలో సత్యం లేదు కనుక సరసంగా హాస్యాన్ని జనింపచేస్తుంది.[628]

ఆడపెళ్లి వారిని వెక్కిరిస్తూ పాడే విందు పాటలు ఎన్నో ఉన్నాయి. విస్తళ్లు హస్తమంతకూడా లేవు. కూర్చోవటానికి తగినంత చోటులేదు. ఎలా కూర్చోవటం? ఎలా కులుపుకోవటం? ఎలా తినటం? అనే సమస్యతో ప్రారంభమవుతుందొక పాట. ముక్కిపోయిన బియ్యం వండారని, దానిలోకి ముద్దపప్పు వేశారని, దానికి తగినంతగా నెయ్యి వెయ్యకపోవటం శోచనీయమని, చెయ్యి కడగవలసిన పనే లేకుండా పోయిందనే విమర్శ తమాషాగా అనిపిస్తుంది. వంకాయ కూర చేశారేగాని అందులో ఉప్పుకారం సరిగా లేవని, నంజుకోవటానికి పచ్చడికూడా లేదని వాపోతున్నట్లు పాట సాగుతుంది. వియ్యాలవారు కలహాలతో పాటు కొన్నిట్లో కారాలు కూడా గుచ్చెత్తినట్లు విమర్శిస్తారు. పులిహోర పులుపు చెప్పనలవిగాదట. అది చింతకాయ పులుసులాగా ఉందట. కరివేపాకు మాత్రం దండిగా ఉందట. లడ్డు, జిలేబీలు మడ్డి తేలుతున్నాయట. ఇవన్నీ వడ్డిస్తున్న వదిన గారికి వడ్డాణం

[627] త్రివేణి, పుట – 32.
[628] పైదే, పుట – 226.

ఊడిపోయిందట. ఈ పాటలో హాస్యం మృదువుగా, వియ్యాలవారు విన్నా ఆనందించేటట్లుగా ఉంది.[629]

పెళ్లి విందును విమర్శించే వినోదాత్మక గేయం మరొకటి ఉంది. 'ఈతాకుల యిల్లు కట్టి, మొగిలాకుల పందిళ్లేసి' మామగారు తమ కూతురి పెళ్లి చేశారట. మూడేళ్లనాటి ముక్కబియ్యం ముద్దరాలు అత్తగారు మూలబోసిందట. కూతుర్ని కన్ననాటి నుండి పెళ్లికని కందులు బేరం చేసి గంపల్లో దాచి పెట్టినా ఎక్కడ అయిపోతాయోననే లుబ్దత్వంతో పప్పు సరిపోను వండనే లేదట. పెళ్లి చేయించిన బ్రాహ్మణుడు తాంబూలమివ్వమంటే దడిచాటున అత్తగారు దడదడలాడిందట.[630] ఈ విధంగా లుబ్ధత్వాన్ని పెళ్లికూతురి తల్లిదండ్రులకు అంటగట్టడం అలవాటయిన ఆచారం. ఎంతో కొంత లుబ్దత్వం ఉండి ఉండవచ్చు. దాన్నే గోరంతలు కొండంతలుగా చేయటం వల్ల హాస్యం పొడగడుతుంది.

'ఈలాటి వియ్యాలవారు మాకెక్కడ దొరికినారో' అనే పాట హాస్య రసస్ఫోరకమైంది.[631] అప్పడం ఒక్కటే వడ్డించారట. శాస్త్రానికికైనా పప్పులేదట. చప్పని పచ్చళ్లు, కరకరలాడని వడియాలు వడ్డించారట. శాకపాకాలు సరిలేవట. తోటకూర ఒక్కటే వేయించారట. పరమాన్నం కొండ నాలుకకు కూడా అందలేదట. ఏ కూర అడిగినా మారొడ్డించటం లేదట. తమలపాకులు అసలే లేవట. తమకైతే ముప్పొద్దూ తాంబూలమట. మంచి నీళ్లు మాత్రం గడియ గడియకూ కావాలా అని అడిగేవారు అధిక సంఖ్యలో ఉన్నారట.

ఇంతవరకూ చేసిన విమర్శలు పెళ్లికొడుకు పక్షం వారివి. పెళ్లి కూతురు పక్షం వారికి అంతగా మాట్లాడటానికి అవకాశం లేకపోయినా వాళ్లూ నోరు మూసుకొని ఉంటారనటానికి వీలులేదు. పదిమాటలకొక మాటైనా జవాబు చెప్పాలి గదా! పెళ్లికొడుకు పక్షం వారిని విమర్శిస్తూ తమ అక్కసును తీర్చుకుంటారు.

629 మధుర కవితలు, పుట – 376.
630 సరాగాలు, పుట – 106.
631 మిన్నేరు, పుట – 136.

సన్నబియ్యపన్నం చాలు అన్నవారు లేరట. నెయ్యంతా నీళ్లులాగా త్రాగారట. కూరలు ఎంతబాగా చేసినా బాగున్నాయన్న ప్రశంస లేదట. అరిటాకుల్లో అన్నం తినటం అలవాటులేక కాబోటు వాటిని చింపుకుంటున్నారట. పచ్చళ్లు తినే అలవాటట, పప్పుకూరలు తినలేదట. చెప్పుకుంటే సిగ్గుచేటు. గొప్పవారని పిల్లనిచ్చాము. మోసపోయాము అని వారి వాచిపోయిన తనాన్ని ఘనంగా విమర్శించి హాస్యాన్ని పుట్టిస్తారు.[632]

**అప్పగింతలు, సలహాలు** : ఆడపిల్లకు పెళ్లి చేసి అత్తవారింటికి పంపించేటప్పుడు అత్తింటివారికి అప్పగిస్తూ కంటతడి పెట్టని కన్నవారుండరు. శకుంతలను అత్తవారింటికి పంపే సమయంలో కణ్వమహర్షి అంతటి వాడిచేతనే కన్నీరు పెట్టించిన కరుణ రసాత్మక ఘట్టమిది. అటువంటి బరువైన సన్నివేశాన్ని సహితం సున్నితమైన హాస్యంతో తేలిక పరిచారు జానపదులు.

ఆడపిల్లకు పెళ్లయితేనే చాలని ఆరాటపడతారు. అయిన తరువాత పెళ్లికొడుక్కి ఇల్లు లేదు, వాకిలి లేదు, అప్పులు చాలా ఉన్నాయని తెలుసుకొని చేసేదిలేక నిట్టూరుస్తారు.

"అప్పాగించితీమయ్య
అప్పాల ఉపాశరణ."[633]

'అప్పుల ఉపశరణ' అనే మాటే హాస్యజనకం. అప్పులకుప్పయిన పెళ్లికొడుక్కి అమ్మాయి నప్పగిస్తున్నామనే పల్లవి నవ్వుపుట్టిస్తుంది. మిగతా పాటంతా నీతులబోధే.

ఇటువంటిదే మరొక అప్పగింతల పాట.

"మేడా మిద్దె కలావారని పిల్లానిస్తిమి
మీ చిల్లా పెంకునైన ఎరుగామైతిమి
డబ్బు గిబ్బు కాలావారని పిలానిస్తిమి
మీ చిల్లా పెంకునైన ఎరుగామైతిమి."[634]

---

[632] మిన్నేరు, పుట – 136.
[633] తెలంగాణ పల్లెపాటలు, పుట -35.
[634] పైదే.

నిజానికి పిల్లను చేసుకున్న వాళ్లు డబ్బున్నవాళ్లే అయినా చిల్ల పెంకులేని వాళ్లని అనటం హాస్యస్ఫోరకం. దీనికి పెళ్లివారు కూడా ఏమీ అనుకోరు. వాళ్లు కూడా నవ్వుకుంటారు, నిజంగా లేని వాళ్లయితే బాధపడతారు.

పూర్వం పదిమంది ఉన్న కుటుంబంలో పిల్లనివ్వటానికి ఇష్టపడేవారు. దానికి పేరడీగా

"అత్తమామలు గాని ఆడబొట్టెలు గాని
లేరమ్మ నీదెంత పున్నెమో గాని"[635]

అని అనటంలో హాస్యం జనిస్తుంది. మగడ్ని మర్ధించి వశం చేసుకోమని, గజగజా వణికించి గిరిగీసి కూర్చోబెట్టమని, ఇరుగు పొరుగువార్ని హడలగొట్టమని

"పతి కోపపడినపుడు పడియుండబోక
అంతకు పదిరెట్లు అతని మర్ధించు"[636]

అని చెప్పే సలహాలు వినేవాళ్లకు విడ్డూరంగా ఉండి అప్రయత్నంగా నవ్వుపుట్టిస్తాయి. చివరకు నారీలోకానికి ఆ వీరనారి ఇచ్చిన సందేశం.

"భర్తను వంచుకోగల భార్య గౌరవమెన్న
రారాజుకునైన రమణిరోలేదు."[637]

ఈవిధంగానే సలహాలు చెప్పే పాటలు వాస్తవానికి దూరం కావటం చేత హాస్యానికి ఆకరాలవుతాయి.

"పతివ్రతా ధర్మంబు భక్తితో సలిపి
అతని చెంపా మీద అంటిస్తు ఉండు"[638]

అనటం మొరటుగా ఉంది కాబట్టి మొరటు హాస్యాన్నే కలిగిస్తుంది. అయినా చివరలో సూచన చాలా సున్నితంగానే ఉంది.

[635] సరాగాలు, పుట – 75.
[636] పైదే.
[637] పైదే.
[638] మధుర కవితలు, పుట -374.

"ఏకువలె మెత్తంగ ఎరుగనట్లుండి
మేకువలె బిగుసుకొని మేలుకొనియుండు."[639]

గడసరి ఆడదానికి ఎవరి సలహాలూ అక్కరలేదు. మెత్తని అతివకు ఈ సలహాలన్నీ వ్యర్థమే.

అనుకరణవల్ల హాస్యం పుడుతుంది. లోకప్రసిద్ధమైన వస్తువును గాని, శైలినిగాని, కావ్యాన్నిగాని అనుకరించి హాస్యాన్ని పుట్టించవచ్చు. దీనినే హాస్యానుకృతి (parady) అంటారు. కూతుళ్లను వివాహానంతరం అత్తవారింటికి సాగనంపేటప్పుడు నీతులు గరిపే పాటల్ని అనుకరిస్తూ అవినీతిని బోధించే పాటలెన్నో హాస్యానుకృతులుగా ఏర్పడ్డాయని త్రివేణి[640] లో పేర్కొనబడింది.

"మొగనికి సంసారం బిడ్డలారా
మీరు మొత్తుకున్న చేయకండి బిడ్డలారా
- - - - - - - - - - - - -
బాజార్ల గుడిసేత్త బిడ్డలారా
మీరు బాగా బతకండి బిడ్డలారా
ఈదుల్ల ఇల్లేత్త బిడ్డలారా
మీరింపూగ బతకండి బిడ్డలారా."[641]

ఈవిధంగా చేసే వ్యతిరేక బోధనలు వింతగానూ, వినోదాత్మకంగానూ ఉంటాయి.

**శృంగారంలో హాస్యం :** హాస్యం శృంగార రసానికి దోహదకారి అని ఈ గేయాలను పరిశీలించినప్పుడు స్పష్టమవుతుంది. భార్యాభర్తల హాస్యపూరిత సంభాషణల్లో శృంగారం తొణికిసలాడుతుంటుంది.

---

[639] మధుర కవితలు, పుట – 374.
[640] పుట – 238.
[641] పైదే, పుట – 236.

భర్త నిత్యశంకితుడు. ఆ శంకను తీవ్రం చేస్తూ నర్మగర్భితంగా భార్య మాట్లాడితే అతడు ఉత్కంఠతో తన సందేహాల్ని ప్రశ్నలుగా సంధిస్తాడు. గడసరి భార్య వాటికిచ్చే సమాధానాలు భర్తకు ఆశ్చర్యానందాల్ని కలగజేసి ప్రేమను ఇనుమడింప చేస్తాయి. ఆ సమాధానాల్లోని వాక్చాతుర్యం ఎవరికైనా నవ్వు పుట్టించకమానదు.

ఒకరికి చేయినిచ్చాను, ఒకరికి కాలినిచ్చాను, ఒకరికి నడుమునిచ్చి కూర్చున్నాను అని భార్య అంటే భర్త ఎవరెవరికిచ్చావని ఉత్కంఠతో ప్రశ్నిస్తాడు. గాజులకు చేతినిచ్చానని, అందెలకు కాళ్లనిచ్చానని, వడ్డాణానికి నడుమునిచ్చానని భార్య చెప్పిన సమాధానంతో తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటాడు భర్త. పురుషుడు ఊహించిన దానికి స్త్రీ చెప్పిన సమాధానానికి పొంతనలేక హాస్యం ఉత్పన్న మవుతుంది. ఈ విధంగానే తాను ఏవేవో ఎవరెవరికో ఇచ్చానని భార్య అంటుంటే వారెవరో అనుకొని పిచ్చిగా ఆరాటపడతాడు భర్త. కాటుక లోపల పెట్టింది, బొట్టు బయట పెట్టింది, అద్దాన్ని పట్టుకొని కూర్చుంది. తలుపు చేరవేసింది, మంచాన్ని వాల్చింది, దీపానికి చెంగు విసిరి పడుకొంది. గేదెను కట్టబెట్టింది, దూడను విడిచిపెట్టింది, పాలముంతను పట్టుకొని కూర్చుంది. వక్కను నొక్కిపెట్టింది, ఆకును చుట్టబెట్టింది, సున్నం కోసం ఎదురుచూసింది.[642] ఎంతటి చమత్కార భరితాలీ సమాధానాలు! పురుషుని అమాయకపు ఆరాటం, స్త్రీ స్వభావగత కొంటెతనం ఆలకించే కొద్దీ చవులూరిస్తాయి.

అతివ ప్రతిచర్యా పతికి అమిత శంకను కలిగిస్తుంది. ఆ శంక తీరితేగాని అతని మనసు శాంతించదు. పురుషుడు శంకిస్తూ వేసే ప్రశ్నలకు స్త్రీ చేకూర్చే సమాధానాలు కోలాటపు పాటలో ఎంత కోలాహలంగా ఉంటాయో![643] 'గట్టుకు బోయి నేను కట్టెలు తెమ్మంటే కొప్పునున్నా పూలెక్కడివె భామా!' అని శీలాన్ని శంకిస్తాడు పురుషుడు. 'గాలి ధూళీ వచ్చి గంపంత మబ్బొచ్చి, కొమ్మ ఊగి కొప్పు నిండింది మగడా' నేనే రంకాడలేదు అని ఒట్టు పెట్టుకొంటుందా పడతి.

[642] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట- 114.

[643] పల్లెపదాలు, పుట – 61.

దానికేదోరీతిగా సమాధానపడ్డా 'కొంగునిండా దుమ్ము ఎక్కడిదె భామా?' అని తిరిగి ఇంకో అనుమానం వ్యక్తం చేస్తాడు. 'పాటేలు ఇంటికి పాలకని పోతేను, కట్టికోడె కాలు దువ్వింది మగడా' అంటుంది. దానికీ సరేనంటాడు పురుషుడు. మరి 'ఆ చెంపనున్న కాట్లో?' 'కోమటోరింటికి కొబ్బరికి పోతే తక్కెట్లో గుండొచ్చి తగిలిందట'. దీనికీ సరేనంటాడు. అయితే 'ఆ మంచంక్రింద వాడెవడు?' ప్రక్కింటి పడుచు పిల్లవాడు పిల్లికి తలనొస్తే నల్లి కోసం వచ్చాడు'[644] అంటుంది. ఎంత విచిత్రమైన సమాధానమిది! ఈ వింత సమాధానాలు కడుపుబ్బ నవ్విస్తాయి.

నెరజాణ అయిన స్త్రీ ఎంత సులభంగా అబద్ధాలు చెప్పగలదో ఒక గేయంలో నిరూపితం, 'చినపాపా! చినపాపా! నీ చీర చిరిగిందేమిటి?' అంటే 'పాటేలింటికి పాలకు పోతే పెనుగడి తట్టిందోయ్, ఈ చీరా అపుడే చిరిగిందోయ్' అంటుంది. రవిక చిరిగిందేమిటంటే అజాను రోకలి బుజాన పెడితే చిరిగిందని; కుంకుమ చెదిరిందేమంటే ఉడుకుడుకంబలి ఊదుకు తాగితే చెదిరిందని; కాటుక చెదిరిందే మంటే ఎచ్చికట్టె పచ్చికట్టె పొయిలో వేసి ఊదితే చెదిరిందని[645] అలవోకగా స్త్రీ చెప్పే సమాధానాలు మృదుల హాస్యోత్పత్తికి దోహదం చేస్తాయి. కొద్ది భేదాలున్న ఇటువంటి గేయభాగాన్ని 'కృష్ణశ్రీ' గారు పేర్కొన్నారు.[646]

పరిహాస శీలంగల భార్య భర్తను ఏ విధంగా వెర్రివెంగళప్పను చేస్తుందో మరొక గేయంలో నిరూపితం. 'రేలంగిసంతలో బొచ్చె పరిగె తెచ్చాను ముక్కెయ్యవే పిల్లా' అని భర్త కోరితే 'రెక్కలున్న చేపకి ముక్కులుంటాయా?''[647] అని సంధిగతంగా శ్లేషార్థాన్ని లాగి ఎగతాళి చేస్తుంది కొంటె కోణంగి అయిన భార్య. 'మారుటేరు సంతలో కోడిపెట్ట తెచ్చాను గుడ్డెయ్యవే పిల్లా' అంటే 'జుట్టున్న కోడికి గుడ్డుంటుందా?' అని ప్రశ్నించి మగడ్ని వెర్రిబాగులవాడ్ని చేస్తుంది. 'ఈరవాసరం

---

644 ఇప్పటికీ తెలంగాణాలో నల్లిని చంపిన వాసన తలనొప్పిని పోగొడుతుందని భావిస్తారని 'కృష్ణశ్రీ' గారి పరిశీలన, పల్లెపదాలు, పుట -63.

645 తెలంగాణ పల్లెపాటలు, పుట – 148.

646 పల్లెపదాలు, పుట – 63.

647 ముక్కెయ్యవే – ముక్క+వెయ్యవే – అని భర్త అర్థం. ముక్కు+ ఎయ్యవే –అని భార్య అర్థం.

సంతలో గేదె పెయ్య తెచ్చాను పాలెయ్యవే పిల్లా' అంటే 'కొమ్ములున్న గేదెకు పాలుంటాయా?' అంటుంది.[648] భర్త అమాయకత్వం, భార్యమాటల్లోని నైశిత్యం, దబాయింపు, వాక్చాతుర్యం (wit) వల్ల హాస్యం పుడుతుంది.

భర్త అసమర్థుడైతే భార్య అతడిని ఏ విధంగా ఆటపట్టిస్తుందో వేరొక గేయంలో వర్ణితం. ఏదో వంక పెట్టుకొని పనినెగ్గొట్టడం, భర్తను అవీ ఇవీ చేసి పెట్టు అని కోరటం హాస్యజనకం. ఎప్పుడూ భర్తను అలరించే భార్య ఎప్పుడైనా భర్త తనను అలరించాలని కోరుకోవటం సహజమే కదా! ఎండ్రకాయ కరిచిందని, వ్రేలిమీద గోరు మొలిచిందని తనకు గొర్రెను కోసి కూర వండి పెట్టమంటుంది. భర్త మాత్రం కందిపప్పు వండుకోవాలట. తనకు గోధుమ రొట్టెలు కాల్చాలట, భర్త జొన్న రొట్టెలు కాల్చుకోవాలట. తనకు పెరుగు బువ్వట, భర్తకు మజ్జిగ బువ్వట. తనకు పట్టె మంచం, అతనికి నులక మంచం. తనకు దూది దిండ్లు, అతనికి తేలిక దిండ్లు. ఇక చివరి కోరిక విసన కర్రతో విసరి నిద్రపుచ్చమనటం.[649] ఇవి స్త్రీ సహజమైన కోరికలు కావు. ఈ కోరికల్లోని అసాధారణ చిత్త ప్రవృత్తి చేత శబ్దాశ్రయమైన హాస్యం జనిస్తుంది.

మాటకు మాట సమాధానం చెప్పటంలో (repartee) బోటుల తెలివి తేటలు జానపద సాహిత్యంలో నిరూపితం.[650] మేనత్త కొడుకు వచ్చి నువ్వులు నూర్చాలి నూరెడ్లు పంపమంటాడు. దానికి సమాధానంగా మరదలు పాలు త్రాగి మాయెడ్లు ప్రత్తి నూర్చటానికి వెళ్లాయంటుంది. ప్రత్తి చేనెన్నడూ నూర్చంగదా అని బావ అంటే నువ్వు చేను మాత్రం నూరుస్తారా అని అత్తకూతురు చురక వేస్తుంది. తన మరదలు జాణ అని గ్రహించి మారు మాట్లాడకుండా వెళ్లిపోతాడు బావ.

చేష్టాగతమైన హాస్యానికి ఒక గేయం ఉదాహరణగా కనిపిస్తుంది. తనకు నెల తప్పిందని, నెల బాలుడు పుడతాడని కొండంత ఆశ కలిగిస్తుందొక భార్య.

---

[648] మిన్నేరు, పుట -200.
[649] త్రివేణి, పుట – 220.
[650] పైదే, పుట – 212.

వేవిళ్లని, తనకేవేవో కోరికలున్నాయని భార్య అంటే వాటిని తీర్చటానికి సంసిద్ధుడవు తాడు మగడు. వెలగపండ్లు, దానిమ్మ పండ్లు తెమ్మంటుంది. ఉదయాన్నే పట్టణానికి ప్రయాణమవుతాడు. సాయంకాలం తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి భార్య తాను ఇంట్లోకి రాకూడదంటుంది. భర్త ఎంతో నిరాశపడతాడు. వారిద్దరూ ఒకరి తెలివి తక్కువ తనానికి ఒకరు నవ్వుకుంటారు.[651] బిడ్డల్ని కనాలనే ఆరాటంలో ఆలుమగలు పడే భ్రాంతి, ఆ భ్రాంతిలో వారు చేసే చేష్టలు హాస్యాన్ని పుట్టిస్తాయి.

మొత్తం మీద జానపద సాహిత్యంలో శబ్దాశ్రయమైన హాస్యమే కనిపిస్తుంది. స్త్రీ చతురోక్తులు హాస్య జనకాలు.

మనసు భారమైతే జీవితం నరకప్రాయమవుతుంది. కోపం, ఉక్రోషం, ఈర్ష్య, అసూయ, ద్వేషం, దుఃఖం మనసులో పేరుకుపోతే ఆ మనసు భారమవు తుంది. అందుకే ఎప్పటికప్పుడు ఆ భారాన్ని దించుకొని మనసును ప్రక్షాళనం చేసుకోవటానికి చెరువులు, వాగులు, వంకలు, నదులు నీటి ఉధృతిని తట్టుకోలేక గట్లు తెగి ప్రవహించినట్లు జానపదులు హాస్యాన్ని ఆలంబనగా చేసుకొన్నట్లు తెలుస్తున్నది.

## 5. కరుణ భావన

శృంగారమే రసరాట్టని ఆలంకారికులు పట్టాభిషేకం చేసినా గుండెల్ని పిండేది, పాషాణాలను సహితం నవ పీయూషం కావించేది కరుణరసమే. వాల్మీకి హృదయాంతర్గత శోకం శ్లోకమయింది.[652] అది రామాయణ మహాకావ్య రచనకు నాంది అయింది. 'ఏకో రసః కరుణయేవ'[653] అని నమ్మిన భవభూతి మాత్రం

[651] జానపద గేయాలు, ద్వి.సం. పుట – 53.

[652] "మా నిషాద! ప్రతిష్ఠాం త్వ
మగమః శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునాదేక
మవధీః కామమోహితమ్!" — మానిషాదమ్ – నాటిక. డా. బి. పురుషోత్తం, పుట - iii

[653] "ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదా
ద్భిన్నః పృథక్పృథ వాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగ మయాన్వికారా
నమ్భోభయథా, సలిలమేవ హి తత్సమస్తమ్" — ఉత్తరరామచరిత నాటకమ్, 3-41.

కరుణారస విలసితమైన సీతామహాసాధ్వి చరిత్రను 'ఉత్తర రామ చరిత్ర' పేరుతో కరుణ రసాత్మక నాటకంగా తీర్చిదిద్దాడు. అయినప్పటికీ శిష్ట సాహిత్యంలో శృంగార రసానికే అగ్రతాంబూలం. జానపద సాహిత్యంలోనూ శృంగార రసానికే పెద్దపీట వేసినప్పటికీ కరుణ రసానికి కూడా చోటు దక్కింది.

వివాహానంతరం ఆడపిల్లను అత్తవారంటికి పంపే సమయంలో ఆ సన్నివేశం కరుణ రస ప్లావితమవుతుంది. (ఈ విషయం ఇంతకు ముందే వివరించటం జరిగింది). అప్పగింతల తరువాత ఈ రస పరిపోషణ అత్యంత పరాకాష్టకెక్కింది అయిదవతనం లేని ఆడబ్రతుకు దైన్యస్థితిలో. రాగులు విసురుతున్న దొక నాతి. ఆమె అందచందాలు చూపరులను ఆకర్షించాయి. కాని బొట్టు లేకపోవటం చేత మొకం కళ తప్పింది. మరొక పడతి 'నీ మొగుడెందుబోయెనే' అని జాలిగా ప్రశ్నిస్తుంది.

'నాగలోకము పోయి నరుడయ్యి నిలిచె
దేవలోకము పోయి దేవుడై నిలిచె'[654]

అని సమాధానం చెపుతుంది.

సానుభూతితో ఆ నాతిని ఓదార్చటానికి ఎంతగానో ప్రయత్నిస్తుందా పడతి. వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ కరుణరసాత్మకమైన విసరు రాతి పాటగా రూపొందింది. నీ భర్త లేకపోయినా నీ చెల్లెలుందిగదా అంటే 'చేతి గాజులు పోయె చెల్లెలెవరమ్మా' అంటుంది. అన్నివిధాలా ఆదుకునే తల్లి ఉంది గదా అంటే 'తలమీద నీడబోయె తల్లియెవరమ్మా' అంటుంది. తండ్రి ఉన్నాడు గదా అంటే 'తాళిబొట్టూ బోయె తండ్రి యెవరమ్మా' అంటుంది. అక్క ఉంది గదా అంటే 'అయిన సంసారం బోయె అక్క యెవరమ్మా' అంటుంది. బావలున్నారు గదా అంటే 'తన అసలైన బలగం లేనప్పుడు బావలెవరమ్మా' అని బావురుమంటుంది. అన్నలున్నారు గదా అని గుర్తు చేస్తే 'అండా ఆసరాలేని అన్నలెవరమ్మా' అంటుంది. తమ్ములున్నారు గదా అంటే 'తాడు తలుగూ లేని తమ్మెలెవరమ్మా' అంటుంది. చివరకు నాథుడే ఉన్నట్లయితే

[654] త్రివేణి, పుట – 93.

అందలాలెక్కే దాన్నని అంతా యేలేదానన్నని తన దురదృష్టానికి దురపిల్లుతుంది. అయిన వాళ్లెందరున్నా మగడు లేని మగువ బ్రతుకు మాన్యం కాదని, మగడుంటే ఎవరు లేకపోయినా సంతోషంగా ఉండగలదనే భావం ఈ గేయంలో వ్యక్తమవుతుంది.[655]

ఇటువంటి దుఃఖం ప్రియుడిపట్ల అయితే దాన్ని బహిర్గతం చేయటానికి వీలుకాదు. మనువొకచోట మనసొక చోట అయిన స్త్రీకి చిత్తశాంతి ఉండదు. ప్రియుడు పరలోక గతుడైతే చింతాభారంతో కృంగిపోతున్నా బయటకు చెప్పకోలేదు. అందుచేత ఏ పిల్లిమీదో, సమయానికి వచ్చిన ఏ దూడమీదో పెట్టి తన బాధని పాట రూపంలో వ్యక్తం చేస్తుంది. కానీ ఈ పాటలంత రసవత్తరం కాకపోవటం చేత ఇట చర్చించటం లేదు.[656]

అన్నింటికంటే పరాకాష్ఠ త్యాగవీరంలో ప్రస్ఫుటమయ్యే కరుణరసం. మానవుడు త్యాగం చేత జీవించే ఉత్తమ సంస్కారి.[657] "జాతస్య హి మరణం ధ్రువం"[658] అనగా పుట్టిన ప్రతిప్రాణీ మరణించక తప్పదు. కానీ ఆమరణం పదిమందికీ ప్రయోజనకారి అయినప్పుడు దేశ రక్షణ బాధ్యతను తమ భుజస్కంధాలపై మోస్తున్న వీర జవానుల మరణం వలె అందరి ప్రశంసకు పాత్రమవుతుంది. అటువంటిదానినే త్యాగం అంటారు. వర్షాకాలంలో చెరువులు నిండి నీరు గట్లు పై నుండి పొంగి ప్రవహిస్తుంది. ఆ నీటి ఉధృతిలో గ్రామాలు కొట్టుకుపోతుంటాయి. ఇటువంటి వైపరీత్యం సంభవించినప్పుడు గంగమ్మ తల్లిని శాంతింపచేయటానికి గ్రామస్తులు రకరకాల ప్రయత్నాలు చేస్తుంటారు. అందులో ఒకటి గ్రామానికి చెందిన ఎవరినైనా బలి ఇవ్వటం. ఎవరిని బలి ఇవ్వాలనేది కూడా గంగమ్మతల్లే నిర్ణయిస్తుందని గ్రామస్తులు నమ్మకం. ఒకానొక గ్రామంలో ఇలాంటి ఆపద సంభవించినప్పుడు గ్రామ పెత్తందారు ఎందరి పేర్లనో చెబుతాడు. అయినా

[655] త్రివేణి, పుట – 93.
[656] మిన్నేరు, పుట – 508.
[657] "తేన త్యక్తేన భూంజీథాః" ఈశావాస్యోపనిషత్తు.
[658] భగవద్గీత.

పొంగు ఆగదు. పురుడు పోసుకోవటానికి పుట్టింటికి వచ్చిన తొలి చూలు ఇల్లాలు తన చెల్లెలి పేరు చెప్పగానే గంగమ్మ పొంగుఆగిపోయిందట. ఆ వార్త విని గ్రామస్తులు విలపిస్తుంటే వారిని ఓదార్చి గ్రామం క్షేమం కోసం తన తనువును త్యాగం చెయ్యటానికి ఆ సోదరి సిద్ధమవుతుంది. చక్కగా అలంకరించుకొని నెమ్మదిగా చెరువులో దిగుతుంది. ఆ సమయంలో అన్నా చెల్లెళ్ల మధ్యజరిగిన సంభాషణ రాతి గుండెను సహితం కరిగిస్తుంది. 'వదిన రాసిన పసుపూ తడిసె రన్నయ్యోరన్నయ్యా! అంటే దుఃఖభారంతోనే ఇంకా లోపలికి వెళ్లమంటాడు అన్న. అత్త కట్టిన చీర తడిసిందంటుంది. పిన్ని వేసిన జడ తడిసిందంటుంది. ఇంకా లోపలికి పోతుంది. చిన్నొదిన తొడిగిన రవిక తడిసిందంటుంది. ఇంకా లోలోపలికి పొమ్మని అన్న గద్గద స్వరంతోనే హెచ్చరిస్తాడు. అమ్మ పెట్టిన కాటుక, బొట్టు నీటిలో కలిశాయి. అంతే చెల్లెలు అదృశ్యమయింది.[659] మాటల్లో చెప్పుకుంటే ఈ పాట పస తెలియదు. రాగాలాపనతోగాని హృదయాలు ద్రవించవు. "ఆ పేరంటాలు గంగాగర్భంలో లీనమై పోయింది. కానీ ఈ కథ ఎప్పటికైనా కాలగర్భంలో కలిసిపోతుందా?"[660]

'ముసలమ్మగండి'[661] అనే పాట కూడా ఇటువంటిదే. ముసలమ్మ (పేరు) సర్వాంగ సుందరంగా అలంకరించుకొని, కొంగును నడుముకు బిగించి, ఘల్లు ఘల్లున కాళ్లగజ్జెలు మోగిస్తూ వెళ్లి బుక్కరాయ సముద్రం అనే చెరువుకు పడిన గండికి అడ్డంగా పడుకొని ప్రాణత్యాగం చేస్తుంది.

ఆధునిక కవి డా. కట్టమంచి రామలింగారెడ్డి గారు రచించిన 'ముసలమ్మ మరణం' గేయానికి బహుశా ఇటువంటి గేయాలే ప్రేరణ ఏమో!

సహజంగానే స్త్రీ త్యాగశీలి. అవసరమైనప్పుడు తన ప్రాణాల్ని తృణ ప్రాయంగా త్యజించగలదు. స్త్రీ జీవించి ఉన్నా శోభే మరణించినా శోభే. ముత్తయిదువుగా చనిపోతే ఆమె శవంకూడా పసుపు కుంకుమలతో రాగరంజిత

---

659 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట -31.
660 పైదే, పుట -32.
661 తెలంగాణ పల్లెపాటలు, పుట – 35.

మవుతుంది. చేటల పంపకంతో ఆమె ప్రేమను చెరిగి అందరికీ పంచుతారు. నిరంతరం లోక కల్యాణాన్ని ఆశించే స్త్రీ స్వభావం త్యాగ గరిమతో మహోదాత్తమవుతుంది.

## 6. నైతిక భావన

నీతి, నియమ పాలనం మానవ జీవితాన్ని పునీతం కావిస్తాయి. స్త్రీ నిగ్రహానికి పెట్టింది పేరు. కాని పురుషుడు ఆమెను ఏదో విధంగా లొంగదీసుకోవటానికి ప్రయత్నిస్తాడు. సాధ్యమైనంత వరకు ఎదిరిస్తుంది. తన శక్తి చాలనప్పుడు నిస్సహాయురాలవుతుంది.

ఒంటరిగా స్త్రీ కంటబడితే ఊరుకోడు పురుషుడు. ఒకానొక స్త్రీ కడవ తీసుకొని మెట్లబావికి నీళ్లు తీసుకురావటానికి వెళుతుంది. మెట్లు దిగింది. కడవ ముంచింది. జలకాలాడింది. చీర కట్టుకొని కడవెత్తుకోబోతే సాయపడటానికి బావి ఒడ్డున బంగారపు పుట్టు కనిపించింది. పుట్టమీద నాగులయ్య కనిపించాడు. కడవెత్తమని ఆ నాగులయ్యని కోరింది. నాగులయ్య మానవకారంలో క్రిందికి దిగాడేమో! గోత్రాలడిగాడు. చుట్టాల్నడిగాడు. చివరకు బలాత్కరించబోయాడు.

"బావల్లు గలదాన్ని తుమెదాలో
బాదలొచ్చు నాగులయ్య తుమెదాలో
మరుదూలు గలదాన్ని తుమెదాలో
మాటలొచ్చు నాగులయ్య తుమెదాలో
అత్తమామలున్నదాన్ని తుమెదాలో
అల్లారి వచ్చునయ్య తుమెదాలో
తల్లిదండ్రి గలదాన్ని తుమెదాలో
తలపోతలు నాగులయ్య తుమెదాలో
అన్నదమ్ములు గలదాన్ని తుమెదాలో
ఆరడొచ్చు నాగులయ్య తుమెదాలో.[662]

[662] తెలంగాణ జానపద గేయాలు, పుట -5.

అని పరిపరివిధాల నచ్చజెప్పటానికి ప్రయత్నిస్తుంది. కానీ నాగులయ్య వినలేదు. ఆ స్త్రీ నిస్సహాయురాలయింది. ఈ విధంగా మానవేతర ప్రకృతిలో కూడ అసహాయురాలైన స్త్రీని అవినీతి పాలు చేసే దౌర్జన్యాన్ని వర్ణించే గేయాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి.

ఇటువంటిదే మరొక గేయం.[663] ధరణీబాల నీళ్లకు పోతుంది. నాగరాజు ప్రత్యక్షమవుతాడు. అడుక్కి అరదుడ్డిస్తానని, నాగలోకం చీరలు, రైకలు ఇస్తానని, బిందెలిస్తానని, సొమ్ములిస్తానని రకరకాలుగా ప్రలోభపెడతాడు. అయినా లొంగక అతని కోర్కెను తిరస్కరిస్తుందా పడతి. అత్తమామలు, బావ, మరుదులు కలదాన్నని తాను అసహాయరాల్నని అంటుంది. అయినా వినడు నాగులయ్య. ఎలాగో తప్పించుకుని ఇల్లు చేరుకొంటుంది ధరణీబాల. అయినా వదలడు నాగులయ్య. 'అద్దమ్మ రాత్రికాడ తుమ్మెదా నిద్దరా పొద్దుకాడ తుమ్మెదా' నాగులయ్య రానే వచ్చాడు. నక్కినక్కి చూచాడు. ధరణీబాలను కాటువేశాడు. అయినా కసి తీరలేదు. ప్రక్కనున్న ఆమె బిడ్డను కూడా కాటువేశాడు. ఎందుకింత కక్ష? స్త్రీ నీతికి నిలబడితే ఎందుకింత ఆగ్రహం? ఎందుకింత కాఠిన్యం? నీతికి నిలబడిన నాతి తన ప్రాణాల్నే బలిపట్టింది.

ఒంటరిగా స్త్రీ త్రోవన పోతుంటే ఊరుకోడు పురుషుడు. ఆమెను అటకాయించి

"ఏ వూరు భామా? ఏమి నీ పేరు?"
అని వెంట పడతాడు పరాయి పురుషుడు.
"మా వోరు యింటేను, మంచోరు కాదూ"
అని బెదిరిస్తుంది. అయినా ఊరుకోడు.
"మీ వోరు యినకుండ, నీకు మాటరాకుండ
చెవిలోన వొకమాట చెప్పెళ్లరాదా"

అని మళ్లా వెంటపడితే తన ఊరి గుర్తు చెపుతుంది.[664]

---

663 జానపద కళా సంపద, పుట – 204-205.

664 జానపద గేయాలు, ప్ర. సం., పుట – 89.

పురుషుడు ఏదో ఒక నెపం పెట్టుకొని ప్రియురాలి ఇంటి పెరట్లోకి ప్రవేశించటానికి ప్రయత్నిస్తాడు. ఎవరైనా అడిగితే గోంగూరకో గోగునారకో వచ్చానంటాడు. ప్రియురాలికోసం పుట్టలెక్కి చూస్తాడు. చెట్టులెక్కి చూస్తాడు. కనిపిస్తే బరువులు పట్టుపట్టమంటాడు. మోపులు ఎత్తు ఎత్తమంటాడు. చివరకు చేయి పట్టుకుంటాడు. చెక్కిళ్లు పుణుకుతాడు. కళ్లలోకి చూస్తాడు. అప్పుడిరువురికీ ఒళ్లు పులకరిస్తుంది. వశం చేసుకుంటాడు. ఈ సన్నివేశాన్ని వర్ణించే జానపదగేయం ప్రసిద్ధమైంది.[665] మనసులో ఒకటి పెట్టుకొని వేరొకరీతిలో సంచరించేటప్పుడు 'ఎందుకోననుకొంటి, గోంగూరకి'! అంటారు. ఈ విధంగా పురుషపుంగవుల మిడిసిపాటు మేరమీరి నారీమణులను ప్రక్కదారిలో నడిపిస్తుంది.

అర్ధరాత్రి అదురూ బెదురూ లేకుండా ఇంటిముందరి అరుగు మీద కూర్చున్న ఆడపిల్లను చూచి వ్యామోహపడతాడు పురుషుడు. చల్లని వెన్నెల చక్కగా కాస్తున్నది. చూరుప్రక్కగా ఒరిగి తనను చేరరమ్మంటాడు మిండగాడు. కానీ దూరాన ఉన్న తనవాడు తొందరగా వస్తాడు రాలేనంటుంది. అయితే

"చుక్కాని యేలకీ, చల్లమ్మ వస్తాను
చల్లంగ పొమ్మురా, పిల్లోడా"[666]

అని అతడ్ని పంపివేస్తుంది. ఈ విధంగా చేసుకొన్న మగడ్ని మభ్యపెట్టి అన్యత్రా సంచరించే అవనీతి వరులైన అబలలు అక్కడక్కడా కనిపిస్తారు.

చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకొని ప్రయోజనమేముంది? తెలిసి పట్టుకున్నా, తెలియక పట్టుకున్నా నిప్పు నిప్పే. కాలకమానదు. ఇంకా ఈడేరని కన్య పురుషుడి కామాగ్నికి బలియై ఎంతగా విలపిస్తుందో వివరించే గేయం

"బాలరో నేచిన్నదాన్నిరో
తెలియరో నేచిన్న దాన్నిరో."[667]

[665] పల్లెపదాలు, పుట – 211.
[666] జానపద గేయాలు, ప్ర.సం., పుట -118.
[667] పల్లెపదాలు, పుట -218.

వడ్ల తట్టెత్తుకొని వలసకు పోయిందట. ఆ వలసలో ఆ కన్నె కొప్పు గొలుసు ఊడింది. ఈదుల కుంటకు నీళ్లకనిపోతే ఈతముల్లు గుచ్చుకొంది. దానితో ఈడేరింది. కడియాల కుంటకు నీళ్లకనిపోతే కవిలిముల్లు తగిలి కడుపయింది. తుమ్మల కుంటకు నీళ్లకనిపోతే తుమ్మముల్లు తగిలి తిమ్మడ్ని కన్నది. ఎంత బాధపడి ఏం ప్రయోజనం?

అందరి స్త్రీల ప్రవృత్తి నియమ నిగ్రహాలతో కూడిందని చెప్పలేం. పురుషులను కవ్వించే స్త్రీలు కూడా లేకపోలేదు. చట్టి చేత పుచ్చుకొని సాగిపోతూ, మిట్ట పల్లలాగ మిడిసి మిడిసి పడుతూ 'నన్ను చూసి నవ్వింది దేశోళ్ల చిన్నది' అని అంటాడు ఒకానొక యువప్రేమికుడు.'కోక కట్టుకుంది, సెవ్వాకు పెట్టుకుంది' మేలు కళ్లది, సల్లగ చెయి తాకుతేను పల్లకున్నది అని ఆనందిస్తాడు ప్రేమికుడు.[668]

'నీకూ నీ వారు లేరు, నాకూ నావారు లేరు
ఏటి యొడ్డున ఇల్లు కట్టబ్బీ, పెరుమాళ్ల చిన్నా"[669]

అని ధైర్యంగా పరాయి పురుషుడితో లేచిపోవటానికి సిద్ధపడే స్త్రీ ప్రవృత్తి ఆశ్చర్యం కలిగిస్తుంది. ఏరువస్తే ఈదుకుపోదామని కూడా ఉపాయం చెపుతుంది. క్రొత్తకుండ నీరు తీపని, కోరిన మగవాడు తీపని ఉబలాటపడుతుంది. ఆకాశంలో ఆకు తోటలు, ఆ మధ్యలో పూలతోటలు, ఆ మధ్యలో బండ్ల బాటలు – వాటిమీద నడక సాగించాలని కలలు గంటుంది. ఇటువంటి స్త్రీ ప్రవృత్తిని 'జారశృంగారం' శీర్షికలో వివరించటం జరిగింది.




668 పల్లెపదాలు, పుట -218.
669 పైదే, పుట – 175.

# 7. భక్తి భావన

హిందూ సాంప్రదాయంలో దైవారాధన ప్రధానమైంది. సంప్రదాయాలను అనుస్యూతంగా కాపాడటంలో స్త్రీలదే అగ్రతాంబూలం. 'భజ దేవాయామ్' భగవంతుని సేవించటమే భక్తి. ఈ భక్తి ఆడపిల్లకు చిన్నతనం నుండే అలవాటవుతుంది. ఎందుకంటే మగపిల్లలు బయట తిరుగుతుంటారు. ఆడపిల్లలు ఇంటికే పరిమితమవుతారు. అలా ఇంట్లో ఉండి ప్రతిక్షణం తల్లిని గమనిస్తూ ఆమె చేసే పనుల్నింటినీ అనుకరణతో చేయటానికి ప్రయత్నిస్తుంటారు. అందులో భాగమే దైవారాధన.

ఆడపిల్లలు ప్రొద్దున్నే లేచి చెట్లకు పూచిన పూలు ప్రోగు చేసుకొని మాలలు గుచ్చి భగవంతుని కర్పించాలని ఉబలాటపడతారు.

"ప్రొద్దున్నె ప్రొద్దున్నె లేద్దామా!
అందుగల పువ్వులూ కోద్దామా!
కోసినవి రాశులుగ పోద్దామా!
సాలింటికాడ సన్నదారము తెద్దామా!
దాసరింటికాడ సన్నసూది కొందామా!
అన్నిటిని దండలుగ గుచ్చుదామా!
దేవుడూ గుళ్లోకి పోదామా!
కిరకిర తలువులు తీద్దామా!
దేవుడు మెడలో వేద్దామా!"[670]

ఇటువంటి ఆకాంక్షలతో శ్రీకారం చుట్టబడుతుంది బాల జీవితం.

ఆడపిల్లలాడుకొనే బొమ్మలాటల్లో కూడా భక్తిభావనే తొంగిచూస్తుంది. తాము ఆడుకొనే బొమ్మల్ని రాముడు సీతగానో, రాధ కృష్ణుడు గానో భావించి గొప్ప భక్తితో సేవిస్తుంటారు కన్యకామణులు. సంక్రాంతి సమయంలో ఇంటి ముంగిట ఊడ్చి, కల్లాపి చల్లి, ముగ్గులు పెట్టి, మధ్యలో గొబ్బెమ్మను పెట్టి చుట్టూ తిరుగుతూ

[670] మిన్నేరు, పుట – 162.

లయబద్ధంగా అడుగులు వేస్తూ పాటలు పాడుతారు. (గొబ్బిపండుగ శీర్షికలో ఇంతకు పూర్వమే చర్చించటం జరిగింది). గొబ్బిని దేవతగా భావిస్తూ తమ ఆకాంక్షల్ని వ్యక్తం చేస్తూ వాటిని నెరవేర్చమని వేడుకుంటారు. అందమైన భర్తనిమ్మని కోరుకుంటారు.

"తామర పువ్వంటి – తమ్ముణ్ణిస్తావా
సేమంతి పువ్వంటి – చెల్లెల్నిస్తావా
మంకెన పువ్వంటి – మరదల్నిస్తావా
మల్లెపువ్వంటి – మొగుడ్నిస్తావా."[671]

పెళ్లయిన తరువాత స్త్రీకి ప్రత్యక్షదైవం భర్త. అతడు గుణవంతుడైనా కాకపోయినా, అందగాడైనా కాకపోయినా, సమర్థుడైనా కాకపోయినా స్త్రీ పాలిట అతడు భగవంతుడే. పురుషుడు చపలచిత్తుడు. అతనికి నిత్యనూతన సౌందర్యం కావాలి. అందగత్తె అయిన భార్యకు ప్రకృతి వైపరీత్యం వల్ల ఏ అమ్మవారో పోస్తే ముఖంలోని వికృతికి చిరాకుపడతాడు. ఆమెనొల్లనంటాడు. అటువంటి భర్తను కూడా ద్వేషించకుండా తనకు ఐదవతనాన్ని ప్రసాదించే దేవుడిగా భావించి పూజిస్తుంది.

"చేడె నిను వల్లాడు చెదలు ముఖమాని
గుణతి నిను వల్లాడు గొగ్గి పండ్లాని
పణతి నిను వల్లాడు పిల్ల జడలాని
నారి నిను వల్లాడు నల్ల ముఖమాని"[672]

అని నలుగురూ ఎగతాళి చేస్తే, వల్లకుంటే పోయె

"ముత్తైద కుంకుమ నొష్టికుంటె జాలు
చేరెడు గాజులు చేతులకుంటె జాలు
ముత్తైద మట్టెలు కాళ్లకుంటె జాలు
నాకు పెట్టిన పసుపు చెంపలకుంటె జాలు

671 మిన్నేరు, పుట -230.
672 త్రివేణి, పుట -301.

నా యొక్క మంగళ సూత్రం గట్టిగుంటె జాలు
నా యొక్క నల్లపూసలు మెడనుంటె జాలు"[673]

అని సంతృప్తిపడుతుంది.

వివాహానంతరం గుమ్మడి పండంటి పిల్లల్నివ్వమని మ్రొక్కుకుంటుంది. (గొడ్రాలి బ్రతుకు శీర్షికలో వివరించడం జరిగింది).

పసిపిల్లలు దైవ స్వరూపులంటారు. జానపద స్త్రీ తన బిడ్డను ఆ భావనతోనే ఏ రాముడిగానో, కృష్ణుడిగానో, లక్ష్మిగానో, రాధగానో ఊహించి భక్తిలో ప్రేమను రంగరించి ఆ బిడ్డను పెంచి పెద్దచేస్తుంది. (వాత్సల్య భావన శీర్షికలో వివరించటం జరిగింది).

పిల్లల్ని దైవ స్వరూపంగా భావించటం వల్లనే 5 సంవత్సరాలలోపు పిల్లలకు సంక్రాంతి సమయంలో భోగిరోజున భోగి పండ్లు పోసి మురిసిపోతారు.

శ్రావణమాసంలో ఆడపిల్లల్ని సాక్షాత్తుగా లక్ష్మీదేవిగా భావించి పూజలు చేస్తారు. 9 సంవత్సరాలలోపు ఆడ పిల్లల్ని పీటపై కూర్చో బెట్టి ముత్తయిదువు లందరూ కలిసి అమ్మవారికి పూజచేసినట్లే పూజచేసి భక్తి పరవశులవుతారు.

స్త్రీ ఎల్లప్పుడూ కుటుంబం కోసమే పరితపిస్తుంది. మంచి భర్త రావాలనో, చక్కటి బిడ్డలు కలగాలనో, భోగభాగ్యాలు కావాలనో, తన ముత్తయిదువతనం నిండు నూరేళ్లు నిలబడాలనో ఏవేవో కోర్కెలతో పూజలు చేస్తుంది. అంతేకాదు తనకు లభించిన సౌభాగ్యం ఈ జన్మకే కాదు జన్మజన్మలకూ కావాలని నోములు, వ్రతాలు ఆచరిస్తుంది. ఇవన్నీ దైవారాధనలో భాగమే. స్త్రీలు పాడుకొనే మేలుకొలుపులు, లాలిపాటలు, మంగళహారతులు అన్నీ భక్తిభావనతో నిండినట్టివే.

స్త్రీలు దేవుళ్లనీ, దేవతల్నే గాదు పర్వతాలను, నదులను, వృక్షాలను, జంతువుల్నీ పూజిస్తారు. రావిచెట్టును (అశ్వత్థ),[674] వేపచెట్టును, జమ్మి చెట్టును,

[673] త్రివేణి, పుట – 301.
[674] "అశ్వత్థః సర్వవృక్షాణామ్" –శ్రీమద్భగవద్గీత, విభూతి యోగం – 25 శ్లో.

మేడి చెట్టును (ఔదుంబర), తులసిని, ఉసిరిని దేవతలుగా భావించి పసుపు, కుంకుమ, పూలతో అర్చించి ప్రదక్షిణలు చేస్తారు. తమ కోర్కెలు నెరవేర్చమని కొబ్బరికాయను ఎర్రటి వస్త్రంలో చుట్టి చెట్టు కొమ్మలకు వేలాడదీస్తారు. సంతానమియ్యమని చిన్న చిన్న ఉయ్యాలలను కొమ్మలకు వేలాడదీస్తారు. తమ వాంఛితాలు తీర్చమని మొదలు చుట్టూ దారాలు చుడతారు. పుట్టలలో పాలు పోసి, పూజలు చేసి చలువచేసే చలిమిడి సమర్పించి నాగులను దేవుళ్ళుగా కొలుస్తారు. కుక్కను గౌరీదేవిగా భావించి పసుపు, కుంకుమలు పూసి మెడలో పూలదండలు, వేపమండలు వేసి, నైవేద్యాలు తినిపించి సంతృప్తి పడతారు. నదులను దేవతగా భావించి సేవించి తరిస్తారు. ఆలయాలు కొండలమీద ఉంటే దైవారాధనలో భాగంగా మెట్లపూజ చేస్తారు. తమ కోర్కెలు తీరాలని ప్రతి మెట్టుకూ పసుపురాసి, కుంకుమబొట్లు పెడతారు. కోర్కెలు నెరవేరితే మరల అదే విధంగా పూజిస్తారు. అంతెందుకు ఇంటి గడపను కూడా లక్ష్మీదేవిగా పూజిస్తారు. ఎంతటి ఉదాత్తులీ జానపదులు! ఎంతటి ప్రకృతి ప్రేమికులు!

నిరంతరం భర్తతోనూ, అత్తమామలతోనూ శాంతంగా నడుచుకొంటుంది గనుక స్త్రీ శాంతభక్తురాలు; భర్తకు, అత్తమామలకు, ఇతర కుటుంబ సభ్యలకు సేవలు చేస్తుంది గనుక దాస్యభక్తురాలు; భర్తతో ఏకాత్మ భావాన్ని వహించి సఖ్యం నెరపుతుంది గనుక సఖ్య భక్తురాలు; పిల్లల్ని లాలించి, పెంచి పెద్ద చేస్తుంది గనుక వాత్సల్య భక్తురాలు; తన సంపూర్ణ వ్యక్తిత్వాన్ని నది సాగరంలో కలిసినట్లుగా ఎక్కడో పుట్టిపెరిగి పెంపొందించుకొన్న తన వ్యక్తిత్వాన్ని భర్తలో ఐక్యం చేసి తననే దైవంగా పూజిస్తుంది గనుక మధుర భక్తురాలు. స్త్రీ జీవితం అసిధారావ్రతం. భక్తిభావ విలసితం.

'కష్టనష్టాలకోర్చి కనిపెంచేది
ఆత్మీయంగా అభిమానించేది
ఆత్మ సమర్పణ కావించేది
ఆ దేవత ఒక్కతే [illegible]'

IV

# జీవితాలంగాల విశేషాలు

1. కన్య జీవితం
2. దాంపత్య జీవితం
3. నియమ జీవితం
   [నోములు వ్రతాలు]
4. పండుగలు
5. ఆచార వ్యవహారాలు
6. మంత్ర తంత్రోచ్చాటనలు
7. వంటకాలు



# IV జీవితాలంకార విశేషాలు

## 1. కన్యాజీవితం

ఇంటికి వెలుగు కన్య. కుటుంబ సభ్యులందరి ప్రేమకు కేంద్రబిందువు ఆమె. ఆడపిల్లలున్న ఇల్లు ఆరామం వంటిది. రంగురంగుల పూలతో భిన్నభిన్నమైన మొక్కలతో శోభావహంగా కనిపించే పూదోట వలెనే ఆడపిల్లలున్న ఇల్లు కూడా వారి ఆటపాటలతో, పండుగ వేడుకలతో, బొమ్మల పెళ్ళిళ్లతో నిత్యకల్యాణంగా శోభిస్తుంది. ఆమె ఆటపాటల్ని చూచి ఆనందించని కుటుంబ సభ్యులెవరూ ఉండరు. కుటుంబ సభ్యులు ఎక్కడికి వెళ్లినా ఆడపిల్లకి కానుకలు తీసుకురాకుండా ఉండరు. ఇంట్లో అంతటి విశిష్టస్థానం ఆడపిల్లలది.

అందుకే గురజాడ అప్పారావు గారు ఆడపిల్లల్ని

"ఆటలపాటల పేటికలారా!
కమ్మని మాటల కొమ్మల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!" [675]

అంటూ ముచ్చటగా సంబోధించారు. బాలికల బాల్యం ఆటపాటలతో గడిచిపోతుంది.

**ఆటపాటలు** : శ్రీ నేదునూరి గంగాధరంగారు తమ 'ఆటలు – పాటలు' అనే గ్రంథంలో దేశీయ క్రీడల నెన్నింటినో పేర్కొన్నారు. ఈ క్రీడల ప్రాముఖ్యాన్ని వివరిస్తూ వారే ఇలా ఉన్నారు.

"రెండువేల సంవత్సరాల నుండి మనజాతి ఆటలాడుకొంటూ, ఆనందిస్తూ, క్రొత్త ఆటలను నేర్చుకుంటూ, ఇరుగుపొరుగు వారికి నేర్పుతూ, వారి నుండి నేర్చుకుంటూ, తన పరిజ్ఞానాన్ని పరిపుష్టిపరచుకొంటూ వుంది. ఆటలూ – ఆటల పాటలూ అనుశృతంగా వస్తున్నాయి. అందుకే దీనిని 'వారసత్వ వాఙ్మయం' అనాలి."

---

[675] ముత్యాలసరాలు, పుట – 47.

వాఙ్మయంలాగే ఆటలుకూడా జాతి జీవిత ప్రతిబింబాలు. మొదటిది వాగ్రూపమైతే, రెండవది క్రియారూపమైనది. ఈ ఆటలు –పాటలు చేరితే పై రెండు స్వరూపాలు సమ్మిళితమై సమగ్ర పుష్టిని అందిస్తాయి. అందుకే ఇవి దేశ కాల చరిత్ర ప్రభావాలతో జాతి సంస్కృతి సంప్రదాయాలతో రూపు తీర్చుకుంటాయి.„[676]

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తమ సాంఘిక చరిత్రలో తెలియజేసిన ఆటలు, పాటలు కూడా ఆనాటి ప్రజల జీవిత విధానాన్ని తెలుసుకోవటానికి ఎంతగానో తోడ్పడతాయని పేర్కొన్నారు.[677]

ప్రాచీన కవుల నుండి ఆధునిక కవుల వరకూ ఎందరో తమ కావ్యాలలో సందర్భోచితంగా ఎన్నో క్రీడల గురించి పేర్కొనటం జరిగింది. కానీ దురదృష్టవశాత్తు నేటి ప్రజలకు క్రీడలపై ఆసక్తి సన్నగిల్లటంవల్ల ఇవి క్రమక్రమంగా వ్యవహారంలో లేకుండా పోతున్నాయి. ఉరుకులు పరుగులతో సాగిపోతున్న నేటి యాంత్రిక యుగంలో పిల్లలు పుస్తకాల బరువుతో పాఠశాలకు వెళ్లి రావటంతోనో, ఆర్థికంగా వెనుకబడిన కుటుంబాల వారి పిల్లలు వ్యావసాయిక పారిశ్రామిక కూలీలుగా మారి పనిచేస్తుండటం వల్లనో అలసిపోతున్నారు. వారికి ఆటలు ఆడేంత తీరిక, ఓపిక గాని, శ్రద్ధగాని ఉండటం లేదు. అందుకే క్రీడల్ని వృత్తిగా స్వీకరించిన బహుకొద్ది మంది మాత్రమే వీటిని ఆదరిస్తున్నారు. కనుకనే మన ప్రాచీన దేశీయ క్రీడలెన్నో ఉన్నప్పటికీ ఏవో కొన్నింటి ఆటల విధానం మాత్రమే తెలుస్తున్నది. మరికొన్ని ఆటలు పూర్తిగా వ్యవహారంలో లేకపోవటం వల్ల ఆటల పేర్లు తప్ప ఆటలాడే విధానం తెలియటం లేదు.

బాలురు ఆడుకొనే ఆటలకు బాలికలు ఆడుకునే ఆటలకు ఎంతో వ్యత్యాసముంది. ఈ వ్యత్యాసమెంతటిదంటే శివుని తాండవానికి, పార్వతి లాస్యానికి ఉన్నంతటిది. జానపద కన్యలు ఆడిన ఆటల వివరాలు సాధ్యమయినంత వరకు తెలియజేయటానికి ప్రయత్నిస్తాను.

---

[676] ఆటలు –పాటలు, పీఠిక, పుట – 6.

[677] ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట -2.

ఆడపిల్లల ఆటలు పాటల్తో మిళితమై మనోజ్ఞమైన వారి భావనలకు నిదర్శనంగా నిలుస్తాయి. ఈ ఆటల్లో మిక్కిలి ప్రశస్తి గాంచింది కాళ్లాగజ్జెఆట.

**కాళ్లాగజ్జె ఆట:**

"కాళ్లా గజ్జి – కంకాళమ్మ
వేగుచుక్క – వెలగమొగ్గ
మొగ్గ కాదు – మోదుగనీరు
నీరు కాదు – నిమ్మలవాయ
వాయకాదు – వాయలుకూర
కూరగాదు – గుమ్మడి పండు
పండుగాదు – పాపడ మీసం
మీసం గాదు – మిరియాల పోతు
పోతు గాదు – బొమ్మల శెట్టి
శెట్టిగాదు – శామల మన్ను
మన్ను గాదు – మంచిగంధపు చెక్క
లింగులిటుకు – పందెమాల పలుకు
కాలు పండినట్లు – కడకు దీసిపెట్టు"[678]

ఇది కాళ్లాగజ్జె ఆట ఆడేటప్పుడు పాడుకొనే గేయం. బాలికలు కాళ్లు బారచాపుకొని ఒకరికొకరు ఆనుకొన్నట్లుగా దగ్గరగా నేలమీద కూర్చుంటారు. మధ్యలో కూర్చున్న బాలిక తన కుడి చేతితో కుడి వైపు నుండి మొదలుపెట్టి ఎడం వైపు వరకూ అందరి కాళ్లపై తడుతూ పాటపాడుతుంది. అందరి కాళ్ల మీద చరచటం పూర్తయితే ఏ కాలి దగ్గర పూర్తయిందో ఆ ప్రక్క కాలి నుండి మరల చరచటం ప్రారంభిస్తుంది. ఈ విధంగా పాట అయిపోయేంత వరకు చేస్తుంది. చెయ్యి ఏ కాలి మీద చరుస్తుండగా పాట అయిపోతుందదో ఆ బాలిక కాలు పండినట్లు. పండిన కాలిని ముడుచుకొంటారు. ఏ బాలిక రెండు కాళ్లూ ముందుగా

678 తెలంగాణ పల్లెపాటలు, పుట -25.

పండుతాయో ఆ బాలిక గెలిచినట్లు. మధ్య కూర్చున్న బాలిక ఈ విధంగా అందరి కాళ్లూ పండేవరకూ చేస్తుంది. ఒకవేళ తనకాళ్లు రెండూ ముందుగా పండినట్లయితే కాళ్లు ముడుచుకొని కూర్చొని మిగిలిన బాలికల కాళ్లపై చరుస్తూ పాట పాడుతుంది. ఈ ఆటలో ఒకసారి ఐదుగురి కంటే ఆడలేరు. ఎందుకంటే ఎక్కువమంది అయితే మధ్య కూర్చున్న బాలికకు కుడి ఎడమల కూర్చున్న వారి కాళ్లు అందవు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తమ 'బాల భాష'లో ఈ గేయం బాలికలు పాడుకొనేది కాదని తల్లి పసిపిల్లలను కాళ్లపై తడుతూ పాడే పాట అని పేర్కొన్నారు[679].

ఇది అర్థరహితమైన లయాత్మక గేయం (nonsense rhyme) గా కొందరు బావిస్తున్నారు. పైకి ఆ విధంగానే కనిపిస్తున్నా ఇందులో పిల్లలకు జానువులపై లేచే గజ్జికి మందున్నదనీ, గ్రామీణ ఆయుర్వేద పరిభాష తెలిసిన వారికి తప్ప ఇతరులకు దీనర్థం తెలియదని గ్రామీణ వైద్యుని సహాయంతో ఇందులోని ప్రతిమాటకు అర్థం తెలుసుకొన్న డాక్టరు బి. రామరాజు గారు వివరించారు.[680] ఈ గేయంలోని అర్థవివరణను ఆమోదించినా ఆమోదించకపోయినా ఈ ఆటకు గల భౌతిక ప్రాముఖ్యాన్ని ఎవరూ కాదనలేరు. కాళ్లుచాచి కూర్చోవటం, ముడుచుకోవటం, వాటిని చరచటం మంచి శారీరక వ్యాయామం. దీన్ని అవయవపుష్టికి దోహదం చేసే ఆటగా భావించవచ్చు.

**చెమ్మచెక్క ఆట** : కాళ్లా గజ్జె ఆట తర్వాత అంతటి విశేష ప్రాచుర్యం పొందిన ఆట చెమ్మచెక్క ఆట.

"చెమ్మచెక్క చేరెడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గులెయ్యంగ
రత్నాల చెమ్మచెక్క రంగులెయ్యంగ
పగడాల చెమ్మచెక్క పందిరెయ్యంగ

679 పరిశోధన (ద్వైమాస పత్రిక) అగష్టు –సెప్టెంబరు, 1954, పుట -34.
680 తెలంగాణ పల్లెపాటలు, పుటలు – 25, 26.

పందిట్లో మా బావ పెళ్లి చెయ్యంగ
చూచి వద్దము రండి సుబ్బారాయుడు పెళ్లి
మావారింట్లో పెళ్లి మళ్లీ వద్దము రండి."[681]

ఈ ఆటకు ఇద్దరు, నలుగురు లేదా ఆరుగురు బాలికలు కావాలి. ఒక చదునైన ప్రదేశంలో ఒకరికొకరు అభిముఖంగా నిలబడి మొదటిసారి ఎవరి చేతులు వారు చప్పట్లు చరిచి మ్రోగించి, రెండవసారి ఇద్దరు ఆడుతున్నట్లయితే ఎదుటి బాలిక చేతులలో చరుస్తూ, ఇద్దరికంటే ఎక్కువ ఉన్నప్పుడు ఇరువైపులా ఉన్న బాలికల చేతులలో అటొక చెయ్యి, ఇటొక చెయ్యి చరుస్తూ, పాట పాడుతూ, పాట లయకనుగుణగా అడుగులు వేస్తూ, చిందులు త్రొక్కుతూ, గుండ్రంగా తిరుగుతూ ఆడతారు.

ఈ ఆటకు పాట ప్రాణమని బాలికలు వేసే చిందులు పాట లయకను గుణంగా ఉండాలనీ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారు పేర్కొన్నారు.[682] ఈ పాటలో సాంకేతికవాదం ఉన్నదనీ, రత్నాల చెమ్మ అంటే ఎర్రపూలు పూసే చెట్టని, ముత్యాల చెమ్మ అంటే తెల్లపూలు పూసే చెట్టని మొదటిది ఈడేరని కన్యలకు, రెండవది సంతానం లేని వారికి మందని, 'ముగ్గులేయటం' సంతానాభివృద్ధికి సంకేతమని, 'రంగులేయటం' ఈడేరటానికి సంకేతమని, 'పందిట్లోబాలుడు' ఆనందానుభవానికి సంకేతమని డాక్టరు బి. రామరాజుగారు వివరించారు[683].

ఇది సుకుమారమైన కన్యహస్తాన్ని వర్ణించే గేయంగా కూడ భావించవచ్చు. ఇది చెమ్మగిలిన చేయి. రెండు చేతులు కలిసినపుడు చారెడుమొగ్గగా భాసిస్తుంది. ఇది పెద్దపెద్ద అట్లుపోసి ఆరగింప చేసే హస్తం. అంతేగాక రత్నాలతో రంగవల్లుల్ని, ముత్యాలతో ముగ్గుల్ని తీర్చిదిద్దే కళామయమైన మృదులహస్తం. ఈ హస్తమే సంతాన్నాన్ని పొందిన తరువాత ఉయ్యాలకు చిలుకల పందిళ్లు తీర్చిదిద్ది

[681] తెలంగాణ పల్లెపాటలు, పుట -27.
[682] సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం, నాల్గవ సంపుటం, పుట -1447.
[683] తెలంగాణ పల్లెపాటలు, పుటలు – 27, 28.

భావిపౌరులను లాలించేది. ఇంటిముంగలి పందిళ్లలో ఆడుకొనే బాలుర్ని లాలించేదికూడా ఈ హస్తమే. ఈ విధంగా ఈ పాటలో కన్య మధుర హస్త వర్ణనం ద్యోతమానమవుతున్నది.

ఈ భావన ఎలా ఉన్నా సుకుమారమైన కన్యల హస్తాలు ఈ ఆటలో పరస్పర తాపడం వలన గట్టిపడి అవయవ సౌష్టవాన్ని పెంపొందించటానికి తోడ్పడతాయి. ఈ రీతిగా శారీరకంగాను, మానసికంగాను కన్యాభావ సౌందర్య సముద్దీప్తిని సమకూర్చే ఈ జానపద సాహిత్య సౌరభం ప్రశంసకు పాత్రమైంది.

**ఒప్పులకుప్ప ఆట** : ఈ ఆటను ఇద్దరు, నలుగురు లేదా ఆరుగురు ఆడతారు. కానీ ఇద్దరు ఆడటం సులభం. ఇద్దరు బాలికలు ఎదురెదురుగా నిలబడి పరస్పరం కుడిచేతితో కుడి చేతిని,ఎడమచేతితో ఎడచేతిని పట్టుకొని

"ఒప్పులకుప్పా – ఒయ్యారిభామా
మినపాపప్పూ – మెంతిపిండీ
తాటి బెల్లం – తవ్వెడు నెయ్యీ
గుప్పెడు తింటే – కులుకూలాడి
నడుమూగట్టి – నామాటబట్టీ"[684]

అని పాడుతూ చుట్టూ గిరిగిరా తిరుగుతారు. ఆ ఆటకు పాట అనువైన లయను చేకూరుస్తుంది. ఈ పాటలో మినప్పప్పు, మెంతిపిండి, తాటి బెల్లం, నెయ్యి కలిపిన ఒకానొక మిశ్ర పదార్థం గురించిన ప్రస్తావన ఉంది. ఇది బాలికల నడుముకు బలిమి చేకూర్చేదని ఆ పాటలోనే పేర్కొనబడింది. ఈ ఆట కాళ్లు, చేతులు, నడుముకు బలాన్ని చేకూర్చే మంచి శారీరక వ్యాయామం.

**కూర్చోవదిన ఆట** : [685] ఈ ఆటను ఎంతమందైనా ఆడవచ్చు. కనీసం నలుగురు ఉండాలి. ఇద్దరు బాలికలు మధ్యలో సుమారు మూడు నాలుగు గజాల దూరం ఉండేటట్లుగా ఒకరికొకరు అభిముఖంగా కూర్చుంటారు. ఒక బాలిక వీరిద్దరి చుట్టూ

684 మిన్నేరు, పుట -24.
685 పైదే, పుట -38.

పరిగెడుతుంది. వేరొక బాలిక ఈ తిరుగుతున్న బాలికను పాటపాడుతూ తరుముతుంది. ముందు వెళుతున్న బాలిక పట్టుబడినట్లయితే వెటకారంగా 'కూర్చో వదినా!' అంటూ కూర్చో బెడుతుంది. తరువాత పరుగెత్తిన ఇద్దరూ కూర్చుంటారు. కూర్చున్న ఇద్దరిలో ఒకరు పరుగెడుతుంటే రెండవ బాలిక పరుగెడుతున్న బాలికను పాటపాడుతూ తరుముతుంది. చాలామంది బాలికలుంటే గుండ్రంగా గాని ఒక వరుసలో గాని కూర్చుంటారు. కూర్చున్న బాలిక లందరూ వదినలయ్యేవరకూ పాటతో పాటు ఆట సాగుతుంది.

"అగిచీ బుగిచీ జండాల
బుగిచీ బుగిచీ బుగిచీ దగ్గులూరు దవనం కట్టా
నీకో కట్టా నాకో కట్టా
కట్టా కట్టా
విశాఖపట్నం వీశెడు బెల్లం
నీకొక పదలం నాకొక పదలం
పదలం పదలం
బిందె నిండా కందులూ రంగసాని బొందులూ
బొందులూ బొందులూ
సూరీ గుమ్మడి కాయ సూరప్పతలకాయ
తలకాయ తలకాయ
ఆనపకాయ అచ్చమ్మ తలకాయ
తలకాయ తలకాయ
అక్కల కర్రా ముక్కాలపీట కూర్చో వదినా
వదినా వదినా"[686]

ఇదే పాటను తొక్కుడుబిళ్ల ఆట ఆడుతూ కూడా పాడతారని శ్రీ నేదునూరి గంగాధరంగారు పేర్కొన్నారు.[687] కానీ కోస్తా జిల్లాలలో తొక్కుడుబిళ్ల ఆటఆడుతూ పాటపాడే సంప్రదాయం లేదని మహిళల వల్ల తెలుస్తున్నది. తొక్కుడుబిళ్ల ఆటలో

686 మిన్నేరు, పుట -38.
687 పైదే.

ఒంటి కాలితో దుమకటం వ్యాయామమైతే కూర్చోవదిన ఆటలో పరుగెత్తటం వ్యాయామం. కేవలం ఆట కేవలం సాట కాకుండా ఆటపాటల మేలికలయిక వల్ల వినోదంతో పాటు శారీరక ఆరోగ్యం సమకూరుతుంది.

**కుమ్మి ఆట** : ఈ ఆట చాలా వరకు చెమ్మచెక్క ఆటను పోలి ఉంటుంది. కాని అభినయం మాత్రం ప్రత్యేకం. ఈ అభినయంతో పాడే పాట రెండు రకాలు. 1) కుమ్మిపదాలు 2) కుమ్మి పాట. కుమ్మి పదాలలో ప్రత్యేకంగా ఇతివృత్తమంటూ ఉండదు. ఏవో కొన్ని అభిప్రాయాల మాలిక వలె సాగుతుంది.

"ఆటవిని ఆడుదమా! మనము పాటలు పాడుదమా!
పాటలను పాడుదమా! మనము హాయిగా తిరుగుదమా!
గవ్వలు యేరుదమా! మనము గవ్వలు యేరుదమా!
చల్లని గాలిలో మనము! అల్లీబిల్లీ లాడుదమా!"[688]

లయానుగుణంగా ఏవో పదాలు కూర్చుకొని ఆలాపించటం జరుగుతుంది. అవి అంత ఆలోచనాత్మకంకావు.

కానీ కుమ్మిపాట పరిష్కృతమై ఇతివృత్తబంధమై చక్కని చిక్కని శైలిలో తాళానుకూలంగా ఉంటుంది. ఇందులోని భావన ఉదాత్తంగా ఆధ్యాత్మిక చింతనతో కూడినది. సకల భువన కారకుడైన పరమాత్మకు జేకొడుతూ అతడీ ప్రపంచ సముద్ధరణానికి అనగా శిష్ట రక్షణకు, దుష్ట శిక్షణకు ఏ యుగాలలో ఏ అవతారం ధరించాడో ఈ పాటలో[689] అభివర్ణితం.

ఇతడు నిగమాలకు నిలయమై మీనరూపాన్ని వహించి బ్రహ్మముఖంగా వేదాలను జగత్తుకు ప్రసాదించాడు. కూర్మరూపుడై మంధరాద్రి భారం మోసి అమృతమధనానికి అవకాశం కల్పించాడు. వరాహరూపుడై వసుధనంతా చుట్టగా చుట్టిన హిరణ్యాక్షుడ్ని సంహరించాడు. నరసింహరూపుడై హిరణ్యకశిపుని అంత మొందించాడు. వామనరూపుడై బలిచక్రవర్తినణచాడు. పరశురాముడై క్షత్రియకుల

688 మిన్నేరు, పుట -27.
689 పైదే.

భీముడయ్యాడు. ఈవిధంగా అభివర్ణించినా దశరథరామునిగా రావణసహారం చేసినట్లుగాని, యశోదానందనుడుగా కంససంహారం చేసినట్లుగానీ ఈ గీతంలో వర్ణింపబడలేదు. కానీ జీవహింస మాన్పటానికి బుద్ధ రూపుడై పుట్టినట్లు, కలియుగ కాలుష్యాన్ని నాశనం చేయటానికి కల్కిరూపుడైనట్లు అభివర్ణితం. ఆ శ్రీహరి దశావతారాలూ ఈ పాటలో వర్ణించటం గమనార్హం.

ఈ విధంగా బాలికలు ఉదాత్త విషయాల్ని సామాన్యమైన ఆటపాటల్లో పాడుకోవటాన్ని బట్టి జానపద వాఙ్మయంలో స్త్రీ భావన ఎంతటి ఉన్నత శిఖరాల్ని అధివసించిందో ఊహించవచ్చు.

**కోలాటం ఆట**: కోలలతో ఆడే ఆట కోలాటం. ఈ కోలలకే కోలాటం కర్రలనీ, చిరతలనీ వేర్వేరు ప్రాంతాలలో వ్యవహారం. ఈ కోలలు సుమారు 12 అంగుళాల పొడవుతో, మధ్యవేలంత లావుగా కొయ్యతో చేసిన కర్రలు. ఇవి మొదలు లావుగా ఉండి చివరికొచ్చే సరికి సన్నగా ఉంటాయి. వీటిపై భాగంలో రకరకాల రంగులు అద్దుతారు. ఈ ఆట ఆడటానికి కనీసం ఎనిమిదిమంది ఉంటారు. ఎక్కువ మంది కూడా ఉంటారు. కానీ వారి సంఖ్య సరి సంఖ్యలోనే ఉంటుంది.

ఈ ఆట రెండు రకాలు. **1. కోలాటం**: ఎనిమిది, పది, పన్నెండు, పధ్నాలుగు లేక పదహారు మంది బాలికలు గుండ్రంగా నిలబడతారు. రెండు చేతులతో కోలల్ని పట్టుకొని ముందుగా ఎవరి కోలల్ని వారు తడుతూ తరువాత కుడివైపున గాని ఎడమవైపునగాని ఉన్న బాలకల కోలల్ని తడుతూ, పాటపాడుకొంటూ గుండ్రంగా తిరుగుతారు. **2. జడ కోలాటం**: ఈ కోలాటంలో తాళ్లతో జడని అల్లటం, విప్పటం చేస్తారు. ఈ తాళ్లను ఏర్పాటు చేయటం కోసం నలుచదరంగా గాని వృత్తాకారంగా గాని కొయ్య పలకను సిద్ధం చేస్తారు. దీనికి బాలికల సంఖ్య ననుసరించి పెద్ద పెద్ద రంధ్రాలు చేస్తారు. ఆ రంధ్రాలలో తాళ్లను దూర్చి ముడివేసి క్రిందకు వేలాడ దీస్తారు. ఈ కొయ్య పలకను భూమికి సమాంతరంగా ఉన్న చెట్టుకొమ్మ అడుగు భాగాన కాని, చదునుగా ఉన్న ప్రదేశంలో పాతిన ఎత్తైన కొయ్య గుంజపైగాని అమరుస్తారు. ఆట ఆడేటప్పుడు బాలికలు ఎడమచేతికి తాళ్లను కట్టుకుంటారు. కోలల్ని తడుతూ

గుండ్రంగా తిరుగుతూ స్థానాల్ని మార్చుకుంటూ పాటపాడుతూ ఆడతారు. స్థానాలు మారేటప్పుడు సరిస్థానంలో ఉన్న బాలిక తన ప్రక్కగా ఉన్న వేరొక సరిస్థానంలోకి, బేసి స్థానంలో ఉన్న బాలిక తన ప్రక్కగా ఉన్న వేరొక బేసి స్థానంలోకి మారుతుంది. ఉదాహరణకు పన్నెండు మంది బాలికలతో ఆట ఆడుతున్నప్పుడు ఒకటో స్థానంలో ఉన్న బాలిక మూడో స్థానంలోకి, మూడో స్థానంలో ఉన్న బాలిక ఐదోస్థానంలోకి, ఐదోస్థానంలో ఉన్న బాలిక ఏడోస్థానం లోకి, ఏడో స్థానంలో ఉన్న బాలిక తొమ్మిదో స్థానంలోకి తొమ్మిదో స్థానంలోని బాలిక పదకొండో స్థానంలోకి, పదకొండో స్థానంలో ఉన్న బాలిక ఒకటో స్థానంలోకిమారతారు. ఇదే విధంగా సరిస్థానాల్లో ఉన్న బాలికలు మారతారు. బాలికలందరూ ఒక వలయం పూర్తి చేసేటప్పటికి జడ ఒక పాయ పూర్తవుతుంది. ఈ విధంగా పాట పూర్తయ్యే సరికి జడ పూర్తవుతుంది. మరల ఇదే విధంగా తిరుగుతూ వెనుకకు అంటే వారు మొదట ఖాళీ చేసిన స్థానాల్లోకి వస్తారు. ఆ విధంగా చేయటంవల్ల జడ విప్పబడుతుంది. ఈ జడల ఆకారాన్నిబట్టి ములక్కాయ జడలనీ, నువ్వుకాయ జడలనీ పేర్లున్నట్లు తెలుస్తున్నది.

వీరు పాడే పాటలో మాత్రం పెద్దగా విశేషం కన్పించటం లేదు.

"కోలాటంబుల వేయుదమా! కోరిక తీరగ మనమందరమూ!
చాల సంతోషంబుగను! సభికులు మెచ్చెడి తీరుగను!
గుప్పుగుప్పున గంతులు వేస్తూ! ఒప్పుగ జడలు వేయుదమా!
ఒప్పుగ వేసిన జడలన్నీ! ఓపిక తోడుద విప్పుదమా!"[690]
"రత్నగిరి కోలాటము! రమ్యముగను వేయుదము!
కూడిపాడి వేడ్కతోడ! ఆడుదం పాడుదం!
రారే చెలియలార రంజిల! కోలాటంబులు వేయుదము
మునగకాయ నువ్వుకాయ జడలల్లుదాము
మనము వలవేసి నిచ్చెన వేయుదము
సంతోషముతో గూడి యాడరే సఖియలార
వంతపాట తోడ యాడరే వరుస జడలు విప్పివేయరే."[691]

---

[690] మిన్నేరు, పుట - 28.
[691] పైదే.

శ్రీ నేదునూరి వారు తమ ఆటలు – పాటలు గ్రంథంలో మూడు రకాలైన కోలాటాల్ని పేర్కొన్నారు. వీరు ఉదాహరించిన గేయాలు కూడా భిన్నంగానే ఉన్నాయి.[692]

శిష్ట సాహిత్యంలోనూ ఈ కోలాటం ప్రసక్తి అక్కడక్కడా గోచరిస్తుంది.[693] చక్కగా పాట పాడుకుంటూ దాని కనుగుణమైన లయననుసరించి గుండ్రంగా తిరుగుతూ, కోలల్తో తడుతూ, జడలల్లుకుంటూ, విప్పుకుంటూ బాలికలు ఆడే ఈ ఆట వారి నైపుణ్యానికి నిదర్శనం.

**దాగుడు మూతలాట** : నలుగురు కన్నా ఎక్కువ మంది బాలికలు ఆడుకొనే ఆట ఇది. ఒక బాలిక కూర్చొని ఉంటుంది. ఈ బాలికను 'తల్లి' అంటారు. వేరొక బాలికను దొంగ అంటారు. ఈ దొంగను నిర్ణయించటానికి బాలికలందరూ పంటవేసి పండని బాలికను దొంగ అంటారు. అప్పుడు 'తల్లి' బాలిక దొంగ బాలికను తన ముందు కూర్చోబెట్టుకొని తన ఎడమ చేతితో దొంగ కళ్ళు మూసి, కుడిచేతితో దొంగ కుడిచేతిని ఊపుతూ ఈ విధంగా పాట పాడుతుంది.

"దాగుడుముచ్చి దండాకోర్ – పిల్లి వచ్చెఎలుక దాట్
ఎక్కడి దొంగలక్కడ – పారిపో పారిపో
తూరితే పిల్లి – పారితే పిల్లి
పడమటక్కల్లారా – పారిపొండోయి."[694]

---

692 పుటలు -131-138.

693 "నిద్దంపువేడ్క దవిలి కోలాటమాడు గంధర్వసతుల"

-చంద్రికా పరిణయం , 1-130. –సురభి మాధవయ్యప్రభువు.

"మోహనాంగులపార శృంగారంబులు నెరపుచు గోలాటలాడ"

– లక్ష్మీవిలాసం, 5-78. -రాయసం వేంకటపతి.

"కోలాటములు పిల్లగ్రోవులు గుమ్మడి క్రోవి కూతలు నూదు గ్రోపులు
ఆడుకొనుచు జదువుపై సంధ్యపై నాస్థచాల లేక పొలతి యీ రీతిన్ బ్రొద్దు పుచ్చుచుండె"

-హంస వింశతి, 3-146, -అయ్యలరాజు నారాయణమాత్యుడు.

"గీర్వాణ బాలామణుల్ పాడుచుం, కోలాటంబులు
వైచి రాయతితముల్ గూర్మిం గటాక్షింపగన్"

-చంద్రభానుచరిత్ర, 2-139. -తరిగొప్పుల మల్లన.

694 మిన్నేరు, పుట -41.

'తల్లి' బాలిక పాటపాడుతున్నప్పుడు ఎదురుగా నిలబడిన మిగిలిన పిల్లలంతా అక్కడక్కడ దాక్కుంటారు. అందరూ దాక్కున్నారనిభావించిన తరువాత 'తల్లి' దొంగను వదిలివేస్తుంది. ఆ దొంగ దాక్కున్న వారిని వెతుక్కుంటూ పోతుంది. ఎవరినైనా పట్టుకోగలిగితే ఆ బాలిక దొంగ అవుతుంది. 'దొంగ దొరికింది' అనగానే దాక్కున్న మిగిలిన బాలికలందరూ బయటకు వస్తారు. దొరికిన దొంగకు కళ్ళు మూస్తారు. ఆట యధాప్రకారం కొనసాగుతుంది. బాలికలు అలిసిపోయేంత వరకూ ఇలాగే ఆడతారు.

ఇది కోస్తా ఆంధ్ర ప్రాంతంలో బాగా వ్యవహారంలో ఉన్న ఆట. కానీ శ్రీ నేదునూరి గంగాధరం గారు వివరించిన ఆట దీనికి పూర్తి భిన్నంగా ఉంది.[695]

**అచ్చన గాయలాట** : ఆడపిల్లలు ఆడుకొనే ఆటల్లో ఈ ఆటకూడా చాలా ప్రసిద్ధమైంది. ఈ ఆటలో ప్రాంతీయ భేదాలున్నాయి. ఈ ఆటను ఇద్దరు, ముగ్గురు లేదా నలుగురైదుగురు గాని ఆడతారు. దీనికోసం గచ్చకాయలు గాని, గుండ్రటి చిన్న రాళ్లు గాని, కుంకుడుగాయలుగాని ఉపయోగిస్తారు. వీటినే అచ్చనగాయలు అంటారు. బాలికలు బాసింపట్టు వేసుకొని గుండ్రంగా కూర్చుంటారు. మధ్యలో నేలపై అచ్చనగాయల్ని పలచగాపరుస్తారు. అందులోనుండి ఒక కాయను తీసుకొని కుడిచేత్తో పైకెగురవేసి క్రింద ఉన్న కాయల్లో ఒక పర్యాయం ఐదుసార్లు నాలుగేసి కాయల్ని, ఒకపర్యాయం ఐదుసార్లు మూడేసి కాయల్ని, ఒక పర్యాయం ఐదుసార్లు రెండేసి కాయల్ని, చివరిసారిగా ఐదుసార్లు ఒక్కొక్క కాయనీ క్రింద నుండి తీసుకుంటూ పైకెగురవేసిన కాయని పట్టుకుంటారు. ఇలా వరుసగా బాలికలందరూ ఆడతారు. పైకెగురవేసిన కాయనుపట్టుకొనే ప్రయత్నంలో ఓడిపోకుండా పైన చెప్పినట్లుగా ఎవరు ఆడగలుగుతారో వారు గెలిచినట్లు.

ఈ ఆటలో క్రింద నుండి ఒకసారి మూడుకాయలు తీస్తే, 'మువ్వలు' అని కొందరు, 'పువ్వీలు' అని కొందరు అంటారనీ, సాధారణంగా పదహారు గుప్పీలు, పదహారు మువ్వలు ఆడతారనీ, కొంతమంది ఇరవై గుప్పీలు, ఇరవై పువ్వీలు కూడా

[695] ఆటలు –పాటలు, పుట – 41.

ఆడతారనీ ఇది బాలికలకు సంఖ్యలు తెలియజేయటానికి ఉపయోగపడే ఆట అనీ శ్రీ నేదునూరి గంగాధరంగారు మిన్నేరులో పేర్కొన్నారు.[696]

ఈ ఆట ఆడేటప్పుడు పాడేపాటల్ని కూడా శ్రీ గంగాధరంగారు ఉదాహరించారు. పది గుప్పీలు ఆడేటప్పుడు పాడే పాట, ఇరవై గుప్పీలు ఆడేటప్పుడు పాడే పాట వేరువేరుగా ఉన్నాయి.

"ఒక్కో ఓ చెలియా    రెండూ రేవిళ్లు
మూడు ముచ్చిలక    నాలుగు నందన్నా
ఐదుం చిట్టిగొలుసు    ఆరుందారాలు
(ఆరుం జవ్వాజి)    ఏడుం బేడీలూ
ఎనమా మనమందా    (ఎనిమిది మనమందా)
తొంబా తోకుచ్చూ    (తొమ్మిది తోకుచ్చూ)
పదికి పెట్టెల్లాం    (పదికి పట్టెడా)"[697]

అనేది పదిగుప్పీలు ఆట ఆడేటప్పుడు పాడేపాట. ఈ సందర్భంలో పాడే వేరొక పాట కూడా మిన్నేరులో ప్రచురితం.[698]

ఇరవై గుప్పీలు ఆడేటప్పుడు ఈ క్రింది పాట పాడతారు.

"పడమటి గుడిచెలక    కన్నా రెండాయి
కాక్కి కొరకంచు    పిచ్చిక్కి నీరంచు
అమ్మకు బొమ్మంచు    అయ్యకు జామారు
నాకు పట్టంచు    చెల్లెలు చేమంతి
తమ్ముడు తలపాగ    మరదలకు ఆభరణం."[699]

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారు 'ఒక్కా ఓ చెలియా' పాటే గాక ఈ క్రింది పాటలు కూడ పాడతారని పేర్కొన్నారు.[700]

---

696 పుట -43.
697 మిన్నేరు, పుట -43.
698 పుట -45.
699 మిన్నేరు, పుట -44.
700 సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం, నాల్గవ సంపుటం, పుట -1440.

"పట్టూ రాయని కుచ్చూ బంగారుకుచ్చూ
నాతో నాడేది సంగాతి పడుచు"
"కొండామీది గుండుదొర్ల కోకిలమ్మ కాలు విరిగె
ఏమేమి మందు వేపాకు చేదు."

ఈ ఆటనే 'అచ్చనగండ్లు' అని కూడా వ్యవహరిస్తారనీ, క్రచ్చకాయలతోకాని చిన్నని గుండ్రని గులకరాలతో గాని ఆడతారని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి వివరణ.[701]

**నాలుగు స్తంభాలాట** : దీనికి ఐదుగురు బాలికలు కావాలి. నలుచదరంగా ఉండి నాలుగుమూలలా స్తంభాలున్న ప్రదేశాన్ని ఎన్నుకుంటారు. బాలికలు ఐదుగురయినా స్తంభాలు నాలుగే కనుక ఒక బాలిక మిగిలిపోతుంది. ఆ బాలికనే దొంగ అంటారు. దొంగను నిర్ణయించటానికి ఐదుగురు పంట వేస్తారు. దొంగగా నిర్ణయింపబడిన బాలిక నాలుగు స్తంభాలకు మధ్య ప్రదేశంలో నిలబడుతుంది. మిగిలిన నలుగురు బాలికలు నాలుగు స్తంభాలని పట్టుకొని నిలబడతారు. ఈ విధంగా స్తంభాలు పట్టుకొని నిలబడ్డ బాలికలు ఈ క్రింది పాట పాడుతూ ఒక స్తంభం నుండి మరొక స్తంభానికి మారుతుంటారు.

"నాలుగు స్తంభాలాటా నడిమికి తొడిమికి
తానక తప్పక తనపేరేమంటే
ఉట్టిమీద బెల్లం పొట్టి కాకర కాయ
బావా బావా బరుకూ బరుకూ
తమ్ములుతింటే తలకొకటే."[702]

ఈ విధంగా స్తంభాలు మార్చొనేటప్పుడు తమకు ప్రక్కగా ఉన్న స్తంభానికి మారాలే గాని మూలంగా ఉన్న స్తంభాలకి మారకూడదు. బాలికలు స్తంభాలు మారేటప్పుడు దొంగగా నిలబడిన బాలిక ఒక స్తంభాన్ని పట్టుకోగలిగితే స్తంభం

701 ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట -145.
702 మిన్నేరు, పుట -35.

దొరకని బాలిక దొంగవుతుంది. బాలికలు పాటపాడుతూ స్తంభాలు మారుతుండాలి గాని ఒకే చోట కదలకుండా ఉండకూడదు. శ్రీమతి లక్ష్మీకాంతమ్మ గారు పేర్కొన్న పాట భిన్నంగా ఉంది.

"నాలుగు కంబాలాట
నడిమికి తొడిమికి నడవని ఆట
గిరగిర తిరుగుచు బరులు తిరిగేఆట
చేరెంగోయమ్మ దొంగ
వచ్చేనమ్మ వచ్చే కొడుకో."[703]

శ్రీ గంగాధరంగారు తమ 'ఆటలు – పాటలు' గ్రంథంలో ఈ ఆటను ఎంతమంది బాలికలైనా ఆడవచ్చని, బాలికల సంఖ్య కన్నా స్తంభాల సంఖ్య ఒకటి తక్కువగా ఉండాలని పేర్కొన్నారు. అంతేగాక దొంగ అనే బాలికని 'గొల్లభామ' అంటారనీ, ఆ బాలిక 'చల్లోయమ్మ – చల్లో' అంటూ అన్ని స్తంభాల దగ్గరికి పోవాలనీ అలా పోయినప్పుడు ఖాళీ అవుతున్న స్తంభాన్ని నేర్పుగా పట్టుకోవాలని వివరించారు. అందుకే వారీ ఆటను 'స్తంభాలాట – గొల్ల స్తంభాలాట' గా పేర్కొన్నారు.[704]

**నాలుగు మూలల నిలుచుండి ఆడు ఆట** : ఇది కూడా నాలుగు స్తంభాల ఆట వంటిదే. ఆ ఆటలో స్తంభాలుంటాయి. ఈ ఆటలో ఉండవు. నలుచదరంగా ఉన్న ప్రదేశంలో నాలుగు మూలలా నలుగురు బాలికలు నిలబడతారు. దొంగ మధ్యలో నిలబడుతుంది. ఆట ఆడే విధానమంతా నాలుగుస్తంభాలాట వలెనే. ఇందులో పాడే పాట మొదట కొంతవరకు నాలుగు స్తంభాలాటలోని పాట మాదిరిగానే ఉంటుంది. మిగిలిన పాట మాత్రం భిన్నంగా ఉంటుంది.

"నడిమికి తొడిమికి    తానక తప్పక
తన పేరేమంటే    ఉస్తికాయల కుణ్ణ
ఊరగాయల కుణ్ణ    పాపట కాయల కుణ్ణ

703 సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం, నాల్గవ సంపుటం, పుట -1443.
704 పుట -34.

పలీలు మనెగా చార చార బరుకు బరుకు
అత్త చెవులలో అటుకులు పోసి
కోడలు చెవులలో కుంకుమ పోసి
ఆడుదువు రావే చిన్న చిలుకా."[705]

**గచ్చన కాయల ఆట** : వినోదంగా ఆడుకొనే ఈ ఆటలోని పాటలో కథ, కథలో సన్నివేశం చిత్రంగా మిళితమవుతాయి. ఈ పాటలో వైద్యవిజ్ఞానం ఎంతో ఇమిడి ఉంది. కాలు విరిగి నప్పుడు చేసే చికిత్స వివరింపబడింది.

"కొండ మీద వెండి గిన్నె కొక్కిరాయి కాలు విరిగె
దానికేమి మందు? వేపాకు మందు
వెల్లుల్ని గడ్డ నూనెలోని మడ్డి
నూటొక్క సారి పూయవోయి నూరి
పూటకొక్క తూరి."[706]

ఈ పాటలో ఎన్నో ప్రాంతీయ భేదాలున్నాయని, సారంగధరుని కాళ్లూ చేతులూ ఖండిస్తే వాటిని అతికిన మందు ఈ పాటలో ఇమిడి ఉందని శ్రీ గంగాధరంగారు పేర్కొన్నారు.[707]

**గుడుగుడు కుంచం ఆట** : అయిదారుగురు బాలికలు ఒకచోట కూర్చొని చేతులు ముందుకు చాచి తమ గుప్పెళ్లు ముడిచి ఒకరి గుప్పిడి మీద మరొకరి గుప్పిడి నిలువుగా ఉంచుతారు. అన్నింటి కన్న పైన గుప్పిడి ఉన్న బాలిక గుప్పిడి మధ్య ఖాళీలో తన కుడిచేతి చూపుడు వ్రేలిని గుండ్రంగా తిప్పుతూ ఈక్రింది పాట పాడుతుంది.

"గుడుగుడు కుంచం – గుండారాగం
పాముల పట్టం – పడగారాగం

705 మిన్నేరు, పుట – 32.
706 పైదే, పుట -18.
707 పైదే.

| | |
|---|---|
| అప్పల్రాజు గుఙ్జం | – ఆడుకోబోతే |
| పేపే గుఙ్జం | – పెళ్లికి బోతే |
| నీ గుఙ్జం | – నీళ్లకుబోతే |
| నా గుఙ్జం | – పాలకుబోతే |
| కత్తెయ్యనా? | – బద్దెయ్యనా? |
| వేణ్ణీళ్లా ? | – చన్నీళ్లా?"[708] |

ఈ పాటలో పాముకరిచినప్పుడు చేసే చికిత్సకు సంబంధించిన పాము మంత్రం ఇమిడి ఉందని శ్రీ గంగాధరంగారు వక్కాణించారు.[709]

ఆటల పేర్లకు పెద్దగా ప్రాముఖ్యతలేని కొన్ని ఆటలు కూడా జానపద వాఙ్మయంలో ఉదాహృతం. అటువంటి వాటిలో కొన్ని,

**ఏనుగు ఆట**: ఒక బాలిక క్రిందికి వంగి ఒక చేయి తొండంలాగ ముందుకు వేలాడేసి రెండవ చేతిని వెనుక తోకలాగ వేలాడేసి ఏనుగులాగ నడుస్తుంది. మిగిలిన బాలికలు రెండువర్గాలుగా విడిపోయి ఏనుగు బాలిక వెంట నడుస్తూ ప్రశ్న సమాధానం రూపంలో పాటపాడుతూ ఆటాడతారు. 'ఏనుగొచ్చిందేనుగు' అని ఒక వర్గం వారుఅంటే 'ఎక్కడికొచ్చిందేనుగు' అని రెండవ వర్గం వారు ప్రశ్నిస్తారు. 'మావూరొచ్చిందేనుగు' అని మొదటి వర్గంవారి సమాధానం. ఇంతకూ ఆ ఏనుగు ఏంచేసిందని రెండవ వర్గంవారు ప్రశ్నిస్తే మంచినీళ్లు తాగింది, కాకినాడ వెళ్లింది, కొబ్బరికాయ తిన్నది అని మొదటి వర్గంవారి సమాధానం.

ఇది బాగా చిన్న వయసు బాలికలు వినోదంగా ఆడుకునే ఆట.[710]

**సుబ్బారాయుడు పెండ్లి ఆట**: ఆడపిల్లలకు పెండ్లి సంబరాలలో పాల్గొనటం చాలా ఇష్టం. అమ్మాయిలందరూ గుంపులుగా చేరి చప్పట్లు కొడుతూ, ఎగురుతూ

[708] మిన్నేరు, పుట -21.
[709] పైదే.
[710] పైదే, పుట -41.

"సుబ్బారాయుడు పెండ్లి
చూచివద్దాము రండి
మావాళ్లింట్లో పెండ్లి
మళ్లీ వద్దాము రండి
దొంగాలింట్లో పెండ్లి
దోచుకు వద్దాము రండి"[711]

అంటూ పాడుకోవటం వారికి ఉత్సాహజనకం.

**ఉయ్యాల కంబాల ఆట** : ఉయ్యాలలూగటం కూడా ఒక ఆటే. ఇందులో పాట[712] ప్రశ్నోత్తరంగా సాగుతుంది. ఊరి పేరు, రాజు పేరు, ఆరాజుండే చోటు ఈ పాటలో సంకేతింపబడ్డాయి. చింత చెట్టుక్రింద బొమ్మరిల్లుందని, దానికి బోరు తలుపులు న్నాయని, పలవ (రెండు కొమ్మల మొదలు) క్రింద పొన్నపూలతో కట్టిన మేడ ఉన్నదని, ఆ మేడలో జోడు హంసలున్నాయని, ఆ హంసల పేరేమిటో ఉయ్యాల మీద పోయి అడిగి రావాలని ఒకానొక ఊహాజగత్తులో బాలికలు విహరిస్తుంటారు. ప్రేయసీ ప్రియులిక్కడ హంసలుగా సంకేతింపబడ్డారు. ఈ సంకేతాత్మక ఊహాజగత్తే కన్యాభావ సౌందర్యానికి ఆటపట్టు.

**పాయసం ఆట**: ఈ ఆటలో పాడేది చిటికెలు మెటికలు పాట.[713] బాలికలు ఒక్కొక్కరు ఎదుటి వారి వ్రేలిని తాకుతూ పాట పాడతారు. తరువాత వేళ్లన్నీ పండినయ్యని చేతులు వెనుకకు పెట్టుకొని పండిన వారిని' నీచేతులేమయ్యాయోయ్' అని ప్రశ్నిస్తారు. చేతులు పండిన వారు 'పిల్లెత్తుకుపోయింది' అని సమాధానం చెబుతారు. ఈ విధంగా ప్రశ్నల్ని – సమాధానాల్ని పొడిగించుకొంటూ ఈ ఆటను కొనసాగిస్తారు.

[711] మిన్నేరు, పుట – 40.
[712] పైదే.
[713] పైదే, పుట -45.

**దొంగాట** : ఈ ఆట[714] విధానం పూర్తిగా తెలియటం లేదు. ఇందులో దొంగయిన బాలిక తన మొగుడి పేరు చెప్పాలనేది నిబంధన. కానీ ఏ విధంగా దొంగని చేస్తారనే విషయం తెలియటం లేదు. దొంగయిన బాలికని 'నీ మొగుడు పేరేమి' అని మిగిలిన బాలికలు ప్రశ్నిస్తే బాలిక తన కిష్టమయిన పేరు చెబుతుంది.

పైన పేర్కొన్న ఆటలే గాక ఆటల స్వరూపం తెలియని కొన్ని ఆటల పాటలు (మిన్నేరులోవి) ఈ జానపద బాలసాహిత్యంలో గోచరిస్తున్నాయి. గుజ్జన గూళ్లపాట,[715] ముక్కుడు గిల్లీలు,[716] నేనే తిందును బెల్లం,[717] నలుగురి జతయాట,[718] చేతులు విసరు ఆట,[719] రొమ్ము తట్టి పరుగెత్తుట,[720] చెయియూచుపాట,[721],[722] నడుములో చేతులుంచుట[723] మొదలైనవి.

అసలు ఆటలు ఆడాలంటే క్రీడాదృక్పథం (sportive mind) కావాలి. అది లేని వాళ్లు ఆటల్లో కొనసాగటం కష్టం. అటువంటి క్రీడాదృక్పథంలేని కొందరు ఎప్పుడెప్పుడు ఇంటికి వెళదామా అని ఎదురుచూస్తుంటారు. మిగిలిన వాళ్లు తమను చూడలేదనుకొని చిన్నగా జారుకొని వెళ్లబోతారు. కానీ మిగిలిన వాళ్లు అంత సులభంగా వదిలి పెట్టరు.

"సగమాటలో పోయినది
చాకలి వాని పెండ్లాము

---

714 మిన్నేరు, పుట – 36.
715 పైదే, పుట -34.
716 పైదే.
717 పైదే, పుట -36.
718 పైదే, పుట – 33.
719 పైదే.
720 పైదే, పుట -31.
721 పైదే, పుట – 30.
722 మాతు శిరోన్మణిగారు తమ 'బాలికాభూషణము'లో మిన్నేరులో ప్రకటితమైనదానికంటే భిన్నమైన గేయాన్ని పేర్కొన్నారు, పుట -22.
723 మిన్నేరు, పుట -30.

మధ్యనడచి పోయినది
మంగలివాని పెండ్లాము
ఆటలోవిడిచి పోయినది
హాస్యగాని పెండ్లాము"[724]

అని హాస్యయుతంగా ఎగతాళి చేస్తారు. ఈ విధంగా ఎగతాళి చేయటంలో ఉద్దేశ్యం వారిలో పిరికితన్నాన్ని పోగొట్టి ఆటల పట్ల ఉత్సాహాన్ని కలిగించటం,

**బొమ్మల పెళ్లిళ్లు** : మనోజ్ఞమైన ఆట బొమ్మల పెళ్లిళ్లు. 'కన్యల జీవితంలో ఇది సంసారపు శిక్షణ ఇచ్చే క్రీడా విశేషము' అని శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు పేర్కొన్నారు.[725] ఇది నమ్మకంతో ఏర్పరచుకొన్న ప్రపంచం (make believe world). ఈ ప్రపంచంలో జీవించటం మహదానందం. లేబ్రాయంలో తప్పితే ఇటువంటి ఆనందానుభవం తరువాత జీవితంలో ఎప్పుడూరాదు. తరువాత జీవితంలో సంభవించేవి వాస్తవిక సంఘటనలు. ఇప్పటివి ఊహలు. ఈ ఊహాజగత్తు వాస్తవిక జగ్గత్తుకు ప్రతిరూపం. అనుకరణం. అనుకరణం కావటంవల్లనే ఆనందజనకం.

పెళ్లి అనగానే ముందుగా వధూవరుల కులగోత్రాలు అడుగుతారు. లోకంలో సాధారణంగా జరుగుతున్నట్లుగానే బొమ్మల పెళ్లిలోనూ వధూవరుల కులగోత్ర ప్రసక్తి పాటలో వస్తుంది.[726] బాలికలు రెండు జట్లుగా విడిపోతారు. మొదటి జట్టువారు నాట్యమాడుతూ ముందుకు వచ్చి ప్రశ్నలు వేస్తారు. రెండవ జట్టువారు కూడా అలాగే నాట్యంచేస్తూ ముందుకు వచ్చి సమాధానాలిస్తారు. ఈ విధంగా సంవాదం జరుగుతుంది. ఇందులో అన్ని కులాల ప్రసక్తి ఉండటం, ఒక్కొక్క కులానికి ఒక్కొక్క సంకేతాన్ని చూపించమని ప్రశ్నించటం, అలా చూపించినప్పుడే వారాకులంవారని నమ్మినట్లు భావించటం జరుగుతుంది. మేం బాపనోళ్లమని చెప్తే జంధ్యాలేవని ప్రశ్న. జంగమోళ్లమని చెప్తే లింగాలేవని ప్రశ్న. కమ్మవారమని చెప్పే

[724] మిన్నేరు, పుట – 33.
[725] సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం,నాలుగవ సంపుటం, పుట – 1442.
[726] త్రివేణి, పుట -18.

మడక ఏదని ప్రశ్న. కురుబ వాళ్లమంటే కంబళ్లేవని ప్రశ్న. మాదిగల మంటే ఆరె ఏదని ప్రశ్న. ఇవన్నీ మాపెద్దల్నడగమని సమాధానం.

ఈ విధంగా ప్రారంభమవుతాయి బొమ్మల పెళ్లిళ్లు.

తరువాత తీర్చిదిద్దవలసింది పెండ్లి వేదిక. వేడుకతో చేసే ఈ పెళ్లికి చక్కని వేదికకూడా అమర్చినట్లే భావింపబడుతుంది. రెండువాకిళ్లకి అటువైపు ఇటువైపు సిరితోరణాలు కడతారు. గుమ్మాన్ని రంగులతో అలంకరిస్తారు. గుమ్మం ముందు రత్నకంబళ్లు పరుస్తారు. వేదిక నాలుగు వైపులా అరటి స్తంభాలు నిలబెడతారు. చిన్నన్న చింతాకు చీర చదివిస్తే వధువు ఆ చీర కట్టుకొని అక్కడున్న పెద్దలకు దణ్ణాలు పెడుతున్నట్లు, వాళ్లు పచ్చని అక్షతలు చల్లి ఆశీర్వదిస్తున్నట్లు మనోజ్ఞమైన దృశ్యం కళ్లకు కట్టిస్తుందీ చరణం.

"పసిబాల తలమీద – పచ్చ అక్షతలు."[727]

పై రీతిగానే బాలికలు తాటాకు బొమ్మలకు పెళ్లి వేడుక నిర్వహిస్తున్నట్లు వర్ణించే గేయాలు[728] కూడా లభ్యం. తాటాకు బొమ్మకు కాటుక పెట్టి, చీర సింగారించి, మెడలో గాజు పూసల పేరు వేసి, గౌరీ కల్యాణరేఖ దిద్ది ముస్తాబు చేస్తారు. లక్కపిడతలో అన్నం ఉడికింది. లక్క చట్టిలో పప్పు ఉడికింది. చింతగింజలు లెక్కపెట్టి కట్నం సిద్ధంచేశారు. పానకపు బిందెలు కూడా సిద్ధం చేసుకొని పాపపేరంటాళ్లు పెళ్లికొడుకు రాక కోసం ఎదురు చూస్తుంటారు. పెళ్లికొడుకు మాత్రం రాలేదు. బాజాలు మోగుతున్నాయి. పెళ్లికొచ్చిన వారంతా సందడి చేస్తున్నారు. కబురు మీద కబురు పంపించారు. అయినా పెళ్లికొడుకు జాడలేదు. అతడేమయినట్లు? అలిగాడా? ఈ నిరీక్షణలోనే ఉన్నది అందమంతా.దీనిని అభివర్ణించే జానపద కళాహృదయం అభినందనీయం.

చివరకు ఎదురుచూస్తున్న పెళ్లికొడుకు రానే వచ్చాడు. కానీ అతని వేషధారణ పెళ్లికూతురు వైపు బాలికకు పరిహాసజనకమైంది. గచ్చకాయలు

---

[727] మిన్నేరు, పుట -14.
[728] త్రివేణి, పుట – 5.

గుండీలుగా ధరించాడు. కుక్కతోలు తలగుడ్డగా చుట్టుకొన్నాడు. నక్కతోలు నడుముకు బిగించాడు. పులితోలు పూలహారంగా వేసుకొన్నాడు. అగిశాకు తోరణాలుగాను, అలచందలు పూరణాలుగాను అలంకరించుకొన్నాడు. వచ్చిన ఆ పెళ్లికొడుకు రూపం ఎలా ఉన్నా మనసు దొడ్డదని గ్రహించి పరిహసిస్తూనే స్వాగతం పలికిందా బాలిక.[729]

పెళ్లికొడుకును కృష్ణుడుగాను, పెళ్లికూతుర్ని రుక్మిణిగానో, సత్యభామగానో భావించి బొమ్మలపెళ్లి జరిపిస్తుననట్లు పాడే పాటలు కూడా ఉన్నాయి.[730] లోకంలో సాధారణంగా పెళ్లి కూతుర్ని సీతగాను, పెళ్లికొడుకును రాముడిగాను భావించి 'మన రామూడు పెళ్లికొడుకాయెనే, మన సీతమ్మ పెళ్లికూతురాయెనే' అని నాదస్వర విద్యాంసులు మధురాలాపన చేస్తుంటే ఉల్లాసంగా వధూవరులు తలంబ్రాలు పోసుకోవటం మనం చూస్తుంటాం. కానీ జానపద వాఙ్మయంలో అటువంటి గేయాలు మృగ్యం.

పెళ్లివేడుకలో వధూవరులకు కట్నాల చదివింపులు కూడా ఒక భాగమే. కొందరు శ్రీరామ పట్టాభిషేకం బొమ్మచెక్కిన ఉంగరాలు, పెళ్లి బటువులు చదివిస్తారు. అందరి చదివింపులకన్నా విలువైంది కన్న తల్లి పెట్టిన చిలుకలంచుచీర. చీరతోపాటు పెట్టిన రత్నాల హారం మరింత విలువైంది. ఇవేకాక పెట్టెనిండా సొమ్ములు పెట్టి ఆడపిల్లను అత్తవారింటికి సాగనంపుతారు.[731]

పెళ్లి వేడుకలో మరొక ప్రధానమైనదీ చివరిదీ అయిన ఘట్టం అప్పగింతలు. చీర, సారె, సొమ్ములతో ఆడపిల్లను అత్తవారింటికి సాగనంపటమే గాక తల్లి, పెద్ద ముత్తయిదువులు అత్తవారింట్లో ఏ విధంగా నడుచుకోవాలో తెలియజేసే ఎన్నో నీతులు బోధిస్తారు.

---

729 మిన్నేరు, పుట – 15.
730 సరాగాలు, పుట -147.
731 మిన్నేరు, పుట – 41.

"వీధిలో తలవిప్పి ముడువకే బొమ్మ
పల్లెత్తి గట్టిగా పలుకబోకమ్మ
పొరుగిళ్లకెప్పుడూ పోవకే బొమ్మ
నలుగురీ నోళ్లలో నానకే బొమ్మ"[732]

అనేవి వాటిలో ముఖ్యమైనవి.

'వీథిలో తలవిప్పి ముడువకే బొమ్మ' అని చెప్పటంలో ధనసంపదకంటే గూడ స్త్రీకి శోభను చూకూర్చేది కేశసంపద అని తెలుస్తున్నది. ఈ కేశసంపద నలుగురి దృష్టిలో పడితే దృష్టిదోషం తగులుతుందేమోనని ఈ విధమైన హెచ్చరికలు చేస్తారు. అంతేకాకుండా తల్లో పెట్టుకున్న పూలు ఇతరుల పాదాల క్రిందపడి నలగటం తప్పుగా భావిస్తారు. బొమ్మల పెళ్లిలే అని చులకన భావంతో కాక వాస్తవిక జీవితంలో లాగ ఈ విధంగా నీతులు బోధించటంలో జీవితం పట్ల, అందులోనూ పెళ్లిళ్లపట్ల బాలికలకు గల గాఢానురక్తి వ్యక్తమవుతున్నది.

భావించటం ఒక కళ. పురుష భావం కన్న స్త్రీ భావం అత్యంత మనోజ్ఞం. అందుచేతనే కావ్యాలుకూడా కాంతాసమ్మితంగా ఉపదేశం చెయ్యాలని ఆలంకారికులు నిర్దేశించారు.[733] కృష్ణపరమాత్మ కూడా తాను "కీర్తిశ్శీర్వాక్చ నారీణాం"[734] అని పేర్కొన్నాడు. అంటే వాక్కులలో తాను నారీ వాక్కును అన్నాడు. అందుకే 'పల్లెత్తి గట్టిగా పలుకబోకమ్మ' అనే నీతిబోధలో అత్తవారింట్లో అతివ ఎంత అణకువగా మాట్లాడవలసిందీ నిర్దేశింపబడింది.

'పొరుగిళ్లకెప్పుడూ పోవకే బొమ్మ' అనే హితబోధ చాలా లోతైంది. గడపదాటితే స్త్రీ శీలానికేదో కళంకాన్ని అంటగడుతుంది లోకం. అప్పుడే నలుగురి నోళ్లలో నానవలసి వస్తుంది. అంతేగాదు ఎప్పుడూ సఖ్యంగా ఉండవలసిన

---

[732] మిన్నేరు, పుట -15.

[733] "కావ్యం యశసేర్థకృతే వ్యవహారావిదే శివేతరక్షతయే
సద్యఃపర నిర్వృతమే కాంతా సమ్మిత తయోపదేశయుజే"
– కావ్య ప్రకాశము, ముమ్మటుడు. – కావ్యాలంకారసంగ్రహము, పుట -116.

[734] శ్రీమద్భగవద్గీత, విభూతియోగం – 34 శ్లో.

ఇరుగుపొరుగు వారితో ఎక్కువగా మాట్లాడుతుండటం వల్ల గొడవలు రావచ్చు. అందుకే ఈ హెచ్చరిక.

ముచ్చటగా, సారవంతంగా నాలుగే నాలుగు పంక్తుల్లో చేయబడ్డ ఈ నీతి బోధ బొమ్మకు చెందిందే అయినా అది సజీవమైన స్త్రీమూర్తిగా భావించి చేసిందే. ఒక వాక్యం సౌందర్యానికి, వేరొకటి సంభాషణకు, ఇంకొకటి శీలానికి, చివరిది అన్యుల విమర్శకు అవకాశమీయని నడవడికకి చెందినది.

మొత్తంమీద బాలికల ఆటలన్నీ పాటలతో మిళితమై లయాత్మక విన్యాసంతో వినోద విజ్ఞానాలతోపాటు శారీరక దారుఢ్యంకూడా సమకూర్చేవిగా కనిపిస్తున్నాయి. చీకూచింతలేని కన్యాజీవితం ఆటపాటలతో ఆనందమయంగా సాగిపోవటం ముదావహం.

**సమర్త:** స్త్రీ జీవితంలో ప్రధానమైన ఘట్టం 'సమర్త'. సమర్త అయిన స్త్రీ మాత్రమే దాంపత్య జీవితానికి, సంతానవతి కావటానికి అర్హురాలవుతుంది. అందుకే భవిష్యత్తులో అటు శారీరకంగాను, ఇటు జీవితపరంగాను జరగబోయే ఎన్నో పరిణామాలకు కేంద్రబిందువు సమర్త. హాయిగా ఆటపాటలతో ఆనందంగా సాగిపోతున్న కన్యా జీవితంలో హఠాత్తుగా జరిగే సృష్టికార్యమిది. అత్యంత వేగంగాపోతున్న వాహనానికి హఠాత్తుగా వేగ నిరోధకాన్ని (break) ప్రయోగిస్తే ఏ విధంగా కుదుపుకు లోనవుతుందో అదే విధంగా సాఫీగా సాగిపోతున్న బాలిక జీవితంలో ఇదొక మలుపు. ఇదొక కుదుపు. ఈ సమర్త మొగ్గ పుష్పించటం వంటిది. అందుకే 'పుష్పవతి' అయింది అని కూడా వ్యవహరిస్తారు. ఋతుస్రావంలో ఉన్న స్త్రీని 'రజస్వల' అని కూడా అంటారు. ఈ సమర్త తరువాత వివాహానికి అర్హురాలు అవుతుంది గనుక, బాల్య జీవితం నుంచి పెద్ద జీవితంలోకి అడుగు పెడుతుంది గనుక 'పెద్ద మనిషి' అయింది అని కూడా అంటారు. పెద్ద మనిషి కాని బాలిక వివాహానికి అర్హురాలు కాదు. అటువంటి ఆడదాన్ని 'మాచకమ్మ' అంటారు.

ఈ సమర్త సాధారణంగా 10-15 సంవత్సరాల మధ్య చోటు చేసు కుంటుంది. ఎక్కువ మంది బాలికలు ఈ సంవత్సరాలలోనే రజస్వల అవుతారు. కొద్ది

మంది మాత్రం 15-20 సంవత్సరాల మధ్య రజస్వల అవుతారు. ఏ బాలికలో ఎప్పుడు ఈ పరిణామం చోటు చేసుకుంటుదనేది ఆయా బాలికల శారీరక ఆరోగ్యాన్నిబట్టి, వారసత్వ లక్షణాలనుబట్టి ఉంటుంది. దీనికి సంబంధించి ఎలాంటి సూచనలూ ఉండవు. ఆ బాలికకు దీని లక్షణాలు ఏ మాత్రం తెలియవు. ఆ బాలిక అమాయకత్వానికి నిదర్శనమీ క్రింది గేయం.

"యవ్వనంబు చాలదమ్మా – ఏమి ఎరుగని బాలికమ్మా
తెల్లచీర కట్టెనమ్మా – తోయజాక్షి ఎరుగదమ్మా
తల్లి చూచి చెప్పెనమ్మా – తలవంచి నవ్వెనమ్మా".[735]

సమర్తను ఒక వేడుకగా జరుపుకొంటారు. ఈ సందర్భంగా ఎన్నో ఆచార వ్యవహారాలు పాటిస్తారు. ప్రాంతాన్నిబట్టి, కులాన్నిబట్టి ఇవి వేరుగా ఉంటాయి. ధనికులు ఆడంబరంగా జరుపుకుంటే, పేదవారు తమ స్తోమతకు తగినట్లు జరుపుకొంటారు. ఆచారాన్ని పాటించటం మాత్రం తథ్యం.

**సమర్త వేడుక :**

**కూర్చోపెట్టటం** : సమర్త వేడుకలో ముఖ్యమైంది 'కూర్చోపెట్టటం'. సమర్త అయిన బాలికను ఒక ప్రత్యేక ప్రదేశంలో కూర్చోపెట్టటాన్నే 'కూర్చోపెట్టటం' అంటారు. దీని కోసం కొన్ని ప్రత్యేక ఏర్పాట్లు చేస్తారు. ముందుగా బాలిక సమర్త అయిన విషయం అందుబాటులో ఉన్న అయిన వాళ్లకు ఇరుగు పొరుగు వారికి తెలియజేస్తారు. వారంతా వెంటనే వస్తారు. ఒక గదిలో మూలన సుమారు రెండు గజాల చతురస్రప్రదేశాన్ని ఎన్నుకుంటారు. ఒక వైపు గోడ ఉంటుంది. ఆ ప్రదేశంలో కోస్తా ప్రాంతం వాళ్లు తాటాకుల్ని పరుస్తారు. అప్పటికప్పుడు తాటిచెట్టునుండి కోయించి తెప్పించి ఆ ఆకుల్ని పరుస్తారు. మేనమామ అందుబాటులో ఉంటే అతని చేతనే ఈ ఆకుల్ని తెప్పిస్తారు. కోస్తా ప్రాంతంలోని కొన్ని ప్రదేశాలలో తాటిచెట్లు అందుబాటులో లేనిచోట పొనుగుగడ్డిని పరుస్తారు. ఆ ఆకులపై తెల్లని పంచెను కాని, వస్త్రాన్ని కాని కప్పుతారు. ఇవేవీ అందుబాటులో లేనివాళ్లు చాపను వేసి దానిపై వస్త్రాన్ని పరుస్తారు.

[735] తెలంగాణ పల్లెపాటలు, పుట – 109.

నాలుగు మూలలా నాలుగు ఎండు కొబ్బరి చిప్పల్ని పెడతారు. ఈ ఏర్పాట్లు అయ్యేవరకు అమ్మాయిని ఎవరూ తాకకుండా ఒక ప్రక్కన కూర్చో పెడతారు. కూర్చోపెట్టటానికి ఏర్పాట్లు పూర్తయింతరువాత ఆ బాలిక అమ్మ, అమ్మమ్మ, నాయనమ్మ గాని లేదా వచ్చిన ముత్తయిదువుల్లో ఒకరు గాని ఆ బాలిక దగ్గరకు వెళ్లి ఒంటిపై ఉన్న దుస్తుల్ని మార్చి తెల్ల చీర కట్టి, తెల్ల రవక తొడుగుతారు. ఇటువంటి అవసరం వస్తుందనే ఆడపిల్లలకు తొమ్మిదవ సంవత్సరంలోగాని, పదకొండవ సంవత్సరంలో గాని ఓణీల వేడుకను జరుపుతారు. అప్పుడే చీరను కూడా కట్టబెడతారు. ఈడు వచ్చిన ఆడ పిల్ల కోసం ముందుగానే మేమమాన చేత తెల్లచీర కొనిపించి తెల్లరవిక కుట్టించి దాచి పెడతారు. ఈ తెల్లచీర ఆచారం లేని కుంటుంబాల వారు ఒంటిపై ఉన్న దుస్తులతోనే యధాతథంగా కూర్చోబెడతారు. చీర కట్టిన తరువాత నుదుట కుంకుమ బొట్టు పెట్టి, మెడకి గంధం పూస్తారు. తలలో పూలు పెడతారు. కాళ్లకి పసుపు రాస్తారు. తమలపాకులు, వక్క, రెండు అరటి పండ్లు కలిగిన తాంబూలాన్ని అమ్మాయి దోసిలిలో పెడతారు. దానిపై ఒక ఎండు కొబ్బరి చిప్పను పెడతారు. తరువాత అమ్మాయిని తీసుకువచ్చి ఆకులపై కూర్చోబెడతారు. ఇలా కూర్చోబెట్టేటప్పుడు తూర్పు ముఖంగా కూర్చోబెడతారు. ఈ కూర్చోపెట్టటం అనేది ఉదయం 12 గం.లోపు, సాయంత్రం 4 - 6 గం. మధ్యనే చేస్తారు. సాయంత్రం 7 గం. తరువాత గాని మిట్టమధ్యాహ్న సమయంలోగాని కూర్చోబెట్టరు. అమ్మాయిని కూర్చోబెట్టిన తర్వాత తనను అంటుకున్న ముత్తయిదువ తలస్నానం చేస్తుంది.

తరువాత గది మధ్యలో చిన్న రోలు ఏర్పాటు చేసి దానిపై కుందిని పెట్టి అందులో ఎండుకొబ్బరి, బెల్లం కలిపి దంచుతారు. దీనినే చిమ్మిలి లేదా చిమ్మిరి అంటారు. కొన్ని ప్రాంతాలలో ఎండు కొబ్బరి బదులు నల్ల నువ్వులు వాడతారు. ఈ చిమ్మిలిని ముగ్గురు లేదా ఐదుగురు ముత్తయిదువులు దంచుతారు. కొబ్బరి, బెల్లం మెత్తగా అయ్యేంత వరకు తొక్కి ఉండలు చేస్తారు. ఈ ఉండలు ఐదింటిని అమ్మాయి దగ్గర పెడతారు. నాలుగు మూలలా ఏర్పాటు చేసిన నాలుగు కొబ్బరి చిప్పల్లో నాలుగు, అమ్మాయి చేతిలోని కొబ్బరి చిప్పలో ఒకటి పెడతారు. ఇవి పెట్టేటప్పుడు

కొబ్బరి చిప్పల్ని తాకకుండా పెడతారు. తరువాత ఇద్దరు ముత్తయిదువులు పాట పాడుతూ అమ్మాయికి హారతి ఇస్తారు. చివరగా వచ్చిన ముత్తయిదువుల్ని సత్కరిస్తారు. వారికి నుదుట కుంకుమ బొట్టు పెట్టి, మెడకు గంధం, కాళ్లకు పసుపు పూసి చేతిలో తాంబూలం పెడతారు. ఈ తాంబూలంలో ఆకులు, వక్క, పండ్లు (ఆయా ఋతువుల్లో దొరికేవి), చిమ్మిలి ఉండలు ఉంటాయి. ఆందరూ వెళ్లిపోయిన తరువాత ఆ బాలిక తన చేతిలోని తాంబూలాన్ని ప్రక్కన పెట్టి విశ్రమించవచ్చు. ఆ బాలిక స్నానం అయ్యేంత వరకు తనకు కేటాయించిన ప్రదేశంలోనే ఉండాలి. భోజనం, నిద్ర అన్నీ అక్కడే. ఎవరినీ తాకకూడదు. దైహికావసరాల కోసం మాత్రమే అక్కడి నుండి లేవవలసి ఉంటుంది. పూర్వం ఇళ్లలో మరుగుదొడ్లు లేని కాలంలో కాలకృత్యాలు తీర్చుకోవటానికి మహిళలు ఊరి బయటకు వెళ్లేవారు. సమర్త అయిన బాలిక ఇల్లు దాటి వెళ్లకూడదు. కనుక ఇంటి పెరటిలో గుంతను తవ్వి దాని ఉపయోగించుకోమనేవారు. మైల స్నానం అయిం తర్వాత ఆగుంతను పూడ్చి వేస్తారు. సమర్త అయిన బాలిక ఎటూ వెళ్లకూడదు కనుక విసుగు చెందకుండా కాలక్షేపం కోసం ఆ ఇంటి వాళ్లుకాని, తోటి ఆడపిల్లలు కాని ఆ బాలికకు దగ్గరలో కూర్చుని అచ్చనగండ్లు, పచ్చీసు, ఓమన గుంటలు వంటి ఆటలు ఆడతారు. అలా ఆడేటప్పుడు ఆ బాలికను తాకకుండా జాగ్రత్త పడతారు. ఒక వేళ పొరపాటున తాకితే స్నానం చేస్తారు.

తెలంగాణ ప్రాంతంలో తాటాకులు, పొనుగుగడ్డి పరిచే అలవాటులేదు. తెల్లవస్త్రం కాని లేదా మామూలు వస్త్రం కాని పరిచి కూర్చోపెడతారు. అదే విధంగా తెల్లచీర కట్టే సంప్రదాయం కూడా లేదు. ఒంటిపై ఉన్న బట్టలతోనే కూర్చోపెడతారు. చిమ్మిలితొక్కే ఆచారం కూడా లేదు. తెల్ల వస్త్రం నాలుగు మూలలా ఎండుకొబ్బరి చిప్పలు పెట్టటం కూడా ఉండదు. కేవలం పచ్చి లేదా వేయించిన శనగపప్పు, పంచదార, ఎండు కొబ్బరి ముక్కలు కలిపి తాంబూలంగా ముత్తయిదువులకు పంచుతారు. కాస్త ఆర్థికంగా ఉన్న వాళ్లు పండ్లు కూడా పంచుతారు.

బాలిక కూర్చున్న గదిలోకి ఇంటిలోని మగవాళ్లు వెళ్లకూడదు. స్నానం అయ్యేంత వరకు పురుషులు ఆ బాలికను చూడకూడదు. దైహికావసరాల కోసమైనా పురుషులు చూడకుండా వెళ్లాలి. బాలికను కూర్చోపెట్టటానికి గది వసతి లేని వాళ్లు, ఇంట్లోనే ఒక మూల కూర్చోబెట్టి పురుషులకంటపడకుండా చుట్టూ తెరలు ఏర్పాటు చేస్తారు.

**స్నానం** : సమర్త అయిన బాలికకు ఐదవరోజు, ఏడవరోజు, తొమ్మిదవరోజు, పదకొండవరోజు స్నానం చేయిస్తారు. కొన్ని ప్రాంతాలలో కొన్ని కుటుంబాలలో ఐదవరోజు, పదకొండవరోజు మాత్రమే చేయిస్తారు. ఈ స్నాన కార్యక్రమం పురుషుల కంటపడకుండా అర్ధరాత్రి దాటిన తర్వాత తెల్లవారుఝాము 2-4 గంటలమధ్య చేయిస్తారు. అనగా నాలుగవ రోజు రాత్రి, ఆరవరోజురాత్రి, ఎనిమిదవ రోజు రాత్రి, పదవ రోజు రాత్రి. మొదటిసారి స్నానం చేయించిన తర్వాత బాలికను కూర్చోబెట్టిన తాటాకులు, పొనుగు గడ్డి లేదా చాపను పెరట్లో అర్థరాత్రి పురుషుల కంటపడకుండా కాల్చివేస్తారు. ఆకులపై కప్పిన వస్త్రాన్ని, బాలిక ఒంటిపై ఉన్న వస్త్రాల్ని ఇంటి చాకలికి ఇస్తారు. మొదటి స్నానం అయిపోయిన తర్వాత పడుకోవటానికి చాప ఇస్తారు. పదకొండవ రోజు వరకూ మొదట కూర్చోబెట్టిన స్థలంలోనే ఉండాలి. 10వ రోజు రాత్రి స్నానం అయిన తర్వాత మరలా పదకొండవ రోజు ఉదయం స్నానం చేయిస్తారు. ఆ స్నానం అయిన తర్వాత ఇంట్లోని పెద్దలు (అమ్మమ్మ, నాయనమ్మ) గానీ, తల్లిగాని ఆ బాలికను వంటింట్లోకి తీసుకువెళ్లి కుడిచేతిని పట్టుకొని పాలు, పెరుగు, ఉప్పు వంటి ఆహార పదార్థాలలో వ్రేలు పెట్టిస్తారు. అనగా ఆ రోజుతో మైల తీరిపోయిందనీ, ఆ బాలిక అన్నీ అంటుకోవచ్చని అర్థం. అదే రోజు ఉదయం వారి వారి ఆర్థిక స్తోమతను బట్టి బంధువులకు, సన్నిహితులకు, గ్రామంలోని వారికి విందుభోజనాలు ఏర్పాటు చేస్తారు. కోస్తా, రాయలసీమల్లో శాఖాహార భోజనాలు ఏర్పాటు చేస్తే తెలంగాణలో మాత్రం స్త్రీ, పురుష భేదం లేకుండా అందరికీ కల్లు, మాంసాహారం ఏర్పాటు చేస్తారు. పదకొండవ రోజు సాయంత్రం పేరంటం చేస్తారు. ముత్తయిదువులందరినీ ఆహ్వానిస్తారు. అమ్మాయిని చక్కగా అలంకరిస్తారు. నూతన వస్త్రాలు ధరింపచేసి, నుదుట కుంకుమ బొట్టు పెట్టి, మెడకు గంధం, కాళ్లకు పసుపు

పూస్తారు. తలలో పూలు పెట్టి చేతులకు నిండుగా గాజులు వేస్తారు. తరువాత అమ్మాయిని తీసుకువచ్చి ఒక కుర్చీలో కూర్చోబెడతారు. ఎదురుగా చిన్న చిన్న పళ్లాలలో ఐదురకాలు వారు చేసిన లేక చేయించిన పిండివంటలు, పండ్లు పెడతారు. పసుపు, కుంకుమ, గంథం, పన్నీరు బుడ్డి, అక్షతలు కూడా ఉంచుతారు. అగరువత్తులు వెలిగించి పెడతారు. ముత్తయిదువులందరూ వచ్చిన తర్వాత కార్యక్రమం ప్రారంభిస్తారు. పాటలు పాడటం వచ్చిన ముత్తయిదువులందరూ ఒకరి తర్వాత ఒకరు పాటలు పాడతారు. ఈలోపు ముత్తయిదువులందరికీ కుంకుమ బొట్టుపెట్టి మెడకు గంధం, కాళ్లకు పసుపు పూస్తారు. పాటలు పాడటం అయిపోయిన తర్వాత ఇద్దరు ముత్తయిదువులు ఒక పళ్లెంలో కర్పూరం వెలిగించి అమ్మాయికి కుడి ఎడమలలో నిలబడి మంగళహారతి పాడుతూ ఆ పళ్లెం పట్టుకొని అమ్మాయికి హారతి ఇస్తారు. తదుపరి ముత్తయిదువులు ఒక్కొక్కరే వచ్చి అమ్మాయికి బొట్టుపెట్టి, గంధంపూసి, అత్తరు చల్లుతారు. అమ్మాయి వారి చేతికి తాంబూలమిచ్చి కాళ్లకు నమస్కరిస్తుంది. అప్పుడు వారు అక్షతలు వేసి ఆశీర్వదిస్తారు. ఆ ఆశీస్సులే ఆ బాలిక భవిష్యజ్జీవితానికి పునాది అవుతాయి. ఆర్థిక స్తోమతు కలిగిన వాళ్లు ఐదవ రోజు, ఏడవ రోజు, తొమ్మిదవ రోజు కూడా వారి వారి తాహతునునుసరించి ఉదయం భోజనాలు, సాయంత్రం పేరంటం ఏర్పాటు చేస్తారు. ఈ భోజనాలకు స్త్రీలతో పాటు పురుషులను కూడా ఆహ్వానిస్తారు. అయితే అప్పుడు అమ్మాయి తాంబూలం ఇవ్వదు. ఇంట్లోని పెద్దవాళ్లే ఇస్తారు. ఈ తాంబూలాలన్నింటిలోను మొదటి రోజు తప్ప తప్పనిసరిగా నానబెట్టిన శనగలను, చిమ్మిలి ఉండను పంచుతారు. కొందరు చలిమిడి కూడా పంచుతారు. ఈ వేడుకలన్నీ చేయటానికి కారణం అమ్మాయిని సాక్షాత్తుగా దుర్గామాత అంశగానో, లక్ష్మీ స్వరూపంగానో భావించటం వల్లనే. ఆ దేవతలకు ఏ విధంగా పూజ చేస్తారో అదే విధంగా ఈ బాలికకు కూడా చేసి మురిసిపోతారు. ఈ భావనతోనే కోస్తా ఆంధ్రలోని ఒక సామాజిక వర్గంవారు ఐదవరోజు స్నానం అయిన రోజు నుండి పదకొండవరోజు వరకు నవరాత్రులలో అమ్మవారిని అలంకరించినట్లు బాలికను రోజుకొక

అలంకారంతో అలంకరించి ప్రతిరోజూ సాయంత్రం ఉత్సాహంగా పేరంటం జరుపుకుంటారు. పదకొండవరోజుతో ఈ సమర్త వేడుక పరిసమాప్తమవుతుంది.

**ఆహారం:** పదకొండు రోజులపాటు బాలికకు పెట్టే ఆహారంలో కొన్ని నియమాలు పాటిస్తారు. శరీరంలో జరిగే మార్పుల వల్ల ఆ సమయంలో బాలికకు ఎటువంటి వికారాలూ కలగకూడదని ఈ నియమాలు పాటిస్తారు. కోస్తా ప్రాంతంలో మొదటి స్నానం అయ్యే వరకు పులగం అన్నం పెడతారు (బియ్యంలో పెసరపప్పు కలిపి వండిన అన్నాన్ని పులగం అంటారు). దీనిలో నెయ్యి ఎక్కువగా వాడతారు. పొట్లకాయ, బీరకాయ వంటి అత్యంత సాత్వికమైన కూరలను పెడతారు. వీటిలో ఉప్పు, కారం నామమాత్రంగానే ఉంటాయి. మొదటి స్నానం అయిన తరువాత మరికొన్ని కూరలు, మామూలు అన్నం పెడతారు. శాఖాహారమే తప్ప మాంసాహారం పెట్టరు. (మాంసాహారం తినే అలవాటు ఉన్న వారికి). అల్పాహారంగా ఎండుకొబ్బరి, బెల్లం, నువ్వుల ఉండలు, అరటి పండ్లు వంటివి పెడతారు. ఆకులపై పరిచిన వస్త్రంపై నాలుగుమూలల్లోను, చేతిలోను పెట్టిన ఎండు కొబ్బరి చిప్పలను బెల్లంతో కలుపుకొని ఆ బాలికే తినాలి. అదే విధంగా వాటిలోని చిమ్మిలి ఉండలు కూడా తినాలి. ఆరునెలల వరకు కొన్ని ఆహార నియమాలు పాటిస్తారు. గోంగూర, వేరుశనక్కాయలు ఆరునెలల వరకు నిషేధం. గోంగూర దగ్గు కలగచేస్తుందని, వేరుశనగకాయలు వాతం చేస్తాయని నమ్ముతారు.

పదకొండురోజుల పాటు బాలికకు పెట్టే ఆహారంలో ఎన్నో విశేషాలున్నాయి. ఎండు కొబ్బరి, నువ్వుల్లో సున్నం (కాల్షియమ్) పుష్కలంగా ఉంటుంది. బెల్లంలో పిండి పదార్థాల (కార్బోహైడ్రేట్స్) శాతం ఎక్కువ. సాధారణంగా పది నుండి ఇరవై సంవత్సరాల మధ్య ఆడపిల్లలు రక్తహీనత (ఎనీమియా)తో బాధపడుతుంటారు. ఎండుకొబ్బరి, నువ్వులు, నెయ్యి ఎముకల పరిపుష్టికి దోహదపడతాయని; బెల్లం, పండ్లు వల్ల రక్త వృద్ధి కలుగుతుందని, పెసరపప్పు వేడిని తగ్గించి చలువ చేస్తుందనీ స్త్రీ వైద్య నిపుణుల వివరణ.[736] ఆహారంలో ఈ విధమైన జాగ్రత్తలు తీసుకోవం వల్లనే

[736] డా. కె. జయప్రదాంబ గారితో ముఖాముఖి చర్చల ద్వారా సేకరణ.

బాలిక శారీరకంగా దృఢత్వాన్ని సంతరించుకొని భవిష్యత్తులో వివాహానంతరం గర్భధారణకు అనుకూలమవుతుంది.

మొదటి సమర్త తరువాత ఐదు సమర్తల వరకు కొన్ని నియమాలు పాటిస్తారు. అయితే మొదటి సమర్తలో వలె పదకొండు రోజుల నియమం గానీ, ఆకులపై కూర్చోపెట్టటం గానీ జరగదు. నాలుగవరోజురాత్రి స్నానం అయ్యేంత వరు ఇంట్లోనే వేరుగా ఉంచుతారు. ఐదవ రోజు నుండి ఇంట్లోకి రానిస్తారు. మొదటి సమర్తలో పెట్టినట్లు కాక సాధారణ భోజనాన్నే పెడతారు. ఈ అయిదు సమర్తలు అయ్యేటప్పటికి ఆరు నెలల సమయం పడుతుంది గనుకనే ఆహారం విషయంలో ఆరు నెలల పాటు నియమాలు పాటిస్తారు.[737]

పైన వివరించిన ఆచారాలు, సంప్రదాయాలు అరవై, డెబ్బై దశకాల వరకు బాగా పాటించేవారు. క్రమక్రమంగా సమాజంలో వస్తున్న మార్పుల కనుగుణంగా స్త్రీ విద్య తప్పనిసరి కావటం వల్ల బాలికలు పాఠశాలలకు వెళుతున్నారు. పదకొండు రోజుల పాటు పాఠశాలలకు సెలవు పెట్టటం కుదరదు కనుక చాలావరకు ఈ సంప్రదాయాలను పాటించకుండా బాలికల్ని పాఠశాలలకు పంపుతున్నారు. ఏబాలిక సమర్త అయినా ఇరుగుపొరుగు వారికి కూడా తెలియటం లేదు. సమర్త అనేది స్త్రీ శరీరంలో కలిగే సాధారణ మార్పుగానే భావిస్తున్నారు. సంప్రదాయాలపట్ల, ఆచారాల పట్ల గాఢానురక్తి గలిగిన ఎవరో కొందరు మాత్రం ఈ వేడుకలను జరుపు కుంటున్నారు.

'సీత సమర్త'[738] అనే గేయంలో సీతకు జరిగిన సమర్త వేడుక గురించి వర్ణింపబడింది. ఆ సమయంలో పద్మముఖులైన స్త్రీలు నువ్వుపప్పు, బెల్లం రోటిలో వేసి పసిడి రోకళ్లతో 'సువ్వి' అంటూ దంచితే చిమ్మిరి లేక చిమ్మిలి తయారయింది. అప్పుడు కౌస్యలకు కన్నుల పండగయ్యిందట. ఆమె ఘల్లు ఘల్లుమని హస్త

[737] కోస్తాఆంధ్ర సంప్రదాయాల గురించి శ్రీమతి కె. బసవపున్నమ్మ, తెలంగాణ సంప్రదాయాల గురించి శ్రీమతి చెన్ను పరిమళ గార్లతో ముఖాముఖి చర్చల ద్వారా సేకరణ.

[738] తెలంగాణ పల్లెపాటలు, పుట -15.

కంకణాలు కదలంగా ఆ చిమ్మిలిని పళ్లాలలోకి తోడుకొని ఇమ్ముగా కాంతలందరినీ పిలిచి బంగారు తబుకులతో పంచి పెట్టిందట. ఈ విధంగా ఒకానొక ఊహా జగత్తును సృష్టించుకొని ఈ వేడుకలు జరుపుకొంటారు. సీతకు వివాహమైన తరువాతనే సమర్త అయినట్లుగా ఊహించి అత్తగారింట్లో కౌసల్య ఆధ్వర్యంలో ఈ వేడుక జరిగినట్లుగా వర్ణించటం జరిగింది.

'రుక్మిణి సమర్త'[739] అనే గేయంలో కూడా ఈ విధంగానే వర్ణించటం జరిగింది. ఇవి నిజంగా పౌరాణికమైన సీత, రుక్మిణిలకు సంబంధించినవి కాదు. సమర్త పెళ్లికూతుర్ని సీతగా, రుక్మిణిగా భావించి చేసుకొనే వేడుకలు.

## 2. దాంపత్య జీవితం

**పెండ్లి** : మానవుడు సంఘజీవి. సంఘజీవనంలో నియమాలు, కట్టుబాట్లు ఉంటాయి. వాటిని అవశ్యం పాటించాల్సిందే. మానవుడు సంతానాన్ని పొందాలంటే తప్పని సరిగా వివాహం చేసుకోవాలి. వైవాహికబంధంతో ఒక్కటైన స్త్రీ పురుషులు మాత్రమే సంతానం పొందటానికి అర్హులు. సృష్టిలో ఇతర ఏ ప్రాణికీ లేని నియమం మానవుడికుంది. మిలిగిన ప్రాణులు ఆయా ఋతుధర్మాన్ని అనుసరించి ఆడ మగా ప్రాణులు సంగమించి సంతానాన్ని పొందుతాయి. కాని మానవులలో అలా కాదు. ఒక వేళ వివాహం కాకుండా సంతానాన్ని పొందితే ఆ సంతానాన్ని అక్రమ సంతానంగా భావించి సంఘం వారిని హీనంగా చూస్తుంది. అందుకే కుటుంబం పెరగాలన్నా, సృష్టికార్యం కొనసాగాలన్నా మానవులకు పెళ్లి తప్పదు.

జీవితం రెండు చక్రాల బండి అనుకుంటే దానికి ఒక చక్రం పురుషుడు మరొక చక్రం స్త్రీ. రెండు చక్రాలూ సమానంగా ఉన్నప్పుడే బండి సాఫీగా సాగుతుంది. అలాగే జీవితం కూడా. చెట్టుమీద కాయ, సముద్రంలో ఉప్పు కలిసినట్లుగా ఎక్కడో పుట్టిపెరిగిన పురుషుడు మరెక్కడో పుట్టి పెరిగిన స్త్రీ పెళ్లితో ఒకటై ఒకే కప్పు కింద

[739] మిన్నేరు, పుట – 95.

కాపురం చేస్తారు. మానవులలో పెళ్లి అంటే కేవలం శరీరాల కలయిక కాదు. రెండు ఆత్మల కలయిక. అందుకే ఆబంధం ఏడేడు జన్మలకు కొనసాగుతుందని భావిస్తారు.

జీవితం సుఖదుఃఖాత్మకమైంది. పురుషుడికి సరియైన భార్య, స్త్రీకి సరియైన భర్త లభించినప్పుడే ఆ జీవితం ఆనందాల హరివిల్లు అవుతుంది. అలా కానప్పుడు ఆ జీవితం దుఃఖభాజనమవుతుంది. తనకు ఎటువంటి భార్య వస్తుందోనని పురుషుడు ఆరాటపడటంకన్నా ఎటవంటి భర్త వస్తాడోనని స్త్రీ ఎక్కువగా ఆరాటపడుతుంది. పూజకొద్దీ పురుషుడు అని ఆర్యోక్తి. దానిని బలంగా నమ్మిన స్త్రీ కన్యా జీవితంలో తనకు మంచి భర్త రావాలని ఎన్నెన్నో నోములు నోస్తుంది. పూజలు చేస్తుంది (చూ.నోములు-వ్రతాలు). వన్నెగాడయిన మగాడు తనకు భర్త కావాలని కోరుకుంటుంది.

ఆడపిల్ల ఎదుగుతుందంటే, యుక్తవయస్కురాలయిందంటే వివాహ సమయం దగ్గరపడినట్లేనని భావిస్తారు తల్లిదండ్రులు. సమర్తకాగానే ఎప్పుడెప్పుడు అమ్మాయికి పెళ్లి చేసి అత్తవారింటికి పంపుదామా అని తొందర పడుతుంటారు. ఆ తొందరపాటులో వారి బరువు, బాధ్యతలు తీర్చుకోవటానికి తనను ఎవరో ఒకరి కిచ్చి కట్టబెడతారేమోనని ఆరాటపడుతుంది కన్యామణి.

'ఊరు పక్కాసేను, ఉడతలా పాలు'
'బావల్ల మీదికి, నన్నీయకన్నా',
'యారాండ్ల మీదికి, నన్నీయకన్నా'
'మరుదుల మీదికి, నన్నీయకన్నా',
'సౌతులమీదికి, నన్నీయకన్నా'[740]

అని అభ్యర్థించటంలో వీరందరూ ఉన్నచోటికి తన్నిస్తే తాను సుఖపడలేను కాబట్టి జీవితం కష్టాల పాలవుతుందనే హెచ్చరిక గోచరిస్తుంది. బావలున్న చోట ఇస్తే బావిలో వేసినట్లే. ఏరాండ్లున్న చోటిస్తే ఏట్లో వేసినట్లే, మరుదులున్న చోటిస్తే మడుగులో వేసినట్లే. సవతులున్న చోటిస్తే సంద్రంలో పడేసినట్లే అని ఆ కన్నె పడుచు

[740] త్రివేణి, పుట -103.

మొరపెట్టుకొంటుంది. ఇక్కడ ఉపమానాలన్నీ నీళ్లు కావటం గమనార్హం. నీళ్లు ఎక్కడున్నా అందులో పడితే చావుతప్పదు గదా!

వేరొక కన్య అన అవ్వతో ఈ విధంగానే మొర పెట్టుకొంటుంది.[741] తనను సామల దేశానికివ్వద్దంటుంది. సామల బువ్వ తినలేదట. వడ్లు పండే దేశానికి వ్వద్దంటుంది. వడ్లు దంచలేదట. కొర్రల దేశానికివ్వద్దంటుంది. కొర్రబువ్వ తినలేదట. మక్కల దేశానికివ్వద్దంటుంది. మక్క బువ్వ తినలేదట. తైదల దేశానికివ్వద్దంటుంది. తైద రొట్టెలు తినలేదట. అయితే ఎటువంటి దేశానికివ్వాలో సూచించలేదు. ఈ గేయంలో కూడా ఏరాండ్లతో బ్రతుకీడ్వటం వేపకాయ చేదుననుభవించటం వంటి దంటుంది. బావలున్నచోట కాపురం చెయ్యటం భారీదొడ్లపేడ ఎత్తి వేయటం వంటిదంటుంది. మరదండ్రున్నచోట కాపురం చేయటం వాళ్ల అలంకరణ కోసం పెంచే మల్లెచెట్టుకు నీళ్లు పోయటం వంటిదంటుంది. సవతులున్న చోట కాపురం చేయటం సముద్రంలో దిగి లోతు చూడటం వంటి దంటుంది. ఈ గేయాలను బట్టి గ్రామ సీమలలో సమష్టి కుటుంబ జీవనం అనివార్యమైనదిగా తోస్తుంది.

**పెళ్లిచూపులు** : పెళ్లిఘట్టంలో మొదటి అంకం పెళ్లిచూపులుగా చెప్పవచ్చు. ఇది ఆధునిక కాలంలో మధ్యతరగతి, ఎగువ మధ్యతరగతి వారిలో మొదలైన ఆచారంగా గోచరిస్తుంది. పూర్వం బాల్య వివాహాలు ఎక్కువగా జరుగుతుండేవి. వయసు వచ్చిన తరువాత జరిపే వివాహమైనా పెద్దలు సంబంధం కుదుర్చుకోవటమే తప్ప పెళ్ళిచూపుల కార్యక్రమం ఉండదు. అందుకే దీనిని వర్ణించే గేయాలు లేవు. కానీ శ్రీ ఆర్వీ.ఎస్.సుందరంగారు తమ గ్రంథంలో పెళ్లి చూపుల సమయంలో తల్లిదండ్రులు అమ్మాయి సౌందర్యాన్ని వర్ణిస్తున్నట్లుగా ఉన్న గేయాన్నొకదాన్ని పేర్కొన్నారు.[742]

అమ్మాయిని చూడటానికి అబ్బాయి, అతని తరుపు వారు అమ్మాయి ఇంటికిరావటమే ఆచారంగా కొనసాగుతోంది. పెళ్లి కూతుర్ని పిలిపించమంటారు మగపెళ్లి వారు. అమ్మాయి మాట్లాడితే వినాలని, ఆమె గొంతు ఎలా ఉంటుందో

[741] పైదే, పుట -100.
[742] తెలుగు - కన్నడ జానపద గేయాలు, పుట- 156.

తెలుసుకోవాలని వారి అభిలాష. తమ బిడ్డ పలుకులు చిలకపలుకులని, నడక హంసనడక అని తల్లిదండ్రులే ఘనంగా కూతుర్ని వర్ణిస్తారు. మగపెళ్లివారి ఆకాంక్ష నెరవేరదు.

**పెళ్లి సంబరాలు** : పెళ్లిచూపులు, పెళ్లిసంబరాలు, అప్పగింతలు, శోభనం మొదలైన వాటికి సంబంధించి మిన్నేరులో ఎన్నో గేయాలున్నాయి. ఈ గేయాలను పరిశీలించినప్పుడు అవి ఎవరో పండితులు రచించి వ్యాప్తిచేసిన గేయాలుగా గోచరిస్తున్నాయి తప్ప వాటిలో జానపద వాసనలు కాని, వారి జీవన విధానం కాని ఎంత మాత్రం లేవు. శిష్టుల ఆచార వ్యవహారాలే వర్ణితం.

అయినప్పటికీ కొంత సామీప్యంగా ఉన్న వాఙ్మయాన్ని దిఙ్మాత్రంగా వివరిస్తాను. మంగళస్నానం, పెళ్లి కూతుర్ని, పెళ్లి కొడుకును చెయ్యటం, పెళ్లితంతు, విందు భోజనాలు, పెళ్లి కొడుకును పెళ్లి కూతుర్ని అవతలి వారు గేలి చేయటం, వియ్యాలవారి వినోదాలు, పెద్దల ఆశీర్వచనాలు, అప్పగింతలు వంటి కార్యక్రమాలతో పెళ్లి సంబంరాలు అంబరాన్నంటుతాయి.

పెళ్లికూతురింట్లో పెళ్లికూతురికి, అదే గ్రామమైతే పెళ్లికొడుక్కి వారింట్లో లేదా దూరాభారమైతే విడిదింట్లో మంగళస్నానాలు చేయిస్తారు. ఈ కార్యక్రమాన్ని కన్నతల్లి, ముత్తయిదువులు కలిసి పాటలు పాడుతూ వేడుకగా నిర్వహిస్తారు. ముందుగా ఒంటికి నూనె రాసి, నలుగు పిండి పూసి, నలుగు పెట్టి ఆపై తలంటు స్నానం చేయించి, జుట్టుకు సాంబ్రాణి పొగ పట్టిస్తారు. కలవారు గంధపు పూతలు, అత్తరు నలుగులు, పన్నీరు నలుగులతో మంగళస్నానాన్ని పరిమళభరితం చేస్తారు. స్నానానంతరం పట్టుబట్టలు ధరింపచేసి నుదుట కల్యాణ తిలకం దిద్ది, బుగ్గన చుక్కపెట్టి, వధువుకైతే స్థాయికి తగినట్లు నగలు అలంకరించి పెళ్లికి సిద్ధం చేస్తారు.

పెళ్లికోసం ఏర్పాటు చేసిన ప్రత్యేక వేదికపై వధూవరులను కూర్చోబెడతారు. వధువు తండ్రి వరుని కాళ్లు కడిగి కన్యాదానం చేస్తాడు. మాంగల్యపూజానంతరం బ్రాహ్మణుల మంత్రోచ్చారణలు, పెద్దల ఆశీర్వచనాలు, మంగళవాయిద్యాల నడుమ వరుడు వధువు మెడలో తాళికడతాడు. తరువాత వధూవరులు ఒకరి తలపై

మరొకరు తలంబ్రాలు పోసుకొంటారు. ఈ తంతులో వరుడ్ని శ్రీమహావిష్ణువుగాను, వధువును శ్రీమహాలక్ష్మి స్వరూపంగాను సంభావించడం హైందవ వివాహాల విశిష్టత. వచ్చిన పెద్దలందరూ జంటలుగా వచ్చి వధూవరులను ఆశీర్వదిస్తారు.

వివాహ కార్యక్రమంలో అత్యంత ప్రధానమైనది ఈ ఆశీర్వచనాల ఘట్టమే. 'చిరంజీవ', 'దీర్ఘసుమంగళీభవ', 'పిల్లాపాపలతో నిండు నూరేళ్లు చల్లగా ఉండాలి' వంటి ఆశీర్వచనాలు నవదంపతులు తాము ప్రారంబించబోయే క్రొత్త జీవితాన్ని నల్లేరు మీద నడకను చేస్తాయి. హైందవ వివాహాలలో ఆదర్శ దివ్యభావన గోచరిస్తుంది. వచ్చిన పెద్దలను కూడా సామాన్య మానవులుగా కాక పురుషులైతే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, ఇంద్రాది దేవతలుగా; స్త్రీలైతే శారద, లక్ష్మి, గౌరి, శచీదేవి వంటి దేవతలుగాను సంభావించటం హైందవ వివాహ సంస్కృతి. అందుకే ఎంత ఎక్కువమంది వచ్చి ఆశీర్వదిస్తే అంతగా వారి దాంపత్య జీవితం పరిపుష్ట మవుతుందని భావించి తల్లిదండ్రులు తమ శక్తికి మించి బంధువులను, స్నేహితులను, హితులను, శ్రేయోభిలాషులను ఆహ్వానిస్తుంటారు. ముత్తయిదువుల ఆశీర్వచనాలు పాటల రూపంలోనూ సాగుతాయి.

పూవులో తావిలాగా ఆలుమగలు కలిసిమెలసి ఉండాలని వారు ప్రగాఢంగా కోరుకుంటారు.

'చెన్నుగ పూవుల పేరెత్తినట్లు
కన్నెమాగౌరమ్మ కాపురం'

ఒప్పుమీరాలని వారి ఆరాటం.

'కడు వేడుకల సేత కడుపు చల్లగను,
కొడుకుల కోటవై కొమరొందవమ్మ' అని ఆకాంక్షిస్తారు.
'వెలయంగ దగుచోట్ల వియ్యంబులంది
కలకాల మఖిల భోగముల వర్ధిల్లు' అని ఆశీర్వదిస్తారు.

ఈ ముత్తయిదువుల ఆకాంక్షలు, ఆశీర్వచనాలే నూతన దంపతుల జీవనయాత్రకు పాథేయం.

ఆశీర్వచనాలతో పాటు అయిన వాళ్లు వస్తురూపంలో, ధన రూపంలో కానుకలుకూడా చదివిస్తారు. అవి వారు ప్రారంభించబోయే నూతన జీవితానికి ఎంతగానో తోడ్పడతాయి.

పెళ్లితంతు పూర్తయిన తరువాత వధూవరులు పూల బంతులాట ఆడతారు. వీటిని మల్లెపూలతో చేస్తారు. (సాధారణంగా ఎక్కువ వివాహాలు వేసవిలో జరుగుతాయి కనుక అప్పుడు లభించే మల్లెపూలను ఉపయోగిస్తారు. మిగతా రోజుల్లో ఆయా ఋతువుల్లో దొరికే పూలను ఉపయోగిస్తారు). ముత్తయిదువులందరూ చుట్టూ చేరి హాస్యపుపాటలతో ఈ ఆటను రక్తికట్టించి వధూవరులలో బెరుకును పోగొట్టే ప్రయత్నం చేస్తారు.

'బుఱ్ఱముక్కు, తొఱ్ఱినోరు, బఱ్ఱెగొంతు పెండ్లికొడుకు
చిఱ్ఱు ముఱ్ఱులాడి పూలచెండు లాడెనే
కొంగకాళ్లు, వంగువేళ్లు, బొంగజొల్లు పెండ్లి కొడుకు
చెంగుచెంగు మనుచు పూలచెండు లాడెనే"

అంటూ పెళ్లి కొడుకును,

"సిగ్గు పడుచు పెండ్లి బాల మ్రొక్కు మ్రొక్కి చేతులెత్త
సిగ్గు యింత లేక పూలచెండు లాడెనే"

అని పెళ్లి కూతుర్ని మేలమాడతారు.

వివాహ ఘట్టం పూర్తయిన తరువాత కార్యక్రమం విందుభోజనమే. వివాహానికి ఎక్కడెక్కడి బంధువులూ వస్తారు గనుక బంధుకోటి పరిహాసాలతో విందారగించటమే బువ్వపు బంతి. దీనినే బూజము బంతి అని కూడా అంటారు. మేళతాళాలు మ్రోగుతుండగా పచ్చని అరిటాకుల్లో రాజనాల అన్నం, పప్పు, వెన్నగాచిన నెయ్యి, అరవై కూరలు, పిండివంటలు, పాయసాలు ఇలా ఎన్నో వడ్డిస్తారు. వంటకాలు ఎంత రుచిగా ఉన్నా వాటిని ఆక్షేపిస్తూ స్త్రీలు పరిహాసపు పాటలు పాడతారు. ఇరువైపుల వారూ వాటిని విని వినోదాత్ములవుతారు (ఇటువంటి గేయాలను 'హాస్యభావన' ప్రకరణంలో వివరించటం జరిగింది).

చివరగా తాంబూలం లేకపోతే విందుభోజనం పూర్తికాదు. తాంబూల చర్వణమంటే రసచర్వణమే. జాజికాయ, జాపత్రి, పచ్చకర్పూరం, ఎండుకొబ్బరి, యాలకులు, లవంగాలు, వక్కలు, సున్నం తమలపాకులలో చేర్చి మడిచి సేవిస్తారు. ఈ సుగంధ ద్రవ్యాలన్నీ లేకపోయినా ఉన్నట్లే భావించి పాటలు పాడతారు. ఇది ఆదర్శ కీర్తనం. ఇవన్నీ నవదంపతులలో ఉత్తేజాన్ని రగుల్కొలుపుతాయి.

వివాహతంతులో చివరి ఘట్టం అప్పగింతలు, అప్పటి వరకు వేడుకలతో, సరసోక్తులతో, హాస్య సన్నివేశాలతో ఆహ్లాదంగా సాగిన కార్యక్రమం ఒక్కసారిగా మారిపోతుంది. గంభీరవాతావరణం ఏర్పడుతుంది. అందరి మనసులూ బరువెక్కుతాయి. అయినా ఇది తప్పనిసరిగా చేయవలసిన కార్యక్రమం.

**అప్పగింతలు** : స్త్రీ జీవితంలో మరపురాని ఘట్టం అప్పగింతలు. అప్పటి వరకూ పుట్టి పెరిగిన ఆ ఇల్లు తనది కాదు. ఇకపై తానా ఇంటికి బంధువు మాత్రమే. వివాహానంతరం నవవధువును అత్తవారింటికి పంపే ముందు తల్లిదండ్రులు అత్త వారింట్లో వారికి పేరుపేరునా అనగా అత్తమామలకు, బావలు, మరుదులు, తోడికోడళ్లు, ఆడపడుచులకు అమ్మాయిని జాగ్రత్తగా చూసుకోమని అప్పగించటమే ఈ అప్పగింతలు. ఆ సమయంలో ఎన్నో నీతులు బోధించటం కూడా జరుగుతుంది.

అప్పగింతల సమయంలో వెన్నవంటి కన్నతల్లి మనసు భావోద్వేగపు సెగ తగిలి కరిగి కన్నీరవుతుంది. వియ్యపురాలిని వదిన అని సంబోధించి సన్నిహితు రాలిని చేసుకొని తన కూతుర్ని పదిలంగా చూసుకోమని ప్రాధేయ పడుతుంది. పాలు కూడా కాచలేని బాల, తన పాలిటి భాగ్యదేవత, అప్పగిస్తున్నాను చక్కగా చూసుకోమంటుంది. ఆకలవుతున్నా అడగని ఆభిజాత్యం కలది. అటువంటి కన్నబిడ్డను అత్తవారింటికి పంపుతున్నందుకు ఆవేదనతో ఆ కన్నతల్లి హృదయం తల్లడిల్లుతుంది. అయినా ఏం చెయ్యగలదు? చివరి సందేశం ఒక్కటే.

"ఎన్నగ అత్తింట
పుట్టినింటికి నీవు
కీర్తిగ మెలగుమా."[743]

అత్తవారింట్లో క్రొత్తకోడలు ఏ పొరపాట్లు చేసినా కన్నతల్లి పెంపకాన్ని ఎత్తి పొడుస్తారు. అందుకే ఆ మాతృమూర్తి అప్పగింతల సమయంలో ఎన్నో సలహాల నిస్తుంది. మరెన్నో నీతులు బోధిస్తుంది. అవన్నీ గేయరూపంలో లభిస్తున్నాయి.

'చెలగి మీ అత్తింట బుద్ధిగా నుండమ్మ' అని బోధిస్తుంది. బుద్ధిగా ఉండటమంటే ఏమిటి? ఎవ్వరేం మాట్లాడినా ఎదురు మాట్లాడకపోవటమని, వాదోపవాదాలు వివాదాలకు దారితీస్తాయని, మౌనమే భూషణమని దాని అర్థం.

నిత్యజీవితంలో కూతురు పాటించవలసిన నియమావళిని కూడా సూచిస్తుంది. అందులో మొదటిది,

'వీథిలో నిలుచుండి విరుల విరబోయకుమా' అనేది.

సౌందర్య చిహ్నమైన స్త్రీ కేశసంపదకు దృష్టి దోషం తగలకూడదని. ఇంతకన్నా ముఖ్యమైనది,

'పలుమార్లు పలుదెరచి నవ్వబోకమ్మ' అనేది.

మందస్మితం మానినీ లక్షణమని, పకపకా నవ్వరాదని భావం.

'పరమాత్మతో గూడి పడతి నీవుండు' అనేది ఇంకొక సలహా.

స్త్రీ జీవాత్మ. భర్త పరమాత్మ. ఎక్కడికి వెళ్లాలన్నా భర్తతోనే వెళ్లాలి. ఒంటరిగా గాని ఇరుగుపొరుగుతోగాని పోకూడదు. అది అనుమానాలకు, అపార్థాలకు దారి తీస్తుందని దాని అర్థం.

'ఆకలివుంటేను అడుగబోకమ్మ.'

ఎంత దారుణమైన సలహా! ఎంతగా ఆకలివేసినా అన్నం పెట్టమని అడగకూడదట! ఓర్పుగా ఉండమని సలహా.

---

743 సరాగాలు, పుట -107.

'ఆడదాని బ్రతుకు అరిటాకు వంటిది
అడకువతో అందరిలో మెలగిరావమ్మ.'[744]

అరిటాకు వెళ్లి ముల్లుమీద పడ్డా ముల్లు వెళ్లి అరిటాకు మీద పడ్డా అరిటాకుకే నష్టం. ఆడదాని జీవితం అరిటాకు వంటిది కనుక అత్తవారింట్లో ఆమె జీవితం నవ్వులపాలు కాకూడదని ఇటువంటి సలహాలు చెబుతుందేమో!

ఈ సలహాల పరంపర ఇంతటితో ముగిసిపోలేదు.

'గడపపై కూర్చుండి
జడవిప్పబోకూ
కూర్చున్నప్పుడే తల్లి
కురులూ దులపాబోకు' అంటుంది.

గడపను లక్ష్మిగా భావిస్తారు. అందుకే పసుపు కుంకుమలతో అలంకరిస్తారు. దైవభావనతో గడపపై కూర్చోగూడదంటారు. గడపపై కూర్చుంటే పసుపు కుంకుమలు బట్టలకు అంటుకుంటాయని సామాన్యంగానూ గ్రహించవచ్చు. గడపపై కూర్చునప్పుడుకాని, ఎక్కడబడితే అక్కడ కూర్చున్నప్పుడుగాని జడవిప్పితే వెంట్రుకలు క్రిందపడి గాలికి ఇంటిలోపల, ఆవరణలో ఎక్కడైనా వ్యాపిస్తాయి. చివరకు తినే ఆహారపదార్థాలలో కూడ కలవొచ్చు. అందుకే ఈ జాగ్రత్త.

వెండి మట్టెల కాళ్లు ఎత్తి నడవవద్దంటుంది. నడిచేటప్పుడు చెయ్యి ఊపవద్దంటుంది. స్త్రీ సుకుమారమైందిగనుక ఆమె నడక వికారంగా కాక వయ్యారంగా ఉండాలి. పాదాలచప్పుడు లయబద్ధంగా ఉండాలి. మగవారిని చూచి నవ్వవద్దని, తగవులాడే చోట తలఎత్తవద్దని, పతికంటే ముందే లేచి పనులన్నీ చక్కబెట్టుకోవాలని- ఇలా ఏవేవో సలహాలను సెలవిస్తుంది.

ఇటువంటివే సుదీర్ఘమైన అప్పగింతల పాటలు ఎన్నో ఉన్నాయి. కూతురి ఎడబాటును సహించలేని ఆ తల్లి ఆక్రందనం ఎంత చెప్పుకున్నా తీరేదికాదు. ఒక్కొక్క తల్లి తాను మాత్రమే బిడ్డను కన్నట్లు స్వోత్కర్షతో తన గోడు

[744] సరాగాలు, పుట – 248.

వెళ్లబోసుకొంటుంది. వినేవారికి కొంత విసుగనిపించినా తల్లిప్రేమ ప్రవాహానికి గట్లు వేయలేరు గదా! దేవతలందరినీ అతి భక్తితో పూజించి పతికరుణతో కూతుర్ని కన్నదట. ఎంతో గారాబంగా పెంచుకొన్నదట. అటువంటి కూతుర్ని అన్నావదినల చేతిలో పెడుతున్నానని ఏ విధంగా చూసుకుంటారో మీదే భారమని అంటుంది.

తరువాత కూతురి వైపు తిరిగి సలహాలిస్తుంది. సలహాలివ్వటం మామూలే అయినా ఈ తల్లి పలుకుబడిలో మెలకువలు కొన్ని గోచరిస్తున్నాయి.[745]

'అతిబుద్ధి గలిగుండు అంబరోనీవు' అంటుంది. అంటే అత్తవారింట్లో నెగ్గుకురావాలంటే సామాన్యమైన తెలివితేటలు చాలవని అతి తెలివితేటలు కావాలని సూచన. 'బిరుసుమాటలు' మాట్లాడవద్దంటుంది. 'ఒప్పిదంగా' ఉండమంటుంది. అంటే అత్తవారింటికి అలంకారంగా, ముద్దు ముచ్చటగా ఉండాలని. అత్తగారిని తల్లిమారుగా, మామగారిని తండ్రిమారుగా, మరుదుల్ని కొడుకులమారుగా చూసుకోమంటుంది.

'కరుణ గలిగుండవే కమలాక్షి నీవు' అంటూనే ఎదురుగా నిలబడి బదులు మాట్లాడవద్దని, బెదిరి ఉండమని, తలెత్తి చూడవద్దని, సాటి స్త్రీలతో వాదులాడవద్దని సూచిస్తుంది. ఈ పాటలో ముఖ్యమైన సలహా.

'పెద్దలు పిన్నలు వచ్చు మార్గము దెలిసి
గద్దెపై కూర్చున్న గ్రక్కున దిగవే' అనేది.

చివరకు ఆసనం కూడా నిషేధమే అయింది. ఈ విధంగా స్త్రీకి అన్నీ అవరోధాలే. అత్తవారింట్లో పంజరబద్ధమైన చిలకలాగా జీవించాలి. దేవుడు, పతిదేవుడు ఈ ఇద్దరినీ కొలవాలి.

ఇటువంటిదే మరొక సుదీర్ఘమైన పాట.[746] కూతురి అమాయకత్వాన్ని వియ్యపురాలికి వివరిస్తూ,

'బిగ్గఱగా బిల్వ బెదరిజూచెడినీ
దగ్గఱ రమ్మన్న తరతరలాడు

745 తెలంగాణ పల్లెపాటలు, పుటలు – 106 -108.
746 మిన్నేరు, పుట -145.

మాయలెరుంగదు మర్మమెరుగాదూ
తనకు మిక్కిలి బాధ కలిగియుండిననూ
మనసు మర్మము చెప్పుకొనజాలదమ్మ
పనులేమి నేరదు పసిబాల యబలా
కనిన బిడ్డగ నేర్పి కావుమోయమ్మ
తెలివిలేమిని నేరములు చేసెనేని
చలము పూనకుమమ్మ సాగిలబడుదు' అంటుంది.

ఎన్నడూ ఒక్క ఘడియ కూడా తనను విడిచి ఉండని బిడ్డను ఇప్పుడెలా విడిచి ఉండాలో తెలియదని విలపిస్తుంది. చివరకు కూతురివైపు తిరిగి

'మతిమంతురాలవై మనుము మాయమ్మా' అని దీవిస్తుంది.

'చిన్న మాణిక్యమ్మ చింతించకమ్మా
కంటనీరు దుడువు కనకంపు బొమ్మా
జంటగా పతితోడ సుఖయింపుమమ్మా'

అని ధైర్యం చెప్పి అత్తవారింటికి సాగనంపుతుంది.

కరుణరసానికి ఆలవాలమైన ఇటువంటి ఘట్టాలు శిష్టసాహిత్యంలోనూ కోకొల్లలుగా నిరూపితం.

"కావ్యేషు నాటకం రమ్యమ్
తత్ర నాటకేషుచ శకుంతలా
తత్రాపి చతుర్థోంకః
తత్ర శ్లోక చతుష్టయః"

అనే చాటు శ్లోకాన్ని బట్టి నాలుగు శ్లోకాలు కవికుల గురువు కాళిదాసు కవితా మాధుర్యానికి మచ్చుతునకగా పేర్కొనబడ్డాయి. ఆ నాలుగు శ్లోకాలూ మరే సందర్భానికో సంబంధించినవి కావు. శకుంతలను అత్తవారింటికి పంపే సన్నివేశంలోవి. ఆ కవికుల గురువు హృదయ స్పందన కణ్వమహర్షి రూపంలో ప్రతిబింబించింది. తన ఆశ్రమంలో పూవుల్లో పూవుగా లతల్లో లతగా, శాబకాల్లో శాబకంగా పెరిగిన శకుంతలను అత్తవారింటికి పంపించాలంటే ఋషి, సర్వసంగ

పరిత్యాగి అయిన కణ్వమహర్షి హృదయం కూడా రాబోయే ఎడబాటును తట్టుకోలేక తల్లడిల్లింది. ఆ వేదననే కాళిదాసు నాలుగు శ్లోకాలలో కరుణ రసప్లావితంగా అద్భుతంగా వర్ణించాడు.

శకుంతలను పెంచి పెద్దచేసిన కణ్వ మహర్షికే అంతటి భాధ కలిగితే నవ మాసాలు మోసి కనిపెంచిన ఈ జానపదాంగనకు ఎంతటి వేదన ఉండాలి? అది పురుష హృదయం. ఇది స్త్రీ హృదయం. అది పెంచిన మమకారం. ఇధి కన్న మమకారం. అందుకే కణ్వుని వేదన మశకం. జానపద స్త్రీ వేదన హస్తి.

స్పందించే ప్రతి కవి హృదయానికీ సమస్త ప్రకృతిలోనూ కూతురి వియోగంతో బాధపడే కన్నతల్లి వేదనే గోచరిస్తుంది. భావకవితాచార్యుడు రాయప్రోలు సుబ్బారావు గారికి కోయిల కూతలోనూ ఆ కన్నతల్లి కంఠధ్వని వినిపించింది. ఉప్పొంగిన ఆయన హృదయం ఈ క్రిందివిధంగా అక్షర రూపం వహించింది.

"ముత్తైపుటశ్రువుల్ నయనముల్ దిగజారగ, మాటరాని డ
గ్గుత్తికతోడ నంపకపు కూతు కవుంగిలి బాయలేని యే
మెత్తని తల్లి కన్న చెలిమిన్ మధురంబుగం గీరితింతువో
కొత్తచిగుళ్ల మెసవి! యెరుంగముగా భవదీయ వైఖరిన్."[747]

వివాహానంతరం మొదటిసారి అమ్మాయిని అత్తవారంటికి పంపే సందర్భంలోనే గాక తరువాత కూడా ఆ కన్నతల్లికి ఈ దృశ్యాలు తప్పవు. పుట్టింటిని, కన్నవారిని చూడటానికి వచ్చి తిరిగి అత్తవారింటికి వెళ్లమని మారాంచేసే కూతుళ్లు కూడా ఉంటారు. పుట్టింటికి వచ్చిన పడతి అతిథిగా కొద్దిరోజులు మాత్రమే ఉండాలి. ఎక్కువ రోజులుంటే తల్లిదండ్రులు అత్తింటివారిచే మాటలుపడవలసి వస్తుంది. కాని అమ్మాయికి అత్తవారింట్లో పద్ధతులు, ఆ వాతావరణం నచ్చక పుట్టింట్లోనే ఉండాలని ఉబలాట పడుతుంది. పెళ్లయిన కూతురు ఎక్కువ కాలం పుట్టింట్లో ఉంటే నలుగురూ నాలుగు మాటలంటారని, కాపురం కూలిపోతుందని ఆ తల్లి భయం.

[747] కోయిల, పుట – 40.

అందుకే ఏదో ఒక విధంగా నచ్చచెప్పి కూతుర్ని అత్తవారింటికిపంపటం తన బాధ్యతగా భావిస్తుంది. ఇటువంటి సందర్భానికి సంబంధించిన గేయాలు కూడా జానపద సాహిత్యంలో గోచరిస్తున్నాయి.[748]

"ఆరెకరాల్ సేనిస్తా అంటు మామిడి తోపిస్తా
పోయమ్మా నా కూతురా
పోయింటికి కీర్తి తేవమ్మా
ఆరెకరాల్ సేనిస్తా ఆవులప్పని నీబసకిస్తా
పోయమ్మా నా కూతురా
పోయూరికి కీర్తి తేవమ్మా"

అని తల్లి కూతుర్ని ప్రాధేయ పడుతుంది. నాగరబిళ్ల చేయిస్తానంటుంది. ఆవులప్పని బసకిస్తానంటుంది. ఎన్ని చెప్పినా కూతురు వినకుండా మొండికేస్తుంది. కడగొట్టు మరిది గంగులప్పంటే భయమని, కడగొట్టు మరదలు కమలమ్మను చూస్తే ప్రాణాలు కడబడతాయని తాను అత్తింటికి పోనని మారాం చేస్తుంది. మగని పోరుకన్నా మరిది పోరు సమధికం. అత్తపోరుకన్నా ఆడబిడ్డపోరెక్కువ. వీటి నన్నింటినీ ఓర్పుతో అధిగమించినప్పుడే కాపురం గుట్టుగా సాగిపోతుంది.

ఈ విధంగానే మరొక కాంతకు పుట్టింటిని వదిలిపెట్టి అత్తింటికి పోవటానికి కాళ్లురావు. చివరకు అందరి పట్టుదలతో అత్తవారింటికి పోకతప్పదని భావించి తన చెల్లెళ్లకు తానాడుకున్న బొమ్మరిళ్లు, బొమ్మలు చూపించి,

"నా మారుగా మీరు
ఆడుకోరమ్మా
పోయి నా అత్తింటికి
పోయీా వస్తాను"[749]

అని అప్పగింతలు పెడుతుంది. అన్నల్ని, అక్కల్ని దీవించమని వేడు కొంటుంది.

---

[748] తెలుగు - కన్నడ జానపద గేయాలు, పుట – 208.
[749] సరాగాలు, పుట – 197.

అత్తవారింటికి వెళ్లి మరలా పుట్టింటికి వస్తుంది. అలా వచ్చిన కొన్నాళ్లకు బావగారు అత్తింటికి తీసుకువెళ్లటానికి వస్తారు. ఆ సమయంలో

"నేనెల్లి వత్తాను ఓయి సెల్లులా
నన్ను మరువాకండి ఓయి సెల్లులా"

అని చెల్లెళ్లతో దీనంగా పలుకుతుంది. పుట్టింటివారు తననెక్కడ మరిచి పోతారోనని బెంగ.

తాను అత్తవారింటికి వెళ్లటం వల్ల పుట్టింట్లో ఎంతో వెలితి ఏర్పడినట్లు భావిస్తుంది. అమ్మకు తాను సహాయకారిగా ఉండేది. మరి ఇప్పుడు ఎలా? అందుకే తన చెల్లెలు తన స్థానాన్ని భర్తీ చేయాలని కోరుకుంటుంది. తన తల్లి తనకు చెప్పినట్లుగానే తాను చెల్లెలికి ఈ విధంగా సలహాలు చెబుతుంది.

"అమ్మమాట యీను ఓయి సెల్లులా
అన్నాకి తమ్ముడికి ఓయి సెల్లులా
అమర్చి పెట్టాలి ఓయి సెల్లులా"

ఇటువంటివే ఇంకా ఎన్నో బుద్ధులు చెబుతుంది. ఇరుగు పొరుగు వారితో ఇష్టంగా మెలగమంటుంది. ప్రొద్దెక్కకుండా ప్రక్కనుండి లేచి ప్రతిరోజూ గుడికి వెళ్లి పదిలంగా రమ్మంటుంది. దేవుడికి పళ్లూ పూలూ తీసుకువెళ్లమంటుంది. ఈ విధంగా తన చెల్లెలికి ఉచితంగా సలహాలిచ్చి ఆమె కూడా తనలాగా కావాలని అత్యంత మమకారాన్ని ప్రదర్శించే స్త్రీ హృదయం పుట్టింటి అభిమాన సదనమని గుర్తించవచ్చు.[750]

అందుకే స్త్రీ పుట్టింటికి మెట్టినింటికి వారధి.

**శోభనం** : వివాహానంతరం జరిగే మరొక వేడుక శోభనం. దీనినే గర్భాదాన సంస్కారమనీ అంటారు. దీనికి సంబంధించిన జానపద సంబంధ గేయాలు మృగ్యం. శిష్టులు వ్రాసినట్లుగా ఉన్న ఒకటిరెండు గేయాలు కనిపిస్తున్నాయి. ఒక గేయంలోని కొంత భాగం సీతారామపరంగాను, మరికొంత భాగం పార్వతీ పరమేశ్వరపరంగాను

[750] తెలుగు దేశపు జానపద గీతాలు, పుట- 63.

గోచరిస్తుంది. భార్యాభర్తలకు అలంకారం చేయటం, పట్టెమంచం అలంకరించటం, తదుపరి వారు ఐదుగురు దంపతులకు పండు తాంబూలమిచ్చి ఆశీర్వాదం పొందటం వంటి విషయాలు వర్ణింపబడ్డాయి. దంపతుల ఆశీస్సులు పొందితే వారి దాంపత్య జీవితంకూడా ఆనందమయంగా సాగుతుందని, త్వరలోనే సంతాన భాగ్యం కలుగుతుందని నమ్మకం.[751] ఇంతకు మించి విశ్లేషించటానికి తగిన గేయాలు లేవు.

## 3. నియమ జీవితం (నోములు, వ్రతాలు)

నియమమే నోము అయింది. దీనికే వ్రతమని కూడా పేరు. స్త్రీ తన జీవితాశయ సిద్ధికై వివిధ వ్రతాల్ని ఆచరిస్తుంది. దీనినే ఆచార్య బి.రామరాజు గారు కర్మమార్గమని పేర్కొన్నారు.[752] నిరంతర సత్కర్మాచరణంచేత జీవితం ఆనందప్రద మవుతుంది. ఈ జన్మలో చేసుకున్న కర్మల్నిబట్టే ఉత్తర జన్మ నిర్ణయమవుతుందని హైందవుల నమ్మకం. మంచి నోములు నోస్తే భోగభాగ్యాలతో తులతూగే జన్మ సంప్రాప్తమవుతుందని, ఏ నోములూ నోయకపోతే దరిద్రంతో బాధపడే జన్మ ప్రాప్తిస్తుందని లోక విశ్వాసం, ఈ విశ్వాసం మాట ఎలా ఉన్నా నోములు నోచుకోవటంలో సాంఘిక ప్రయోజనాలు మాత్రం సిద్ధిస్తాయి. నోము నోచుకునే స్త్రీలు తమ ఇరుగు పొరుగు వారినే గాక సమీప ప్రాంతాలలోని మహిళలను కూడ తమ శక్తిమేరకు ఆహ్వానిస్తారు. దీని వల్ల అందరితో స్నేహబంధం, ఐక్యతాశక్తి పెంపొందుతాయి. అందరూ ఒక చోట చేరతారు గనుక ఒకరి కష్ట సుఖాలు మరొకరితో పంచుకొనే వీలు కలుగుతుంది. ప్రసార మాధ్యమాలు లేని ఆ రోజుల్లో ఇటువంటి కార్యక్రమాలు పరిచయ వేదికలవుతాయి. అంతేకాదు అప్పటివరకు ఆ

---

[751] పెళ్లిసంబరాలు, అప్పగింతలు, శోభనం - ఈ శీర్షికలలో వివరించిన విషయాలకు మిన్నేరులోని 103 నుండి 135 వరకు గల పుటలలోని గేయాలు ఆధారం.

[752] భక్తి జ్ఞానముల వలెనే కర్మము కూడ మోక్షసాధనముగా చెప్పబడినది. వేదాదులీ మార్గమున కధిక ప్రాముఖ్యము నిచ్చినవి. కనుకనే భారతదేశమునకు కర్మభూమియని కూడ పేరు వచ్చినది. వర్ణాశ్రమాచార ధర్మములు, వేదవిహిత కర్మలు, వ్రతములు, ఆచారములు, నియమములు, నిష్ఠలు మున్నగునవి భారతీయుల ప్రత్యేకతను చాటునట్టివి. జానపద గేయ సాహిత్యం, పుట -115.

నోములు నోయని వారికి ఎలా చేయాలో తెలిపే శిక్షణా కేంద్రాలు కూడా ఇవే. ఈ సందర్భంలోనే పెళ్లీడుకొచ్చిన అబ్బాయిల, అమ్మాయిల వివరాలు కూడా తెలుస్తాయి గనుక మధ్యవర్తుల అవసరంగాని, పెళ్లి సంబంధాలు కుదిర్చే సంస్థల అవసరంగాని అంతగా ఉండేది కాదు. వచ్చిన ముత్తయిదువులకు బొట్టు పెట్టి, గంధం పూసి, కాళ్లు పట్టుకొని పసుపురాయటం వల్ల ఎదుటి వారికన్నా తాను అధికురాలననే గర్వం నశిస్తుంది. అందరికీ ఆయా ఋతువులలో పూచే పూలను, కాచేపండ్లను పంచి పెట్టటం వల్ల స్వార్థబుద్ధి నశించి విశాల దృక్పథం అలవడుతుంది. వ్రతం పూర్తయిన తరువాత ముత్తయిదువులకు తాంబూలమిచ్చి కాళ్లకు నమస్కరించినప్పుడు 'దీర్ఘసుమంగళీభవ', 'సంతాన ప్రాప్తిరస్తు', 'పిల్లాపాపలతో చల్లగా ఉండు' అంటూ వారిచ్చే ఆశీర్వాదాలతో తాను తన కుటుంబం హాయిగా ఉంటుందనే భావన ఎంతో సంతోషాన్ని కలుగజేస్తుంది. సంతోషమే సగం బలంకదా! ఈ నోములు వ్రతాలు ఆచరించేటప్పుడు అనుభవజ్ఞులైన ముత్తయిదువులు ప్రారంభం నుండి చివరి వరకు అక్కడే ఉంటారు గనుక ఏవైనా పొరపాట్లు జరిగితే సరిదిద్దుతారు. ఆ విధంగా చేయటం వల్ల మరొకసారి వీటిని ఆచరించేటప్పుడు ఏ తప్పులూ జరగకుండా జాగ్రత్తపడతారు. ఆ విధంగా ప్రతి స్త్రీ ఈ వ్రతాచరణలో పరిపూర్ణురాలవుతుంది. ఇంతమాత్రమే కాదు కొన్ని రకాల నోములు, వ్రతాలకు ఆచరించే స్త్రీయే గాక తాంబూలం అందుకునే ముత్తయిదువులు కూడా ఉపవాసం ఉండవలసి వస్తుంది. దీనివల్ల తనకు పదిమందీ అండగా ఉన్నారనే ఆలోచన ఆ స్త్రీకి ఎంతో ధైర్యాన్నిస్తుంది. ఈ విధమైన సంతోషం, ధైర్యం పొందిన స్త్రీ తన కుటుంబాన్ని చక్కదిద్దుకోవటంలోను, పిల్లల పెంపకం విషయంలోను ఎంతో శక్తిని పొందు తుంది. ఇటువంటి సామాజికాశయంతోనే మనపూర్వులు ఉత్తర జన్మ అనే ఆశను కల్పించి వ్రతాలు నోములు నోయించి పూబోండ్లను పూతచరితులను కావించటానికి ప్రయత్నించినట్లుగా అనిపిస్తుంది.

సాధారణంగా మానవులకు కష్టాలు సంప్రాప్తించినప్పుడు వాటికి ఎవరో కారకులని భావించి నిందించటం ఈ నాటి సమాజంలో చూస్తున్నాం. కాని మనపూర్వులు అందులోనూ పడతులు తాము పడుతున్న కష్టాలకు తామే

కారణమని దోషాన్ని తమ నెత్తిమీదనే వేసుకొంటారు. ఎంత గొప్ప సంస్కారం! పూర్వజన్మలో మంచి నోములు నోచుకోకపోవటంవల్లే తమకీ విధమైన ఆపదలు సంప్రాప్తించాయని ఊరడిల్లడం ఉత్తమ లక్షణం.

నిండు పేరోలగంలో భర్త చేత తిరస్కరింపబడిన శకుంతల పరాభవ ఖిన్నయై కూడా దుష్యంతుడ్ని దూషించకుండా పుట్టినప్పుడు తల్లిచే విడువబడ్డాను, ఆ తరువాత తండ్రిచే విడువబడ్డాను, ఇప్పుడు

"..................పతిచేతను విడువబడియుదు నొక్కా!
నుడువులు వేయినింకేల యిప్పాటి నోములు దొల్లి
కడగి నోచితిని గాకేమి యనుచును గందె డెందమొన."[753]

ఈ విధంగా ఏ నాతి అయినా ఆపదలు కలిగినప్పుడు అవి సరైన నోములు నోచక పోవటంవల్లే కలిగాయని భావించటం హైందవ గుణంలోని విశిష్టతగా భావించవచ్చు.

మాయప్రవరుడు తన మీద వ్యామోహాన్ని ప్రదర్శించినప్పుడు అతడు నిజమైన ప్రవరుడనుకొని వరూధిని

"నా నోముల్ ఫలియించె నా వయసు ధన్యంబయ్యె విప్రోత్తమా!" [754]

అని ఆనందాన్ని ప్రకటిస్తుంది. శిష్ట సాహిత్యంలో ఇటువంటి సన్నివేశాలు ఎన్నో గోచరిస్తాయి.

అందుకే ఎంతో ముందు చూపుతో మహిళలు కన్యాజీవితం నుండే నోములు, వ్రతాలు ఆచరించటం మొదలు పెడతారు. కొన్నిముఖ్యమైన నోములు, వ్రతాల గురించి వివరిస్తాను.

**మోచేటి పద్మము నోము**: ఇది కన్యలు నోచే నోము. పాటలో మొదట 'మోచేతి పద్మము పట్టేటి వేళ' అని వస్తుంది. దీనిని మూగినోము పాటగా సరాగాలు[755]లో

[753] శ్రీమదాంధ్ర మహాభారతం, 4-103.
[754] మనుచరిత్ర, 3-107.
[755] పుట – 170.

అభివర్ణితం. అశ్వయుజ బహుళ అమావాస్య మొదలుకొని కార్తీక శుద్ధ పౌర్ణమి వరకు సాయం సమయాలలో స్నానం చేసి శుచిగా నోము ప్రారంభిస్తారు. తులసి కోట వద్ద ఈ పూజా కార్యక్రమం జరుగుతుంది. మొదటి సంవత్సరం తులసికోట చుట్టూ నాలుగు పద్మాలు పెట్టి నాలుగు వత్తుల దీపం వెలిగించి మౌనంగా పూజచేసి నలుగురు ముత్తయిదువులకు బొట్టుపెట్టి నాలుగు నక్షత్రాల్ని లెక్కపెడతారు. ఒక్కొక్క సంవత్సరం ఆ పద్మాలను రెట్టింపు సంఖ్యలో అలంకరిస్తారు. అనగా రెండవ సంవత్సరం ఎనిమిది, మూడవ సంవత్సరం పండ్రెండు. తరువాత ఉద్యాపనం జరగుతుంది.[756]

ఇందులో అన్నగారు తలుపు వెనకాల ఉండి 'ఇప్పుడు రానా? ముప్పున రానా?' అని అడిగితే నోము పట్టిన కన్య ఇప్పుడే రమ్మంటుంది. ఈ వ్రతం చేసిన కన్యకు పదివేలయేండ్లు అయిదవతనం ఉంటుందట. నాలుగు పద్మాలతో చేసే నోము కాబట్టి 'మోచేటి పద్మమునోము' అని పేరు వచ్చింది. ఇది సాయంకాలంపూట నోచేనోము కాబట్టి పాటలో సాయంకాల వర్ణన విపులంగా చేయబడింది.[757]

**చిట్టి బొట్టు నోము** : నోముల్లో కొంత ప్రాధాన్యం కలది 'చిట్టి బొట్టు నోము'.[758]

'చిట్టీ బొట్టూ పట్టావోలే
సిరిగలయింటా పుట్టావోలే
ఏడుగురు అన్నల తోడాబుట్టావోలే
ఏకాచక్రం ఏలావోలే.'

ఈ నోము ఆశయం ఈ రీతిగా పాటలో పొందుపరచబడింది. ఈ నోము ఆచరించిన స్త్రీ ఉత్తర జన్మలో ఐశ్వర్యవంతుల ఇంట్లో పుడుతుందని, ఏడుగురన్నల మధ్య ఏకఛత్రాధిపత్యంగా పుట్టింటినేలే మహారాణిగా పెరుగుతుందని, రూపవంతుడు, గుణవంతుడు, ధనవంతుడు అయిన భర్తను పొందుతుందని పాటలో వర్ణించబడింది.

---

756 స్త్రీల వ్రతకథలు, పుట-1.
757 సెలయేరు, పుట – 46.
758 సరాగాలు, పుట – 148.

మాఘపౌర్ణమికి ముందు వచ్చే సప్తమిని రథసప్తమి అంటారు. ఆనాడు ఈ కథ చెప్పుకొని అక్షతలు వేసుకొంటారు. ఏడాది వరకూ ఐదుగురు ముత్తయిదువులకు ప్రతిదినం గంథపు బొట్టుపెట్టి దానిమీద అక్షతలు అద్దుతారు. ఏడాది పూర్తయిన తరువాత ఉద్యాపన జరుగుతుంది. ఐదుగురు ముత్తయిదువులకు తలంటిపోసి, పిండి వంటలతో భోజనం పెట్టి, బంగారపు బొట్టు చేయించి, నల్ల పూసలు, మట్టెలు, రవిక గుడ్డలు, లక్కజోళ్లుతో పాటు దక్షిణ, తాంబూలం ఇచ్చి భక్తితో నమస్కరిస్తారు. ముత్తయిదువుల ఆశీర్వచనాలే ఇక్కడ ముఖ్యమైనవి.

**చల్లచిత్త నోము** : చిట్టిబొట్టు నోముతోపాటు 'చల్లచిత్త నోము'[759] కూడా నోస్తారు. ఇది పాడికి సంబంధించింది. పాడి-పంట అన్నారు. అవి రెండూ సమృద్ధిగా ఉంటే ఆ ఇంట సిరి నడయాడినట్లే. పాడికి దోహదపడేది ఇల్లాలే. అందుకోసమే ఈ నోము. పెరుగును మజ్జిగగా చేయటానికి కవ్వంతో చిలికేటప్పుడు చల్లకుండ చుట్టూ చల్లచినుకులు పడతాయి. ఆ చల్ల చినుకుల్ని పసుపుతో కలిపి ఒక ఏడాదిపాటు ప్రతిదినం ఐదుగురు ముత్తయిదువులకు బొట్టు పెడతారు. సంవత్సరం చివరలో ఒక రోజు ఆ రోజు చిలికిన చల్ల, వెన్నముద్దతో ఉన్న చల్లకుండను ఒక ముత్తయిదువుకు వాయినమిస్తారు.

'చల్లచిత్త నోము నోచవే తల్లీ!
వెల్లయావుల పాడి సేయవే తల్లీ!
ఇల్లు పాలసేత నిండునే తల్లీ !
ఎల్ల సొమ్ములు నీవు తాల్చవే తల్లీ!
చల్లని కడుపుతో సాగేనే తల్లీ!
కొల్లలుగ సౌభాగ్యమెలసే తల్లీ!

అంటూ సాగే ఈ నోము ప్రతి పల్లెలోనూ స్త్రీలు జరుపుకునేదిగా కనిపిస్తుంది.

759 సరాగాలు, పుట -148.

**కాటుక గౌరు నోము:**

'కాటిక గౌరూ పట్టావోలే
కలిగిన వారింట పుట్టావోలే'

అనే పాటలో[760] ఈ నోము గురించి పేర్కొనబడింది. ఈ పాటలో పెద్దగా వివరాలేమీ లేవు. ఇది అంధత్వానికి సంబంధించిన నోము. ఇరుగు వారు గ్రుడ్డి, పొరుగు వారు గ్రుడ్డి, భర్త గ్రుడ్డి, భార్య గ్రుడ్డి. అందుచేత విచారిస్తున్న భార్యకు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై కాటుక గౌరి నోము పూర్వజన్మలో చేయనందువల్ల ఇటువంటి దుస్థితి కలిగిందని ఇప్పటికైనా ఆ వ్రతాన్ని చేపట్టి అక్షతలు వేసుకుంటే అందరికీ చూపు కలుగుతుందని వారు పేర్కొంటారు. ఉద్యాపనలో ముత్తయిదువులకు కాటుక బరిణలిచ్చి సత్కరించాలి. ఎంతగా స్త్రీ కాటుక పెట్టుకొంటే అంతగా చక్కని చూపుగల భర్త లభిస్తాడనే ఆశను రేకెత్తించి తద్వారా స్త్రీలు కాటుక పెట్టుకొనే ఆచారాన్ని అమలు చేయటానికి చేసిన ప్రయత్నమేమో ఈ నోము అనిపిస్తుంది.

**నిత్య శృంగారము నోము** : ఈ నోము పట్టటం వల్ల పసుపు కుంకుమలు నిత్యం ఇంట్లో నెలకొని ఉంటాయని నమ్మకం. అద్దం, పన్నె (దువ్వెన) దానం చేయటమనేది ఇందులో ముఖ్య విషయం.[761]

ఏ నోముకైనా భక్తిశ్రద్ధలు చాల ప్రధానం. నోము పట్టినవారు స్వయంగా ముత్తయిదువులకు బొట్టు పెట్టటం, తాంబూలమివ్వటం చేయాలి. అలాకాక పనివారిచేత ఆ పని చేయిస్తే వ్రత ఫలితం లభించకపోగా అశ్రద్ధవల్ల దారిద్ర్యం సంభవిస్తుందంటారు. పూర్వం ఒక రాజుగారి భార్య చెలికత్తెలచే బొట్టు పెట్టించి తాంబూలమిప్పించటం వల్ల దరిద్రం చుట్టుకుందని, స్వయంగా వ్రతమాచరించిన మంత్రిభార్యకు ఎనలేని భోగభాగ్యాలు కలిగాయని తెలుపుతుందొక ముత్తయిదువ. అందుచేత స్వయంగా ఆచరిస్తేనే నోములు ఫలిస్తాయనే నీతిని బోధిస్తుందీ నోము,

---

760 పైదే.
761 సరాగాలు, పుట – 148.

ముత్తయిదువులకు బొట్టు పెట్టి, తాంబూలమిచ్చి, అద్దం చూపించి ఆశీర్వాదం పొందాలి. ఏడాది తర్వాత ఉద్యాపనం చేసుకోవాలి. ఉద్యాపనలో అన్ని నోములలో ఇచ్చే వాటితో పాటు కుంకుమ భరిణ, సవరం, గంధపు చెక్క కూడా ఇవ్వాలట.

**బొమ్మల నోము** : దీనికే సావిత్రి గౌరి నోము అని పేరు.[762] సావిత్రి గౌరిదేవమ్మ సాక్షిగా ఉంటుంది గాబట్టి ఈ నోముకాపేరు వచ్చి ఉంటుంది. ఈ నోమును గూర్చిన పాటలు రెండు జానపద వాఙ్మయంలో కన్పిస్తున్నాయి.

'స్వర్గానికెళ్లినా సవతి పోరొద్దు
మేడమీద కెళ్లినా మారు తల్లొద్దు
సావిత్రి గౌరమ్మతల్లి నీదయ మాకు ఎల్లకాలం కావాలి'

అనే ప్రార్థన ఉండటం చేత ఈ పేరు ఏర్పడి ఉంటుంది. తల్లి, తండ్రి, అత్త, మామ, భర్త, కుమారుడు, యముడు వీరెవరి దండనా తమకు పనికిరాదని సావిత్రి గౌరి దేవమ్మ దండనే కావాలనే ఆకాంక్ష వేరొక పాటలో కనిపిస్తుంది.[763] ఈ నోములో తొమ్మిది సంఖ్యకు ప్రాధాన్యత ఉన్నట్లుగా గోచరిస్తుంది. తొమ్మిది రోజులు వ్రతమాచరించి చివరిరోజు తాంబూలంతో పాటు తొమ్మిది చేటలు, తొమ్మిది బిళ్లకుడుములు దానాలివ్వటంతో నిర్వహింపబడుతుందని వ్రతకథల పుస్తకంలో నిరూపితం. కాని అటువంటి వివరాలు పాటలో గోచరించటం లేదు.

**చిక్కుళ్ల గౌరి నోము** : స్త్రీ నిరంతర సుఖాన్ని అపేక్షిస్తుంది. కంటి కాటుక కరగకూడదు. చేతి గాజులు చెదరకూడదు. కాలి మట్టెలు కదలకూడదు. ఒకసారి విడిచిన చీర మరలా కట్టకుండా, తొడిగిన రవిక తొడగకుండా, ఒంటిసొమ్ములు సడలకుండా, చీకూ చింతా దరిచేరకుండా, కట్టుకున్న భర్త ఎప్పుడూ వెంట ఉండాలనే కోరికతో ఆచరించే నోమిది. చిక్కులు లేకుండా సిరిసంపదలిమ్మని చిక్కుళ్ల గౌరిదేవిని ప్రార్థించే నోము కాబట్టి ఈ పేరు వచ్చిందేమో! ఉద్యాపన రోజు

[762] పైదే.
[763] సరాగాలు, పుట – 131.

ముత్తయిదువులకు పిండి వంటలతో భోజనం పెట్టి, చీర, రవిక, దక్షిణ, తాంబూలంతో పాటు బంగారు చిక్కుడు పువ్వును వాయినంగా ఇస్తారు[764].

**పెండ్లి గుమ్మడి గౌరు నోము** : ఈ నోమును ప్రతి వివాహిత స్త్రీ నిర్వహిస్తుంది. దీనివల్ల ఇల్లు వాకిళ్లు కల్యాణమయమవుతాయని, పంటలు బాగా పండుతాయని, గుమ్మడి పండంటి బిడ్డలు పుడతారని, మంచి కోడళ్లు, అల్లుళ్లు వస్తారని, మాణిక్యాల వంటి మనవ సంతానం కలుగుతుందని నమ్మకం. ఉద్యాసనలో ముత్తయిదువుకు కాక బ్రాహ్మణుడికి స్వయం పాకమిచ్చి, దక్షిణ తాంబూలంతో పాటు మూడు బూడిద గుమ్మడి కాయలు దానమివ్వటం ఈ నోము ప్రత్యేకత.[765]

**మూసివాయనాల నోము** : ఒక చేట మీద మరొక చేట మూసి వాయనమివ్వటమే మూసి వాయనం. ఈ విధంగా ఆరు జతల చేటలిస్తారు. ఒక దానిలో పసుపు, వేరొక దానిలో కుంకుమ, మరొక దానిలో నల్లపూసలు, ఇంకో దానిలో పూలు, చివరి దానిలో గాజులు అమర్చి తగిన దక్షిణ, తాంబూలం చేటలో పెట్టి దానిపై మరొక చేటతో మూసి దానమిస్తారు. ఈ రకమైన దానం వల్ల ఆ ఇల్లాలు పాడిపంటలతో, కడుపు చలవతో, భర్త అనురాగంతో, బంధువుల ప్రేమానురాగాల మధ్య ఇహలోక సౌఖ్యాలు అనుభవించటమే గాక చివరకు పరలోక సౌఖ్యం కూడా పొందుతుందని తెలియజేస్తుందొక గేయం.[766]

**వరలక్ష్మి వ్రతం** : ఈ వ్రతానికి సంబంధించిన పాట చాలా నాగరకంగా కనిపిస్తుంది. ఒకసారి పార్వతిదేవి పరమశివుడ్ని ప్రశ్నించిందట. ఏది గొప్ప నోము అని. అందుకాయన సమాధానంగా కుండిన పట్టణంలోని చారుమతి కథను వినిపిస్తాడు. చారుమతి ఎంతో దారిద్ర్యం అనుభవిస్తున్నప్పటికీ వరలక్ష్మీ దేవిని పూజించటం వల్ల ఆమె స్వప్నంలో సాక్షాత్కరించి శ్రావణమాసంలో శుక్ల పక్ష శుక్రవారం వంద కలశాలతో తనను పూజించి బ్రాహ్మణునికి వాయనం ఇమ్మని చెబుతుంది. ఆ

---

[764] మిన్నేరు, పుట -227.
[765] స్త్రీల వ్రత కథలు, పుట – 131.
[766] స్త్రీల వ్రత కథలు, పుట – 132.

విధంగానే చేసిన చారుమతికి సౌభాగ్యం, సంపద, సంతానం సమకూరాయి. ఈ వ్రతమాచరించిన ఇంతులందరికీ వరలక్ష్మీదేవి అనుగ్రహం లభిస్తుంది.[767]

**నిత్యదానము నోము** : నిత్యం చేరెడు బియ్యం, ఒక కూర దానంచేసే నోమిది. ఈ విధంగా ఏడాది చేసింతర్వాత ఎద్దుతొక్కని ధాన్యం ఏడుకుంచెలు, కాయగూరలు, పిండి వంటలు, క్రొత్త పంచెలచాపు, దక్షిణ, తాంబూలంతో బ్రాహ్మణుడికి దానమివ్వాలి. దీనివల్ల సకలైశ్వర్యాలు లభిస్తాయని నమ్మకం.[768]

**ఏకాదశీ వ్రతం** : దీనికే చిలుకు ఏకాదశి[769] లేక చిలుకు ద్వాదశి వ్రతం అని పేరు. ఈ వ్రతాన్ని కార్తీక శుద్ధ ఏకాదశినాడు చేస్తారు. ఆ రోజు ఉపవాసముండాలి. మరునాడు అనగా ద్వాదశి రోజు ఉద్యాపన చేయాలి. ఉద్యాపనకు ముందు ఆవుపాలలో బియ్యపు పిండి కలిపి ఆ మిశ్రమాన్ని చెరకు గడతో చిలుకుతారు. ఆ విధంగా చిలికేటప్పుడు ఆ మిశ్రమం చిందులు వ్రతమాచరించే వారిపై పడాలి. అందువల్లనే దీనికి చిలుకు ఏకాదశి లేక చిలుకు ద్వాదశి అని పేరు వచ్చింది. దీనికి సంబంధించిన పాటను ఆచార్య బి.రామరాజుగారు పేర్కొన్నారు.[770]
ఏవ్రతమాచరించినా అఖండ సౌభాగ్యం కోసం, భోగభాగ్యాల కోసమేగదా!

"కోటి సంపదలివ్వు కోమాండ్లివు
ఎప్పటికి ముత్తయిదుతనము నాకివ్వు"

అనే ఆకాంక్ష ప్రతికాంత కంఠంలోనూ అక్షయంగా ప్రతిధ్వనిస్తుంది.

ఈ విధంగా నోములెన్నో పురుషుల కన్నా స్త్రీలకే నిర్దేశించినట్లుగా కనిపిస్తుంది. శ్రీబాలాంత్రపు వేకంట్రావుగారు ఇటువంటి గేయాలను వంద వరకు సేకరించారు. ఇవన్నీ ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలలో ప్రచురం కాకపోయినా కొన్ని కొన్ని ప్రాంతాలలో ప్రచురంగా ఆచరించబడుతున్నట్లు తెలుస్తున్నది. ఆధునికులు వీటిని అంధవిశ్వాసాలుగా భావించి త్రోసిపుచ్చవచ్చు. కానీ పదిమందితో

---

767 మిన్నేరు, పుట – 220.

768 స్త్రీల వ్రత కథలు, పుట – 114.

769 క్షీరసాగరమథనం జరిగింది ఈ రోజునే కాబట్టి దీనికి చిలుకు (చిలకటం) ఏకాదశి అని పేరు వచ్చిందంటారు.

770 జానపద గేయ సాహిత్యం, పుట – 429.

కలిసిపోవటం వల్ల కలిగే ఐక్యతాబలాన్ని, కలిగినంతలో శక్తిమేరకు ఇతరులకు దానం చేయటం వల్ల లభించే మానసికానందాన్ని కాదనలేంగదా! నేటి ఆధునిక జీవన విధానంలో అన్నీ చిన్న చిన్న కుటుంబాలే. ఆ కుటుంబాలలోని స్త్రీలు మానసికంగా ఒంటరితన్నాన్ని అనుభవిస్తున్నారు. తద్వారా ఎంతో ఒత్తిడికి గురై కుంగుబాటు (depression) కు లోనవుతున్నారు. ఆత్మహత్యలకూ సంసిద్ధు లవుతున్నారు. కానీ జానపద స్త్రీకి తగిన శారీరక శ్రమ, మనసులో ఆనందం ఉండటం వల్ల ఇటువంటి స్థితి కలిగే అవకాశమే లేదు. ఇట్టి సాంఘిక ప్రయోజనాన్నిచ్చే నోములు ఆచరణీయమేగదా!

## 4. పండుగలు

పండుగలు సామాజిక జీవన సరళిని, సమష్టి జీవన తత్త్వాన్ని ఆవిష్కరిస్తాయి. ఇవి జాతి చరిత్రకు, సాంస్కృతిక వారసత్వానికి ప్రతిబింబాలు. మానవుల నడవడి ఏ విధంగా ఉండాలో, ఏవిధమైన ఆధ్యాత్మిక సంప్రదాయాలు పాటించాలో పండుగలు తెలియజేస్తాయి.

**ఏరువాక పున్నమి** : ఏరువాక అంటే దుక్కి ప్రారంభం. ఇది కేవలం వ్యవసాయ దారులకు మాత్రమే పరిమితమైన వ్యవసాయ పండుగ అని చెప్పవచ్చు. భూమిని దున్నటంతోనే వ్యవసాయ పనులు ప్రారంభమవుతాయి. గ్రీష్మ ఋతువులో ఎండ వేడికి నెర్రెలిచ్చిన భూమి ఆ ఋతువులో చివరవచ్చే జ్యేష్ఠమాసంలో తొలకరి జల్లులకు కొంతవరకు తడిచి దున్నటానికి అనువుగా ఉంటుంది. అందువల్లనే జ్యేష్ఠమాసంలో ఈ పండుగను జరుపుకుంటారు. జ్యేష్ఠపౌర్ణమి[771]నే ఏరువాక పున్నమి అంటారు. ఈ పున్నమి నాడు ఏరును, ఎడ్లను పసుపు కుంకుమలతో, పూలమాలతో అలంకరిస్తారు. నాగలికి రావి ఆకు కడతారు. నేల తల్లిని పూజిస్తారు. పిదప తొలి సంజ వేళలో ఎరుపు తెలుపుల మబ్బు టెండలో వెలుగు రేకలు పూర్తిగా భూమిపై పరుచుకోక మునుపే ఒక సుముహుర్తాన తొలి దుక్కు దున్నుతారు. స్త్రీలు పొలం గట్టున నిలబడి

[771] ఇది శ్రావణ శుద్ధ పౌర్ణమి అని నేదునూరి వారు పేర్కొనటం పొరపాటేమో అనిపిస్తుంది.
జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట -23.

ఎలుగెత్తి పాటలు పాడతారు. వ్యవసాయానికి ఆధారం నేల తల్లి, నాగలి, దుక్కిటెడ్లు. అందుకే ఈ ఆరాధన.

జైమిని న్యాయమాలా గ్రంథంలో ఇట్టివి కోలాధికరణమనే పేరుతో అభివర్ణితమైనట్లు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు 'హిందువుల పండుగలు'లో పేర్కొనడాన్ని ఆచార్య రామరాజుగారు ఉద్ధరించారు.[772]

ఏరువాకను అమ్మగా భావించి పాటలు పాడతారు.[773]

"ఏరువాకమ్మకు ఏమి కావాలి?" అని స్త్రీలు ప్రశ్నించుకొని

"ఎర్ర ఎర్రని పూల మాల కావాలి
ఎరుపు తెలుపుల మబ్బుటెండ కావాలి"

అని వారే సమాధానం చెప్పుకొంటారు. టెంకాయ, వడపప్పు నైవేద్యం పెడతారు. ఆ తల్లి పాదాలకు మ్రొక్కుతారు. ఎడతెగని సిరులిమ్మని, పాడిపంటలు సమృద్ధిగా సమకూర్చమని ప్రార్థనలు చేస్తారు.[774] కృషి చేసేది పురుషుడైనా, దానికి తోడ్పడేది ఎద్దులైనా స్త్రీల ఈ ఆకాంక్ష, ప్రార్థన వారికి తగిన శక్తిని సమకూరుస్తాయి.

ఏరువాక సాగించగానే ఏరులూ, నదులూ పొంగి పొర్లుతాయి. తన చిట్టి బాలుడికి బువ్వ తినిపిస్తూ తల్లి ఉల్లం అలరేటట్లుగా,

"ఏరువాక వచ్చింది ఏరువాకమ్మా!
ఏళ్లు నదులూ పొంగి వెంటనే వచ్చాయి
నల్లమేఘాలలో నాట్యమాడింది
ఇసుక నదిలో దూరి బుసలుకొట్టింది
పాడుతూ కోయిలా పరుగులెత్తింది
నవ్వుతూ మా బాబు బువ్వతిన్నాడు
ఏరువాక వచ్చింది ఏరువాకమ్మా!"[775] అని పాడుతుంది.

---

[772] తెలుగు జానపద గేయ సాహిత్యం, పుట – 478.
[773] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట-25.
[774] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 26.
[775] పైదే, పుట – 24.

ఈ అభివర్ణన ఎంత మధురభావ పరిపూర్ణమైంది!

ఒక మాతృమూర్తి ఈ విధంగా ఆనందిస్తుంటే మరొక ప్రేమమూర్తి విరహంతో బాధపడుతుంది. ఏరువాక నాటికి ఏడాది పూర్తయినా దూరమెళ్లిన భర్త తిరిగి రాలేదని దుఃఖిస్తుంది. (భావాలంకార విశేషాలు అధ్యాయంలో శృంగారభావన శీర్షికలో వియోగ శృంగారం అనే ఉపశీర్షికలో వివరించటం జరిగింది).

ముత్తయిదువులు ఏరువాకమ్మకు పాడే మంగళహారతి పాట[776]లో కూడా లోకహితార్థం వారు చేసే విన్నపం, వారి ఆకాంక్ష అక్షర బద్ధమై గోచరిస్తుంది.

"మంగళమమ్మా! మా పూజలు గైకొమ్మా!
మంగళమమ్మా! మా నాగలి నీకు
కష్టమనక భూమిదున్ని, కరువుమాపి, కడుపునింపి
సకల జీవరాశిని నీచాటున పోషించవమ్మా!
కర్షకులను కరుణతోడ, కాపాడుచు నెల్లప్పుడు
కామితార్థముల నొసంగు కల్పవల్లివమ్మ!"[777]

ఈ పాట చాలా వరకు నాగరిక విరచితంగా అన్పిస్తుంది. సినీ గేయ రచయిత కొసరాజు కలం నుండి జాలువారి, గాయని జిక్కి కంఠవినిర్గతమై ఆంధ్రుల నాలుకలపై నర్తించిన "ఏరువాకా సాగారో రన్నో చిన్నన్నా! నీ కష్టమంతా తీరునురో రన్నో చిన్నన్నా!" అనే అనుకరణ జానపదగేయం (fake folk song) ఇటువంటిదే.

**నాగుల చవితి**: స్త్రీలు అత్యంత నియమ నిష్టలతో, భక్తి శ్రద్ధలతో జరుపుకునే పండుగ నాగుల చవితి. కార్తీక మాసంలో వచ్చే శుక్లపక్ష చవితిని నాగుల చవితిగా జరుపుకొంటారు. ఆంధ్రులు నాగజాతివారని కొందరి నమ్మకం. అందువల్లనే కాకుండా అత్యంత ప్రాచీన కాలం నుండీ నాగులను ఆరాధించే సంప్రదాయం ఉన్నట్లుగా పురాణేతిహాసాల వల్ల, చరిత్ర వల్ల తెలుస్తున్నది. చవితి రోజు తెల్లవారు ఝామునే లేచి తలస్నానం చేసి పుట్టవద్దకు వెళ్లి ప్రదక్షిణలు చేసి పుట్టను పసుపు

[776] పైదే, పుట – 38.
[777] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట -38.

కుంకుమ, పూలతో అలంకరించి పుట్టలో పాలుపోస్తారు. పిదప టెంకాయ కొట్టి ఆనైవేద్యంతో పాటు పచ్చి చలిమిడి, నానబెట్టిన పెసరపప్పు, సజ్జలు సమర్పిస్తారు. చివరగా హారతిచ్చి పాటలు పాడతారు. పుట్టమన్ను తీసుకొని నుదుట బొట్టుగా పెట్టుకొంటారు. కొంత నోట్లో వేసుకుంటారు. మరికొంత ఇంటికి తీసుకువెళ్లి భద్రంగా దాచుకుంటారు. పుట్టమన్ను నోట్లో వేసుకుంటే చలువ చేస్తుందని నమ్ముతారు. నాగులయ్యకు వేడి పనికి రాదని పుట్టవద్ద దీపాలు వెలిగించరు. అలాగే వేడి చేసే వస్తువులు నైవేద్యంగా పెట్టరు. చలువ చేసే పదార్థాలనే నైవేద్యంగా పెడతారు. చవితి రోజు పూర్తిగా ఉపవాసం ఉంటారు. పంచమి రోజు ఉదయాన్నే మరల పుట్టవద్దకు వెళ్లి పాలు పోసి తదనంతరమే ఉపవాస దీక్షను విరమిస్తారు. దీనినే చద్దిపాలు పొయ్యటం అంటారు. ఈ పూజలు చేసేటప్పుడు అత్యంత శుచి, శుభ్రతలను పాటిస్తారు. నాగదేవతను పూజించటం వల్ల తమ సౌభాగ్యం కలకాలం నిలుస్తుందని, సంతానం కలుగుతుందని నమ్ముతారు. ముఖ్యంగా సంతానం లేనివాళ్లు ఎంతో నియమ నిష్టలతో పూజలు చేస్తారు. దగ్గరలో పుట్టలేకపోయినా, పుట్ట దగ్గరకు వెళ్లటం కుదరకపోయినా ఇంట్లోనే నాగప్రతిమను పాలతో అభిషేకించి నైవేద్యాలు సమర్పిస్తారు.

నాగ పంచమినాడు పాలుపోసిన పిదప నాగప్రతిమనుపుట్ట దగ్గర పెట్టి పాటలు పాడతారు.

"మా అత్తకొలిచిన నాగేంద్రుడా!
ఆవిడత్త కొలిచిన నాగేంద్రుడా!
మా పూజ లందుకో నాగేంద్రుడా!
సిరి సంపదలియ్యవా శ్రీనాగన్నా!"[778] అని అర్థిస్తారు.

ఈ విధంగా పండుగ సమయాలలోనే కాకుండా స్త్రీలు అనునిత్యం నాగేంద్రుడ్ని స్మరిస్తూనే ఉంటారు. పిల్లల్ని నిద్రపుచ్చుతూ,

[778] మిన్నేరు, పుట -208.

"నాగస్వరం పాడితే నాగులకు నిద్ర
పుట్టలో నుంటేను భూములకు నిద్ర"[779] అని.

అమావాస్య, పౌర్ణమి దినాలలో మసక చీకట్లో నాగేంద్రుడు బుసలు కొడుతూ పాటి దిబ్బల మీద కొస్తాడని, అతని జోలికి వెళితే కక్షగడతాడని, నమస్కరిస్తే తన దారిని తాను పోతాడని పాటల ద్వారా తెలియజేస్తారు.[780] ఎంతటి క్రూర జంతువైనా భక్తితో ఆత్మార్పణం చేసుకున్న వారి జోలికి రాదని హిందువుల నమ్మకం.

పుల్లల్లో ఉండే నాగయ్య పుల్ల నాగయ్య, మల్లెల్లో ఉండే నాగయ్య మల్లె నాగయ్య, చల్లకుండ క్రింద ఉండే నాగయ్య చల్ల నాగయ్య – ఇలా ఎందరు నాగయ్యలో! తమ జోలికి రావద్దని, తమ పిల్లల్ని చల్లగా చూడమని అందరు నాగయ్యలకూ వందనం చేస్తారు స్త్రీలు.[781]

అంతేకాదు,

"మాచేను పండితే చలిమిడేసేము
మా నువ్వులు పండితే చిమ్మిలేసేము
మా పత్తి పగిలితే పంచెలెట్టేము
మా యావులీనితే పాలుపోసేము
పడగలెత్తకు నాగు పగవారమూకాము
నీ పూజ చేసెదము నీకు మ్రొక్కెదము"[782]

అని ఆశలు చూపుతూ ప్రార్థిస్తారు.

దివ్య సుందర నాగులెందరో ఉన్నారు. నల్లచుక్కల నాగు, తెల్లచుక్కల నాగు, పసిమి పొరల పచ్చని నాగు, మొగలి చెట్లపై తిరిగే నాగు. ఈ నాగులందరికీ పాలు

[779] పైదే.
[780] పైదే, పుట – 207.
[781] మిన్నేరు, పుట- 207.
[782] పైదే, పుట – 209.

ఆరగింప చేస్తారు. ఆ నాగుల కళ్లు గురివింద పూసల వలె ఉంటాయట. పళ్లు పరికి ముళ్ల వలె ఉంటాయట. ఎంత చక్కటి సహజ వర్ణన.[783]

ఎండనక వాననక వెర్రినాగన్న తిరుగుతుంటాడు. ఆ నాగన్నను పూజించటమే గాక తన సహజ సిద్ధమైన మాతృత్వపు మమకారంతో ఉవిద ఉచిత సలహాలివ్వటానికికూడా వెనుకాడదు.

"పుట్టలో నాగన్న బూచి నాగన్న
ఎండలో పడుకొన్న ఎర్రినాగన్న
కలవోరి కోడళ్లు గర్వవంతూలు
కళ్లాపి జల్లేరు కాళ్ల చిమ్మేరు
ఎంగిళ్లు జల్లేరు భంగపుచ్చేరు
అటుబోకు నాగన్న చాకిరేవులకు
చాకిరేవుల లోను చేరి పడుకుంటె
సాలెపురుగూవని చంపేరు నాగూ
అటుబోకు నాగన్న చెఱకు తోటలకు
చెఱుకు తోటలలోన చేరి పడుకుంటె
నల్ల చెఱుకూవని నరికేరు నాగూ."[784]

ఇంతకూ నాగులు మానవ జాతికి చేసే మేలేమిటి? పొలాల్లోని ఎలుకల్ని తిని సస్యరక్షణగావిస్తాయి. అందుకే నాగులు రైతులకు మిత్రులు. అంతమాత్రానికే ఇంతటి భక్తా? కానేకాదు. ప్రకృతిలోని ప్రతి చెట్టు పుట్టలోను, ప్రాణిలోను సాధు స్వభావాన్ని చూడటం స్త్రీ సహజ లక్షణం.

ప్రకృతితో ఇటువంటి సమరస జీవనం సాగించే స్త్రీ సాధుస్వభావం నాన్యతో దర్శనీయం!

**బ్రతుకమ్మ పండుగ** : ఈ పండుగ తెలంగాణలో చాలా ప్రాచుర్యంలో ఉంది. జానపదుల ఆచారాలకు, తెలంగాణ సంస్కృతికి ప్రతీక ఈ పండుగ. కోస్తా,

[783] పైదే, పుట – 210.
[784] మిన్నేరు, పుట -210.

రాయలసీమ ప్రాంతాల్లో ఈ ఆచారం కనిపించదు. ఒకవేళ కనిపించినా తెలంగాణ ప్రాంతం నుండి వలస వచ్చినవారు జరుపుకోవటమే తప్ప అక్కడి వారి ఆచారం కాదు. బ్రతుకునిచ్చే అమ్మగాబట్టి బ్రతుకమ్మ అయిందటంటారు. అశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి మహర్నవమి వరకు తొమ్మిది రోజుల పాటు ఈ పండుగను జరుపుకుంటారు. శరన్నవరాత్రులకు సమాంతరంగా ఈ పండుగ జరుపుకోవటం గమనించవచ్చు. శరన్నవరాత్రులలో ఆదిపరాశక్తిని నవవిధ రూపాలలో పూజిస్తే ఈ పండుగలో 'పూలమ్మ' గా, 'ప్రకృతి స్వరూపిణి' గా దుర్గమ్మను ఆరాధిస్తారు. ఈ పండుగకు ముందు అనగా భాద్రపద బహుళ పంచమి నుండి అమావాస్య వరకు బొడ్డెమ్మ పండుగ జరుపుకుంటారు. దీనిని కన్యలు మాత్రమే జరుపుకుంటారు. జన బాహుళ్యంలో ప్రచారంలో ఉన్నప్పటికీ ముద్రిత వాఙ్మయంలో దీనికి సంబంధించిన పాటలు అంతగా కనిపించటం లేదు. కాంచన పల్లి నరసింహదాసు అనే కవి రచించి బహుళ ప్రచారంలో ఉన్న రెండు పాటల్ని ఆచార్య బి. రామరాజు గారు సేకరించారు.

**బ్రతుకమ్మ కథ** : బ్రతుకమ్మ గాథను వివరించే చందమామ పాటొకటి ప్రచారంలో ఉంది.[785] లక్ష్మీదేవే సృష్టిలో బ్రతుకమ్మ అయిందట. పూర్వం చోళదేశాన్ని ధర్మాంగుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. అతని భార్య సత్యవతి. ఆమె నూరు నోములు నోచి నూరుగురు పిల్లల్ని కన్నది. వారు గొప్ప వీరులు, శూరులు అయినప్పటికీ శత్రువుల చేతిలో హతులవుతారు. ఆ దుఃఖాన్ని తట్టుకోలేక ధర్మాంగుడు, అతని భార్య సత్యవతి రాజ్యాన్ని ప్రజలను వదిలిపెట్టి వనవాసం చేయటానికి అడవికి వెళతారు. అక్కడ లక్ష్మీదేవి గురించి గొప్ప తపస్సు చేస్తారు. వారి తపస్సుకు మెచ్చి లక్ష్మీదేవి ప్రత్యక్షమై వరం కోరుకోమంటుంది. అప్పుడు సత్యవతి ఆమెను తన గర్భాన జన్మించమని వేడుకొంటుంది. ఆ విధంగా లక్ష్మీదేవి సత్యవతి గర్భాన జన్మిస్తుంది. అప్పుడు కశ్యపుడు, అంగిరసుడు, అత్రి, వశిష్టుడు మొదలైన మునులు ఆ కన్యను చూచి ఎంతగానో సంతోషిస్తారు. లక్ష్మీదేవి ఆవిధంగా బ్రతుకు కాంచింది గాబట్టి వారందరూ ఆమెను 'బ్రతుకమ్మ' అనిపిలుస్తారు. ఆ తరువాత

[785] తెలుగు జానపద గేయ సాహిత్యం, పుట -431.

ధర్మాంగుడు భార్యతో, కుమార్తెతో కలిసి రాజ్యానికి వెళ్లి రాజ్యపాలన గావిస్తాడు. ఆ బిడ్డకు యుక్త వయసు వచ్చిన తర్వాత సాక్షాత్తుగా శ్రీ మహావిష్ణువే చక్రాంగుడనే రాజు పేరుతో వచ్చి బ్రతుకమ్మను పెళ్లి చేసుకుంటాడు. ఇల్లరికపుటల్లుడై అక్కడే ఉంటాడు. వారికి అత్యంత సుందరాంగులైన ఆరువేల మంది పిల్లలు జన్మిస్తారు. ఆ దంపతులు సాటిలేని సిరులతో, పిల్లలతో ఎంతో సంతోషాన్ని పొందారట. అందుచేతనే ఈ జగతి మీద బ్రతుకమ్మ కథ శాశ్వతంగా వెలిసింది.

జనబాహుళ్యంలో మరికొన్ని గాథలు కూడా ప్రచారంలో ఉన్నాయి. మహిషాసురుడితో యుద్ధం చేసి దుర్గాదేవి సొమ్మసిల్లింది. మహిళలు సేవలు చేసి పాటలుపాడారు. తొమ్మిదవ రోజుకు జగన్మాత అలసట తీరింది. విశ్వచైతన్య మూర్తిగా విజృంభించి మహిషాసురుడ్ని సంహరించింది. ప్రజలందరికీ క్రొత్త జీవితాన్ని ప్రసాదించింది. అందరికీ బ్రతుకునిచ్చిన అమ్మ కాబట్టి ఆమెను 'బతుకమ్మ'గా కొలుచుకుంటున్నారు. మరొక కథ శివుని భార్య అయిన సతీదేవి తన తండ్రి దక్షప్రజాపతి తలపెట్టిన యజ్ఞానికి పిలవని పేరంటంగా వెళ్లి ఘోర అవమానానికి గురవుతుంది. ఆ అవమానానాకి తట్టుకోలేక యజ్ఞగుండంలోపడి దేహత్యాగం చేస్తుంది. అది తెలిసి శివుడు ప్రళయకాల రుద్రుడై తన జటాజూటం నుండి వీరభద్రుడ్ని సృష్టించి దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయిస్తాడు. ఆ విధంగా అగ్నికి ఆహుతైన సతీదేవికి సంకేతంగా పసుపు గౌరమ్మను ఏర్పాటు చేసుకొని అమ్మ అంశగా పూజిస్తున్నారు. అమ్మ పసుపు గౌరమ్మగా బతికి సకల జీవకోటికి బతుకును అనుగ్రహించింది గాబట్టి 'బతుకమ్మ' అయిందంటారు.

**బ్రతుకమ్మను పేర్చటం** : గోపురం ఆకారంలో పేర్చిన పూలరాశినే బతుకమ్మగా వ్యవహరిస్తారు. రాత్రిపూట ఆకాశంలో పాలపుంత కనిపించినట్లుగానే, రంగురంగుల పూలు ఒకే చోట కనిపించి పూలపుంతలా కనువిందుచేస్తాయి. ఈ పండుగ జరుపుకొనే విధానాన్ని శ్రీ బి.రామరాజు గారు సవివరంగా తెలియజేశారు.[786] ఇది మహిళలు సమష్టిగా జరుపుకొనే పండుగ. వర్ణశోభితంగా రంగురంగుల పూలను

[786] తెలుగు జానపద గేయ సాహిత్యం, పుట – 431.

పేర్చి అర్చించటమే ఈ పండుగలోని ప్రధానాంశం. వర్షాకాలంలో చెట్లన్నీ చిగిర్చి అశ్వయుజమాసం నాటికి చక్కని పూలతో కళకళలాడుతుంటాయి. బతుకమ్మను పేర్చటానికి కావలసినవి పూలు, ఆకులు, సిబ్బె. ఈ పూలలో కూడా ఒక ప్రత్యేకత ఉంది. పనికి వచ్చే పూలు, పనికి రాని పూలు అనే భేదం లేకుండా సమత్వభావంతో అన్నిటినీ వాడటం విశేషం. సామాన్యమైన పూలకు, అందుబాటులో ఉండే పూలకే అధిక ప్రాధాన్యం. సాధారణంగా దేవతార్చనకు ఉపయోగించని గుమ్మడి, తంగేడు, గునుగు, సొర, బీర, గోరింట, నువ్వు రుద్రాక్ష వంటి పూలను ఉపయోగించటం. ఒక ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. వీటితో పాటు బంతి, చేమంతి పూలను, అల్లి, కట్ల, టేకు, గుమ్మడి, తామర ఆకుల్ని ఉపయోగిస్తారు. ప్రకృతిలో ప్రతి ఒక్కటీ విలువైందని ఈ పూల ఎంపికను బట్టి చెప్పవచ్చు. ముందుగా బాగా వెడల్పుగా అంచు ఎత్తు తక్కువగా ఉన్న (తాంబూల పళ్లెం వంటిది) వెదురు సిబ్బెనుగాని, ఇత్తడి పళ్లెం గాని తీసుకుంటారు. ఇది ఎంత వెడల్పుది తీసుకోవాలి అనేది ఎంత ఎత్తుగా పూలు పేరుస్తారో దానిని బట్టి నిర్ణయించుకుంటారు. బాగా ఎత్తుగా పేర్చాలనుకుంటే బాగా వెడల్పుగా ఉండే పళ్లెం, ఎత్తు తక్కువైతే వెడల్పు తక్కువగా ఉండే పళ్లెం తీసుకుంటారు. దానిపై ఒక వరుస గుమ్మడి, తామర లేదా టేకు ఆకుల్ని పరుస్తారు. వీటిపై పళ్లెం అంచు వెంబడి గుండ్రంగా ఒక రంగు పూలు దానిపై మరొక రంగు ఆపై వేరొక రంగు అలా తొమ్మిది వరుసలుగా పేరుస్తారు. ఈ పూలదొంతర క్రింద వెడల్పుగా పైకి వచ్చేటప్పటికి సన్నగా అనగా త్రికోణాకారం లేదా గోపురం ఆకారంలో ఉంటుంది. ఈ పూలను పేర్చేటప్పుడు పువ్వు వెలుపలి వైపుకు కాడలు పళ్లెం లోపలి వైపుకు ఉండేలా పేరుస్తారు. ఇది ఒక గొప్పకళ. పూలు పేర్చటం అయిపోయిన తర్వాత పైన తమలపాకు పెట్టి దానిపై పసుపుతో చేసిన గౌరమ్మను ఉంచుతారు. ఈ గౌరమ్మకు బొట్టు పెట్టి పసుపు, కుంకుమ, పూలు, అక్షతలతో అర్చిస్తారు. ఈవిధంగా అమర్చిన పూలదొంతరనే 'బతుకమ్మ'గా వ్యవహరిస్తారు. ఈవిధంగా ఇంటికొక బతుకమ్మను గాని లేదా ఇంట్లో ఎందరు మహిళలుంటే అన్ని బతుకమ్మలను గాని తయారు చేసుకుంటారు. దీనినే 'తల్లి బతుకమ్మ' అంటారు. తల్లి వెంట పిల్ల ఉండటం స్త్రీలోని మాతృత్వపు మమకారానికి సంకేతం. అందుకే తప్పనిసరిగా 'పిల్ల

బతుకమ్మ'ను కూడా తయారు చేస్తారు. పెద్ద వాళ్లు పెద్ద బతుకమ్మలు తయారు చేస్తే చిన్న పిల్లలు చిన్న బతుకమ్మలు తయారు చేస్తారు.

**పూజా విధానం** : మహిళలు ప్రతిరోజూ సాయంత్రం శుచిగా స్నానం చేసి ఎవరి తాహతుకు తగ్గట్టుగా వారు నూతన వస్త్రాలు ధరించి, నగలు అలంకరించుకొని బతుకమ్మను ఇంటి ఆవరణలో నేలపై ఉంచి చుట్టూ నిలబడి చప్పట్లు తడుతూ లయాత్మకంగా అడుగులు వేస్తూ గుండ్రంగా తిరుగుతూ పాటలు పాడతారు. వలయంలో లోపలివైపుకు ఒకఅడుగు వేసి ముందుకు వంగి చప్పట్లు కొడతారు. (కోలాటం కర్రలు కూడా ఉపయోగిస్తారు). రెండవ అడుగు వెనక్కి వేస్తూ గుండ్రంగా ముందుకు కదులుతారు. ఒక మహిళ పదాన్ని అందుకొని గొంతెత్తి పాడితే మిగిలిన వారు బృందగానం చేస్తారు. ముందుగా ఈవిధంగా ఎవరింటిముందు వారు ఆడిన తరువాత బతుకమ్మలను తలపై పెట్టుకొని వీధి చివరకు చేరతారు. ఆ వీధిలోని మహిళలందరూ తాము తీసుకువచ్చిన బతుకమ్మలను అక్కడ ఉంచి ఆడతారు. అక్కడి నుండి మరలా బతుకమ్మలను తలపై పెట్టుకొని ఊళ్లోని చెరువు వద్దకు గాని, కాలువ గట్టుకు కాని, గుడి ఆవరణలోకి గాని, ఊరి మధ్యకు గాని లేదా విశాలమైన ఖాళీ ప్రదేశంలోకిగాని చేరతారు. అక్కడ అందరూ తీసుకు వచ్చిన బతుకమ్మలను నేలపై ఉంచుతారు. మధ్యలో బాగా ఎత్తుగా ఉన్న బ్రతుకమ్మను పెట్టి చుట్టూ చిన్న చిన్నవి పెడతారు. కొద్దిమందే అయినప్పుడు ఒకే వలయంగా ఏర్పడతారు. ఎక్కువమంది ఉన్నప్పుడు చిన్నచిన్న బృందాలుగా అనగా 10-20 మంది ఒక బృందంగా ఏర్పడి బతుకమ్మల చుట్టూ వలయంగా తిరుగుతూ, చప్పట్లు తడుతూ పాటలు పాడతారు. ఈవిధంగా చాలాసేపు ఆడిన తర్వాత మహిళలు తాము తీసుకువచ్చిన నైవేద్యాలను బతుకమ్మకు సమర్పించి అందరికీ పంచి పెడతారు. పసుపు వాయనాలను ఒకరికొకరు ఇచ్చిపుచ్చుకొంటారు. చివరగా బతుకమ్మలను నీళ్లలో నిమజ్జనం చేసి ఎవరిళ్లకు వాళ్లు వెళతారు. ఈ విధంగా ఎనిమిది రోజులు చేస్తారు, తొమ్మిదవ రోజు అనగా మహర్నవమి రోజు 'సద్దుల బతుకమ్మ' పండుగ జరుపుకుంటారు. ఈ తొమ్మిది రోజులూ గౌరమ్మ పూలమ్మగా పుట్టింటికి వచ్చినట్లు భావించి తొమ్మిదోరోజు నిమజ్జన సమయంలో అమ్మను అత్తవారింటికి (శివుని

దగ్గరకు) పంపుతున్నట్లుగా ఊహించి సాగనంపు పాటల్ని పాడతారు. చివరి రోజు విశేషమైన వంటలు వండి నైవేద్యంగా సమర్పిస్తారు. అమ్మను సాగనంపిన తర్వాత ఎవరిళ్లకు వారు వెళ్లటంతో పండుగ ముగుస్తుంది.

తొమ్మిది రోజుల్లో బతుకమ్మను మొదటి రెండురోజులు బొడ్డెమ్మగా, మూడవ రోజు లక్ష్మీదేవిగా, నాలుగవ రోజు గౌరమ్మగా, అయిదవ రోజు అట్ల బతుకమ్మగా, ఆరవ రోజు అలిగిన బతుకమ్మగా, ఏడవ రోజు చకినాల బతుకమ్మగా, ఎనిమిద రోజు దుర్గమ్మగా, తొమ్మిదవ రోజు సద్దుల బతుకమ్మగా పూజిస్తారు.

**పాటలు** : బతుకమ్మను పూజిస్తూ పాడే పాటల్లో చాలా వరకు చిన్న చిన్న పదాలే కనిపిస్తాయి. ప్రతి పదం చివర ఉయ్యాలో, గౌరమ్మ, చందమామ, బతుకమ్మ, కోల్, ఎన్నియల్లో అనేవి ఉంటాయి. ఈ పాటలలో ఇతివృత్తం చాలా వరకూ ఆధ్యాత్మిక భావజాలంలో కూడి ఉంటుంది. ఇతిహాసాలు, పురాణాలు, బతుకమ్మ ఆవిర్భావం, గౌరమ్మ లీలలు వంటివి ఎక్కువగా ఉంటాయి. కొన్ని పాటల్లో చరిత్ర, సాంఘికాంశాలు కూడా ఉంటాయి. అన్నాచెల్లెళ్లు, అత్తాకోడళ్లు, తల్లీ పిల్లలు, భార్యాభర్తలు వారి మధ్య వెల్లివిరిసే ప్రేమానురాగాలు, ఇరుగుపొరుగుతో ఉండే అనుబంధాలు, పాడి పంటల విశిష్టత మొదలైన అంశాలు కూడా కొన్ని పాటల్లో ఉంటాయి.

ఆచార్య రామరాజు గారు సేకరించిన చందమామ పాటవంటిదే గౌరమ్మ పాట.[787] బతుకమ్మపైన గౌరమ్మను పెడతారు గనుక ఆ గౌరమ్మ రూపురేఖా విలాసాలు ఈ పాటలో సహజ సుందరంగా అభివర్ణింపబడ్డాయి.

గౌరమ్మ సంబోధనతోనే మరొకపాట కూడా ప్రచారంలో ఉంది.[788] జొన్నల్లో పుట్టిన గౌరి, వడ్లలో పుట్టిన గౌరి, కందుల్లో పుట్టిన గౌరి, పెసల్లో పుట్టిన గౌరి, మినుముల్లో పుట్టిన గౌరి అంటూ వివిధ ధాన్య లక్ష్ములుగా బతుకమ్మను సంభావిస్తారు. బ్రతుకమ్మ పండుగ సందర్భంలో కోమట్లు వాయినాలిచ్చుకుంటూ ఈ

[787] తెలుగు జానపద గేయ సాహిత్యం, పుట – 433.
[788] తెలంగాణ పల్లెపాటలు, పుట – 87.

పాట పాడతారని, దీనినే శ్రీసోమరాజుపల్లి చెంచయ్య గారు 'అట్లతద్దిపాటలు' శీర్షికతో ఆంధ్రప్రభలో ప్రకటించారని శ్రీరామరాజుగారు పేర్కొన్నారు.[789] ఏది ఏమైనా వివిధ ధాన్యసంపదలను చేకూర్చే దేవతగా బ్రతుకమ్మను భావించి అవన్నీ సమృద్ధిగా ప్రసాదించమని అర్థించటం సముచితమని భావించవచ్చు.

**నైవేద్యాలు** : బతుకమ్మకు సమర్పించే నైవేద్యాల కోసం మిగిలిన పండుగల్లో వలె ఆర్భాటంగా ఎలాంటి పిండివంటలూ చేయరు. అటుకులు, శనగలు, బొబ్బర్లు, పాలు, పెరుగు, పంచదార వంటి అందుబాటులో ఉండే పదార్థాలనే నైవేద్యంగా సమర్పిస్తారు. సద్దుల బతుకమ్మ పండుగ రోజు మాత్రం రకరకాల అన్నాలు (పులిహోర, కొబ్బరి అన్నం, దద్యోజనం, పులగం వంటివి), మక్కగుడాలు (మొక్కజొన్న గారెలు), బొబ్బర్ల గుడాలు వంటి వాటితోపాటు ఎవరితాహతుకు తగినట్లు వారు పిండివంటలు చేసి అమ్మకు నైవేద్యంగా సమర్పిస్తారు.

**సాంఘిక ప్రయోజనాలు** : ఈ పండుగలో సాంఘిక ప్రయోజనాలు ఎన్నో ఉన్నాయి. పూలలో ఎక్కువ తక్కువలు లేనట్లే మహిళలు కూడా ధనిక, పేద తేడా లేకుండా అందరూ ఒకచోట చేరటం వల్ల వారిలో ఐక్యతాశక్తి అభివృద్ధి చెందుతుంది. 'మూడు కొప్పులొక చోట చేరిన ముజ్జగములు గ్రుంకు' అని ఎవరో పురుషపక్షపాతి ప్రచారం చేసిన సామెతలో ఎంత మాత్రం నిజం లేదని ఈ పండుగ ద్వారా ఋజువవుతున్నది. ఈ పండుగ అన్నా చెల్లెళ్ల అనుబంధానికి, కుటుంబ విలువలకు ప్రతీక. ఈ పండుగ సమయంలో ప్రతి అన్న లేదా తమ్ముడు వివాహమైన సోదరి ఇంటికి వెళ్లి ఆమెను పుట్టింటికి తీసుకువస్తారు. దీనివల్ల సోదర సోదరీ బంధం పటిష్టమవుతుంది. బతుకమ్మలను నీటిలో నిమజ్జనం చేయుటంవల్ల నీటిశుద్ధి జరుగుతుంది. వర్షాకాలంలో కురిసిన వానల వల్ల జలాశయాలన్నీ నీటితో నిండి సమృద్ధిగా ఉంటాయి. బతుకమ్మను పేర్చటంలో వాడిన పూలకు (ముఖ్యంగా గునుగు, తంగేడు), ఆకులకు నీటిని శుద్ధి చేసే గుణం ఉండటంవల్ల నీరంతా శుభ్రపడుతుంది. చిల్లగింజలు నీటిలో వేసినప్పుడు ఆ నీటిలో మాలిన్యాలన్నీ అడుక్కిచేరి నీరు తేటగా,

[789] పైదే.

స్వచ్ఛంగా మారినట్లుగానే ఈ పూలు, ఆకుల వల్ల నీరంతా తేటగా మారుతుంది. పసుపు వాయనాలు ఇచ్చిపుచ్చుకోవటం వల్ల ఇచ్చిపుచ్చుకునే గుణం, నైవేద్యాలు అందరికీ పంచటం వల్ల సంకుచితత్వం నశించి విశాల దృక్పథం అలవడతాయి. ఇతరులతో స్నేహ బంధాలు పెంపొందుతాయి. సాయంసంధ్యా సమయంలో ఎలుగెత్తి పాడటం వల్ల గాత్ర సౌలభ్యం కలుగుతుంది. ఈ పండుగ వల్ల కుటుంబాలపై ఎటువంటి ఆర్థిక భారం పడదు. ఈ పూలూ, ఆకులూ గ్రామ సీమలలో సహజ సిద్ధంగా దొరికేవే. తండ్రిగాని, అన్నదమ్ములుగాని పొలాల వెంట, తోటల వెంట తిరిగి పూలను, ఆకులను సేకరిస్తారు. (వినాయక చవితికి 21 రకాల పత్రి సేకరించినట్లు). కనుక వీటిని కొనవలసిన అవసరం లేదు. ఖర్చు ఉండదు. ఇవి లభించని పట్టణాలు, నగరాలలో మాత్రమే కొనుక్కోవాలి. అలాగే ఎనిమిది రోజులూ అందుబాటులో ఉండే పదార్థాలనే నైవేద్యంగా సమర్పించటం వల్ల ఆర్థికభారం ఉండదు. తొమ్మిదవ రోజు నైవేద్యాలు మాత్రం ఎవరి తాహకు తగినట్లుగానే వారు తయారు చేస్తారు.

**సందేశం** : ప్రకృతిని ప్రేమించు, పూజించు, పరిరక్షించు అనే సందేశాన్ని అందిస్తుంది ఈ పండుగ.

**బొడ్డెమ్మ పండుగ** : ఇది తెలంగాణలో బహుళ ప్రచారంలోఉన్న పండుగ.[790] కోస్తా, రాయలసీమల్లో కనిపించదు. ఇది కేవలం కన్యలు చేసుకొనే పండుగ. ఆచార్య బి. రామరాజు గారు అన్నట్లు ఇది గొబ్బి పండుగకు అనుకరణమేమో ననిపిస్తుంది.[791] ఈ పండుగ భాద్రపద బహుళ పంచమితో ప్రారంభమై మహాలయా

---

[790] "స్త్రీలు గొండ్లియాటను ఆడిరి. గొండ్లి అనునది కుండల అనుదాని తద్భవమేమో! కుండలాకార నృత్యమే గొండ్లి. గొండ్లి విధానమే బతుకమ్మ, బొడ్డెమ్మ ఆటలు."

– ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట -173.

[791] "బొడ్డెమ్మ నృత్యములను ఆటపాటలను మన మౌత్తరాహుల 'గర్భో' నృత్యముతో పోల్చుకొనవచ్చు. 'గర్భో' శబ్దమే 'గొబ్బి' యని పండితుల యభిప్రాయము. ఆంధ్రదేశమున గొబ్బియాటలు మనమెరిగినవే. బొడ్డెమ్మకూడ వాని యనుకరణమే యని నా అభిప్రాయము."

తెలుగు జానపద గేయ సాహిత్యం, పుటలు – 429 -430.

మావాస్యతో పూర్తవుతుందని రామరాజుగారి అభిభాషణం. ఇందులో భక్తి, కర్మ రెండూ మిళితమై ఉన్నాయని వారు పేర్కొన్నారు.

పుట్టమన్ను తీసుకువచ్చి పంచమి నాడు దానిని ఒక పీటపై అయిదు అంతరువులుగా పేర్చి బొడ్డెమ్మను ప్రతిష్టించి దానిపై ఒక కలశం ఉంచుతారు. ఆ కలశంలో బియ్యం పోస్తారు. దానికి క్రొత్త రవికె గుడ్డ చుట్టి దానిపై పసుపు గౌరమ్మను నిలుపుతారు. ఆ గౌరమ్మను పసుపు కుంకుమలతో, రుద్రాక్ష, గోరింట, బీర పువ్వులతో అలంకరిస్తారు.

ఈ బొడ్డెమ్మను ప్రతి ఇంటిలో కాక వీధికొక ఇంటిలో ప్రతిష్టిస్తారు. ఆ వీధిలోని కన్యలందరూ సాయం సమయంలో బొడ్డెమ్మ చుట్టూ చేరి వలయాకారంలో తిరుగుతూ చప్పట్లు తడుతూ పాటలు పాడతారు. చీకటి పడగానే తాము తీసుకువచ్చిన ఫలహారాలను బొడ్డెమ్మకు నైవేద్యం పెట్టి పిదప వాటిని అందరూ పంచుకొని అమ్మవారిని భద్రంగా దాచి ఎవరిళ్లకు వారు వెళతారు.

వీరు పాడే పాటల్లో 'చందమామ' అనే సంబోధనతో సాగే పాట ఒకటి ముఖ్యమైంది.[792] ఈ పాటలో కొన్ని సంకేతాలు కనిపిస్తాయి.

"మంచినీళ్ల బావిప్రక్క చందమామ
మంచిమల్లె తీగెబుట్టె చందమామ
కోసే వారెవరూ లేక చందమామ
కొండెత్తు పెరిగిపోయె చందమామ"

అని అనటంలో ఆడపిల్లలు పెరిగిపోతున్నారని, యుక్తవయసు వచ్చిందని పెద్దలు వివాహ ప్రయత్నాలు మొదలు పెట్టాలి అనే సూచన కనిపిస్తుంది. ఈ పాటలోని మల్లెతీగను కన్యకు సంకేతంగా భావించినట్లు గోచరిస్తుంది.

మరొక పాటలో[793] దంపతుల పేర్లు చేర్చి 'కోలు కోలు' అంటూ పాటలు పాడతారు. ఆ దంపతుల వలెనే తమకు కూడా త్వరగా జతకూడాలనే ఆకాంక్ష

[792] తెలుగు జానపద గేయ సాహిత్యం, పుట – 430.
[793] తెలంగాణ పల్లెపాటలు, పుట – 39.

నిక్షిప్తమైనట్లు భావించవచ్చు. మొత్తంమీద కన్యల వివాహాపేక్షను ప్రకటించే పాటలుగా ఇవి కనిపిస్తున్నాయి. లక్ష్మీ పార్వతులను ఈ బొడ్డెమ్మ రూపంగా అర్చించి తమ జీవితాశయాన్ని నెరవేర్చుకోవటానికి చేసే ప్రయత్నం ప్రస్ఫుటమవుతుంది.

తొమ్మిదో రోజు పండుగ ముగింపు. కలశంలో పోసిన బియ్యంతో ఆ రోజు పరమాన్నం వండి అమ్మకు నైవేద్యం పెట్టి అందరూ భక్తి శ్రద్ధలతో ఆరగిస్తారు. చివరకు బొడ్డెమ్మను జలాశయాల్లో నిమజ్జనం చేస్తారు. అదే బొడ్డెమ్మను నిద్రపుచ్చటం.

**గొబ్బి పండుగ:** ఇది సంక్రాంతి సమయంలో జరుపుకునే పండుగ, కోస్తా, రాయలసీమ ప్రాంతాలలోని కన్యలు ఈ పండుగను ఉత్సాహంగా జరుపుకొంటారు. హేమంత ఋతువులో వచ్చే ధనుర్మాసం[794] నెలరోజులూ ఈ సందడి కొనసాగుతుంది. సూర్యుడు ప్రతినెలా ఒక రాశి నుండి మరొక రాశిలోకి ప్రవేశిస్తుంటాడు. దీనినే సంక్రమణం అంటారు సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిప్పుడు మకర సంక్రాంతి లేక సంక్రాంతిగా జరుపుకొంటారు. ఇది జనవరి నెలలో వచ్చే పండుగ, అంతకు ముందు నెల రోజులు, అనగా డిసెంబరు 14వ తేదీ నుండి జనవరి 14 వరకు 'సంక్రాంతి నెల పట్టటం' అంటారు. ఈ నెల రోజులూ జగతికి వెలుగునిచ్చే వాడూ, సంక్రమణానికి కారకుడూ, పంటలు పండటానికి దోహదకారీ అయిన సూర్యుడ్ని 'సంకురుమయ్య' పేరుతో భగవంతుడిగా ఆరాధిస్తూ గుమ్మాల ముందు పెద్ద పెద్ద ముగ్గులువేసి ఆయన్ను ఇంటి ప్రాంగణంలోకి ఆహ్వానిస్తారు.

స్త్రీలు తెల్లవారుఝామునే లేచి ఇంటి ముంగిలంతా ఊడ్చి కల్లాపి (కలయంపి) చల్లి ముగ్గులు వేస్తారు. ఈ ముగ్గులు సంవత్సరం పొడవునావేసే మామూలు ముగ్గులు కావు. ఇవి సంక్రాంతికి మాత్రమే పరిమితమైన ప్రత్యేకమైన ముగ్గులు. వీటిని సంవత్సరంలోని మిగతా రోజుల్లో వేయరు. చూడగానే తెలిసిపోతుంది ఇవి సంక్రాంతి ముగ్గులని. ఇవి ఒకతరం నుండి మరొక తరానికి

794 మార్గశిర మాసంలో చివరి 15 రోజులు, పుష్యమాసంలో మొదటి 15రోజులు కలిపి ధనుర్మాసంగా వ్యవహరిస్తారు.

అనగా అనుస్యూతంగా స్త్రీలకు అలవడినటువంటివి. వీటిని చతురస్రాకారంలో, దీర్ఘచతురస్రాకారంలో, వృత్తాకారంలో రకరకాలుగా వేస్తుంటారు. చుక్కల ముగ్గులకన్నా గీతల ముగ్గులకే ప్రాధాన్యత. ప్లస్ వంటి గుర్తులను వేసి వాటిని కలపటం లేదా వీటినే నాలుగు గీతలుగా వేసి వాటిని కలపటం, రెండు లేదా ఎనిమిది నాగులు మెలిపడినట్లుగా కనిపించే నాగబంధం ముగ్గులు ఎక్కువగా వేస్తుంటారు. 27 రోజుల పాటు సంక్రాంతి ముగ్గులను ఎవరికి వచ్చినట్లు వారు వేసినప్పటికీ పండుగ మూడురోజులు మాత్రం అందరూ ఒకే రకమైన ముగ్గుల్ని వేస్తారు. భోగిరోజు చతురస్రాకారంలో పీటాల (పీటలు) ముగ్గు వేస్తారు. సంకురుమయ్యను ఆ పీటల మీదికి రమ్మని ఆహ్వానం పలుకుతారు. పండుగ రోజు సంకురుమయ్యను ఊరేగించటానికి రథం ముగ్గు వేస్తారు. కనుమ రోజు ఊరేగించటానికి ప్రభ ముగ్గు వేస్తారు. నెల రోజుల పాటు ముగ్గుకు గుమ్మం వైపు తప్ప మిగిలిన మూడు వైపులా వాకిళ్ల ముగ్గు వేసి అవి తెరుచుకున్నట్లుగా వేస్తారు. అంటే సంకురుమయ్య ఆ గుమ్మాల ద్వారా తమ ఇంట్లోకి రావాలని వారి ఆకాంక్ష. కనుమ రోజు సాయం సంధ్యా సమయంలో వాకిలి ఊడ్చి చిన్న ముగ్గు వేసి మూడు వైపులా వాకిళ్లు మూసివేస్తారు. అనగా సంకురు మయ్యకు వీడ్కోలు పలకటం. చిత్రాలు, శిల్పాలు ఎన్నెన్నో ఊసులు, కథలు చెప్పినట్లుగా ఈ ముగ్గులు ఎన్నో భావాల్ని వ్యక్తం చేస్తుంటాయి. మరెన్నో విశేషాల్ని తెలియజేస్తాయి.[795] చిత్రకళ, శిల్పకళ వలె ఈ ముగ్గులు వేయటం కూడా ఒక గొప్ప కళ. అటువంటి కళను అలవోకగా అందిపుచ్చుకొన్న ఏకలవ్య శిష్యురాండ్రు భారతీయ నారీమణులు.

(ఈ ముగ్గులు వేయటంలో ఆరోగ్య సూత్రం, భూతదయ కూడా ఇమిడి ఉన్నాయి. సాధారణంగా హేమంత ఋతువులో ఎండ తీవ్రత తక్కువగా ఉంటుంది. క్రిమికీటకాలు వృద్ధి చెందటానికి ఇది అనువైన వాతావరణం. ఇబ్బడిముబ్బడిగా

[795] ఇంటి గుమ్మం ముందు ముగ్గు లేకపోతే ఆ ఇంటి వారికి మైల లేదా సూదకం అని అర్థం. అనగా వారి సమీప బంధువులెవరో మరణించారని దాని భావం. అటువంటి సమయంలో ఆ ఇంటి వారిని ఏదైనా కార్యక్రమానికి ఆహ్వానించవలసి వస్తే వారినితాకకుండా గుమ్మానికి బొట్టుపెట్టి పిలవటం అనాదిగా వస్తున్న ఆచారం.

పెరిగిన క్రిమికీటకాదుల వల్ల ఎన్నో వ్యాధులు విజృంభిస్తాయి. ముగ్గుల కోసం ఇంటి ఆవరణంతా శుభ్రం చేయటం వల్ల కొంతవరకు క్రిమికీటకాలు ఇంట్లోకి చేరవు. ముగ్గు వేయటానికి తెల్లటి సున్నపురాళ్ల పొడిని గాని ముగ్గురాళ్ల పొడి (రాతి ముగ్గు)ని గాని వాడతారు. ఇందులో బియ్యపు పిండిని కలిపి ముగ్గులు వేస్తారు. ముగ్గులోని సున్నపు ఘాటుకి క్రిమికీటకాదులు ఇంట్లోకిచేరవు. అనగా ముగ్గు క్రిమి సంహారిణి (disinfectant) గా ఉపయోగపడుతుందన్న మాట. అదే విధంగా చీమలు వంటి కొన్ని అల్పప్రాణులు ఆ ముగ్గులోని బియ్యపు పిండిని ఆహారంగా స్వీకరిస్తాయి. తద్వారా భూతదయ చూపినట్లవుతుంది. ఒక దెబ్బకు రెండు పిట్టలు అనే సామెత ఈ సందర్భానికి చక్కగా వర్తిస్తుంది. పూర్వం తెల్లటి ముగ్గు పిండిని మాత్రమే ముగ్గులు వేయటానికి ఉపయోగించేవారు. పశువుల పేడతో కల్లాపి చల్లటం వల్ల నేలంతా లేత ఆకుపచ్చ రంగు పులుముకుంటే దానిపై వేసిన తెల్లని ముగ్గుతో ప్రాంగణమంతా కళకళలాడుతుంది. ఆధునిక కాలంలో ఈముగ్గులను రంగులతో నింపుతున్నారు. దుకాణాలలో లభంచే రంగులను తీసుకువచ్చి దానిలో మెత్తటి ఇసుకను గాని కళ్లు ఉప్పునుగాని కలిపి ముగ్గుల మధ్యలో వాటిని నింపుతున్నారు. దీని వల్ల ముగ్గులన్నీ రకరకాల రంగులతో వర్ణరంజితమై ప్రాంగాణాలన్నీ శోభావహంగా కాంతులీను తుంటాయి).

పెద్ద వాళ్లు ముగ్గు వేసిన తర్వాత కన్నె పిల్లలు ఆ ముగ్గుల మధ్యలో గొబ్బెమ్మలను పెడతారు. ఇందుకోసం ఆవుపేడనుపయోగిస్తారు. ముందురోజు సాయంత్రమే కన్నెపిల్లలందరూ కలిసి ఆవులున్న దగ్గరకు వెళ్లి ఆవు పేడను సేకరించి ఇంటి ప్రాంగణంలో పెట్టుకుంటారు. ఉదయం ఆ పేడతో గొబ్బెమ్మలను చేస్తారు. గుండ్రంగా చేసిన ఆవు పేడ ముద్దనే 'గొబ్బెమ్మ'గా పిలుచుకొంటారు. గౌరీదేవికి ప్రతిరూపంగా ఈ గొబ్బెమ్మను కొలుచుకుంటారు. కన్నెపిల్లలు ఆవుపేడను రెండు చేతుల్లోకి తీసుకొని తమ చిట్టి చేతులతో వత్తుతూ గుండ్రంగా బంతిలాచేస్తారు. ఇది ఎంత పరిమాణంలో ఉండాలి ఎన్ని తయారు చేయలి అనేది వారి ఇష్టం, ఓపిక లేదా ఆవు పేడ ఎంత లభించింది అనే దానిపై ఆధారపడి ఉంటుంది. సాధారణంగా క్రికెట్టు బంతి పరిమాణంలోగాని లేదా అంతకంటె కొంచెం పెద్దవిగాని చిన్నవిగాని

చేస్తారు. ముందుగా ఒక గొబ్బెమ్మను బాగా పెద్దదిగా చేస్తారు. దానినే 'తల్లి గొబ్బెమ్మ' అంటారు. మరొక దానిని బాగా చిన్నదిగా చేస్తారు. దానినే 'పిల్ల గొబ్బెమ్మ' అంటారు. పిల్ల గొబ్బెమ్మను తల్లి గొబ్బెమ్మ పైన పెట్టి దానిని ముగ్గు మధ్యలో పెడతారు. చుట్టూ మిగిలిన గొబ్బెమ్మలను పెడతారు. చుట్టూ పేర్చిన గొబ్బెమ్మలు ఖచ్చితంగా తల్లి గొబ్బెమ్మ కంటే చిన్నవిగానే ఉంటాయి. చుట్టూ పెట్టిన వాటిని ఏ విధంగా పెడతారు, ఏయే ఆకారాలలో పెడతారు అనేది పెట్టేవారి అభిరుచిపై ఆధారపడి ఉంటుంది. ఇలా గొబ్బెమ్మలను అమర్చిన తరువాత వాటిపై ముగ్గుతో గీతలు గీస్తారు. పసుపు, కుంకుమ చల్లుతారు. చివరగా వాటి పైభాగంలో గుమ్మడి, బీర లేదా గోరింట పువ్వుల్ని అలంకరిస్తారు.

అలంకారం పూర్తయిన తరువాత కన్నెపిల్లలందరూ కలిసి ముగ్గు త్రొక్కకుండా ముగ్గు చుట్టూ వలయాకారంగా తిరుగుతూ చప్పట్లు తడుతూ పాటలు పాడతారు. పిల్లలందరూ కలిసి గొబ్బెమ్మలు పెట్టిన ప్రతి ఇంటి ముందూ ఈవిధంగానే ఆడతారు. సాయంత్రం సూర్యాస్తమయం తరువాత ఆ గెబ్బెమ్మల్ని తీసి పిడకలుగా చేసి ఎండబెడతారు. ఇలా నెల రోజుల పాటు చేసిన పిడకల్ని దాచి ఉంచి సంక్రాంతి తరువాత వచ్చే రథసప్తమి రోజు వాటిని వంటచెరకుగా ఉపయోగించి పొంగలి చేసి సూర్యుడికి నైవేద్యం పెడతారు.

ఈ గొబ్బెమ్మలను తొలుత సాయం సమయాలలో పెట్టి దేవతగా భావించి పూజించటం వల్ల 'సందె గొబ్బెమ్మ' అనే వ్యవహారం ఏర్పడింది. కొందరు కలవారి ఇళ్లలో ఈ సందె గొబ్బెమ్మలను పెట్టే సమయంలో ముత్తయిదువులను పిలిచి తాంబూలాదుల్ని సమర్పించి కన్నె పడుచులు వారి ఆశీర్వాదాన్ని పొందుతారు.

కన్యలు గొబ్బెమ్మల చుట్టూ తిరుగుతూ పాడే పాటలు[796] కొన్ని లభిస్తున్నాయి. వాటిలో కన్యలు తమ తమ ఆకాంక్షల్ని వ్యక్తం చేస్తారు.

"తామర పువ్వంటి తమ్ముణ్ణిస్తావా
సేమంతి పువ్వంటి చెల్లెలినిస్తావా"

[796] మిన్నేరు, పుట -230.

అని తమ పుట్టింటి పెంపును కోరడమే కాకుండా కాబోయే అత్తంటి క్షేమాన్ని ఆకాంక్షిస్తూ

"మల్లె పువ్వంటి మరిదినిస్తావా
మంకెన పువ్వంటి మరదలినిస్తావా"

అంటూ పాడతారు. మరిదే మల్లెపువ్వంటి వాడైతే ఇక మగడి సంగతి చెప్పేదేముంది! కానీ మరొక సంకలనంలో

"మల్లె పూవంటి మొగుడి నియ్యావే" అని కోరినట్లుగా ఉంది.

(గొబ్బెమ్మలను పెట్టటంలో కూడా ఆరోగ్య సూత్రాలు అంతర్లీనంగా దాగున్నాయి. ఆవుపేడ, పసుపు క్రిమిసంహారిణులు (disinfectants). గొబ్బెమ్మల్లపై గుమ్మడి, బీర, పసుపు గోరింట పూలనుమాత్రమే పేర్చటానికి కారణమేమిటంటే అవి పసుపుపచ్చ రంగులో కంటికి నదురుగా కనిపిస్తూ క్రిమికీటకాదుల్ని త్వరగా ఆకర్షిస్తాయి. అలా వచ్చిన క్రిమికీటకాదులు ఆవుపేడ, పసువు ఘాటుకి మరణిస్తాయి. తద్వారా వ్యాధికారకమైన క్రిమికీటకాదులు ఇంట్లోకి చేరకుండా గుమ్మం ముందే నిరోధింపబడతాయి గనుక ఇంట్లోని వారు ఆరోగ్యంగా ఉండగలుగుతారు).

**సంక్రాంతి** : కోస్తా, రాయలసీమ ప్రాంతాలలో సూర్యగమనం ఆధారంగా వచ్చే సంక్రాంతి అతి పెద్ద పండుగ. ఎందుకంటే ఆ సమయానికి పంటలన్నీ అందివస్తాయి. ఇళ్లన్నీ ధాన్యరాశులతో కళకళలాడుతుంటాయి. ఏడాదిపొడవునా పడిన తమ కష్టానికి ఫలితాన్ని పంట రూపంలో చూసుకొన్న రైతుల హృదయాలు ఆనందభరిత మవుతాయి. అంతేకాదు సంక్రాంతితోనే ఉత్తరాయణం ప్రారంభమవుతుంది. ఈ కాలాన్ని ఎంతో పుణ్యమైనదిగా హిందువులు భావిస్తారు. సంక్రాంతి మూడు రోజుల పండుగ. 'భోగి, సంక్రాంతి, కనుమ' పేర్లతో జరుపుకొంటారు. కొన్ని ప్రాంతాలలో నాలుగవ రోజు కూడా 'ముక్కనుమ' పేరుతో జరుపుకొంటారు.

భోగినాడు తెల్లవారుఝామునే లేచి 'భోగిమంటలు' వేస్తారు. పిల్లలు, పెద్దలు అందరూ ఆ భోగిమంటల దగ్గర చలికాచుకోవటమేగాక ఆ మంటలపై పెద్ద

పెద్ద పాత్రలతో లేదా కుండలతో నీళ్లు కాచి ఆ నీటితో తలస్నానాలు చేస్తారు. ఇదే రోజు 5 సంవత్సరాలలోపు పిల్లలకు భోగిపళ్లు పోసి ముత్తయిదువులకు తాంబూలాలు పంచుతారు. పిల్లల్ని కుర్చీలో కూర్చోబెట్టి రేగుపండ్లు, చిల్లర నాణాలు కలిపి వారి తలపై పోస్తారు. సంస్కృతంలో రేగును బదరీ అంటారు. రేగుపండ్లను తలపై పోయటం వల్ల సాక్షాత్తుగా ఆ బదరీనారాయణుడి ఆశీస్సులు వారిపై వర్షించి పిల్లలు దీర్ఘాయుష్మంతులవుతారనే నమ్మకంతో ఈ విధంగా చేస్తారు.

సంక్రాంతి రోజు ఆ నెలలో ఈనిన గేదె పాలతో (క్రొత్త పాడి), క్రొత్త బియ్యంతో, క్రొత్త బెల్లంతో, క్రొత్త కుండలో పొంగలి చేసి సంకరుమయ్యకు నైవేద్యంపెడతారు. కొన్నిప్రాంతాలలో ఈ పొంగలిని భోగిరోజునే చేస్తారు.

కనుమ రోజు పశువులను పూజిస్తారు. వాటిని రకరకాలుగా అలంకరిస్తారు. వాటి కొమ్ములకు ఒక దానికి పసుపు, రెండవ దానికి పసుపు సున్నం కలపగా వచ్చిన ఎరుపు రంగును పూస్తారు. నుదిటిపై పసుపు రాసి బొట్టు పెడతారు. కొమ్ములకు పూలు చుడతారు. మెడలో పూలదండలు వేస్తారు. ఆర్థిక స్థోమతు కలవారు మెడలో గంటల పట్టెళ్లు రకరకాల పూసల దండలు వేస్తారు. వీపు భాగంలో తోలుతో చేసిన పట్టీలు వేస్తారు. అలంకరణ పూర్తయిన తరువాత వాటిని పూజిస్తారు. వాటికి ఇష్టమైన దాణా తినిపిస్తారు. ఆ విధంగా తమకు వ్యవసాయంలో సహాయపడటమే కాకుండా ఇంటిని పాడితో నింపుతున్న పశువులకు తమ కృతజ్ఞతను తెలుపుకుంటారు.

ఈ పండుగకు ఎన్నో పిండివంటలు వండుకుంటారు. అరిశెలు, కజ్జికాయలు, సున్నుండలు, బూందిలడ్లు, కాజాలు, పూతరేకులు, చక్కలు, చక్కరాలు, సకినాలు వంటి వాటితో ఇళ్లు, వీధులు ఘుమఘుమలాడిపోతాయి. ముఖ్యంగా అరిశెలు వండని ఇల్లు ఉండదంటే అతిశయోక్తి కాదు.

సంక్రాంతికి కూతుళ్లను, అల్లుళ్లను తప్పనిసరిగా ఆహ్వానిస్తారు. క్రొత్త అల్లుళ్లకు కొంతభారీగా, పాత అల్లుళ్లకు తమ శక్తిననుసరించి కానుకలిచ్చి సంతోషపెట్టటానికి ప్రయత్నిస్తారు. సంక్రాంతి మూడురోజులూ పిల్లల ఆటపాటలతో,

పెద్దల హడావుడితో, క్రొత్తబట్టల రెపరెపలతో పిండివంటల ఘుమఘుమలతో పండుగ శోభను సంతరించుకొంటుంది.

సంక్రాంతి మూడు రోజుల పండుగే అయినా నెలంతా పండుగ వాతావరణమే ఉంటుంది. ఆ నెలరోజులూ సన్నాయి మేళాలూ, గంగిరెద్దుల విన్యాసాలు, హరిదాసుల సంకీర్తనలు, కాటికాపరుల కనికట్టు విద్యాప్రదర్శనలు, భట్రాజుల పొగడ్తలతో ఇంటి ముంగిట్లో సందడి నెలకొంటుంది. ఆ నెలరోజులూ గుమ్మం ముందుకొచ్చి అడిగిన వారికి లేదనకుండా ధాన్యం సమర్పించటం రైతు దాతృత్వానికి నిదర్శనం.

సంక్రాంతి అతి పెద్ద పండుగే అయినప్పటికీ గొబ్బి పండుగకు సంబంధించిన గేయాలే తప్ప పైన పేర్కొన్న విశేషాలను తెలియజేసే గేయాలు ముద్రిత జానపద వాఙ్మయంలో మృగ్యం.

**హోళి పండుగ :** ఇది ప్రధానంగా ఉత్తర భారతదేశంలో జరుపుకొనే పండుగ. దీనినే రంగుల పండుగ అనికూడా అంటారు. ఆ రోజు ఒకరిపై ఒకరు రంగులు చల్లు కోవటం, రంగులు కలిపిన నీళ్లను పిచికారీ చెయ్యటం, తదుపరి మిఠాయిలు పంచుకోవటం, తినిపించటం, తినటం జరుగుతుంది. ఉత్తరాది నుండి క్రమంగా ఇది దక్షిణ భారత దేశానికి కూడా ప్రాకింది. ఇది ఆంధ్రదేశంలో తెలంగాణ ప్రాంతంలో అధిక ప్రాచుర్యంలో ఉంది. బహుశా మహారాష్ట్ర నుండి ఈ పండుగ తెలంగాణలో ప్రవేశించి ఉండవచ్చు. ఈ హోళి పండుగకు సంబంధించినవి 'కాముని పాటలు' పేరుతో ప్రచారంలో ఉన్న రెండు గేయాల్ని ఆచార్య బి. రామరామజు గారు సేకరించారు. హోళీ పండుగను తెలుగులో 'కాముని పండుగ' అనీ 'కాముని పున్నమ' అనీ అంటారు. ఇది ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు ముందు జరుపుకునే వసంతోత్సవంగా సూర్యరాయాంధ్రనిఘంటువు పేర్కొన్నది. 'కాముని పండుగ' కడపటినాడు తగలబెట్టటానికి ప్రోగుచేసిన గడ్డికంపను కూడ హోళి అంటారు అని శబ్దరత్నాకరం ఉవాచ.

పరమశివుడు తన త్రినేత్ర జ్వాలలతో మన్మథుడ్ని దహించిన సన్నివేశానికి సంకేతంగా ఈ పండుగ జరుపుకొంటారు. అందుకే దీనికి 'కామదహనం' అని కూడా పేరు. జానపద స్త్రీలు ఈ కామునిపున్నమ సందర్భంలో పగలు కాని వెన్నెల రాత్రులలో కాని 'హోళి! హోళి! అనుకుంటూ పాటలు పాడతారు. ఈ పాటలలో ప్రకృతిని గురించిన వర్ణనలే ఎక్కువగా ఉంటాయి. నిమ్మలు పూచాయి. నిమ్మలు కొట్టటానికి దొరగారు లేరు. కాయలేరటానికి దొరసాని లేదు అని పాట సాగుతుంది. అదేవిధంగా మామిళ్లు, వేపలు, రేగులు, మోదుగులు పూచాయని పాటలుగా పాడుకుంటారు. అనగా వసంతఋతువు గనుక ప్రకృతంతా వికసించిందని భావం. అదేవిధంగా స్త్రీ మనసు కూడా రాగరంజితమై వికసించిందనే సూచన ఈ పాటల్లో[797] ధ్వనిస్తున్నది.

'రంగులాడుదాము' అనే పాట[798] కూడా స్త్రీ మనోవికాసానికి సంబంధించి నట్టిది. ఉంగరాల జుట్టు మీద రంగుపోసి పోతానంటుందొక యువతి. అప్పుడా యువకుడు యువతి హృదయ భాగం మీద రంగు చల్లుతానంటాడు. ఈవిధంగా యువజనం సరసాలాడుకుంటూ సంతోషంగా జరుపుకునే కాముని పండుగ ఇది.

కాముని పాటలు శృంగార రసాత్మకమైనవి. ఈ పాటల భావాన్ని ఆచార్య బి. రామరాజుగారు తమ సిద్ధాంత వ్యాసంలో వివరించారు.[799]

## 5. ఆచార వ్యవహారాలు

ఆచారం అంటే ఆచరణ, నడత. దీనినే అనుష్ఠానం అనికూడా అంటారు. ఈ ఆచారం సాంప్రదాయికంగా గురువృద్ధపరంపరగా సంక్రమిస్తున్నది.

ఆచారం నుండి ధర్మం ప్రభవిస్తుందని మహాభారతం చెబుతుంది.[800] ఈ ధర్మానికి అధిపతి పరమేశ్వరుడేనని కూడా భారతం

[797] తెలంగాణ పల్లెపాటలు, పుట – 62.
[798] పైదే, పుట – 63.
[799] తెలుగు జానపద గేయ సాహిత్యం, పుట – 548.
[800] "ఆచార ప్రభవో ధర్మో ధర్మస్య ప్రభు రమ్యతః"
—ఆంధ్ర మహాభారతం, భీష్మపర్వం – విష్ణు సహస్రనామస్తోత్రమ్, 17 శ్లో.

ఉద్ఘాటిస్తుంది.[801] అంటే చాలాకాలంగా ఆచరింపబడేదే ధర్మమని, ఆ ధర్మమే భగవత్స్వరూపమని మనపూర్వులు విశ్వసించారు. భగవంతుడితో ముడిపెట్టటం వల్ల ఆచారాలకు పవిత్రత చేకూరుతుంది.

వ్యవహారమంటే ఆచారమని, వాడుకని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొన్నది. కార్యము, పని అనికూడా అర్థాలున్నాయి. ఎప్పటికప్పుడు చేసేపని వ్యవహారం. అనూచానంగా చేసేపని ఆచారం. స్థిరపడ్డ వ్యవహారమే ఆచారమని చెప్పవచ్చు. మొత్తం మీద ఆచార వ్యవహారాలని రెండు పదాల్ని కలిపే ప్రజలు వాడుతున్నారు.

జానపద సాహిత్యంలో స్త్రీల ఆచార వ్యవహారాల గురించిన పరామర్శ ఇంతకు పూర్వమే అనేక సందర్భాలలో జరిగింది. అయినప్పటికీ కొన్ని ముఖ్యమైన ఆచారాలను గురించి ఇక్కడ వివరిస్తాను. బిడ్డ పుట్టిన తర్వాత ఇరవయ్యొకటో రోజున తొట్టిలో (ఉయ్యాలలో) వేయటమనేది ఒక ఆచారం. బిడ్డను ఉయ్యాలలో పడుకోబెట్టి ఊపుతూ పాటలుపాడతారు ముత్తయిదువులు. ఆ పాటలలోని ఇతివృత్తం ఏదోవొకటిగాక పురాణ గాథల్ని ముఖ్యంగా రామాయణ గాథల్ని ఎన్నుకుంటారు.[802]

"ఈ బిడ్డ వైకుంఠపురి వాసుడూ
పూర్ణంపు చంద్రుడమ్మా
ఈ బిడ్డని పూరుషోత్తముడందురూ
కరుణాకటాక్షుడమ్మా"

అనే భావన ఎంతో ఉదాత్తమైంది. ఇందులో వాత్సల్య భక్తిభావన కూడా గోచరిస్తుంది. ఏదో వినోదాత్మకంగా లల్లాయి పదాలు కాక విజ్ఞానాత్మకంగా ఇట్టి ఆచారాన్ని నిర్వహించటంలో హైందవ మత వైశిష్ట్యం గోచరిస్తున్నది.

801 పైదే.
802 సరాగాలు, పుట -21.

ఈ ఆచార వ్యవహారాలెప్పుడూ ఒకే రీతిగా ఉండవు కాలానుగుణంగా మారుతుంటాయి. వివాహాల విషయంలో ఆచారాలు మారుతుంటాయి. జనాభాలో స్త్రీ, పురుష నిష్పత్తిలో తేడా ఎక్కువైనప్పుడు ఆప్రభావం వివాహాలపై పడుతుంది. క్రీ.శ. 18వ శ. ఉత్తర భాగం, క్రీ.శ.19వ శ.పూర్వభాగంలో పురుషజనాభా ఎక్కువై స్త్రీ జనాభా తగ్గిపోయింది. అప్పుడు ఆడపిల్లల్ని డబ్బులిచ్చి కొనుక్కొని పెళ్లి చేసుకోవాల్సివచ్చేది. దీనినే 'ఓలి' అని, కన్యాశుల్కమనీ వ్యవహరించేవారు. ఈ పరిస్థితి ఎంత తీవ్రస్థాయికి చేరిందంటే కాటికి కాళ్లు చాపుకున్న ముసలి వాళ్లుకూడా గర్భస్థ శిశువుకు ఓలి ఇచ్చి ఒప్పందం కుదుర్చుకునే వరకు. ఒక వేళ అమ్మాయి కాక అబ్బాయి పుడితే పుచ్చుకున్న డబ్బులు తిరిగి చెల్లించలేక తరువాత కాన్పులో పుట్టే అమ్మాయితో పెళ్లి చేస్తామని నచ్చచెప్పుకునేవారు పిల్ల తల్లిదండ్రులు. విజయనగర మహారాజు ఆదేశానుసారం అక్కడి సంస్కృత కళాశాలలో అధ్యాపకుడిగా పనిచేస్తున్న శ్రీ గురజాడ అప్పారావుగారు ఇటువంటి బాల్య వివాహాలకు సంబంధించిన వివరాలు సేకరించారు. ఆ గణాంకాలు చూచిన తర్వాత పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో గ్రహించి ఈ అనాచారాన్ని రూపుమాపటానికి 'కన్యాశుల్కం' అనే నాటకం రచించారు. చిన్న పిల్లలకు పెళ్లి చేసినా వారికి అభంశుభం తెలియక ముందే ఆ ముసలివరులు మరణించేవారు. తరువాత ఆ బాల వధువులు బాలవితంతువులుగా మిగిలిపోయేవారు. వితంతువుల జీవితం బహు దుర్భరంగా ఉండేది. రంగుల వస్త్రాలు ధరించకూడదు. తెల్లచీర మాత్రమే ధరించాలి. బొట్టు, గాజులు, పూలు, ధరించకూడదు. కేశాలు ఉండకూడదు. బోడిగుండుతో ఉండాలి. ఇంటి చాకిరీ అంతా చేయాలి. ఉదయాన్నే ఇంట్లో ఎవరికీ ఎదురుపడకూడదు. ఎటువంటి శుభకార్యాలకూ పోకూడదు. ఒక్కపూట మాత్రమే భోజనం చేయాలి. ఆంధ్రదేశంలో వితంతువులు గడుపుతున్న ఇటువంటి జీవితాన్ని చూసి చలించిపోయిన నవయుగ కవితావైతాళికుడు, సంఘుసంస్కర్త శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, విధవా పునర్వివాహాల కోసం తీవ్రంగా కృషిచేశారు.

జానపద సాహిత్యంలోనూ ఈ ఆచారం గూర్చిన ప్రస్తావన గోచరిస్తుంది. తన కొడుక్కి పిల్లనివ్వమని అడగటానికి వచ్చిన అన్నయ్యను,

"కూతూరు చిన్నాది కులము గొప్పాది
అల్లూడు పెద్దోడు సేనిగలోడూ
ఓలేమి యిత్తారు ఓ పెద్దలారా!"[803]

అనే ప్రశ్న ఓ దంపుడు పాటలో వినిపిస్తుంది.

"అత్త మంచీదైన అనుకూలమైన
మామ మంచి వాడైన మాటకారైన
కాముడూ లేత్తైన కన్యనిత్తాము
ఓలేమి తెచ్చారు ఓ పెద్దలార"[804]

అని వేరొక పాటలో వినిపిస్తుంది.

ఆ ఆచారం ఇప్పుడు లేకపోవటం వల్ల 'ఓలి' అనేది పాతబడ్డ పదం (obselate) అయింది. అయినా సామెతల్లో ఈపదాన్ని మనం వింటూనే ఉంటాం. 'ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్లాడినట్లు' అని తాత్కాలిక లాభాపేక్ష కోసం ప్రాకులాడే వారిపట్ల ప్రయోగితం.

తదనంతరకాలంలో ఓలి ఆచారం మారిపోయింది. జనాభాలో పురుషుల కంటే స్త్రీలే ఎక్కువ కావటం వల్లనో, ఉన్నత స్థాయిలో ఉన్న పురుషులే భర్తలు కావాలనే ఆకాంక్ష వల్లనో లేక సంఘ సంస్కర్తల కృషి వల్లనో కన్యాశుల్కమనే ఆచారం పోయి వరశుల్కమనే ఆచారం ప్రబలింది అయితే వరకట్నానికి సంబంధించిన గేయాలు ఇప్పుడున్న ముద్రిత జానపద వాఙ్మయ గ్రంథాలలో ఎక్కడా కనిపించటం లేదు.

ఆచారాలు కొన్ని అనుసరించేవి కొన్ని అనుసరించకూడనివి ఉంటాయి. ఇవే విధి నిషేధాలు. అమ్మ తమ్ముడిని అంటే మేనమామను వివాహమాడకూడదనే నిషేధాచారాన్ని తెలిపే పాట[805] ఒకటి కనిపిస్తున్నది.

---

803 సరాగాలు, పుట – 230.
804 త్రివేణి, పుట – 70.
805 మున్నీరు, పుట – 237.

ప్రాచీన కాలంలో రజస్వలానంతర వివాహాలే జరుగుతున్నట్లుగా వేదాలు, పురాణాల వల్ల తెలుస్తున్నది.[806] కానీ తరువాత బాల్య వివాహాల ఆచారం ప్రబలింది. క్రీ.శ. 13వ శ. చివరి నుండి 17వ శ. వరకు ఉత్తర భారతదేశం నుండి దక్షిణాదికి వ్యాపించిన మహమ్మదీయుల పాలనలో కొన్ని అరాచకాలు జరిగాయి. మహమ్మదీయ సైనికులు హిందూ కన్యలను ఎత్తుకుపోతుండేవారు. మెడలో నల్లపూసలు, కాలికి మట్టెలు కనిపిస్తే వదిలివేసే వారు. అందుకే తల్లిదండ్రులు తమ కూతుళ్లను వారి బారి నుండి కాపాడుకోవటం కోసం బాల్య వివాహాలు చేయటం ప్రారంభించారు. ఇదే విషయం ఒకానొక జానపద గేయంద్వారా నిరూపితమవు తున్నది.

"భాగ్యము కొందరిది బలము కొందరిది
బాలప్రాయము నాడు పెండ్లి కొందరిది."[807]
"అష్టావర్ణం పెంచీనేను
పిల్లానిస్తీనీ" [808]

అని వేరొక పాటలో కనిపిస్తుంది. నోములు, వ్రతాలు, పండుగలు, వేడుకలు, పెండ్లిండ్లు, పేరంటాలు మొదలైనవన్నీ ఆచార వ్యవహారాలే అయినా వాటిని ఆయా శీర్షికల క్రింద విమర్శించటం చేత ఇక్కడ పేర్కొనటం పునరుక్తమవుతుంది.

---

806 'స్త్రీ కెన్నవ సంవత్సరమున వివాహమగుచుండెనో మనము చెప్పలేము. కాని యౌవనము వచ్చిన పిమ్మట వివాహమగుట యానాటి యాచారమని మాత్రము స్పష్టముగ తెలియుచున్నది. ఏమన స్త్రీకి యువకుడగు భర్త కావలెనను కోరిక బయలు దేరిన పిమ్మటనే వివాహమగు చుండెనని కొన్ని మంత్రముల వలన తెలియుచున్నది.
"స్తోమం జుపేధాం యువశేన కన్యానాం" -ఋగ్వేద సంహిత, 8-355.
స్త్రీకి భర్త కావలెనను కోరిక పిన్న వయస్సుననే యుండవచ్చును గాని యువకుల నాహ్వానించుట మాత్రము యౌవనము వచ్చిన పిమ్మటగనే కాని జరుగదు. – వేద కాలపు స్త్రీలు, పుటలు -20, 21.

807 మిన్నేరు, పుట – 61.

808 జానపద గేయాలు, ద్వి.సం., పుట – 34.

## 6. మంత్రతంత్రోచ్చటనాలు

భారతీయులకు మంత్ర తంత్రోచ్చాటనాలపై అపారమైన విశ్వాసం. ఈ విశ్వాసం పురుషులలో కంటే స్త్రీలలో అధికంగా కన్పిస్తుంది. ఉన్నత వర్గాల వారు వేదమంత్రోచ్చాటనం కావిస్తే జానపదులు తాము మాట్లాడుకునే సామాన్య భాషలోనే మానసిక శక్తితో ఉచ్చాటనం కావిస్తారు. ఇది ఒక విధమైన చిత్త ప్రవృత్తి. ఈ జానపద చిత్తప్రవృత్తులు నాలుగు విధాలుగా ఉంటాయని జానపద విజ్ఞాన శాస్త్రంలో శ్రీమతి సోఫియా బర్న్ పేర్కొన్నట్లు డా. కర్ల రాజశేషగిరిరావుగారు నిరూపించారు.[809]
1. ప్రాక్ తార్కిక బుద్ధి 2. ఆత్మ వాదం 3. కర్మకాండ 4. మంత్రశక్తి.

1.ఈ ప్రాక్ తార్కిక బుద్ధి జానపద స్త్రీలలో ఎక్కువగా ఉన్నట్లు గోచరిస్తుంది. దీనినే మూఢ విశ్వాసమని కూడా అనవచ్చు. ఎవరో మేఘాల్ని తోలి వర్షాల్ని కురిపిస్తున్నారని నమ్మటం ఇటువంటిదే. ఇటువంటి మూఢ విశ్వాసాల్ని ప్రతిఫలింపచేసే గేయాలనేకం గోచరిస్తాయి.

2. ఆత్మవాదబలంతో చెట్టు చేమల్లో కూడా ప్రాణమున్నదని, ఈ ప్రాణమనేది ఇచ్చిపుచ్చుకొనే వస్తువని విశ్వసించటం అధికంగా కనిపిస్తుంది.

3. కర్మకాండలు కావించి ప్రకృతిదత్త వరప్రసాదాల్ని స్వీకరించటం జానపద మనస్తత్వంలో ఎక్కువేననిపిస్తుంది. నోము పట్టిన జానపద స్త్రీ ఇంత పిండిని నైవేద్యంగా సమర్పించి ధాన్య సమృద్ధి కలుగజేయమని, దారపు పోగు అర్పించి కట్టుబట్టలు కావాలని కోరుకొంటుంది.

4. మంత్రమంటే శాబ్దక శక్తి. దీనితో కొన్ని శక్తుల్ని వశం కావించుకోవచ్చని జానపదుల విశ్వాసం. జానపదుల మంత్రాలు లౌకిక మంత్రాలు. అంటే దైనందిన జీవితంలో వినియోగించుకొనేవి, ఇవి లౌకిక భాషలోనే ఉంటాయి. ఇవి దుష్టకార్యాలకు పనికి వచ్చేవి, అభీష్టకార్యాలకు పనికి వచ్చేవి అని రెండు విధాలుగా ఉన్నట్లు నిరూపితం. దుష్ట శక్తుల్ని ఆహ్వానించి చేతబడులు కావించటం మొదటిది.

[809] 'జానపద సాహిత్యంలో మంత్రశక్తి తత్త్వ నిరూపణం'. తెలుగు త్రైమాస పత్రిక, జనవరి – మార్చి, 1981.

వానలు కురవాలని వరుణదేవుడ్ని ప్రార్థించటం, నాగదేవతకు పిండి, నూలు సమర్పించి కోర్కెలు తీర్చమనటం రెండవది.

స్త్రీలు ఆచరించే నోములు కర్మకాండకి సంబంధించినవిగా ఇంతకు ముందే నిరూపితం. ప్రతి నోములో ఉద్యాపనమనేది అనివార్యం. నోము ఆచరించే సమయంలో విఘ్నాలు కలుగకుండా స్త్రీలు శక్తుల్ని బంధించుతారట. వీటినే వాయన బంధనాలంటారు. విఘ్నవ్యాధులు వాయురూపాన వ్యాపించి ఉంటాయని వ్రతాచరణ సమయంలో కొంత వీటిని అరికట్టవచ్చని డా. సత్యేంద్రగారి అభిప్రాయంగా ఆచార్య రాజశేషగిరిరావుగారు పేర్కొన్నారు.[810] ఈ పాటలే మంత్రాల్లా పనిచేస్తాయంటారు.

డా. నాయని కృష్ణకుమారిగారు వీటినే మంత్రాభాసాలన్నారని కూడా ఆచార్య రాజశేషగిరిరావుగారు పేర్కొన్నారు. వంట కోసం గింజల్ని ఎండబెడుతూ లచ్చమ్మ దేనిని కొలవటం, కోతలకు ముందు అన్నం వడ్డించి లచ్చమ్మ దేవత ముందు పెట్టటం, పెండ్లి సమయాలలో బోరమ్మ తల్లిని ప్రార్థించటం, ప్రసవ సమయాలలో గార్లమైసమ్మనుద్దేశించి బిడ్డ ఊడిపడితే శేరుజొన్నలర్పిస్తానని మొక్కటం[811] మొదలైనవి మంత్రాభాసాలని డా. కృష్ణకుమారిగారు భావించినట్లు వీరు పేర్కొన్నారు.[812]

జానపద గేయాలలో శాస్త్రాంశాలు అనే శీర్షిక క్రింద శ్రీనేదునూరి గంగాధరం గారు కూడా కొంతవరకు ఇటువంటి ఊహల్నే వెలిబుచ్చారు.

'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం' అంటూ బిడ్డకు ఉగ్గు పట్టిన తర్వాత తల్లులు పాడే గేయంలో జీర్ణశక్తికితోడ్పడే మంత్రముందంటారు వారు.[813]

810 తెలుగు, త్రైమాస పత్రిక, జనవరి – మార్చి, 1981.
811 జానపద గేయ గాథలు, పుటలు- 227, 228.
812 తెలుగు, జనవరి –మార్చి, 1981.
813 జానపద గేయ సాహిత్య వ్యాసావళి, పుట- 130.

'గుడుగుడు గుండం గుండారాగం
పాములపట్టం పడగారాగం'

అని తల్లులు పిల్లల్ని ఆడించేటప్పుడు పాడే గేయంలో పాముమంత్రాన్ని ఊహించారు నేదునూరి వారు.[814]

ఇక్కడ పాము మంత్రమంటే శ్రవణహితమైన శబ్దాలతో పామును ఆకట్టుకోవటమేమో! ఇదే విషయాన్ని ఆంధ్రమహాభారతం నిరూపిస్తున్నది.[815] ఆదిపర్వం ప్రథమాశ్వాసంలోని ఉదంకోపాఖ్యానంలో ఉదంకుడు ఆదిశేషుడ్ని, వాసుకిని, తక్షకుడ్ని, ఇతర నాగరాజుల్ని ప్రసన్నం చేసుకోవటానికి స్తుతిస్తాడు. ఈ స్తుతిని నన్నయగారు నాలుగు పద్యాలలో రచించారు. శ్రవణోపేయమైన శబ్దాలతో ఈ పద్యాలను కూర్చారు నన్నయగారు. ఈ నాలుగు పద్యాలలో తాంత్రిక రహస్యాలు దాగున్నాయని విమర్శకుల అభిప్రాయం.

గర్భిణీ స్త్రీలు సుఖంగా ప్రసవించటానికి మంత్రించిన విభూతి, తీర్థ ప్రసాదాలు ఇవ్వటం, ఆ తర్వాత కొన్నితంత్రాలు చేయటం అనగా గుళ్లో నందిని తిప్పటం, ఆ నందిపై పాలు కలిపిన జలాన్ని పొయ్యటం, ప్రసవ సమయంలో ఆ స్త్రీ తలకురుల్ని నోటి కందియ్యటం వంటివి తాంత్రిక చర్యలుగా నేదునూరి వారు ఊహించారు.[816]

సంక్రాంతికి బొమ్మలకొలువు పెట్టి స్త్రీలు చేసే ప్రార్థనలు లౌకిక మంత్రోచ్చాటనలే అని వారుభావిస్తున్నారు.

'తల్లి దండన తండ్రి దండన
అత్త మామల దండన
పురుష దండన పుత్ర దండన
రాచదండన యమ దండన'

---

814 పైదే. పుట -131.
815 ఆదిపర్వం, పథమాశ్వాసం, 105-108.
816 మిన్నేరు, పుటలు – 67,68.

తనకు వద్దంటుంది వనిత.[817] స్వర్గానికి వెళ్లినా సవతి పోరు వద్దట. మేడ మీదకు వెళ్లినా మారుతల్లి వద్దట. కానీ సావిత్రి గౌరిదేవమ్మ దండన మాత్రం ఎల్లకాలం కావాలట.[818]

మంత్రాలంటే ఏమిటోకాదు. సంకల్పబలంతో ఉచ్చరించే మాటలే. వైదిక సంస్కృతంలో ఉన్న మంత్రాన్ని అనువాదం చేస్తే అవి కూడా ఇలానే ఉంటాయి.

"పిలకతోనున్న కందదుంపకు పసుపు రాసి బొట్లుపెట్టి ప్రౌఢ స్త్రీలు కొలుతురు. తోరమునకు పసుపు కొమ్ములుకట్టి ముత్తయిదువులు మెడలో వేసి కొందురు. చివరి కిట్లు దీవన పల్కుదురు.

శక్తి తప్పినా భక్తి తప్పరాదు
వాక్కు తప్పినా వరము తప్పరాదు
అక్షతలు తప్పినా ఐదవతనము తప్పరాదు"[819]

ఈ విషయాన్నే శ్రీగంగాధరం గారు వివరించారు. "శ్రావణ బహుళ అమావాస్య నాడు ముత్తయిదువులు కందచెట్టును పూజిస్తారు. దానినే పోలేరమ్మ అమావాస్య, పోలాల అమావాస్య అని కూడా అంటారు. చెట్టు మొలిచిన కందదుంపకు పసుపు రాసి, బొట్టు పెట్టి పూజిస్తే తమ సంతానం కంద పిలకల్లాగ తామరతంపరగా వృద్ధి చెందుతుందని నమ్ముతారు. కొన్ని ప్రాంతములందు దీనిని పోలాలమ్మ అమావాస్య అని కూడా అంటారు.[820]

ఇటువంటి ఉద్ఘాటనలే చిట్టిబొట్టు నోములో అక్షతలు వేసుకొనేటప్పుడు వినిపిస్తాయి.[821]

నాగులచవితి సందర్భంగా నాగేంద్రుడ్ని కొలుస్తూ పలికే పలుకులు కూడా ఇటువంటి సంకల్పబలానికి సంబంధించినవే.[822]

---

[817] సరాగాలు, పుట -131.
[818] పైదే, పుట – 31.
[819] ఆంధ్రుల చరిత్ర –సంస్కృతి, పుట – 85.
[820] మిన్నేరు, పుట -214.
[821] సరాగాలు, పుట – 148.

# 7. వంటకాలు

**దైనందిన వంటకాలు** : జానపదులు శ్రమజీవులు. తెల్లవారి లేచింది మొదలు స్త్రీ పురుషులిరువురూ పనిలో నిమగ్నమవుతారు గనుక రకరకాల వంటలు చేసుకొనే సమయం వారికుండదు. వారి ప్రధాన ఆహారం అన్నం. జొన్నలు, సజ్జలు, కొర్రలు, రాగులు, బియ్యం మొదలైన వాటితో చేసిన అన్నాన్ని తింటారు. మాగాణి ప్రాంతం వాళ్లు వరి అన్నం తింటే మెట్ట ప్రాంతం వాళ్లు జొన్నన్నం, సజ్జన్నం, కొర్రన్నం తింటారు.[823] రాయల సీమ ప్రాంతంలో రాగి సంకటి ప్రధాన ఆహారం. పండుగ సమయాలలో మెట్టప్రాంతం వారు కూడా వరి అన్నాన్నే తింటారు. ఎప్పుడన్నా వచ్చే పండుగ సమయాల్లో తినేది కాబట్టి వరి అన్నాన్ని 'స్వామి బువ్వ' గా వ్యవహరిస్తారు.

అంతేకాదు మగడు అలిగినప్పుడు మగువ భర్త అలుక తీర్చటానికి వరి అన్నం వండిపెడుతుందని తెలుస్తున్నది. ఈ క్రింది గేయం అందుకు నిదర్శనం.

---

[822] మిన్నేరు, పుట – 208.

[823] శ్రీనాథుడు పలనాటి సీమలో ప్రజలందరూ జొన్నకూడే తింటున్నట్లు చూచి కుసుమాయుధుడొచ్చినా ఇక్కడ జొన్నకూడే తినక తప్పదని చమత్కరిస్తాడు.

"జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగ పల్నాటనున్న ప్రజలందరకున్"

"చిన్నచిన్న రాళ్లు చిల్లరదేవుళ్లు
నాగులేటి నీళ్లు నాపరాళ్లు
సజ్జ జొన్నకూళ్లు సర్పంబులును తేళ్లు
పల్లెనాటిసీమ పల్లెటూళ్లు"

"రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభమైన నేకులెవడకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడె కుడుచున్"

– శ్రీనాథుని చాటువులు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట – 97.

"వరి కూడు వార్చేను, వంకాయ వండేను
తినమని చెప్పవే తడికా! తడికా!"[824]

వంకాయ కూరే ఎందుకంటే వరి అన్నంతో తిన్నప్పుడే దాని రుచి మరింతగా తెలుస్తుంది. అప్పుడేగా భర్త అలక తీరేది!

ఈ విధంగానే కొర్రన్నంతో గోంగూర పులుసుకూర కలుపుకు తింటేనే రుచికరం. అందుకే భార్య అలిగినప్పుడు భర్త

"కొర్రబియ్యం తెచ్చాను
గోంగూర తెచ్చాను
వండమని చెప్పవే తడికమ్మా"[825] అంటాడు.

కనీసం వాటి మీద ప్రేమతోనైనా ఆమె అలుక తీరుతుందేమోనని అతని అభిలాష.

మగడ్ని మరిపించి పరాయి మగవాడిపై మర్లుగొన్న మగువకు భర్తంటే చులకన భావం ఏర్పడుతుంది. ఆచులకన భావాన్ని తాను పెట్టే తిండిలోనూ చూపిస్తుంది.

"ఇంటి మొగుడికి కొర్రాబువ్వా
పరాయి మొగుడికి వర్రీబువ్వా
నడుమన దిరిగే నోబాళమ్మకు
సద్దారొట్టీ ముద్దాపప్పా"[826]

భర్తకు కొర్ర బువ్వ. పరాయి మొగుడికి వరిబువ్వ. ఎంతటి పక్షపాత వైఖరి!

జోలపాట పాడుతూ తల్లి జోలలకు జొన్నబువ్వ అనీ తన బిడ్డకు వరిబువ్వ అనీ బిడ్డను సంతోషపెట్టటానికి ప్రయత్నిస్తుంది.[827] దీనినిబట్టి జానపదుల్లో వరిబువ్వకు ఎంతటి ప్రత్యేకత ఉందో తెలుస్తున్నది.

---

[824] మిన్నేరు, పుట – 485.
[825] మిన్నేరు, పుట – 485.
[826] త్రివేణి, పుట -221.
[827] సాంప్రదాయిక విజ్ఞానం, పుట – 9.

వరి బియ్యంలోనూ బాగా తెల్లగా దంచినవి తినటమే జానపదులక్కూడా ఇష్టమని తెలుస్తున్నది. పెళ్లిలో వియ్యాలవారు ముడి బియ్యపన్నం పెట్టారని, అందులోనూ మంచికూర లేకుండా ములక్కాయ ఇగురు వడ్డించారని ఆక్షేపిస్తారు మగ పెళ్లివారు ఆడపెళ్లివారిని.[828] ములక్కాయ కూర నలుగురిలో తినటానికి ఇబ్బందికరంగా ఉంటుంది. హాస్యానికి వియ్యాలవారికి ఇటువంటి కూర, అన్నం పెట్టటం పెళ్లిళ్లలో అలవాటు. ఒకవేళ పెట్టకపోయినా పెట్టినట్లు పాటలు పాడుకొని నవ్వుకోవటం సాధారణ విషయమే (ఈ విషయం హాస్యభావన అధ్యాయంలో వివరించటం జరిగింది).

ఇంటికి వచ్చిన అతిథులకు వడ్డించే కూరల్లో వారికిచ్చే ప్రాధాన్యం స్పష్టంగా తెలుస్తుంది. అన్నలు చూడటానికి వస్తే చెల్లెలు అలచందపప్పు, అడవికాకరకాయ వండి పెడుతుందట.[829] మరికొంతమంది చెల్లెళ్లు అడవికాకరకాయ బదులు అడవి చిక్కుడు కాయ వండిపెట్టవచ్చు.[830] ఇవి గ్రామీణుల దృష్టిలో ఖరీదైన వంటలు. దీనినిబట్టి సోదరులపై సోదరికి గల అభిమానం నిరూపితం. కానీ బావగారు వస్తే మాత్రం కుళ్లిపోయిన గుమ్మడి కాయ వండిపెడుతుందట.[831] అత్తింటి వారంటే ఎంతచులకన! ఈ విధంగా కూరల ద్వారా పుట్టింటి వారిపై మమకారాన్ని, అత్తింటి వారిపై నిరసననూ తెలియజేస్తారు అతివలు.

నెల్లికూర, బలుసుకూర, చింతచిగురు కలిపి భర్తకు వండి పెడతే 'మహాపసందు'గా ఉంటుందని, వలపు తీరుతుందని వెల్లడిస్తుందొక వనిత.[832] భర్త ప్రేమను పొందటానికి కూరను ఆయుధంగా ఉపయోగించుకొన్నట్లు తెలుస్తున్నది.

శాఖాహారంకన్నా మాంసాహారం విలువైనదని ఒకానొక గడుసరి స్త్రీ మాటల వల్ల స్పష్టమవుతుంది. కందిచేలో కలుపు తీయటానికి పోయిందొక భార్య. అక్కడ

---

[828] త్రివేణి, పుట – 32.
[829] జానపద గేయాలు, ప్ర,సం., పుట, -95.
[830] మధుర కవితలు, పుట – 348.
[831] సరాగాలు, పుట -227.
[832] జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పుట – 65.

'ఎండ్రగిత్తి' వ్రేలు కొరికిందట. తన వ్రేలు బాగా లేదు కనుక వంట చేయలేనని భర్తనే చేయమంటుంది. ఇదే అదనుగా భావించి ఆ ఆలు చూలాలికంటే ఎక్కువగా తన కోర్కెలను ప్రకటిస్తుంది. తాను ఏమేమి తినాలనుకుంటుందో అవన్నీ వరసపెట్టి చెప్తుంది. కానీ భర్త మాత్రం అవి తినకూడదట. వేరే వండుకోవాలట. తనకు గొడ్డుగొర్ని (గొట్టె) కోసి వండిపెట్టాలని, భర్త మాత్రం కందిపప్పు వండుకోవాలని ఆదేశించటంలో శాఖాహారం కన్నా మాంసాహారానికి ఎక్కువ ప్రాధాన్యమున్నట్లు తెలుస్తున్నది. అంతేకాదు తనకి గోధుమ రొట్టెలట, భర్తకు జొన్న రొట్టెలట; తనకు వరి బువ్వ భర్తకు కొర్రబువ్వట; తనకు పెరుగు, భర్తకు మజ్జిగట. ఈ విధంగా అవకాశాన్ని అందిపుచ్చుకొని స్త్రీ విజృంభించటం, వంటకాలపై వాంఛల్ని ప్రకటించటాన్ని బట్టి వానిలో ఉన్న న్యూనాధికతల్ని గుర్తించవచ్చు.[833]

అన్నంకంటే ఎనిమిది రెట్లు పిండి బలవర్ధకమని ఆర్యోక్తి (అన్నాదేష్ట గుణం పిష్టమ్) కష్టజీవులకు నిప్పులమీద కాల్చే ఈ రొట్టెలు బలవర్ధకమే. 'తెల్లజొన్న రొట్టె జేసి, మంచి వెన్న బూసి వెంట తేవె' అని 'లగ్గోపిల్ల'ను కోరతాడు 'చిన్నోడు'.[834]

పచ్చి చేపల పులుసు, తెల్లజొన్న రొట్టెలు, సట్టి చేపలకూర (మట్టి చట్టిలో చేసిన చేపల కూర) తన భర్తకు ఇష్టమని కష్టపడి వండి చేనికి తీసుకువెళుతోందొక భార్య.[835]

ఈ విధంగా వంటలు, వలపులు కలిసి జీవితాన్ని రసమయం చేస్తాయి.

రొట్టెలు వరి అన్నం కన్నా బలాన్నిచ్చేవి అయినా వాటిని జీర్ణించుకోవటం అందరివల్లా కాదు. శ్రమజీవులకే అది సాధ్యం. అంతేకాదు రొట్టెలు తినే వాళ్లు ఆర్థికంగా ఉన్నతులు కారనే అభిప్రాయం ప్రజలలో బలంగా నాటుకుపోయింది. అందుకే తైదరొట్టెలు తినేవాళ్లకు తననిచ్చి పెళ్లిచేయవద్దని ఒకానొక పల్లెటూరి పడతి తన పుట్టింటివార్ని హెచ్చరిస్తుంది.[836]

---

[833] త్రివేణి, పుట -220.
[834] పల్లెపదాలు, పుట, 169.
[835] జానపద కళాసంపద, పుట – 8.
[836] తెలంగాణ పల్లెపాటలు, పుట – 112.

కేవలం జొన్నన్నం, కొర్రన్నం, తైదన్నం కన్నా వాటిని విసిరి ఆ పిండితో సంకటి చేసుకొని తినటం మరింత బలవర్ధకం. తైద సంకటిని ఉలవచారుతో కలిపి తినటం జానపదుల కెంతో ఇష్టం.[837] ఈ సంకటికి, రొట్టెలకు అలవాటుపడినవారికి వరి అన్నం ఎంతతిన్నా తిన్నట్లుండదు.

స్త్రీ తనకున్న అందంతోనే గాక మగవాడికిష్టమైన వంటలు చేసి ఆకట్టుకోవాలని చూస్తుంది. బంగారు మామ వెంటకస్వామిని ఆకర్షించింది ఓ జానపద స్త్రీ ఇటువంటి గుణం చేతనే.

"ఎర్ర సెరువు వాలుగు ముక్కలు
గోలకొండ గుల్ల సింతపండు
ఆవాలు, ధనియాలు వేసి వండితే"[838]

ఆవాసనకు ఆకర్షితుడై తన ఇంటి చుట్టూ తిరిగే వెంకటస్వామిని మరువనంటుంది పల్లెటూరి పడతి.

దంపుడు పాటల్లోనూ ఈ వంటకాల ప్రసక్తి గోచరిస్తుంది.

'మెరుగు బియ్యం కూడు, మెత్తళ్ల[839] పులుసు' మెల్లగా పట్టించమని (తినమని) మేనత్త కొడుకును హెచ్చరిస్తుందొక మేనమామ కూతురు.[840]

**విశేష వంటకాలు-పిండి వంటలు** : జానపదులైనా, నాగరకులైనా విశేష సందర్భాలలో అనగా పండుగలు, పెళ్లిళ్లు, పేరంటాలు మొదలైన సందర్భాలలో ప్రత్యేకమైన వంటలు, పిండి వంటలు చేయటం అందరికీ తెలిసిన విషయమే.

స్త్రీ జీవిత పరిణామంలో విశేషమైన మలుపు సమర్తాడటం. ఆ తరువాత ఆ బాలిక శరీరంలో ఎన్నో మార్పులు చోటుచేసుకుంటాయి. ఆ మార్పులకనుగుణంగా అమ్మాయి శరీరం ఎదగాలంటే తగిన పోషకాహారం అవసరం. ఈ అవసరాన్ని

---

[837] త్రివేణి, పుట -229.
[838] పల్లెపదాలు, పుట -234.
[839] ఒక రకం చేపలు.
[840] సరాగాలు, పుట -232.

గుర్తించిన పెద్దలు సంప్రదాయం పేరుతో శరీర పోషణకవసరమైన వంటలు, పిండి వంటలు చేసి పెడతారు.[841] వాటిలో ఒకటి పొంగడాలు (వరి పిండిగాని, మైదా పిండిగాని, గోధుమపిండి గాని తీసుకొని పంచదార లేదా బెల్లంతో పాలతో గాని నీళ్లతోగాని గరిటజారుగా చేసి బాణలిలో కాగుతున్న నూనెలో వేయగా తయారయ్యే పదార్థం). అదే విధంగా పాయసాన్నం, పులిహోర, దోసెలు వంటివి కూడా అమ్మాయికి పెట్టాలని పాట ద్వారా హెచ్చరిస్తారు. అమ్మాయి ఒక్కతే వీటిని తినటానికి బద్ధకిస్తుందేమోనని ఆ వీధిలోని కన్యలందరినీ పిలిచి బంతి భోజనం ఏర్పాటు చేస్తారు.

ఇక పెళ్లి సమయంలో వియ్యాలవారికి ప్రత్యేక వంటలుచేసి వడ్డించాల్సిందే. భోజనంలో పంచదార మడిగలు (పంచదార పాకంలో వేసిన చక్కరాలు) లేకపోతే ఆక్షేపిస్తారు.[842] వాటితో పాటు లడ్డూ, జిలేబీల మాట చెప్పనే అక్కరలేదు.[843]

గ్రామ సీమల్లో సంక్రాంతి పండుగ సమయంలో ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా చేసుకొనే పిండివంట అరిశెలు. పండుగ వస్తుందనగానే కోడలు అత్తగార్ని ఎన్ని బియ్యం నానబొయ్యమంటారని అడుగుతుంది. అందుకు అత్తగారు తలగీచి తవ్వెడు బియ్యం పొయ్యమంటుంది. ఆ బియ్యంతో పిండి కొట్టి అరిశెలు చేసి కోడలు అందరికీ పెట్టాలట![844]

అట్ల తద్ది నోములో వాయనాలివ్వటానికి మాత్రమేగాక తరచుగా చేసుకొనే వంట అట్లు. ఈనాడు ప్రతి ఒక్కరి ఇంట్లో ఉదయపు అల్పాహారంగా కనీసం నెలకు ఇరవై రోజులు దోశెలు పేరుతో చేసుకుని తింటున్నారు. ఇవి బాగాపలచగా కరకరలాడుతుంటాయి. కాని పూర్వం ఈ అట్టుని విశేష వంటకంగా భావించి అప్పుడప్పుడూ తినేవారు. మందపాటి పెనంమీద వరిపిండి, మినప్పప్పు రుబ్బిన

841 మిన్నేరు, పుటలు – 95,96.
842 మిన్నేరు, పుట – 136.
843 సరాగాలు, పుట – 84.
844 పైదే, పుట – 168.

పిండిని కలిపి మందంగా వేసిన దాన్ని అట్టు అనే వారు. దోశె అనే పదం వారికి తెలియదు.

"అట్లు తిన్నా అన్నయ్య అలిగి పడుకొంటే
తిట్లు తినే వదినమ్మ తీపులందింది"

అని పాట పాడుతుంది ఆడబిడ్డ.[845]

లక్ష్మీదేవికి, గౌరీదేవికి నోములు, వ్రతాలప్పుడు చేసే వంటలు ప్రత్యేకమైనవి. పోళీలు (బొబ్బట్లు) (రాయలసీమలో బొబ్బట్లనే హోళిగలు అని అంటారు), మడుగు పువ్వులు (చక్కరాలు), సేమియాలు, శర్కర గింజలు (పంచదార గుళికలు) ముఖ్యమైనవి.[846]

"పెళ్లి భోజనాలలో అప్పడాలు, వడియాలు తప్పనిసరిగా ఉండే వంటలు".[847]

నోములు, వ్రతాలు, పండుగలు వంటి విశేష సందర్భాలలో నైవేద్యంగా సమర్పించే ప్రత్యేక వంటల గురించి ఆయా సందర్భాలలో వివరించటం జరిగింది.

* * *

---

[845] మిన్నేరు, పుట -162.
[846] మిన్నేరు, పుట – 233.
[847] పైదే, పుట -136.

## ఉత్తరభాగం

# V సామెతల్లో స్త్రీ సమాలోచనం

## 1. సామెతలు – స్త్రీ

జానపద విజ్ఞానంలో జానపద సాహిత్యం తరువాత ప్రముఖంగా పరిగణింపదగినవి సామెతలు. ఇవీ అజ్ఞాత వ్యక్తి కల్పనలే. అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని కల్పించే రచనా శిల్పం వీటిలో గోచరిస్తుంది. ఏదో ఒక సామ్యంతో సృష్టించబడటం చేత 'సామ్యత' అనే రూపం ఏర్పడిందని, అది ప్రజావ్యవహారంలో 'సామెత'గా మారిందని భావించవచ్చు. దీనికే సంస్కృతంలో 'లోకోక్తి' అని వ్యవహారం.

ఒక లీటరు పాల అవశేషమే (మరగబెట్టగా మిగిలిన) నిమ్మకాయంత కోవా అన్నట్లు తరతరాల ప్రజల అనుభవజ్ఞాన సారాంశమే సామెతలు. అనేక వ్యక్తుల అనుభవజ్ఞానం ఒక వ్యక్తి ముఖతః సూత్రప్రాయంగా వెలువడితే అది సామెత అవుతుందంటారు.[848]

నిరంతరం ప్రజానీకం వ్యవహరించుకొంటూ ప్రజలకు సముచిత సలహా సందపలను సమకూరుస్తూ, ప్రచ్ఛన్నమైన అలంకార పటుత్వం కలిగిన జాతీయ సూత్రరచననే 'సామెత' అనవచ్చునని డా. సెల్విన్ అభిప్రాయం.[849]

'సామెతలు నిత్యజీవితానుభవ దుహితలని'[850] 'అనుభవ ప్రతిధ్వనులని,[851] 'యుగయుగాల జీవితానుభవాలని,[852] పాశ్చాత్యవేత్తలు పలువిధాల ప్రశంసించారు.

---

[848] "A proverb is the wit of one and the wisdom of many' – లోకోక్తి ముక్తావళి అను తెలుగు సామెతలు, విన్నపము, పుట – 1.

[849] "A proverb is a racial aphorism, which has been or still is in common use conveying advice or counsel invariably camonflaged figuratively disginsed in metaphor or allegory". – పైదే, పుట – 2.

[850] "Proverbs are the daughters of daily experience".

[851] "Proverbs are the echoes of experience".

[852] "Proverbs are the wisdowm of ages".

'సుప్రసిద్ధ జీవితానుభవజనిత సంక్షిప్త భావప్రకటనమే సామెత,[853] నీ ఇంకో నిర్వచనం.

'ఉచిత ప్రపంచజ్ఞాన స్రవంతే సామెత[854] నీ', 'ప్రజాసముదాయ కంఠధ్వనే సామెత,[855] నీ మరికొందరు పేర్కొన్నారు.

'సంక్షిప్తంగా, శక్తిమంతంగా, సామాన్య ప్రజానీకం ఉద్ఘాటించిన అనుభవగత సత్యంగానీ లేక పరిశీలనానుభవ జనిత ఫలితంగానీ సామెత అవుతుందని[856] నీ' ఒకానొక నిర్వచనం.

వీటిలో హాస్యం, ఛలోక్తి, వ్యంగ్యోక్తి, ధ్వని మొదలైనన్నో నిండి నిబిడీకృతమై ఉంటాయి. ఇవి ప్రసంగానికి దీపాలు.

ఈ సామెతలు ఆడవారి సొత్తనీ, చాలా సామెతలు స్త్రీలే కల్పించి ఉంటారని నమ్మేవాళ్లు చాలా మంది ఉన్నారు. లోకంలో సాధారణంగా సామెతలు ఆడవారి నోటి నుండే ఎక్కువగా వస్తుంటాయి. అందులోనూ చదువురాని ముసలమ్మలు ఎక్కువగా వీటిని వాడి అనుభవంలోని తమ జాణతనాన్ని నిరూపిస్తారు.[857] "స్త్రీణాం అశిక్షిత పటుః" అని శకుంతలనుద్దేశించి దుష్యంతుని చేత కాళిదాసు పలికించిన మాటలు ఈసందర్భంలో గుర్తుచేసుకోవాలి.

బహుముఖీనమైన స్త్రీ జీవితాన్ని చిత్రించిచూపే సామెతలెన్నో గోచరిస్తాయి. వాటినన్నిటినీ వివిధ శీర్షికల క్రింద వింగడించి పరిశీలిస్తే స్త్రీ స్వభావ చిత్రణానికవి అపర దర్పణాలని గ్రహించగలుగుతాం. అంతేగాక సాంఘికంగా స్త్రీకి గల ప్రతిపత్తి

---

853 "A proverb is condensed popular wisdom". –పైదే.

854 "All good sense of the world runs into proverbs".

855 "What are proverbs but the people's voice".

856 "Proverbs are old and common sayings, which briefly and forcibly express some practical truth or the result of observation and experience". – లోకోక్తి ముక్తావళి అను తెలుగు సామెతలు, పుటలు -2, 3.

857 పైదే, విన్నపము, పుట – 1.

ఏమిటోకూడ నిర్ణయించవచ్చు. పురుష ప్రవృత్తి స్త్రీ పట్ల ఎంత పరుషంగా ప్రవర్తిల్లుతుందోకూడా తెలుసుకోవచ్చు.

## 2. ఆడ పుట్టుక

సృష్టిని ప్రవర్ధమానం చేసేది స్త్రీ అయినా ఆడపిల్ల పుట్టిందంటే భారంగా భావిస్తుంటారు. ఇందుకు కారణాలనేకం. అందువల్లనే 'అమ్మాయి పుట్టిందంటే ఆయువు సగం కుంగిందన్నమాటే' అనే సామెత ఏర్పడింది. సగం ఆయుర్ధాయాన్ని అపహరించేంత దుఃఖాన్ని చేకూర్చేది ఆడపుట్టుక అని నమ్ముతారు. అందుకే 'నెలతక్కువైనా మగపిల్లవాడే మేలం'టారు. 'ఇంటికి ఆడపిల్ల ముప్పు, దొడ్డికి వారసప్రం ముప్పు' అనే సామెత పోలికతో నిరూపితం. దొడ్డివైపు ఖాళీస్థలం ఎక్కువగా ఉంటుంది. కాబట్టి గాలికి వసారాలు కూలి పడతాయి. ఆడపిల్ల పుట్టినప్పటినుండి ఖర్చులెక్కువ. అలంకరించగలిగితేనే ఆడపిల్ల అందం. అందుకు డబ్బులు కావాలి. ఆడపిల్ల ఎదిగేకొద్దీ అన్నీ ఖర్చులే. ఓణీల పండుగ అయినా, సమర్త అయినా, పెళ్లి అయినా అన్నీ ఖర్చులే. మగపిల్లవాడితో ఈ బాధలుండవు గనుక ఆడపుట్టుకను కోరుకోరేమో!

మొదటి కాన్పులో ఆడపిల్ల పుడితే మంచిదా? మగపిల్లవాడు పుడితే మంచిదా? అనే చర్చ ప్రజల్లో జరుగుతూనే ఉంటుంది. చివరకు కొడుకు కావాలనే తీర్మానిస్తారు. 'తొలకరిలో చెరువు నిండినా తొలిచూలు కొడుకు పుట్టినా మేల'నే సామెత ఆకారణంగానే ఏర్పడి ఉంటుంది. తొలకరి వర్షానికి చెరువునిండితే చెరువు క్రింద చేను ఏపుగా ఎదుగుతుంది. పంట సమృద్ధిగా పండుతుంది. తొలిసారి కొడుకు పుడితే త్వరగా ఎదిగి తండ్రికి ఆర్థికంగా చేదోడువాదోడు అవుతాడు. కుటుంబాభివృద్ధికి సహాయపడినట్లవుతుంది. అయితే దీనికి భిన్నంగా ఆలోచించే వాళ్లూ లేకపోలేదు. మొదట ఆడపిల్ల పుడితే త్వరగా ఎదుగుతుంది. తండ్రి బాగా సంపాదిస్తున్నప్పుడే పెళ్లి చేసి అత్తవారింటికి పంపి బాధ్యతలు తీర్చుకోవచ్చు. వయసు పైబడినతర్వాత అమ్మాయి పెళ్లి చేయాలంటే సంబంధాలు చూడటానికి

కూడా జవసత్వాలుండవు. ఏది ఏమైనా 'ఆడపిల్లను కన్నవారు ఐదు బిరుదులు తెగకోసుకోక' తప్పదట. ఆ అయిదు బిరుదులు ఏమిటో![858]

ఆడపిల్లకోసం ఖర్చు పెట్టిందంతా వ్యర్థమని కొందరు భావిస్తారు. కానీ కొంతమందిమాత్రం ఆడపిల్లకు పెడుతుంటేనే కలిసొస్తుందని భావిస్తారు. అయినా లోకంలో 'ఆడచెత్త, మగబంగారం' అనే మాటమాత్రం వినిపిస్తుంది.

ఏమైనా ఎవరు పుట్టేది ఎవరికి తెలుసు? అది విధినిర్ణయం. బిడ్డలు లేక గొడ్రాలు అనిపించుకోవటంకన్నా ఆడో, మగో బిడ్డల్ని కని మాతృమూర్తిగా గౌరవం పొందటమే స్త్రీకి అభిలషణీయం. 'దశకొద్దీ పురుషుడు, దానం కొద్దీ బిడ్డలు' అని హిందువుల నమ్మకం. పూర్వ జన్మలో మంచి దానధర్మాలు చేస్తే దానికి తగినట్లు మగపిల్లలుకాని, ఆడపిల్లలుకాని మంచివాళ్లు పుట్టి కుటుంబ గౌరవాన్ని ఇనుమడింప చేస్తారని భావిస్తారు.

ప్రకృతిగతంగా ఆడిపిల్ల పుట్టుక సుకుమారమైంది. అందుకే 'అయిదేళ్ల ఆడపిల్ల అయినా, మూడేళ్ల మగపిల్లవాడికి లోకువే' ననే లోకోక్తి. మగపిల్లవాడిపట్ల చూపించే గారాబం, ప్రత్యేకతకూడా దీనికి కొంత కారణం కావచ్చు. అబ్బాయి పుట్టాడంటేనే చాలా అపురూపంగా చూస్తారు. వంశోద్ధారకుడని సంభావిస్తారు. పిల్లవాడిని పెంచటంలోనూ ప్రత్యేకత కనబరుస్తారు. ఆ ప్రత్యేకతను భంగ్యంతరంగా ఇలా అనిపిస్తుందొక సామెత. 'అబ్బరాన అబ్బాయి పుడితే ఆముదంతో ముడ్డి కడిగిందట.'

ఆడపిల్ల పుట్టినప్పటినుండీ ఖర్చు ఎక్కువవుతుందనీ ఆమె వంశానికి భారమనీ భావించనక్కరలేదు. 'ఆడపిల్ల పుట్టినప్పుడే ఆదరవు పుడుతుంద'ని నమ్మేవాళ్లూ లేకపోలేదు. భగవంతుడే ఖర్చుకి తగ్గ రాబడినిస్తాడనే తృప్తితో జీవిస్తారు.

---

[858] ఈ అయింటికి ఆధారాలు మృగ్యం, బహుశః కులగౌరవం, వంశగౌరవం, ఆత్మగౌరవం, విద్యాగౌరవం, సంఘగౌరవం వంటివేమో!

ఆడపిల్ల చిన్నప్పటి నుండే పనిపాటల్లో తల్లికి చేదోడువాదోడుగా సహాయపడుతుంది. జ్వరమొచ్చినా, మరోకాన్పు వచ్చినా 'కుంచమంత కూతురుంటే, మంచంమీదే కూడు' లభిస్తుంది తల్లికి.

మరణించినప్పుడు తలకొరివి పెట్టటానికి కొడుకు ఉపయోగపడతాడు. కాని నిత్యజీవితంలో తల్లి ఏ పనిలో ఉన్నా కూతురు శ్రమించి ఆకలితో వచ్చిన తండ్రికి, అన్నదమ్ములకు కూడు పెడుతుంది. అందుకే 'కొరివిపెట్టేవాడు కొడుకు, కూడు పెట్టేది కూతురు' అనే సామెత. ఇది ఎంతో అర్థవంతమైన సామెత. ఎప్పుడో చనిపోయినప్పుడు కొరివి పెట్టే కొడుకుకంటే నిత్యం ఆప్యాయతను పంచే కూతురు మేలేకదా!

## 3. పెండ్లి

ఆడపిల్ల ఎంత వేగంగా ఎదుగురుతుందో తెలుపుతుందీ సామెత – 'కాడు కాలుతూ ఉంటే కన్నె ఎదుగుతూ ఉంటుంది'. ఎదిగిన ఆడపిల్లకు పెళ్లి చేయటం పెద్దభారం.

'అశ్వమేధయాగం చేయవచ్చుగాని ఆడపిల్ల పెళ్లి చేయలేము' అనే సామెత ఏశ్రీమంతుడి ఊహాపోహల నుండి జనించిందో! సామాన్య ప్రజలు అశ్వమేధయాగం చేయలేరుగదా! 'ఆడపిల్ల పెళ్లి, అడుగు దొరకని బావి అంతం చూసేవే' అనే సామెత సామాన్యుడి అనుభవంనుండి వచ్చిందే. మొత్తంమీద ఈ రెండూ వైవాహిక నిర్వహణ భారాన్ని నిరూపించేవే.

ఇప్పటి లాగా పూర్వం వరాన్వేషణ లేదు. కన్యాన్వేషణమే. మగవాడికి పెండ్లి కావటమే కష్టం. సిరిసంపదలతో తులతూగేవారికి ఇబ్బంది లేదు. సామాన్యులకు అన్నీ ఇబ్బందులే. ఓలినిచ్చి ఆడపిల్లల్ని కొనుక్కోవటం తప్ప మార్గాంతరం లేదు. అందుకైనా కన్యాన్వేషణ సాగాల్సిందే. అది అంత సులభం కాదు. తల్లి పెంపకం మీదనే పిల్ల ప్రవర్తన ఆధారపడి ఉంటుందని నమ్ముతారు. అందుచే 'తల్లిని చూచి పిల్ల'ను ఎంచుకోవాలి. ఏవిధంగానంటే 'పల్లును చూచి పశువు' నెంచుకొన్నట్లు. పండ్ల సంఖ్యను బట్టి పశువు ఈడు పసికట్టవచ్చు. పంటి సంఖ్యను బట్టి కాకుండా

పాడిసమృద్ధిని బట్టి కూడా బఱ్ఱెను కొనుగోలు చేయాలి. ఈ సందర్భంలో ఏర్పడిందే 'తల్లిని చూచి పిల్లను, తరిని చూచి బఱ్ఱెను' అనే సామెత.

దేనికైనా వంశమనేది చాలా ప్రధానం. ఇదే సంప్రదాయం (tradition)[859] కూడా. అంటే తరతరాలుగా అనుస్యూతంగా మనవెంట వచ్చే ఆచారవ్యవహారాలు. పురుషుడు స్వేచ్ఛగా ఈ సంప్రదాయాన్ని ఉల్లంఘిస్తాడు. కాని స్త్రీ ఎక్కువగా గృహసీమకే పరిమితం కావటం వల్ల దీనిని పరిరక్షిస్తుంటుంది. తల్లి గుణగణాలు చాలా వరకు ఆడపిల్లలు పుణికిపుచ్చుకోవటమే అందుకు కారణం. అనుక్షణం ఆమె చేసే పనుల్ని గమనిస్తుంటారు, అనుకరిస్తుంటారు. అందుచేత తల్లిని చూచి పిల్లనెంచుకోవటం సులభం.

'వంశమెరిగి వనితను, వన్నెనెరిగి పశువును కొనవలె' ననే సామెత మనల్ని హెచ్చరిస్తుంది. మొత్తంమీద పశువుకు పడతికి దగ్గరి పోలికలు నిరూపిస్తున్నాయి సామెతలు. అందుకే 'గొడ్డు వచ్చినవేళ, బిడ్డ (కోడలు) వచ్చిన వేళ' అంటారు. 'కులమెరిగి కోడలిని, అణిమెరిగి ఆవును తీసుకోవాలి' అనే సామెత కూడా ఈ సందర్భంలోనిదే. అణిమంటే దేశం లేక ప్రదేశం. కొన్ని కొన్ని ప్రాంతాల్లోని ఆవులు శ్రేష్టంగా ఉంటాయి. ఎక్కువ పాలివ్వటం, ఎక్కువ కోడెదూడల్ని పెట్టటం వంటి లక్షణాలు వాటి శ్రేష్ఠత్వ నిర్ణయానికి కారణాలవుతాయి (ఉదా: ఒంగోలు గిత్తలు, పుంగనూరు ఆవులు).

ఆడపిల్లల్ని ఎంచుకోవటంలో వాళ్ల పుట్టుక సంఖ్యనుకూడా పరిగణించే ఆచారం గోచరిస్తుంది. 'ఆరవకాన్పు ఆడపిల్ల అత్తవారింటికి లక్ష్మి' అనే సామెత ఈ ఆచారానికి అద్దం పడుతుంది. ఆరువిధాలుగా లక్ష్మీదేవి పరిగణనీయం.[860] 1. శుద్ధలక్ష్మి 2. మోక్షలక్ష్మి 3.జయలక్ష్మి 4. సరస్వతి 5. శ్రీలక్ష్మి 6. వరలక్ష్మి. ఈ అన్నింటిలో

[859] Tradition = body of law, custom, story and myth, transmitted or handed down orally from one generation to another – A dictionary of psychology.

[860] "శుద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీస్సరస్వతీ
శ్రీలక్ష్మీర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా" – శ్రీ సూక్తము.

వరాలను ప్రసాదించే ఆరవ లక్ష్మి అధికురాలు. ఆరవ కాన్పుకు, ఆరవ లక్ష్మికి సంబంధం ఈ సామెతలో ఊహింపబడ్డట్లుగా భావించవచ్చు.

క్షీరసాగరమథనంవల్ల ప్రభవించిన కామధేనువు, ఉచ్చైశ్రవం, ఐరావతం, కల్పవృక్షం, చంద్రుడు, లక్ష్మి అనే క్రమంలో ఆరవది లక్ష్మి కాబట్టి ఆరవ ఆడజన్మను లక్ష్మీ సదృశంగా భావించటం వల్లకూడా ఈ సామెత ఏర్పడినట్లు ఊహించవచ్చు.

పెళ్లికి ఈడూ జోడూ ప్రధానం. ముసలి వాడికి పడుచు పిల్లనిచ్చి పెళ్లి చేయటం ఆమె గొంతు కొయ్యటమే. పిడికి కొడవలి అతికినట్లుగా పెళ్లి కుదరాలి. 'ఈడు చూచి పిల్లనియ్యి, పిడి చూచి కొడవలియ్యి' అనే సామెత ఈ సందర్భంలో పేర్కొనదగింది.

పెళ్లి తర్వాత అత్తవారింట్లో ఏశుభాశుభాలు జరిగినా వాటిని క్రొత్త కోడలికే ముడిపెడతారు. జాతకంలో అయిదవతనం బలంగా లేని ఆడదాన్ని పెళ్లాడితే అయ్య అచిరకాలంలోనే యాత్ర సాగిస్తాడంటారు. 'అమ్మ గృహప్రవేశం, అయ్య అగ్నిప్రవేశం' అనీ 'సూర్యోదయానికి మాంగల్యధారణ, శుక్రోదయానికి మాంగల్యవిసర్జన' అనీ స్త్రీనే ఆక్షేపిస్తుంది సంఘం. పురుషుని భోగభాగ్యాలు, ఆయుర్దాయం స్త్రీ మీదనే ఆధారపడినట్లు హైందవ సంఘం భావిస్తుంది. 'పుణ్యం కొద్దీ పురుషుడు, విత్తంకొద్దీ వైభవం' అనటంలో స్త్రీ సుకృతాసుకృతాలు తొంగిచూస్తాయి. ఈ సామెతలను బట్టి భూమికి ఇరుసువలె పురుషుని జీవితానికి స్త్రీ కేంద్ర బిందువు అని గ్రహించవచ్చు. ఇంతటి ప్రాధాన్యమున్న పడతిని పుట్టుక విషయంలో కాదనుకోవటం ఏమిటోమరి?

దారిద్ర్యం భయంకరమైంది. దానిని కావాలని ఎవరూ కోరుకోరు. దరిద్రుడ్ని పెళ్లాడిన ఏ ఆడదీ సుఖపడలేదు. 'అడుక్కొని తినే వాడి ఆలు అయ్యేకంటే, భాగ్యవంతుడి బానిస అయ్యేది మేలు' అనే సామెత ఈ సత్యాన్నే హెచ్చరిస్తున్నది.

ఈడూజోడూ, ఆర్థికంగా ఉన్నతస్థితి అన్నీ చూచి పిల్లనివ్వటం అందరికీ సాధ్యం కాకపోవచ్చు. పరిస్థితులు అనుకూలించనప్పుడు ఏ ముసలివాడికో ఇచ్చి ముడిపెడతారు. ముసలిమొగుడు వయసు భార్యకు బానిస అవుతాడు. ఇక ఆమె వగలకు, అంతూపొంతూ ఉండదు. అటువంటి స్త్రీని చూచి 'వగలాడికి ముసలాతడు

మగడైతే దాని వగలు యింతింతా?' అనే ప్రశ్నాత్మకమైన సామెత ఏర్పడి ఉంటుంది. ఈడూజోడూ లేని దంపతుల్ని చూచి లోకం వెక్కిరిస్తుంది. 'అయ్యకు వణుకుప్రాయం, అమ్మకు కులుకు ప్రాయం' అంటుంది.

ఎంత ఈడు వచ్చినా కొంతమంది అమ్మాయిలకు అంతతంతమాత్రంగా పెళ్ళిళ్లు కావు. సంబంధాలు దొరకవు. ఎన్ని ప్రయత్నాలు చేసినా కలిసిరావు. అటువంటి ఆడపిల్లను చూచి 'ఎక్కడా దొరక్కపోతే అక్క మొగుడే గతి' అని లోకం ఆక్షేపిస్తుంది. 'అక్కా! మొగతే గతి' అనే సామెత తెలంగాణలో ప్రాచుర్యంలో ఉంది. ఏ మొగుడూ లేనప్పుడు (మొగత= యజమాని) మొగతే దిక్కు అని. 'మొగుడు లేకపోతే అప్పమొగుడు, కూరలేకపోతే పప్పుకూర' అనే సామెత కూడా ఇటువంటి సందర్భాన్ని పురస్కరించుకొన్నదే.

సంబంధాలు రావాలన్నా, పెళ్లిళ్లు కుదరాలన్నా ఆధునిక కాలంలో పెళ్లిళ్లు చేసే సంస్థలున్నట్లుగానే పూర్వం పెళ్లిపెద్దలుండేవారు. వీరు అమ్మాయి గురించి అబ్బాయివారికి, అబ్బాయి గురించి అమ్మాయివారికి తెలియజేసి ఇరుపక్షాలవారికి నచ్చినట్లయితే సంబంధం కుదురుస్తారు. ఇటువంటి పెళ్లిపెద్దలు మగవారుంటారు, ఆడవాళ్లుంటారు. ఒక్కొక్కప్పుడు పెళ్లి విషయాలలో ఏమైనా తేడాలు వస్తే ఈ పెళ్లిపెద్దలు ఇరుపక్షాలవారిచేతా చీవాట్లు తినవలసి వస్తుంది. 'అచ్చి పెళ్లి బుచ్చి చావుకు వచ్చింది' అనేది ఇటువంటి సామెతే, కొన్ని ప్రాంతాలలో దీన్నే 'సుబ్బిపెళ్లి వెంకి చావుకొచ్చింది' అంటారు. 'లింగిపెళ్లి మంగి చావుకు వచ్చినట్లు' అని మరికొన్ని ప్రాంతాలలో వ్యవహారం.

ఈ పెళ్లి అనే మహా కార్యక్రమంలో కొంతమంది స్వార్థపరులు ఖర్చు లేకుండా కొన్ని ఉపకార్యక్రమాలు నిర్వహించుకోవటానికి ప్రయత్నిస్తుంటారు. అటువంటి వార్ని ఎత్తిపొడుస్తున్నట్లుగా కొన్ని సామెతలు కనిపిస్తున్నాయి. 'ఎల్లమ్మ పెళ్లిలో పుల్లమ్మ శోభనం'. 'ఈ రక్క పెళ్లిలో పేరక్క గర్భాదానం' 'అచ్చమ్మ పెళ్లిలో బుచ్చెమ్మ శోభనం' ' సుబ్బి పెళ్లిలో సూరి సమర్త'.

ఎన్నో ప్రయాసలకోర్చి తల్లిదండ్రులు అమ్మాయి వివాహం జరిపిస్తే పెళ్లికూతురు సరిగ్గా కాపురం చేస్తుందా? లేదా? అని సందేహం వ్యక్తం చేస్తారు పెళ్లికొచ్చిన జనం. ఆ సందేహాన్ని నివృత్తి చేసుకోవటం కోసం పెళ్లిక్రతువులో వధువు ప్రవర్తనను పరిశీలిస్తారట. అమ్మాయి సౌమ్యురాలా? లేక గడుసరా? ఆమె వాలకం ఎటువంటిది అని గమనిస్తారట. హిందూ వివాహ సంప్రదాయం ప్రకారం పెళ్లిలో వధూవరులు ఒకరి కాలు మరొకరు త్రొక్కుతారు. ఆ త్రొక్కేరీతిని బట్టి అమ్మాయి స్వభావాన్ని కనిపెట్టవచ్చునని తెలియజేసే సామెత 'కాపురం చేసే కళ కాలు త్రొక్కేటప్పుడే కనబడుతుంది.'

## 4. దాంపత్యం

స్త్రీకి ఐశ్వర్యం ఉన్నా లేకున్నా అనుకూల దాంపత్యం ఉంటే జీవితం హాయిగా సాగిపోతుంది. అది లేనప్పుడు ఎన్నున్నా ఏమీ లేనట్లే. మగడు ఆదరించకపోతే, ఆమెను చులకన చేస్తే సమాజం కూడా అలాగే చూస్తుందని నిరూపిస్తున్నాయి ఈ సామెతలు. 'ఇంట్లో మొగుడు కొడితే, వీధిలో మాదాకవళం వాడు కొడతాడు' 'మొగుడు ముండా అంటే ముష్టివాడు (గూడా) ముండా అంటాడు'. ముద్దుముచ్చటలన్నీ మగడే తీర్చాలి. అందుకే అంటారు 'మొగుడు కొద్దీ వన్నెలు, సిరికొద్దీ చిన్నెలు' అని.

మగవాడికి బట్టతల అదృష్ట చిహ్నంగా భావిస్తారు. కానీ అది సహజంగా ఏర్పడాలి. 'అంబడిపూడి అప్పయ్యదీ బట్టతలే, నా మొగుడిదీ బట్టతలే! కానీ అప్పయ్యది ఐశ్వర్యపు బట్టతల' 'నా మొగుడిది పేను కొరికిన బట్టతల' అని విలపిస్తుందొక భార్య. అసమర్థుడు, అదృష్టహీనుడూ అయిన భర్తను పొందిన పడతికి అన్నీ సమస్యలే. 'అదృష్టానికి ఏడ్వనా? అదవ మొగుడికి ఏడ్వనా?' అని తనను తానే ప్రశ్నించుకొంటుంది. 'కూడు లేనమ్మకు గుడ్డలేని వాడు జతపడితే' ఇక ఆ దాంపత్యం గురించి వర్ణించాలా! 'గుడ్డి మొగుడికి రేజీకటి పెళ్ళాం' సమకూరితే చెప్పాలా ఇంటి భద్రత సంగతి! అనుకూలదాంపత్యమంటే పడుగు పేక కలిసి నట్లుండాలి. 'పడుగు పేక కలిస్తే గుడ్డ, ఆలుమగలు కలిస్తే ఇల్లు' అనే సామెత ఎంతో

అర్థవంతమయింది. ఆలుమగలు కలిసి ఎక్కడ సుఖంగా జీవిస్తుంటే అదే ఇల్లవుతుంది. ఎడముఖం పెడముఖంగా పెద్ద భవంతిలో ఉన్నా అది నరకమే. అందుకే 'న గృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే' అని ఆర్యోక్తి. అనుకూలవతి అయిన గృహిణే గృహం. అట్టి గృహిణి లేని గృహం పెద్ద గుహ.[861] ఆలుంటే ఇల్లు లేకపోయినా పరవాలేదని ఎంత సరిపెట్టుకున్నా 'ఇల్లు లేనమ్మ హీనము చూడు, మగడు లేనమ్మ మానము చూడు' అని లోకం ఎత్తిపొడుస్తుంది. ఇల్లులేని వాళ్లు ఆ ఇల్లు ఈ ఇల్లు తిరగక తప్పదు. తిప్పలూ తప్పవు. భర్తృవిహీన అయిన స్త్రీ అంటే అందరికీ లోకువే. 'పడిన ఆమిషమ్ము పక్షులపేక్షించు పగిది' గా విధవ అయిన స్త్రీని పరపురుషులు అపేక్షిస్తారని అంటాడు నన్నయ.[862]

ఆలుమగలుగా ఉన్నవారంతా అనుకూల దాపంత్యానుభవం కలవారని చెప్పలేం. అరమరికలు లేని ప్రేమ దంపతులందరిలో ఆశించలేం. భర్తలందరూ నిత్యజీవితంలో భార్యల్ని సుఖపెడుతున్నారనలేం. అయినా పెళ్లి అనేది స్త్రీ పురుషులిద్దరికీ సాంఘిక భద్రత అని చెప్పాలి. సంతానం పొందటానికి చట్టబద్ధమయిన అనుమతి (license) అనుకోవాలి.

స్త్రీలు వివాహం చేసుకోకుండా ఆజన్మబ్రహ్మచారిణులుగా ఉన్నట్లు వేదకాలంలో నిదర్శనాలు కనిపించినా[863] అనంతరకాలంలో కనిపించవు. మరీ

---

861 "పొగడొందు జనని గానీ
తగవున వర్తించు నట్టి దయితయకానీ
తగనుండని గృహమున నుం
టగు జక్రనిపాన రథము నందుంటరయన్". – భాగవతము, 4-681. – సూక్తిసుధాకరము, పుట – 941.

862 "పడిన యామిషంబు పక్షులపేక్షించు, నట్లు పురుషహీనయయిన యువతి, జూచి యెల్లవారు జులుక నపేక్షింతు, రిదియు బాపమనక హీనమతులు". – శ్రీమదాంధ్ర మహాభారతం, ఆదిపర్వం, 6-257.

863 "అనూజూరివ పిత్రోస్సచ
సతీ సమానాదాసద సస్త్వామియేభగం" - ఋగ్వేదసంహిత, 2-17-7.
ఓ యింద్రుడా! యావజ్జీవము పితృగృహమందే జీవించుచు తల్లిదండ్రులతో నుండి, భర్తను పొందలేని కుమారితె తనకును తండ్రికిని సాధారణమైన గృహము నందుండి యాతని ధనములో భాగము నెట్లు యాచించుచున్నదో యట్లే పొందదగిన ధనము కొరకు నిన్ను నేను యాచించుచున్నాను.
-వేదకాలపు స్త్రీలు, పుట -28.

మహమ్మదీయుల పాలనలో పుస్తెలు, నల్లపూసలు, మట్టెలు వంటి వివాహ చిహ్నాలు కనిపించకపోతే హిందూ కన్యల్ని ఎత్తుకుపోయే వారు. వివాహం అయిన స్త్రీని కన్నతల్లిగా భావించాలని ఆర్ష ధర్మం హెచ్చరిస్తుంది. తదనుకూలంగా ఏర్పడ్డ సామెత 'ఒకని ఆలి ఒకని కన్నతల్లి' అనేది. అందరూ దీనిని పాటించినా పాటించకపోయినా ఇదొక ధర్మం.

అవివాహిత పట్ల ప్రవర్తించే విధంగా పురుషులు వివాహిత పట్ల ప్రవర్తించరు. అందుకే 'కట్టుకొన్న మగడు, పెట్టెనున్న నగలు' అనే సామెత ఏర్పడి ఉంటుంది.

భర్త నడవడిక సరిగాలేనప్పటికీ ఇదేమని ఇల్లాలు ప్రశ్నిస్తే అతడు కొంచెం కూడా సహించలేడు. పైగా పశుబలాన్ని ప్రయోగిస్తాడు. 'బ్రహ్మతలిస్తే ఆయుస్సుకు కొదువా? మొగుడు తలిస్తే దెబ్బలకు కొదువా?' ఈ విధంగా దెబ్బలు తింటున్న ఇల్లాల్ని చూసి లోకం జాలిపడుతుంది. పెళ్లి చేసుకోకముందు కూలినాలి చేసుకొని వేళకింతతిని హాయిగా నిద్రపోయేది. 'కూలినాలి చేసి కుదురాల ఉండక, మొగుడ్ని కట్టుకొని సగమైపోతివే' అని జనం సానుభూతి చూపుతారు. అటువంటి పెండ్లి జరిగిందానికంటే జరగకపోవటమే మేలని లోకం భావిస్తుంది.

కొన్ని సందర్భాలలో మనువు ఒక చోట మనసు ఒక చోట అవుతుంది, చేసుకున్నవారిని సరిగ్గా చూసుకోరు. 'కుట్టని రవిక చేతిలో ఉంటే' ఎంత లాభమో 'ఏలని మొగుడు ఊరిలో ఉన్నా' అంతే. 'కాలుత్రొక్కని మొగుడేనుగంత, కనిపెంచని బిడ్డ బారెడంత' అన్నట్లు. 'ఇష్టం లేని మొగుడ్ని జూసి కొనవేళ్లతో మొత్తుకుంటుంది'.

స్త్రీ శీలాన్ని నిరూపించే సామెతలెన్నో లభిస్తున్నాయి. కట్టుకున్నవాడి కళ్లు గప్పి మనసిచ్చిన వాడితో మసలుతుంటారు కొందరు మగువలు. అటువంటి భార్యల్ని అడుగడుగునా అనుమానిస్తారు భర్తలు. భార్య బయటకు పోకుండా ఎన్నో కట్టుదిట్టాలు చేస్తాడు భర్త. అలవోకగా ఆ అడ్డంకుల్ని అధిగమించి తామనుకున్నది సాధించే నేర్పు కొందరు లలనామణుల స్వంతం. ఈ విషయాన్నే నిరూపిస్తుందీ

సామెత. 'అనుమానపు మొగుడు ఆలిని వీపుకు కట్టుకుంటే పెండ్లాము మిండమగని కొప్పులో పెట్టుకున్నదట'.

గ్రామసీమల్లో ఇటువంటి దుష్ప్రవర్తనగల భార్యల్ని అగ్నిపరీక్షకు గురిచేస్తారు. అది తెలిసిన ఒక గడుసరి భార్య, 'పతిభక్తి చూపిస్తాను మగడా చెప్పులుతే, నిప్పులు తొక్కుతాను' అని అన్నదట. దీనిని బట్టే ఆమె పాతివ్రత్యమెంతో ప్రకటితమవుతుంది. ఇటువంటిదే మరొకటి. 'సత్యము నా వద్ద చాలా ఉన్నది. చెప్పులు తేరామగడా! నిప్పులో దూకుతాను.'

భార్యలందరూ సాధుస్వభావులని, భర్తలే గయ్యాళివారని భావించటానికి లేదు. గయ్యాళిభార్యలు, సాధుస్వభావులయిన భర్తలూ ఉంటారు. ఈ విషయాన్ని నిరూపించేదే ఈ సామెత. 'మొగుడ్ని కొట్టి మొగసాలకెక్కి ఏడ్చే' ఆడదాన్ని ఎవరేంచేయగలరు? 'మొండికెక్కిన దాన్ని మొగుడేమి చేయును? రచ్చకెక్కిన దాన్ని రాజేమి చేయును?'

మగడ్ని లెక్కచేయని భార్య అతను వచ్చేలోపలే చద్దిఅన్నంతిని భర్తకు అన్నానికి తొందర లేదంటుంది. అన్నం వడ్డించటానికి ఆలస్యం చేసే స్త్రీ ప్రవృతిని ఈ సామెతల్లో విమర్శిస్తుంటారు. 'చద్దికూడు తిన్నమ్మ మగని ఆకలి ఎరుగదు', 'ముప్పొద్దు తిన్నమ్మ మొగుడి ఆకలి ఎరుగదు'.

భర్త ఏమైనా పెద్దగా మాట్లాడితే 'ఇరుగింటమ్మా! పొరుగింటమ్మా! మా ఇంటాయన గోడు చూడండమ్మా!' అంటుంది.

కొంతమందికి 'మొగుడు అంటే ఘోష, డబ్బు అంటే ఆశ.' ఇటువంటి ప్రవృత్తి గల స్త్రీల గురించి సుమతీ శతకకారుడు,[864] వేమనా[865] పేర్కొన్నారు.

[864] "గడనగల మగని జూచిన
నడుగడుగున మడుగు లిడుదు రతివలు తమలో
గడనుడుగు మగని జూచిన
నడ పీనుగు వచ్చెననుచు నగుదురు సుమతీ". — సుమతీ శతకము, 43.

[865] "కలిమినాడు మగని గామించి చూచును
లేమిజిక్కునాడు లేవకుండు
మనిన మగనినైన మడియంగ జూచును
విశ్వదాభిరామ వినురవేమ." — వేమన – సూక్తి సుధాకరము, పుట – 956.

ఇటువంటి లోలత్వాన్ని పురస్కరించుకొని కొందరు ధనవంతులు నిరుపేదలైన స్త్రీలను డబ్బు ఆశ చూపి వంచించటానికి ప్రయత్నిస్తారు. పేద ఇల్లాండ్రను చులకనగా చూస్తారు. 'పేదవాని పెళ్లాం వాడకెల్ల వదిన' అనే సామెత ఈ సందర్భంలో ఏర్పడిందే.

అభిమానవతులైన ఆండ్రెందరో! వాళ్లు 'మొగుడు కొట్టినందుకు కాదుగాని, తోడికోడలు నవ్వినందుకు' బాధపడతారు 'మొగుడు కొట్టినాకొట్టె ముక్కు చీమిడి బాగా వదిలిందని సంతోషిస్తారు మరి కొందరు.

'మొగునితో పెళ్లికి, పిల్లలతో తీర్థానికి వెళ్లరాదు' అని ఒక సామెత. మగనితో పెళ్లికి వెళితే ఆయనకు కావాల్సినవి అమర్చి పెట్టటంతోనే కాలం గడిచిపోతుంది. బంధువులతో స్నేహితులతో కాలం గడపటానికే సమయ ముండదు. పిల్లలతో తీర్థానికి వెళితే వారికి కాపలా కాయటంతోనే సరిపోతుంది తీర్థ స్నానం చేయటానికి కూడా అవకాశం ఉండదు.

ఆలుమగల మధ్య చోటుచేసుకునే కలహాలు ఎక్కువ కాలం కొనసాగ కూడదనే విషయాన్ని సామెతలుకూడా నిరూపిస్తున్నాయి. 'ఆలుమగల కలహం (ప్రణయ కలహం) అన్నం తినే దాకానే' లేదా 'ఆరిక కూడు వండినంత సేపే'. ఆ తరువాత ఇద్దరూ ఏకమవుతారు. ఇంతకన్నా సుకుమారమైన సామ్యంతో ఏర్పడ్డ సామెత 'ఆలూ మొగుడు మధ్య పోట్లాట అద్దం మీద పెసరగింజ వేసినంత సేపు'. పగలు ఎన్ని గొడవలతో కాలం గడిచినా ఫరవాలేదు గానీ ప్రొద్దుగుంకేటప్పటికి గొడవలు సమసిపోయి వారు కలిసిపోవాలి. అందుకే 'మొగుడి మీద కోపం పొద్దు మునిగే వరకే' అంటారు. ఈ కలహం నూతన ప్రణయానికి దారితీసేదిగా ఉండాలి. ఒక్కొక్కప్పుడు ఈ గోరంత కలహాలే కొండంతలై శాశ్వత వియోగానికి దారి తీస్తుంటాయి. ఎవరూ తెగేదాకా లాగకూడదు. భర్త మూర్ఖుడైతే భార్య సరసత్వాన్ని ప్రదర్శించాలి. భార్య మూర్ఖురాలైతే భర్త సరసుడు కావాలి. రెండు చేతులు కలిస్తేనేకదా చప్పుడయ్యేది? 'పలుపు తీసుకొని కొట్టరా మొగుడా, పదాలు పాడుతా' ననరాదు. భర్త కర్రదీసుకొని కొట్టటానికి వస్తే, 'మూరెడు ఇంట్లో బారెడు కర్ర, ఎట్లా

కొడతావో కొట్టరా మొగుడా' అని రెచ్చగొట్టటం భావ్యంకాదు. మొత్తం మీద ఇటువంటి విషయాలలో ఎక్కువ బాధ్యతను స్త్రీకే అంటగట్టింది హైందవ సంఘ సంప్రదాయం. ఆమె సహనానికి మారు పేరుగా ఉండాలని ఆశిస్తుంది. 'సంసారం సాగనిది ఆడదాని వ్రాత, పిల్లలు బ్రతకనిది మొగుడి వ్రాత' అనే హెచ్చరికనుకూడా చేస్తుంది. అందుకే 'పురాణంలో ఏమి చెప్పినారే అంటే, అక్కడా నీ మొగాననే ముద్దులు బెట్టమన్నారన్నదట పెండ్లాము' అంటే భర్త నుండి దూరంగా ఉందామని పురాణ కాలక్షేపానికి వెళితే అక్కడా పాతివ్రత్యగాథలే వినిపించాయట. కాబట్టి హైందవ ధర్మం మొదటి నుండీ పురుషపక్షపాతిగానే ఉన్నట్లు తెలుస్తున్నది.

'వేరు మీద గోరు మొలిచింది, వేరుపోదాం రారా వెర్రి మొగుడా!' అనే సామెతకు ఏ ఆలుమగలు గురికాకూడదు. హైందవ సంఘంలో భర్త వదిలివేసిన మగువకు గౌరవం ఉండదు. 'మొగుడు విడిచిన, మగువకు బుద్ధివస్తుంది' అనే సామెత ఎవరో ఆ స్త్రీ మీద కోపంతోనో, అసూయతోనో కల్పించిందే. 'మగడు ఒల్లనమ్మను మారీ ఒల్లదు' అనేది కూడా ఇటువంటిదే. ఎన్నో దుష్టశక్తులు ఆలుమగలను విడగొట్టటానికి ప్రయత్నిస్తుంటాయి. వాటిని కనిపెట్టి పరస్పరావగాహనతో ఆలుమగలు ఏకం కావాలి. 'ఆలుమగలొక్కటయ్యే వరకే అందరితో అవసరం' అనే సామెత మంచి హెచ్చరిక. దుష్టసర్పాలు కాటు వేయటానికి సమయం కోసం ఎదురుచూస్తుంటాయి. అందులో మొదటిది కుబుద్ధి అయిన అత్తగారు. అగ్నికి ఆజ్యం పోస్తుంది ఆడబిడ్డ. అందుకే 'ఆడబిడ్డ అర్థ మొగుడు' అని లోక వ్యవహారం. ఇరుగు పొరుగు వారు కూడా ఎంతో కొంత అగ్నిలో ఆజ్యం పోస్తుంటారు. స్త్రీ పురుషులు ఒంటరిగా మాట్లాడుకుంటుంటే వావివరుసలు తెలుసుకోకుండా సంబంధాలు అంటగట్టటానికి కూడా వెనుకాడరు. ఈ విషయంపై ఏర్పడిన సామెత' అన్యాయపు ఊరిలో ఆలూ మొగుడికి రంకు' అని.

'అతిపరిచయాత్ అవజ్ఞా' అన్నట్లు భర్త మేనత్త కొడుకో మేనమామ కొడుకో అయితే చిన్నప్పటి నుండి పరిచయం ఉండటం వల్లనో ఏమో భార్యలో కొంత

చులకన భావం కనిపిస్తుంది. 'ఉండ్రాళ్లూ ఒక పిండి వంటేనా? మేనత్త కొడుకూ ఒక మగడేనా?' అని నిరసిస్తారు.

ఆచారాలు అధికంగా పాటించేది స్త్రీలే. అందుకే స్త్రీలంతా 'ఆచారపు అచ్చమ్మలు, చాదస్తపు చెల్లమ్మలు' అని అభివర్ణిస్తుందో సామెత. 'సాటి వారితో సరిగంగస్నానాలు చేస్తుంటే, ముసలి మొగుడ్ని కాస్తా మొసలెత్తుకుపోయిందట!' అంటే ముసలి మొగుడితో ఇటువంటి స్నానాలెందుకనే ఎత్తిపొడుపేమో!

భర్త భార్యకు గుదిబండ కాకూడదు. సంపాదన లేకుండా ఇంట్లో కూర్చుంటే సంసారం ఎలా గడుస్తుంది? అటువంటి మగవాడు 'పుణ్యం కలిగిన మగని చేసికొంటే, పూసలలోనికొక రుబ్బుడు రాయి' అవుతాడు.

సాధారణంగా స్త్రీలు భర్తకు, పిల్లలకు, అత్తమామలకు వండి, వడ్డించటం, సేవ చేయటం లోనే ఆనందాన్ని పొందుతారు. కానీ 'చేసుకున్న తరువాత వండి పెట్టక తప్పుతుందా?' అని ఎంతో అయిష్టాన్ని ప్రదర్శించే మగువలు కూడా ఉంటారు.

భర్త తాకట్ల మారివాడు, తంటాలమారివాడు అయితే తట్టుకోవటం కష్టం. విసిగిపోయిన తరువాత అయిష్టంగానే అయినా ఈ విధంగా కోరకతప్పదు. 'తాకట్ల మొగుడా! తంటాల మొగుడా! నీతనువుండగానే నన్ను మనువిచ్చిపోర!'

సముద్రపులోతు, సంసారం గుట్టు తెలుసుకోవడం కష్టం. అయినా దాంపత్య జీవితానికి సంబంధించిన ఈ సామెతలు కొన్ని వాస్తవికంగా, కొన్ని హాస్యయుతంగా, కొన్ని వ్యంగ్యంగా, కొన్ని హెచ్చరికగా ఎన్నో విషయాలను స్పృశించాయి.

## 5. సవతి పోరు

స్త్రీ ఏ బాధనైనా, కష్టాన్నైనా తట్టుకుంటుంది గాని సవతి పోరు మాత్రం సహించలేదు. కానీ దురదృష్టవశాత్తు కొందరు భర్తలు భార్యకు సవతి పోరు తెచ్చిపెడుతుంటారు. హైందవ ధర్మం బహుపత్నీత్వాన్ని అంగీకరించింది. శ్రీరాముని ఆదర్శం ఆచరణసాధ్యం కాదని నిరూపించారు చాలామంది పురుషులు. మొదటి

భార్య సంతానవతి కానప్పుడో, దీర్ఘవ్యాధితో బాధపడుతున్నప్పుడో లేక మరే ఇతర బలీయమైన కారణం వల్లనో ద్వితీయ వివాహం చేసుకోవచ్చని ఆర్య ధర్మం బోధిస్తున్నది, దీనిని వక్రీకరించి కొందరు పురుషులు స్వార్థంతో బహుభార్యాత్వాన్ని ప్రోత్సమిస్తున్నారు. అప్పుడా భార్యల మధ్య సవతిపోరు తప్పటం లేదు. రెండు ఊళ్లలో వ్యవసాయం చేయటం ఎంత కష్టమో ఇద్దరు భార్యలతో సంసారం చేయటం అంతే కష్టమంటుందొక సామెత. 'రెండు ఊళ్ల వ్యవసాయం, ఇద్దరు భార్యల సంసారం'. ఒక్కొక్క అమాయకురాలు తాను ముందు పడబోయే పాట్లు తెలుసుకోలేక తోడు దొరుకుతుందనే సంతోషంతో మగనికి మారుమనువు కుదిరిస్తే ఏమవుతుందో నిరూపిస్తుంది 'చేటు ఎరుగని చేడె మొగుడికి పెళ్లి చేసిందట' అనే సామెత. ఇటువంటి అమాయకురాలే ఇంకొకతె తగుదునమ్మా అని మగని పెళ్లికి వెళ్లటం చూచి ఇరుగు పొరుగు వారోవరో 'చేటూపాటూ ఎరుగనమ్మ మగని పెళ్లి చేసిందట' అని ఆశ్చర్యం ప్రకటిస్తారు.

'స్వర్గానికి పోయినా సవతి పోరు తప్పింది కాదు' అన్న సామెత ఆశ్చర్యం కలిగిస్తుంది. అంటే చనిపోయిన వారందరూ స్వర్గానికి వెళతారా? ఒకవేళ వెళితే ఇక్కడి బంధాలే అక్కడా కొనసాగుతాయా? ఏమోమరి! కానీ ఇటువంటి ఊహ చేశారంటే ఆ సవతిపోరు ఎంత బాధాకరంగా ఉందో ఊహించుకోవచ్చు.

భర్త ప్రేమ తనకు మాత్రమే దక్కాలని, అందులో ఎవరూ పాలు పంచుకో కూడదని ప్రేమతో కూడిన స్త్రీ స్వార్థపూరిత స్వభావమే ఈ సపత్నీ మాత్సర్యానికి దోహదం చేస్తుంది. ఒక్కొక్కసారి ఈ అసూయా ద్వేషాలు పరిమితి దాటితే కుటుంబాలలో ఎన్నో అనర్థాలు సంభవిస్తాయి. అవి సమాజంలో విపరీత పరిణామాలకు దారితీస్తాయి. వీటినన్నటినీ గమనించిన ప్రభుత్వం బహుభార్యాత్వాన్ని నిషేధించి ఏకపత్నీత్వాన్ని (monogamy) చట్టం చేసింది. అప్పటి నుండి స్త్రీలకు అధికారిక సవతిపోరు తప్పింది కానీ అనధికారిక సవతిపోరు గురించి చెప్పలేం.

# 6. అత్త-కోడలు

అత్తా కోడళ్ల సంబంధం పరస్పర అసహనంతో కూడిందని ఇంతకు మునుపే జానపద సాహిత్యంలో కొంత నిరూపించటం జరిగింది. స్త్రీని చిత్రించే సామెతల్లో ఈ అత్తా కోడళ్లకు సంబంధించినవే ఎక్కువగా కన్పిస్తున్నాయి.

అత్తగారు సంబంధాలు వెతికేటప్పుడే తన కుమారుడికి ఎటువంటి భార్య కావాలో ముందే నిర్ణయించుకొని అటువంటి అమ్మాయి కోసమే ప్రయత్నిస్తుంది. 'కోడలు నలుపైతే కులమంతా నలుపవుతుంద'ని ఆమె భయం. ఒక్కొక్క కోడలు అడుగు పెట్టిన వేళావిశేషం వల్ల కలిసొస్తే ఎంతో సంతోషిస్తారు. 'కోడలు వచ్చిన వేళ, కోడెలు వచ్చిన వేళ' అని మురిసిపోతారు. హైందవ కుటుంబాలలో భర్తతో కాపురం కష్టం కాకపోయినా అత్తలో వేగటం కోడలికి అసిధారావ్రతమే. 'అత్తింటి కాపురం, కత్తిమీద సాము' అంటారిందుకే. 'అందరికాళ్లకు మొక్కినా, అత్తగారింటికి పోకతప్పదు' ఆడదానికి. కష్టాలు అనుభవిస్తేనే జీవితానికి పరిణతి. అందుకే 'అత్త ఏలిన కోడలు, చిత్తపట్టిన వరి'అంటారు. అంతేకాదు 'అత్త చేపట్టిన కోడలు, కౌసులవాడు (కంసాలివాడు) చేపట్టిన బంగారం' ప్రకాశిస్తాయంటారు.

అత్తయినా కోడలయినా మానవ మాత్రులే. పొరపాట్లు ఎవరికైనా జరగవచ్చు. అయినా 'అత్త చేసిన పనికి ఆరళ్లులేవం'టారు. కోడలు చేసిన పొరపాట్లు గోరంతలు కొండంతలై రచ్చకెక్కుతాయి. 'అత్తకొట్టిన కుండ అడుగోటికుండ, కోడలు కొట్టిన కుండ కొత్తకుండ' అనటంలో అర్థమిదే.

అత్తగుణవంతురాలైతే కోడల్ని సరిదిద్దుకోవచ్చుగాని 'అత్తరంకుపోతూ, కోడలికి బుద్ధి చెప్పటం' ఒజ్జల పుచ్చకాయ వంటిది. అత్త లేకపోతే కోడండ్రందరూ ఉత్తమురాండ్రే. కోడండ్రే లేకపోతే అత్తలందరూ గుణవంతురాండ్రే. అందుకే ఈ సామెత 'అత్తలేని కోడలుత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు'. ఒకవేళ అత్త పెత్తనం లేకపోయినా మామ పెత్తనం ఉంటుంది. మామగారు అనుమతించనిదే పైసా కూడా ఖర్చు పెట్టటానికి వీలుండదు. మామకూడా లేనప్పుడే కోడలు భాగ్యశాలి అవుతుంది. మొత్తంమీద 'అత్తలేనమ్మ ఉత్తమురాలు, మామలేనమ్మ మరీ భాగ్యశాలి'.

అత్తమామలు లేకపోయినా బావగారుంటారు. ఆయనా లేకపోతే మరిది ఉంటాడు. వీరెవరూ లేకపోతే ఇక కోడలి అదృష్టం వర్ణనాతీతం. అందుకే అంటారు 'బావలేని కోడలు బహు భాగ్యశాలి, మరిది లేని కోడలు మరీమంచిది' అని.

అత్త దొంగయితే కోడలూ దొంగతనం నేర్చుకుంటుంది. మగడు తిరుగు బోతు అయితే భార్య తానుకూడా అలా ఎందుకు చేయకూడదు అనుకుంటుంది. అందుచేత సమష్టి కుటుంబాలలో పెత్తందార్లు గుణవంతులు కావాలని భంగ్యంతరంగా హెచ్చరిస్తుంది 'అత్తవల్ల దొంగతనం, మగనివల్ల రంకుతనం నేర్చుకున్నట్లు' అనే సామెత.

అన్ని పనులూ కోడలే చేస్తుంది. కాని అత్తగారు వ్రేలు పెట్టి అన్నీ తానే చేసినట్లు ప్రకటిస్తుంది. ఒకవేళ ఎప్పుడైనా అత్త పనిచేయటానికి ఉపక్రమిస్తే కోడల్ని పిలిచి అడుగడుక్కీ అదీ ఇదీ అందీయమంటుంది. ఇటువంటి అత్తగారి ప్రవర్తనను ప్రతిబింబించే సామెత 'అట్లు వండే అత్తకు అరవై ఆరు ఎత్తులు పెట్టినట్లు' అనేది.

అత్త ఎన్ని కష్టాలు పెట్టినా కోడలు సహించాలే గాని ఇరుగు పొరుగుతో ఏమీ చెప్పుకోకూడదు. చెప్పినా వాళ్లు ఆర్చేదీ తీర్చేదీ ఏమీ ఉండదు. అందుకే అత్తమంచిదని అందరితో చెప్పుకుంటే కొన్నాళ్లకయినా ఆమె మనసు మారకపోదు. ఇటువంటి కోడండ్రను పరిశీలించి చెప్పినట్లుగా ఉందీ సామెత 'వాచినమ్మకు పాచిన కూడు పెడితే, మా అత్త పరమాన్నం పెట్టిందని ఇరుగింట పొరుగింట చెప్పుకొంటుంది'.

కోడలికి ఇంట్లో ఏ విషయంలోనూ స్వాతంత్ర్యం ఉండదు. అంతా అత్త అధికారమే. చివరకు బిచ్చగాడ్ని పొమ్మనటానికికూడా. దేనికైనా 'ఔననటానికి కాదనటానికి అత్తకధికారం కాని, కోడలికేముంది?' అనే ప్రశ్నార్థక సామెత అత్త పెత్తనంలో అనధికారులెవరూ జోక్యం చేసుకోరాదని హెచ్చరిస్తుంది.'బిచ్చగాడ్ని పొమ్మన్నా అత్తచెప్పాలి, కోడలు పంపాలి'. అయితే ఒక్క విషయంలోమాత్రం కోడలికి స్వాతంత్ర్యముంది. అదే బిడ్డల్ని కనటం. వంశం అభివృద్ధి చెందాలి కదా! 'కోడలు కంటానంటే వద్దనే అత్తఉన్నదా?' అని ప్రశ్నిస్తుందో సామెత.

అత్త ఎంతసేపటికీ పరస్పర విరుద్ధ భావనలు చేస్తుంది. 'కొడుకు బాగుండాల, కోడలు ముండమొయ్యాల'. ఇదెలా సాధ్యం? అదీ ఆమె సహృదయత. 'కొడుకు ముద్దు, కోడలు మొద్దు'.

ఎప్పుడైనా అత్తగారు బయటకు వెళితే 'ఏక్ దిన్ కా సుల్తాన్' అన్నట్లు పెత్తనమంతా కోడలిదే. అలా విర్రవీగే కోడళ్ని చూచి ఆశ్చర్యపడుతూ పొరుగింటి పుల్లమ్మ ఇలా ప్రశ్నిస్తుంది. 'కోడలా! కోడలా! నీ భోగమెంతసేపు' అని. అప్పుడు కోడలు 'మా అత్త మాలవాడకు పోయి వచ్చిందాక' అని సమాధానం చెబుతుంది. ఇటువంటిదే మరొకటి 'పోలీ! పోలీ! నీ భోగమెన్నాళ్లే? అంటే, మా అత్త మాలపల్లి నుంచి వచ్చేదాకా' అన్నట్లు.

ఒక్కటే కోడలయితే కష్టాలన్నీ ఒక్కతే భరించాలి. అది మరీ దురదృష్టం. ఒకరికి నలుగురు కోడండ్రుంటే కష్టాలలో భాగస్వాములవుతారు. క్రమంగా కష్ట తీవ్రత తగ్గటమే కాకుండా ముందు పెద్ద కోడలికి విముక్తి కలుగుతుంది. ఆమె అత్త గారి స్థానం ఆక్రమిస్తుంది. 'పెద్ద కోడలికి పెత్తనమిస్తే కాళ్లు కడగకుండ ఇంట్లోకి వచ్చిందట'. పెత్తనం నెత్తిమీదికొస్తే నియమోల్లంఘనమే. పెద్ద కోడలి ప్రాముఖ్యాన్ని వివరించే సామెత మరొకటున్నది. 'కలిగిన వారింట కడగొట్టు కోడలయ్యేకంటే పేదవారింట పెద్దకోడలయ్యేది మేలు!' ఎంతటి పేదరికంలోనయినా పెద్ద కోడలికి కొంతవరకయినా ముద్దుముచ్చట్లు జరుగుతాయి. కోడలిమోజు అనేది పెద్ద కోడలితో సరి. అది క్రమంగా తగ్గిపోతుంది. ఎంత భాగ్యవంతులయినా కడగొట్టు కోడలికి అన్ని మర్యాదలూ సక్రమంగా జరగవు. అదే సామెత రూపం వహించింది. 'పేదవారి పెద్ద కోడలికి జరిగినట్లు, కలిగిన వారి కడసారి కోడలికి జరగదు'.

ఇంటి కోడళ్లను కష్టపెట్టటంలో అత్తకు సహాయపడతారు కూతుళ్లు. ఇటు చెంబు అటు పెట్టరు. ఏపనీ చేయక సోమరులవుతారు. తరువాత పెళ్లయి అత్తవారింటికి పోయి అక్కడ ఏపనీ చేయటం సరిగా చేతకాక అత్తచేత చీవాట్లు తింటారు. అట్టి వారిని చూచి లోకం ఇలా విమర్శించింది. 'కూకున్న కూతురు

కూలిపోయింది, చేసిన కోడలు చేవదేలింది'. ఏమైనా 'అత్తవారింటి సుఖం మోచేతి దెబ్బవంటిది'.

ఎప్పుడైనా అత్తగారు మెత్తబడి కోడలి కోర్కెనంగీకరించినా ఆడపడుచు అడ్డుపడుతుంది. ఈ విషయాన్నే సాంకేతికంగా తెలియజేసే సామెత 'అత్త ఒప్పిన, దుత్త ఒప్పదు'. ఇక్కడ దుత్త అంటే ఆడపడుచు అని అర్థం. ప్రాసకోసం ఇలాంటి సంకేతాల్ని అలవోకగా కల్పిస్తారు సామెతకారులు. కోడలు ఒకవేళ అత్తకు నచ్చినా ఆడబిడ్డకూ నచ్చాలి. 'వచ్చిన కోడలు నచ్చితే, ఆడబిడ్డ అదిరిపడుతుంది'.

ఒకవేళ అత్తగారు తనకునచ్చిన అమ్మాయిని ఏరికోరి కోడలిగా తెచ్చుకుంటే లేదా ఏ మేనకోడలో కోడలు అయితే 'కోరుకున్న కోడలు వస్తే, కొప్పులో చెప్పుపెడుతుంది'. అంటే అత్త మాట వినకుండా ఏ పనైనా స్వతంత్రించి చేస్తుందని అర్థం.

పుట్టింటివారు పురుడుపోయలేని పేదవారయితే ఇక ఆ కోడలు పడే పాట్లకు అంతుండదు. 'కూతురి పురుడు కుండల్లో, కోడలి పురుడు కొండల్లో' పోస్తుంది అత్తగారు.

అత్తకూడా తానొక ఇంటి కోడలినేనని మరిచిపోవటం వల్లనే కోడలికి ఇన్ని కష్టాలు.'అత్త మంచీ వేము తీపీలేదు', 'కత్తి మెత్తనా అత్త మంచీ లేదు'. 'అత్తముండకన్నా ఉత్తముండ మేలు'.

అత్తకాలం కొన్నాళ్లు, కోడలికాలం కొన్నాళ్లు. అప్పుడు కోడలు తాను అత్తచేతిలో పడ్డ అగచాట్లు మరిచిపోతుందో లేక తాను పడ్డ కష్టాలు ఇతరులెందుకు పడగూడదనుకుంటుందో గాని తానూ తన హయాం సాగిస్తుంది.

ఎక్కువశాతం అత్తలు గడుసరులే. కానీ అరుదుగా మెత్తని అత్తలు గడసరి కోడళ్లూ ఉంటారు. గడసరి కోడలు కాలుపెట్టగానే ఆమె దెబ్బకు తట్టుకోలేక అత్తగారు తన జీవితాన్ని అంతమొందించుకొనే సంఘటనల్ని పురస్కరించుకొనే 'కోడలు గృహప్రవేశం, అత్త గంగాప్రవేశం' అనే సామెత ఏర్పడిందని చెప్పవచ్చు.

వయసుకూ గడసరితనానికి సంబంధం ఉండదు. అది స్వభావాన్ని బట్టి ఉంటుంది. కోడలు చిన్నదైనా, అనుభవం తక్కువదైనా అత్తగారి ఆటలు సాగ నీయదు. భర్తను వశపరచుకొని అత్తకు ఎసరు పెడుతుంది. ఆమెకు సింహ స్వప్నమవుతుంది. ఇట్టి సందర్భాన్ని నిరూపించే సామెతలూ ఉన్నాయి. 'ఉల్లిగడ్డంత కోడలు వస్తే నలికతో ఉన్న అత్త ఉలికి ఉలికి పడ్డదట'. 'కొర్రగింజంత కోడలిని చూస్తే, కొండంత జ్వరం వచ్చిందట'.

అత్త పురమాయించే పనులనన్నింటినీ విధేయతతో చేసుకుంటూపోతే వాటికి అంతూపొంతూ ఉండదు. ఈ రహస్యం గుర్తించిన కోడలు అత్తకంటే బద్ధకాన్ని నటిస్తూ ఆమె రోగం కుదురుస్తుంది. 'ఓపలేని అత్తకు వంగలేని కోడలు', 'లేవలేని అత్తకు వంగలేని కోడలు'. ఇంకా కొందరు కోడళ్లు నేర్పుగా మాటలు చెపుతూ అత్త చేతనే పనులన్నీ చేయించుకొంటూ సుఖపడతారు. వీరు మనస్తత్వ మెరిగిన గడుసరులు. అత్త దంభాన్ని (vanity) గుర్తించి తదనుకూలంగా మాటల మంత్రం వేస్తారు. అటువంటి కోడళ్లకు అత్తలు బానిసలవుతారు. ఇట్టి నేర్పరులైన కోడళ్లను పురస్కరించుకొని ఏర్పడ్డ సామెతలివి – 'అత్తకంటె అడపాపలేదు', 'అతగాని కంటె జీతగాడు లేడు', 'అరవై వరహాలు ఇచ్చినా అత్తవంటి బానిస దొరకదు'.

అత్తకెప్పుడూ ఏదో ఒక పని కల్పిస్తుంది జాణ అయిన కోడలు. లేకపోతే ఆమె వ్యర్థ ప్రలాపాలకు పాల్పడుతుంది. 'అత్తా! నా రాట్నమాగకుండా చూడు, కదుటిలో దిండు పడకుండా చూడు' అని అర్థిస్తుంది. ఒక మాట అని పదిమాటలు అనిపించుకోవద్దని హెచ్చరిస్తుంది. 'అని అనిపించుకోవలెనా అత్తగారు?' అన్నది ఒక సామెత అయింది.

కోడలి శీలాన్ని అదిక్షేపించటానికి అత్తగారెప్పుడూ సన్నద్ధంగా ఉంటుంది. స్త్రీ దేన్నైనా సహిస్తుంది గాని శీలాన్ని శంకిస్తే మాత్రం ఊరుకోదు. మాటకు మాట సూటిగా సమాధానం చెప్తుంది. ప్రశ్నకు ఎదురు ప్రశ్నవేస్తుంది. అత్తగారు 'కోడలా! కోడలా! కొడుకు కోడూరుకు పోయెనే నీకు కోకెక్కడిదే?' అని ప్రశ్నిస్తే కోడలు

వెంటనే 'అత్తా! అత్తా! మామ మడనూరు పోయెనే నీకు మట్టెలెక్కడివే?' అన్నదట. ఈ ప్రశ్నకు ప్రశ్నే ఒక సామెత అయింది. అని అనిపించుకోవటమంటే ఇదే.

కోడళ్ల పోకళ్లు పలు విధాలుగా ఉంటాయని సామెతల్ని బట్టి తెలుసుకోవచ్చు. 'పప్పులో ఉప్పు వేసేటప్పుడు చెప్పేయమంటే, చెప్పు వేసి తీసి అత్తకు అంచుకుపెట్టి' చూపించిందట ఒక కొంటె కోడలు.

ఒక్కొక్క కోడలు అత్తనెట్లా వదలించుకోవాలా అని ఆలోచిస్తుంటుంది. 'అత్తకు నాకు అరం బేరం, అత్త నెత్తుకుపో ముత్యాలమ్మా! అత్త నెత్తుకపోతే ఆరుగాళ్ల జీవాన్ని అర్పిస్తాను?' అని గ్రామదేవతకు మ్రొక్కుకోవటానికి కూడా వెనుకాడదు. ఇంతకూ ఆ దేవత కరుణించి అత్తనెత్తుకుపోతే ఈమె అర్పించేది ఆరుకాళ్ల జీవాన్నట. రెండు కాళ్ల కోడి, నాలుగుకాళ్ల గొఱ్ఱె లేక మేకకన్నా సులభంగా, వ్యయప్రయాసలు లేకుండా, ఖర్చులేకుండా లభించే ఆరుకాళ్ల జీవం సాలెపురుగు. ఎంత గొప్ప మ్రొక్కుబడి!

అత్తకూడు వండమంటే పనిచేయవలసి వచ్చినందుకు కుండపగల గొడుతుంది ఒకనొక కోడలు. ఈ విషయం కూడా సామెతగా రూపుదిద్దుకొంది. 'అత్త కూడు వండమన్నది కాని, కుండ పగలగొట్టమన్నదా?'

కొంతమంది కోడళ్లు 'అత్తను కొట్టి అటకెక్కి కూర్చుంటారు, 'మొగుడ్ని కొట్టి మొగసాలెక్కి కూర్చుంటారు'. ఇంకా కొందరు భర్త రాగానే అత్తగారి మీద చాడీలు చెప్పి భర్తను రెచ్చగొడతారు. కోపోద్రిక్తుడైన భర్త తన తల్లిని కొడితే గడుసరికోడలు ఏడ్వటం మొదలు పెడుతుంది. దెబ్బ తనకే తగిలినట్లు. అది ఆమె నంగనాచితనానికి నిదర్శనం. అటువంటి కోడల్ని బట్టి ఏర్పడిందే 'అత్తను కొడితే కోడలు ఏడ్చినట్లు' అనే సామెత.

నెరజాణ కోడళ్లు చేసే పనులు లోకానికి కన్పించవు. అత్త పెట్టే ఆరళ్లే కనిపిస్తాయి. అందుకే 'అత్త పెట్టే ఆరళ్లు కనబడుతవికాని, కోడలు చేసే కొంటె పనులు కనబడవు' అంటారు. అత్త ఎంత కష్టపడి పనిచేసినా ఒక్కొక్క కోడలు దానికి విలువివ్వదు. 'అత్త పని రిత్తపని దినమొకకండి, నా పని రాచపని నెలకొకకండి'

అంటుంది. రోజుకొక కండె చొప్పున నిత్యం రాట్నం వడికే అత్త పని రిత్తపనట! నెలకొప్పుడో ఒకసారి రాట్నం పట్టి ఒక కండె వడికే కోడలి పని రాచపనట! ఆహా! ఎంతగడుసుదనం!

కసిపోక మసి పూసుకొన్నట్లుగా అత్తమీద కోపం దుత్తమీద చూపిస్తుంటారు కొందరు కోడళ్లు. అత్త పేరు పెట్టుకొన్న కూతుర్ని అత్తగారు గానే భావించి అస్తమానం సాధించే అవివేకులైన కోడళ్లు ఉంటారని నిరూపిస్తుంది 'అత్తపేరు పెట్టి కూతురిని కుంపట్లో వేసింద'నే సామెత.

**అత్తా కోడళ్ల హాస్యం** : అత్త వృద్ధురాలు అయింది. అందుచేత చెముడు వచ్చింది. కోడలు ఒకటడిగితే అత్త ఇంకొకటి సమాధానం చెబుతుంది. అవే చిత్రమైన సామెతలుగా రూపొందాయి. ఈ సామెతల్ని పరిశీలించినప్పుడు వాటిలో వారి పరస్పర విరుద్ధ స్వభావాలు గోచరించడమే గాక కొంత హాస్యం కూడా పొడగడుతుంది.

'అంబటి ఏరు వచ్చింది అత్తగారూ! అంటే, కొలబుట్ట నా చేతిలోనే ఉన్నది కోడలా! అన్నదట'. ఒక కోడలు 'ఆగడపలు (మేఘాలు) వేసినవి అత్తా అంటే, అట్లకు బియ్యం నానబొయ్యి కోడలా!' అని సమాధానమిచ్చిందట. ఏరు రావటానికి, కొలబుట్టచేతిలో ఉండటానికి; మేఘాలు కమ్ముకోవటానికి, బియ్యం నానబొయ్యి టానికి ఎటువంటి సంబంధం లేదు కాబట్టి ఆ సమాధానాలు హాస్యజనకాలు.

ఈ రీతిగా చెవిటి అత్తగారితో అవస్థపడే కోడలి స్థితిని వర్ణించే సామెతలు అనేకం లోకంలో వాడుకలో ఉన్నాయి. ఎవరైనా ఒకటడిగితే ఇంకొకరు దానికి విరుద్ధంగా సమాధానం చెప్పే సందర్భాలలో ప్రజలు వీటినుపయోగిస్తారు. 'ఆగడపలు వేసినవి అత్తా! అంటే, చేరెడు వెనక్కు కోడలా! అన్నదట.' 'ఆగడప వేసింది అత్తా! అంటే, అబక నా చేత ఉన్నదిలే అన్నదట.' 'గొల్లకంపు గాలికొట్టింది అత్తగారూ! అంటే, అంటు అయింది కుండలో నీరు పారబోయి కోడలా! అన్నదట.' 'చెవిటి అత్తా చేంతాడు తెమ్మంటె, మా అమ్మ పుట్టిల్లు బెజవాడ అన్నదట.' 'పులిచారలు వేశాయి అత్తయ్యా! అంటే పుడిసెడు వెనక్కు తీయవే కోడలా! అన్నదట'.

ఎంత చెప్పినా 'అత్తా కోడలు అల్లీ బిల్లీ, ఇరుగుపొరుగు ఇల్లా మల్లి' గానే ఉంటుంది. పొరుగింటి 'అత్తా కోడళ్ల మాట ఆనోటా ఆ నోటా' వ్యాపిస్తుంది. అత్తమాట ఎంతో కఠినంగా అనిపిస్తుంది. 'ఆకలవుతున్నది అత్తగారూ! అంటే రోకలి మ్రింగవే కోడలా!' అన్నదట. అత్తలు కొంతమంది ఎన్ని తిట్లు తిట్టినా ఎంతగా నిష్టూరాలాడినా కడుపునిండా తిండి పెట్టి కోడళ్లను పోషిస్తారు. ఎందుకంటే 'ఇంటి కోడళ్లు తిన్నా, కోళ్లు తిన్నా వృథాగా పోదు' అని వారి భావన. కోడళ్లు మంచి బిడ్డల్ని కంటారని, కోళ్లు బాగా గ్రుడ్లు పెడతాయని ఆశ కాబోలు!

కోడలు అత్తవారింట్లో అడుగు పెట్టినప్పటి నుండీ కొంగు బిగించి పని చేయాలేకాని క్రొత్తగా వచ్చానని కూర్చోవటానికి లేదు. ఈ విషయాన్నే వివరిస్తాయి 'కలబంద ఎండు కోడలి క్రొత్తా లేదు', 'బందేడు పచ్చి, కోడలు కొత్తా లేదు' అనే సామెతలు.

'కలిగిన వారి కోడలు కులుకు మానక' పోయినా దానికి తగినట్లే పని కూడా ఉంటుంది. అత్త హోదాకు తగిన కోడలొస్తేనే అందం చందం. 'మున్నూరు కాపత్తకు ముష్టికోడలు' వస్తే ముదితలు గుసగుసలాడతారు.

పెళ్లి చేసేటప్పుడు కూతుర్ని గొప్పింట్లో ఇవ్వాలని, కోడల్ని తమకన్నా తక్కువస్థాయి ఇంటి నుండి తెచ్చుకోవాలని అనుభవజ్ఞులైన పెద్దలు చెబుతుంటారు. ఎందుకంటే గొప్పింటి ఆడపిల్ల తక్కువ స్థాయి ఇంటికి కోడలుగావస్తే కోడంట్రికం సహించదు. తక్కువ స్థాయి ఇంటి నుండి వచ్చిన కోడలయితే వినయవిధేయతలు ఎక్కువగా ఉంటాయని భావిస్తారు. కోడలు వేరే కులమైతే గృహకలహాలు మొదలవుతాయి. న్యూనాధికతలు శృతిమించుతాయి. ఈ విషయాన్నే సూక్ష్మంగా వివరిస్తుందొక సామెత. 'కుప్పలో కేడిగింజ, కులంలో కులాల కోడలు'. ఒక ధాన్యపు కుప్పలో వేరొక ధాన్యం కలవదు. కలిసినా ఇట్టే తెలిసిపోతుంది. అదే విధంగా ఒక కులానికి చెందిన కోడలితో వేరొక కులానికి చెందిన కోడలు కలిసిపోవటం కష్టం. ఆచారవ్యవహారాలు తారుమారవుతాయి. ఇక్కడ కులాల కోడలంటే కుమ్మరి కోడలు.

పూర్వం ఉమ్మడికుటుంబాలలో స్త్రీలు భోజనం చెయ్యాలంటే మగవాళ్లు భోజనం చేసిన తర్వాత మాత్రమే వీరు చెయ్యాలనే ఆచారం ఉండేది. అంటే మామలు, బావలు, భర్త భోజనం చెయ్యనిదే ఇంటి కోడళ్లు భోజనం చెయ్యటానికి వీలులేదు. ఒక వేళ ఏకారణం చేతనైనా వాళ్లు భోజనానికి రావటం ఆలస్యమైతే వీరికి నీరసంతో తలప్రాణం తోకకొస్తుంది. ఆ విషయమే ఈ సామెతలు నిరూపిస్తున్నాయి. 'మబ్బులో పొద్దు మాయమైపోతే, కోడళ్ల ప్రాణాలు కొలికిళ్లకొచ్చె' 'మొగుళ్ల పొద్దు మోసపుచ్చె, కోడలి ప్రాణం కొలుకులోకి వచ్చె.'

అత్తను వదిలించుకోవాలనే ప్రయత్నం సాగినా సాగకపోయినా కోడలి మనసులో ఆ ఆలోచనలు సాగుతూనే ఉంటాయి. 'అత్తను అమ్ముకొమ్మంటారు, కోడలిని కొలుచుకొమ్మంటారు' అనే సామెత ఆమె ఆలోచనలకు అనుగుణమైనదే.

అత్తా – కోడళ్ల మధ్య ఎన్ని వైరుధ్యాలున్నా, మరెన్ని విభేదాలున్నా వారు జీవితాంతం ఒకే కప్పు కింద జీవించకా తప్పదు ఒకరినొకరు చూసుకోకా తప్పదు.

## 7. స్వభావం

ఒక వ్యక్తి గురించి అంచనా వెయ్యాలంటే వారి స్వభావం తెలిసుండటం ముఖ్యం. 'స్వభావో మూర్ధ్ని నర్తతే' అన్నట్లు అన్ని గుణాల్ని మించి స్వభావం తలపై ఉంటుంది. అంటే అన్ని గుణాలకన్న స్వభావం మిన్న. 'స్వభావో దురతిక్రమః' అని కూడా అంటారు. దేన్ని మనం అతిక్రమించలేమో అదే స్వభావం. స్త్రీ స్వభావమథనం కావించిన వ్యక్తులు కొందరు (పురుషులేనని ముందు చెప్పబోయే సామెతల్ని చూస్తే అర్థమవుతుంది) నేర్పుగా తీర్పులు చెప్పినట్లు కొన్ని సామెతలు కల్పించారు. అవి నేటికీ జనవ్యవహారంలో నిలిచి ఉన్నాయి.

స్త్రీ స్వభావంలో పేర్కొనదగింది అనుమానం. 'అనుమానం ముందుపుట్టి ఆడది తర్వాత పుట్టింది' అనే సామెత ఈ విషయాన్నే తెలియజేస్తుంది. అగ్నికి ఆజ్యం తోడైనట్లు అనుమానానికి తోబుట్టువు అసూయ. 'అసూయ ముందు, ఆడది వెనుక'.

అనుమానంతోనే గదా రాముడంతటి ధర్మజ్ఞుడు సీతను అడవులపాలు చేసింది. అసూయతోనే గదా దుర్యోధనుడు భారత యుద్ధానికి కారకుడయ్యాడు.

అటు పురాణాలు, కావ్యాలలోనే కాదు నేటికీ మన సమాజంలో భార్యను అనుమానించి హింసించే భర్తలు, ఇంటి నుండి ఆమెను వెళ్లగొట్టేవారు ఎందరు లేరు? కాబట్టి అనుమానం, అసూయ స్త్రీ స్వభావానికే పరిమితమైనవి అనేకంటే మానవ స్వభావోచితమైనవి అనిపేర్కొనటం సమంజమని నా అభిప్రాయం.

స్త్రీ బుద్ధి చాలా విచిత్రమైంది. ఆమె ఆలోచనలు ఎటుపోతున్నాయో తెలుసుకోవటం కష్టం అంటారు. 'ఆడదాని బుద్ధి అపరబుద్ధి' 'పడతుల బుద్ధి పెడతల బుద్ధి' అనే సామెతల్ని పరిశీలించినప్పుడు అవి ఖచ్చితంగా పురుషులు లేదా పురుషపక్షపాతులు కల్పించినవే అని చెప్పవచ్చు.

స్త్రీ స్వభావం సుకుమారం,చంచలం అని నిరూపించే సామెత 'ఆడదాని నోటిలో నువ్వు గింజ నానదు' అనేది. 'ఆడదాని మాట ఆపదలకు మూలం' 'ఆడదాని మాట నీళ్లమూట' అనే సామెతలు ఉక్రోషం పట్టలేని ఎవరో పురుషపుంగవులు కల్పించినట్లుగా అన్పిస్తుంది.

స్త్రీలోని కొన్ని లక్షణాలు కుటుంబానికి క్షేమం కాదని భావించినట్లుగా తెలుస్తున్నది. 'కండ్లు ఆర్పినమ్మ ఇండ్లు ఆర్పును' అనే సామెత అటువంటిదే. 'నవ్వే ఆడదాన్ని ఏడ్చే మగవాడ్ని నమ్మరాదు' అని హెచ్చరిస్తుందొక సామెత. స్త్రీ కళ్లను గురించే కాక నాలుక గురించి కూడా తీవ్రమైన సామెత లున్నాయి. 'నాతిబలం నాలుకపైనే', 'ఆడదాన్ని నోరుపెట్టుకొని బ్రతకమన్నారు'.

'ముగ్గురు ఆడవాళ్ళు కూడితే పట్టపగలే చుక్కలు పొడుస్తాయి'. 'మున్నూరు శిఖలైనా కూడవచ్చుగాని, మూడు కొప్పులు కూడరాదు'. 'మూడు కొప్పులు ఒకటైతే ముల్లోకాలు ఏకమవుతాయి'. 'అయిదు శిఖలున్నా ఇబ్బంది లేదు కాని, మూడు కొప్పులు చేరాయంటే ముదనష్టమే?' – ఇటువంటి సామెతలు స్త్రీలలో ఐకమత్యం ఉండదని, అసూయాద్వేషాలతో, న్యూనాధిక్యతలతో వారు కలిసి ఏపనీ చేయలేరని చెప్పటానికి ప్రయత్నించినట్లుగా అనిపిస్తుంది. నిజానికి ఇంట్లో ఉప్పుగాని, పప్పుగాని ఏది అయిపోయినా సమయానికి చేతిలో డబ్బులు లేకపోయినా ఇరుగింటి పిన్నిగారినో, పొరుగింటి అక్కయ్యనో లేక ఎదురింటి

మామ్మగారినో అడిగి వాటిని క్షణాలలో అమర్చేది స్త్రీయే గదా! వివాహ వేడుక అయినా, నోములు, వ్రతాలు అయినా మరే కార్యక్రమమయినా హడావుడి అంతా మహిళలదే గదా! అందరూకలిసే ఆ కార్యక్రమాన్ని శుభప్రదంగా పూర్తిచేస్తారు. మరి వారికి ఐకమత్యం లేదనటం ఎంతవరకు సమంజసం? స్త్రీపట్ల అసూయా ద్వేషాలతో రగిలిపోయే పురుషులు కల్పించిన సామెతలు కావా ఇవి?

## 8. నడవడి

స్త్రీకైనా పురుషుడికైనా నడవడే ప్రధానం. ఆస్తి, అంతస్తు, గొప్ప తెలివితేటలు లేకపోయినా మంచి నడవడి గల వారికి సంఘంలో గౌరవముంటుంది. అందులోనూ పురుషుడి కన్నా స్త్రీ నడవడిని సమాజం ఎక్కువ గమనిస్తుంది. వంశాభివృద్ధికి కారకురాలు, సృష్టిభారాన్ని మోసేది స్త్రీయే గనుక అంతటి ప్రత్యేకత. పురుషుడు బీజం. స్త్రీ క్షేత్రం. క్షేత్రం పవిత్రంగా ఉంటేనే సంతాన సస్యం సారవంతమవుతుందని ప్రజల నమ్మకం.

స్త్రీ శీలాన్ని గూర్చిన ప్రస్తావన అత్త – కోడళ్లు, భార్యా భర్తలు, స్వభావం శీర్షికలలో కొంతవరకు ప్రస్తావించబడింది. కొంతకాలం స్త్రీని గృహసీమకే పరిమితం చేశారు. స్వాతంత్ర్యానికి అర్హురాలు కాదని ఆదేశించారు.[866] బయటకు

[866] "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" మనువు.
"తానే నేర్పరియైనను
మానిని దగు మెలకువెఱిగి మహినేలు జుమీ!
దానిని స్వేచ్ఛగ నిడిచెడు
హీనుడు తానైన దుదకునేడ్చు" – వేమన
"ఆడువాండ్ర స్వేచ్ఛ గీడొనర్చు" – వేమన
"బాల్యమున దల్లిదండ్రులు ప్రాయమున భ
వుండు వార్ధక్యమున నందనుండు జెప్పి
నట్లు చేయంగ దగు గాని యరసిచూడ
దెఱవలకు నెందు దమయిచ్ఛ దిరుగ జనదు"- జైమినీ భారతం – సూక్తి సుధాకరం, పుట – 961.

అడుగుపెడితే 'ఇల్లు ఇడ్చిన ఆడది, చెట్టు ఇడ్చిన కోతి' సమానమని 'ఆడది తిరిగిచెడును, మగవాడు తిరగక చెడును' అని భావిస్తారు.

ఆడది నీతి తప్పిన తర్వాత ఎక్కువ తక్కువలు పరిగణించరు. ఒకసారి తప్పినా పదిసార్లు తప్పినా ఒకటేనంటారు. 'ఆడుది నీతితప్పిన తర్వాత అంతేమిటి? ఇంతేమిటి?' అని ప్రశ్నిస్తుంది సంఘం. 'నూరు నోములు ఒక రంకుతో సరి' అంటుంది లోకం. అందువల్లనే అగ్గికోసం పొరుగింటికి పోయినా ఏం ప్రమాదం ముంచుకొస్తుందోనని భయపడతారు. 'అగ్గికి పోయినమ్మ ఆరు నెలల గర్భమై వచ్చె'నట. అందుకే 'ఆకుచుట్టను, ఆడదాన్ని నమ్మరా'దంటారు.

'ఇంటికూడు తిని, రంకుమొగుళ్ల వెంటపడే' స్త్రీలు, 'మగనిసొమ్ము తిని మిండని పాట పాడే' అతివలూ ఉంటారు. పొరుగింటి పుల్లకూర రుచి అన్నట్లు కొందరికి 'ఇంటి మొగుడు మట్టిగబ్బు, పొరుగింటి మొగుడు పూలవాసన'. 'అగడు మగడిపాలు, ఆనందం ఊరిపాలు' చేసే ఇల్లాండ్రూ ఉంటారు. ఇటువంటి స్త్రీలు పొందే సుఖం కన్నా పడే నిందలే ఎక్కువ. 'నీటికి నాచు తెగులు, నాతికి రంకు తెగులు', చివరకు 'సుఖంమరిగినమ్మ మొగుడ్ని అమ్ముకొని తినింద'ట. ఎవరు ఎన్నినీతులు చెప్పినా ఇటువంటి వారు మారటం కష్టం. 'నుతులెన్ని చెప్పినా మామ ప్రక్కనగాని తొంగోనన్నదట' ఒక ఆడది. ఒక్కొక్క అమ్మకు 'మొగుడ్ని చూచిన దండుగ, మిండని చూచిన పండుగ'.

చంచల స్వభావంతో క్రొత్తరుచులకోసం పరతపిస్తుంటారు కొందరు పడతులు. 'పండుగనాడు కూడ పాత మొగుడేనా?' అని ఈసడిస్తారు. కొందరు అందమైన మగవారి వెంట పడతారు. పూర్వకాలంలో రాజులు రాజ్యపర్యటన చేసినప్పుడు ఆయన్ని చూచిన కంటితో భర్తను చూడబుద్ధయ్యేది కాదట. ఈ విషయాన్నే తెలియజేస్తుందొక సామెత 'రాజును చూచిన కంటితో మొగుడ్ని చూస్తే మొత్త బుద్ధయిందట'.[867]

---

[867] "చక్కనైన వాని మక్కువ గన్నంత
దక్కువగను జూచు దనదు విభుని."
"వరుడు చక్కనైన వజ్రాల గనియైన
దళుకు మెఱుపువంటి తత్త్వమున్న
నవ్యపురుషుని వాంఛ యాడు దానికి నుండు." వేమన – సూక్తి సుధాకరం, పుట - 957

బంతిని అణిచిపెట్టే కొద్దీ ఎక్కువ శక్తితో పైకి ఎగిరినట్లుగా సత్ప్రవర్తన లేని వారిని ఎంతగా అదుపు చేయాలని ప్రయత్నించినా ఫలితం ఉండదు. మరింతగా విజృంభిస్తారు. 'ఇల్లు వెళ్లగొట్టగా ఇడుపుల శృంగారం, మొగుడు వెళ్లగొట్టగా మొత్తల శృంగారం' సాగిస్తారు. కవులు కూడ ముక్త కంఠంతో ఈ జారతనాన్ని నిరసించారు.[868] ఎంతో సుదీర్ఘంగా కవులు చేసిన విమర్శను ప్రజలు చిన్న సామెతలో నిక్షిప్తం చేశారు. 'తగులుకొన్న మొగుడు, తాటి చెట్టు నీడ నిలుకడ

[868] "పతి యెఱింగిన దన ప్రాణంబుపై వచ్చు
నసుభయంబున నుల్లమదరుచుండ
జనులు కాంచిన మానుషము తూలుదనుకను
పుయిలోటమున మోము పుల్లగిలగ
బోటికి దోచిన బొలియు దేకువయను
నెగడున జెయ్యులు వీడుపడగ
బంధుల కగపడ్డ బాయు నన్వయమను
కలకమై జెమటలు క్రమ్ముదేర
గ్రీడదెస గౌతుకంబులియాడ రతుల
చవులు గొనియాడ నేరని జారపొందు
హృదయమున కింపు చేయమి నెఱుక గలుగు
వారు దీని సుఖంబుగా గోరరెందు" – శ్రీమదాంధ్ర మహాభారతం, విరాట పర్వం, 2-70.
"ప్రాణేశుడెరిగిన బ్రాణంబునకు దెగు
దండించు నెఱింగిన ధరణి విభుడు
మామ యెఱింగిన మనువెల్ల జెడిపోవు
దులపరి యెఱిగిన దగులుసేయు
దలిదండ్రు లెఱిగిన దలలెత్త కుండును
యేరా లెఱింగిన నెత్తిపొడుచు
నాత్మజు లెఱిగిన నాదరింపరు చూచి
బంధువు లెఱిగిన బహియొనర్తు
రితరు లెఱిగిన నెంతయు జుల్కగా
జూతు రిందునందు సుఖము లేదు
యశము లేదు నిర్భయానందమును లేదు
జారు జేర జనదు చారుముఖికి" – శ్రీమదాంధ్రమహాభాగవతం, దశమస్కంధం, 978.

లేనివి'. అక్రమ సంబంధాల వల్ల కలిగే ఆనందం తాత్కాలికమేనని నిరూపిస్తుంది సామెత.

స్త్రీ పురుషుల విశృంఖల ప్రవర్తనకు వేదికలు జాతరలు. క్రొత్తరుచులకు అలవాటు పడిన మిండడు కండువా మార్చినంత సులభంగా ప్రియురాండ్రను మారుస్తుంటాడు. అందుకే అప్పులవానినమ్ముకొని అంగడికిపోరాదు, మిండని నమ్ముకొని జాతర పోరాదు' అంటారు. ఎన్ని లోపాలున్నా చేసుకున్న వానికున్న బాధ్యత చేపట్టినవానికుండదు గదా! 'ఉంచుకున్నవాడు మగడు కాడు, పెంచు కొన్నవాడు కొడుకు కాడు'.

పైకి పతివ్రత లాగ నటిస్తుంది జారిణి. 'నా పాతివ్రత్యం నామొదటి పెనిమిటికి తెలుసు' అంటుంది. 'బావ మరుదుల ప్రక్కన కూర్చోవటం ఎట్లా అని, దూరంగా పోయి, తురకోడి ప్రక్కన కూర్చుంటుంది'. అదే ఆమె జాణతనం. 'మిండలను మరిగినమ్మ, మీగడ తిన్నమ్మా ఊరకుండరం'టారు.

ఏదో వంకతో 'మొగుడిమీద కోపం చేత మాదిగవాని వెంటపోయే మాయలాడులు ఉంటారు. అయితే ఇందులోనూ తెలివి తేటల్ని ప్రదర్శించే స్త్రీలు కొందరైతే, బరితెగించి ప్రవర్తించే భామలు కొందరు. దీన్నే 'సాగించుకోవట' మంటారు. 'సాగినమ్మ చాకలితో మాట్లాడితే తప్పులేదు, సాగనమ్మ సంసారితో మాట్లాడినా తప్పు' పడతారు.

ఈ కులం ఆ కులం అని ఎంచకుండా, ముందు పడేపాట్లు ఊహించుకోకుండా ప్రవర్తించే జార స్త్రీలను గురించి పెక్కు సామెతలు వాడుకలో ఉన్నాయి. 'ఉండి ఉండి ఉప్పర వానితో పోతే, చచ్చేదాక తట్టలమోతే' గా! ఏమి సుఖం? ఒక ఉవిద 'ఊరకుండలేక ఉప్పర్ని తగులుకుంటే తట్టకొక తన్ను తగిలిస్తాడు'.

ఇటువంటి జారిణులు, సాధారణంగా పిల్లల్ని కనటానికి ఇష్టపడరు. అయితే 'ఒడుపు చేత కడుపు చేసుకొన్న' వాళ్లూ లేకపోలేదు.

కొంతమంది గుట్టు రట్టు కాకుండా కుటుంబంలోని దగ్గరి వారితో సంబంధాలు ఏర్పరచుకొంటారు. అదంతా ఇంటిగుట్టులో కలిసిపోతుందని. 'ఏమీ ఎరుగని పిల్ల, మామను మరిగిందట' అనే సామెత, 'కోరి కోరి బావతో పోతే కుంటివాడు పుట్టాడట' అనే సామెత ఇట్టివారిని చూచి ఏర్పడినవేనేమో! 'చెల్లెలి మగని చూచుకొని విర్రవీగుతుందో'క చేడియ. తమ కంటే చిన్న వయసు వారి పొందు కోసం అర్రులు చాస్తే 'అత్తకు అల్లుడాశ, బాపనికి పప్పాశ' అని లోకం విమర్శిస్తుంది.

'ఇల్లాలా! ఇల్లాలా! మగల్లెందరే? అంటే తోలాటకాయనతో తొంభైమంది' అని చెప్పే సాహస స్త్రీలు కూడా ఉంటారు. 'ఓలి ఇచ్చిన మొగుడికంటె కూలి ఇచ్చిన మొగుడెక్కువ' అని అభిమానించే స్త్రీ ప్రవృతిని ఇదమిత్థంగా ఎవరు ఏమని నిర్ణయించగలుగుతారు? శిష్టకవులు ఎందరో ఈ జార స్త్రీల వగలు, హొయలు ఎంతో సరసంగా నిరూపించారు. వేమన, అయ్యలార్యుడు, పిల్లలమర్రి పినవీభద్రుడు, అయ్యలరాజు నారాయణామాత్యుడు వీరిలో ముఖ్యులు.[869] దీనికంతటికీ కారణం

[869] జగడమునకు బోదు జారిణి యెప్పుడు
మాయజేసి పురుషు మమత బెట్టు."
"జిలిబిలి మాటల పలికెడు
కులటల నమ్మంగ రాదు."
"వ్యభిచారి మనసు నిలుపగ
ప్రభువులకును సాధ్యపడదు."
"మందు బెట్టి మగని మఱపించి విటుజేరు
సుందరాంగి పాడు సుదతి సుమ్ము."
"మగడు తప్పులేక మనసిచ్చియున్నను
సహజ గుణము వీడదు జారకాంత." – వేమన, సూక్తి సుధాకరం,పుట – 303.
"అన్యునిన్ మరగిన యింతి కాంతులకు
మానుగ బశ్చీమ గణ్యమేకదా" - భాస్కర రామాయణం,యుద్ధకాండ, 26-16 –పైదే.
"ఒఱపరిగన్న గూడ జనునూరక సన్నలు వాఱనాడు ద
త్తరపడు బోటి దెల్పెడు విధంబున నొత్తిలి బల్కునవ్వులు
ల్మఱు బొరుగిండ్లకేగు నొక పట్టున నిల్వదు చంటిమీద ముం
చెఱ గెడలించు నైశికపు సిగ్గు నటించుచు జార ధారుణిన్."

నన్నయ గారు పేర్కొన్నట్లు "సర్వప్రాణులకు సామాన్యంబయ్యును, మనోజురాగంబు వనితల కసహ్యంబయియుండు."[870] ఇటువంటి మనోవికారాలను నిగ్రహించుకొనే శక్తి పశుపక్ష్యాదులకు లేదు. కాని మానవుడు సంఘజీవి కనుక ఎన్నో నియమ నిబంధనలు, కట్టుబాట్లు అతని నడవడిని నియత్రిస్తుంటాయి గనుక మనోనిగ్రహం పాటించకతప్పదు. నిగ్రహం పాటించిన వారు తమ నడవడిని ఒరపిడి పెట్టుకొని కమ్మెచ్చున తీసిన బంగారం వలె ప్రకాశిస్తారు. వారే సంఘంలో గౌరవమర్యాదలు పొందుతారు. నిగ్రహం పాటించలేని వారు చరిత్ర హీనులవుతారు.

ఈ విధంగా దొంగబ్రతుకు బ్రతుకుతూ జారిణి అనిపించుకొనేకంటే ఇష్టంలేని మొగుడ్ని వదిలించుకొని మారుమనువు చేసుకోవటంమేలు. కానీ హైందవ సంఘం అంత త్వరగా మారుమనువును అంగీకరిచదు. ఒకవేళ ధైర్యంచేసి ఎవరైనా మారుమనువు చేసుకున్నా అందులోనూ ఎన్నో సమస్యలు. మారు మనువాడినా పూర్వపు మనువు గురించిన జ్ఞాపకాలు మాసిపోవు. అవి కలత పరుస్తూనే ఉంటాయి అని గుర్తు చేస్తుంది సామెత రూనం వహించిన ఒక అమాయకురాలి చేష్ట – 'మారుమనువు చేసుకొని, మొదటి మగని సుద్దులు చెప్పినట్లు.' ఒక్కొక్కప్పుడు రెండవ మగనికంటె మొదటి మగడే నయమనిపిస్తాడు. అట్టి సందర్భాన్ని పట్టే 'ముక్కుకొరికినా మొదటి మొగుడే నయం' అనే సామెత ఏర్పడిందేమో!

---

"పరులగన్న జంక పాపని ముద్దాడు
గోడనిక్కి చూచు గొప్పుదీర్చు
మాఱుమలయు నత్తమామలతో లేని
కిటుకు వెట్టి బంధకి వధూటి." —జైమిని భారతం , 3-26,29.

"పతిని దిరస్కరించి పరభర్తల జెందిన భామ పుణ్యము
ల్గతజలసేతు బంధములు గావె వచింపగ నెంత నోచినన్."
—హంసవింశతి, 1-129 - సూక్తి సుధాకరం, పుటలు – 302,303.

[870] శ్రీమదాంధ్రమహాభారతం, ఆదిపర్యం - 6-222.

## 9. అలంకరణం

అతివలకూ అలంకారానికీ అవినాభావ సంబంధం. అలకరించుకోవటం స్త్రీల జన్మహక్కుగా భావిస్తారు. కానీ "సహజంగా అందంవున్న స్త్రీకి, విలువైన బట్టలూ, నగలూ అనవసరం"[871] అని ఆధునిక కవి చలంగారి అభిప్రాయం. ఈ అలంకరణం కూడా స్త్రీ మనః ప్రవృత్తిని ప్రతిబింబిస్తుంది. స్త్రీ శబ్దంలోని సత్త్వ, రజస్తమో గుణాలు అలంకరించుకోవటంలో స్పష్టంగా బహిర్గతమవుతాయి. కొంతమంది అధికాలంకార ప్రియులు. ఇది వారి తమోగుణానికి నిదర్శనం. సముచితాలంకరణం రజో గుణానికి సంబంధించిందయితే నిరాడంబాలంకరణం సత్త్వగుణానికి సంకేతంగా భావించవచ్చు.

లోకం తమను అందగత్తెలుగా భావించాలని ఆరాటపడతారు అతివలు కొందరు. ఆ ఆరాటంలో అతిగా అలంకరించుకొని చూచేవారికి ఏహ్యాభావాన్ని కలిగిస్తారు. 'అంతనాడు లేదు, ఇంతనాడు లేదు, సంతనాడు పెట్టింది ముంతంత కొప్పు' అని లోకం తన అసహ్యాభావాన్ని మొహమాటం లేకుండా మొహం మీదే వెల్లడిస్తుంది. కొందమంది అలంకరించుకోవటం ఎంతసేపటికీ పూర్తికాదు.'చీర సింగారించే సరికి ఊరు మాటుమణిగింది', 'చీర సింగారించేటప్పటికి పట్నమంతా కొల్లపోతుంది' అనే సామెతలు ఇదే విషయాన్ని తెలియజేస్తున్నాయి. ఏదైనా 'చూచే వారుంటే సొమ్ములు పెట్టాలి, చేసేవారుంటే పిల్లల్ని కనాలి'.

ప్రకృతిలో మగపశువులు, పక్షులు అందంగా ఉండి స్త్రీ జాతిని ఆకర్షిస్తాయి. కాని దీనికి విరుద్ధం మానవ ప్రకృతి. స్త్రీలే అలంకారశోభతో పురుషుల్ని ఆకర్షిస్తారు. స్త్రీకి అలంకరణ తప్పని సరి అని నిరూపిస్తుందొక సామెత. 'కడుపు కూటికేడిస్తే, కొప్పు పూలకేడ్చింద' నేది. తినటానికి తిండి లేకపోయినా అది ఎవరికీ కనిపించదు. ఎదుటి వారికి కనిపించేది అలంకారమే గాబట్టి ఆభరణాలు లేకపోయినా కనీసం పూలయినా తప్పనిసరిగా అలంకరించుకొంటారు.

[871] ప్రస్తావన, చలం – ప్రజావాఙ్మయం, పుట – 3.

అలంకరణం సౌభాగ్య ప్రదమని భారతీయుల భావన. 'గాజుల చెయ్యి గలగలలాడితే ఇల్లు కలకలలాడుతుందం'టారు.

స్త్రీ తీర్చిదిద్దే కొప్పును బట్టి ఆమె ఐశ్వర్యాన్ని అంచనా వేస్తుంటారు. 'కుంచెడుంటే కుడికొప్పు, అడ్డెడుంటే ఎడమ కొప్పు' పెడతారట. స్త్రీ వస్త్రధారణ ఆమెకు రాబోయే అదృష్టానికి సూచన అని ప్రజలు నమ్ముతున్నట్లుగా సూచించే సామెత – 'చీలమడిమలదాకా చీర ఉంటే, మోకాలు బంటి సిరి ఉంటుంది.' 'చీరకట్టినమ్మ శృంగారం గుడ్డ కట్టినమ్మ కులుకు' పోతారట!

ఆడదానికి అక్కున చెక్కున కాస్తో కూస్తో అలంకరణం ఉంటేనే అందం. అవేమీ పెట్టుకోకుండా పిల్లాండ్లు మాత్రం పెట్టుకొని కులుకుతుంటే లోకం ఆక్షేపిస్తుంది. 'అక్కున లేదు చెక్కున లేదు ప్రీతిగా కాలికి పిల్లాండ్లు' అని. పూర్వం చెవి, ముక్కు బోసిగా ఉంటే సహించేవాళ్లు కాదు. అందుకే 'ఉత్తచెవి కన్న, 'చెవ్వాకు చెవి మేలం'టారు. చెవ్వాకు విలువైనది కాకపోవటం వల్లే చెవ్వాకు పోయినమ్మకు దుఃఖమూలేదు దొరికినమ్మకు సంతోషమూ లేదు' అంటారు. ఒక్కొక్క స్త్రీ అదృష్టమేమో కాని 'ఏరువచ్చినా ఎద్దడి నీరే, మొగుడు చచ్చినా మొండిమెడే!'

కాస్తో కూస్తో ఉన్నవాళ్లకి అలంకరణం మీద అధికారాటం. 'వీసంగల అమ్మి విడువా ముడువా, కాసుగల అమ్మి కట్టా పెట్టా'.

ఏ అలంకరణమయినా శోభించాలంటే సహజ సౌందర్యం ఉండాలి. అందుకే అంటారు 'చక్కనమ్మ చిక్కినా అందమే' నని.

సహజ సౌందర్యం లాగానే మంచి జుట్టు ఉంటేనే కొప్పు పెట్టినా, జడవేసినా అందం చందం. 'జుట్టుంటే ఎన్ని జడలైనా వేయవచ్చు' 'జుట్టువున్న అమ్మ ఏ కొప్పయినా పెట్టవచ్చు.' 'బోడితలకు బొండు మల్లెలు ముడిస్తే' ఏం బావుంటుంది? అయితే 'అప్పుచేసి కొప్పు దీర్చటం' మాత్రం ఇల్లు గుల్ల చేసుకోవటమే.

## 10. ఇల్లు – ఇల్లాలు

బాహ్య ప్రపంచం పురుష సామ్రాజ్యమైతే, స్త్రీది గృహ సామ్రాజ్యం. గృహాన్ని తీర్చిదిద్దుకోవటంలోనే గృహిణి నేర్పరితనం గోచరిస్తుంది. అందుకే అంటారు. 'అమ్మకళ గుమ్మంలో తేలుతుంది' అని. 'ఇంటికళ ఇల్లాలే చెబుతుంద' ని అన్నా ఇదే అర్థం. 'ఇంటి లక్ష్మిని వాకిలి చెబుతుంద' నే వ్యవహారమూ ఉంది. 'ఇల్లు చూచి ఇల్లాలిని చూడమంటారు' కొందరు.

భర్త సంపాదించిన డబ్బులతోనే ఇంటి ఖర్చులన్నీ గడపాలి. రాబడికి మించిన ఖర్చు పెడుతూ విలాస జీవితాన్ని గడిపే స్త్రీ క్షంతవ్యురాలు కాదు. 'ఆడదాని చేతి అర్థం, మగవాడి చేతి బిడ్డ బ్రతుకవు' అంటారు. ఆడదానికి పెత్తనమివ్వక పోయినా బాధే, ఇచ్చినా బాధే. 'ఆడపెత్తనం తంబళ్ల దొరతనం' అనే ఆక్షేపణ అడుగడుగునా వినిపిస్తుంది. 'బహునాయకము, బాల నాయకము, స్త్రీ నాయకము చేటం'టారు.

పొదుపు లేని కాపురానికి అభివృద్ధి ఉండదు. రోజూ పప్పులు,పాయసాలు వండుకు తింటుంటే అప్పులపాలు కాక తప్పదు. అక్క ఇంటికి వచ్చిన చెల్లెలు 'అప్పా! పప్పు వండవే, చెడే వాడు బావ ఉన్నాడుకదా!' అంటుంది. ఆలుమగలు ఇద్దరూ దుబారాపరులైతే దరిద్రదేవత ఇంట్లోనే తిష్టవేసుకొంటుంది. 'అమ్మ దాసర్లకు, అయ్య జంగాలకు' పెడుతుంటే కాపురం ఎలా బాగుపడుతుంది? దీనికి తోడు ఆడపడుచుల సత్కారాలు కూడా ఉన్నాయంటే ఇక ఖర్చులపై అదుపే ఉండదు. 'అమ్మవారి మొక్కుతీరదు, ఆడబిడ్డ అప్పూ తీరదు.'

కొంతమంది ఇల్లాండ్రు ఇరుగు పొరుక్కి దోచిపెట్టి స్వంత ఇల్లే గుల్లచేస్తారు. అటువంటి స్త్రీ 'ఇంటికి జ్యేష్ఠాదేవి, పొరుగుకు శ్రీ మహాలక్ష్మి' అనే విమర్శకు గురవుతుంది. 'ఇంటికి ఏబ్రాసి, పొరుగుకు శ్రీ మహాలక్ష్మి' అన్నా ఇదే అర్థం. కొందరు స్త్రీలు ఇతరులకు ఏమైనా పెడితే వారినుండి దానికి రెట్టింపు ఆశిస్తారు. అటువంటి వాళ్లను బట్టే 'అట్టు పెట్టినమ్మకు అట్టున్నర' అనే సామెత ఏర్పడి ఉంటుంది. 'ఇందమ్మా తియ్యకూర అంటే, ఇందమ్మ పుల్లకూర' అనే అతివలే

ఎక్కువ మంది ఉంటారు. 'ఇచ్చితినమ్మా వాయనం అంటే, పుచ్చుకొంటినమ్మా వాయనం' అన్నట్లు బదులు తీర్చుకుంటారు. 'కంకణాల చెయ్యి ఆడితే, కడియాల చెయ్యి ఆడకుండా ఉంటుందా?'

కొందరమ్మలు పిల్లిక్కూడా బిచ్చం వెయ్యరు. ఈ లుబ్ధత్వం పిల్లలు లేని వాళ్లకే ఎక్కువగా ఉండటం గమనార్హం. బిడ్డలుకన్న వాళ్లకే పీడితప్రజల బాధలు అవగతమవుతాయి. 'బిడ్డలను కన్నమ్మా, బిక్షము పెట్టినమ్మా చెడరంటుంది' లోకం. కొందరు మాటల్లోనే తమ నేర్పరితనం చూపిస్తారు. దానం చేయకపోయినా చేసినట్లు వట్టిమాటలు చెప్పి చివరకు రిక్తహస్తాలు చూపిస్తారు. అట్టివారిని చూచే 'మాటలు తల్లిమాటలు, పెట్టు సవతి తల్లి పెట్టు' అనే సామెత ఏర్పడింది. 'మాదాకవళమమ్మా! అంటే మాయింటాయన నీకు కనిపించలేదా?' అంటుందొక ఇల్లాలు. ఇది మాటనేర్పో లేక తనదీ అటువంటి దారిద్ర్యస్థితో మరి! దగ్గరి బంధువులు ఇంటికొస్తే ఒక్కొక్కమ్మ ఆదరించే తీరు ఆశ్చర్యంగా ఉంటుంది. దీనిని అభివర్ణిస్తూ ఏర్పడిందే ఒక పెద్ద సామెత. 'అయ్యో వదినా! అంతకుముందు వచ్చిన అన్న బంతిన తిందువు, ఇంతకుముందు వచ్చిన ఏరాలి బంతిన తిందువు, ఇప్పుడెలాగు? ఎలుక పొయ్యి ఎత్తుకు పోయింది!' అనేది. ఇంత గొప్ప ఆదరణ ఆమెది.

భార్యాభర్తలిద్దరూ కష్టపడి పనిచేస్తేనే ఆ ఇల్లు దినదిన ప్రవర్ధమాన మవుతుంది. 'అయ్య దేశ సంచారం, అమ్మ గ్రామ సంచారం' చేస్తుంటే ఆ కాపురం బాగుపడ్డట్టే. 'అవ్వ వడికిన నూలు తాత మొలత్రాటికి సరి' అన్నట్లుగా ఉండకూడదు కాపురం. ఆలొక దారి మగడొక దారి అయితే ఆసంసారం అపహాస్యం పాలవుతుంది. 'ఆగభోగాలు అక్కవి, అంబట్లో గింజలు బావవి' గా ఉండకూడదు బ్రతుకులు. తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లన్నట్లుగా ఆడది ప్రవర్తిస్తే ఆ సంసారంలో సంతోషం ఉండదు. 'ఆడది మెచ్చిందే అందం, మగవాడికన్ను మసక'గా కాకూడదు కాపురం.

ఇంటికి గుట్టు, రోగానికి రట్టు ప్రధానం. అదేవిధంగా 'అల్లునికి బెట్టు ఇల్లాలికి గుట్టు' ఉండాలంటారు. లేకపోతే గౌరవం ఉండదు.

కాయకష్టం చేయకుండా సోమరిగా ఉండే ఇల్లాండ్రకు చురకలు వేస్తుంది సంఘం. 'ఏమి చేసి బ్రతుకుదునమ్మా అంటే, నోరు చేసుకు బ్రతుకు బిడ్డా!' అని వ్యంగ్యంగా అంటారు. ఏమీ చేతకానమ్మకు చేతనైనదొకటే ఏడ్వటం. 'ఏమీ లేనమ్మకు ఏడ్పుల శృంగారం' అని సామెత కూడ ఏర్పడింది. స్త్రీల ఈ ఏడుపు నైపుణ్యాన్ని శిష్టకవులు కూడా పలు విధాల వర్ణించారు.[872]

వంకలేనమ్మ డొంక పట్టుకు ఏడ్చినట్లు 'ఏలు మీద గోరు మొలిచింది, ఏంజేతు మొగుడా!' అనే వాళ్లకు ఎవరేం చెప్పగలుగుతారు? ఏడవటం కూడా ఒక కళ. దానికీ నేర్పుకావాలి. 'నేర్చినమ్మ ఏడ్చినా బాగుంటుంది' అంటుంటారు కొందరు. దీనికికూడా మాటలు బాగా నేర్చుకోవాలి. 'మాటలు నేర్చినమ్మ ఏడ్చినా ఒక సొంపే'. 'ఏడ్చేదాని ఎడమ చేతికిందా, కుట్టే వాని కుడిచేతికిందా కూర్చోరాద'నేది ఒక హెచ్చరిక.

కొంతమంది మహిళలకు తినటమే తప్ప వంటచేయటం చేతకాదు. అందుకే 'కూడువండని ఆడది మంచం అల్లని మగవాడూ' ఉండరాదంటుంది

---

872 పాటున కింతులోర్తురె! కృపారసాత్మక! నీవు బోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోకె గనుంగొను మంచు జూపి య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చె గల స్వనంబుతో
మీటిన విచ్చు గబ్బి చను మిట్టల నశ్రులు చిందువందుగన్. -మనుచరిత్ర
ఈసున బుట్టి డెందమున హెచ్చిన కోప దవానలంబుచే
గాసిలియేడ్చె బ్రాణవిభు కట్టెదురన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయి జేల చెరంగిడి బాల పల్లవ
గ్రాస కషాయ కంఠలకంఠ వధూకలకాకలీధ్వనిన్. - పారిజాతాపహరణం
ఆజాబిల్లి వెలుంగు నెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున బటాగ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవాననయేడ్చె గిన్నర వధూరాజత్కరాభోజకాం
భోజీమేళ విపంచికారస సుధా పూరంబు తోరంబుగాన్. – వసుచరిత్ర
రామకృష్ణుడీ పద్యములపై నిలభిప్రాయ మొసగెనట. అల్లసాని పెద్దన అటు నిట్టు నేడ్చెను, ముక్కు తిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చెను, బట్టుమూర్తి బావురని యేడ్చెను.
– చాటుపద్య మణిమంజరి, పుటలు – 147-148.

సామెత. 'మంచం అల్లలేని మగవాడు – మజ్జిగ చిలకలేని ఆడది'. ఈ సామెత కూడా పై సందర్భంలోనిదే. సోమరితనాన్ని మించిన దారిద్ర్యంఉండదు. కూర్చున్న చోటినుండి లేవలేని సోమరి స్త్రీలను చూస్తే పెద్దలు సహించలేరు. 'కూర్చుండి లేవలేనమ్మ వంగుని శివరాత్రికి వస్తా' నంటే ఎవరు తీసుకు వెళతారు? 'చేతకానమ్మకు చేష్టలు మెండు, చెల్లని రూకకు గీతలు మెండు', 'చేయలేనమ్మకు చేష్టలు మెండు, వండలేనమ్మకు వగపులు మెండు' అని లోకం విమర్శిస్తుంది.

ఇల్లాలు ఇంటిని చక్కదిద్దుకోవటమంటే తన సుఖం, భర్త సుఖం చూసుకోవటమే కాదు. అత్తమామలను, ఆడపడుచులను కూడా సమాదరించాలి. 'ఆడపడుచు ఉసూరుమంటే ఆరుతరాలు అరిష్టం' అని మన సంప్రదాయం హెచ్చరిస్తుంది. 'ఆడపడుచు కొరతా, అడ్డుగోడ కొరతా తీరదం'టుందొక సామెత. 'ఆమె ఎవరంటే ఆరో నెలలో పట్టిన దయ్యమ'ని ఆడపడుచును నిరసించకూడదు.

స్త్రీ ప్రవర్తనలో అనౌచిత్యం ఏమాత్రం పొడగట్టకూడదు. అలా జరిగితే ఆమె నడవడిని అనుక్షణం గమనించే లోకం 'తోచీతోచనమ్మ తోడికోడలు పుట్టినింటికి వెళ్లింద'ని నిరసిస్తుంది. దీని పొడుగింపే 'అదీ తోచనమ్మ ఆడబిడ్డ అత్తగారింటికి వెళ్లింద'నే సామెత. 'అప్ప సిరి చూచుకొని మామ మడమలు త్రొక్కింద'నే సామెత కూడా స్త్రీలోని అనౌచిత్యాన్ని పరిహసించేదే. తన అసమర్థతను కప్పిపుచ్చుకోవటానికి 'ఆడలేనమ్మ మద్దెల ఓడం'టుంది.

కొంతమంది మగువలు ఊరికే ఆరాటపడుతుంటారు. అటువంటి వారిని చూచి 'ఆవాలు తిన్నమ్మకు యావ, ఉలవలు తిన్నమ్మకు ఉలుకు','ఉలవలు తిన్నమ్మకు ఉలుకు,సజ్జలు తిన్నమ్మకు సలుకు' అని నిందిస్తుంది లోకం.

'పేరు కమలాక్షి' అయినా 'చూపులు కాకిచూపులు'. 'పేరు కమలాక్షి కాని కండ్లేమో చీపురివి' అని పేరుకుతగ్గ అందంలేని మగువల్నికూడా పరామర్శించాయి సామెతలు. అందానికి తగ్గ పేరు, పేరుకు తగ్గ అందం అందరిపట్లా ఆశించలేం గదా!

ఇంటికి పెద్దదిక్కు అవసరమని గ్రహించే వివేకురాండ్రయిన అతివలుకూడా లేకపోలేదు. 'ఇంటికి అవ్వ, కొలతకు తవ్వ' అనే సామెత ఈ విషయాన్నే తెలియజేస్తుంది.

తల్లి, తండ్రి ఇద్దరిలో ఎవరిపాత్ర గొప్పది అనే ప్రశ్న అర్థవంతమయింది కాదని చెప్పవచ్చు. ఎందుకంటే సంసారంలో ఇద్దరి పాత్రా ముఖ్యమైనదే. అయితే హిందూ సంప్రదాయంలో తండ్రి కంటే తల్లికి కొంత ఎక్కువ ప్రాధాన్యమిచ్చినట్లుగా స్పష్టమవుతుంది. కొన్ని సామెతలుకూడా ఈ విషయాన్నే నిరూపిస్తున్నాయి. తండ్రి లేకపోయినా తల్లి ఉంటే కూతుళ్లు పుట్టింటికి వస్తారు. 'తల్లిలేని పుట్టిల్లు, ఉల్లిలేనికూర' అనేసామెత తల్లి ప్రాముఖ్యాన్ని తరచి చెపుతుంది 'ఏనుగంత తండ్రి ఉండే కంటే, ఏకంత తల్లి ఉండేది మేలు' అనే సామెతలో మన సంఘం తల్లికి ఎటువంటి స్థానాన్ని సమకూర్చిందో స్పష్టమవుతుంది.

'అడగనిదే అమ్మయినా పెట్టదు' అనే సామెతలో నిజం లేదనిపిస్తుంది. బిడ్డ ఏడవకపోయినా సమయం చూచి పాలు పట్టేది తల్లేకదా! బిడ్డ పెద్దయింతర్వాత ఆటల్లో పడి ఆకలి మర్చిపోతే పిలిచి అన్నం పెట్టేది అమ్మేకదా! కుటుంబ సభ్యులందరినీ వేళమించిపోకుండా భోజనాలకు రమ్మని హడావుడి చేసేది అమ్మే కదా! ఇదే విషయాన్ని 'ఆంధ్రమహాభారతం' నిరూపించింది. పాండవులు అరణ్యవాసానికి బయలుదేరినప్పుడు కుంతీదేవి సహదేవుడ్ని ద్రౌపదికి అప్పగిస్తూ వీడు చిన్నపిల్లవాడు, తనకు ఆకలివేసినా అన్నమని అడగడు, నేనే పిలిచి పెడతాను అంటుంది.[873]

**నిరసన :** జాతికి మూలం నాతి. నాతికి జీవం నీతి. అయినా సంఘం అడుగడుగునా ఆడబ్రతుకును నిరసిస్తుంది ఎందుకో! 'ఆడదాని బ్రతుకు అనదబ్రతుకు' అనీ

[873] "కడు బసిబిడ్డ వీడొకటి కాదవునా నెరుగండు ముందరె
యృడ నొకపాటెరుంగ డెద యెంతయు గోమల మెప్పుడైననే
గుడువగ బిల్తుగాని తనకుంగల యాకటి ప్రొద్దెరుంగ డీ
కొడుకిటు పోకకున్ మనము కుందెడు నిన్గన్ యూరడిల్లెడిన్."

—శ్రీమదాంధ్ర మహాభారతం, విరాటపర్వం, 2-213.

'ఆడబ్రతుకూ ముండబ్రతుకూ అదవే' అనీ కించపరుస్తుంది. ఈ నిరసనలు, అవమానాలూ భరించలేక స్త్రీ చివరకు 'ఆడదై పుట్టే కంటే అడవిలో మానై పుట్టేది మేలు' అని దుఃఖిస్తుంది. ఇటువంటి నిందలకూ నిరసనలకూ కారణం స్త్రీ నిస్సహాయత, పరాధీనత. అవి తొలగిపోయినప్పుడు సంఘంలో స్త్రీకి సముచిత స్థానం, గౌరవం లభిస్తాయని భావించవచ్చు.

స్త్రీ గాని పురుషుడు గాని పుట్టటానికెవరూ బాధ్యులు కారు. పుట్టిన తర్వాత తమ బాధ్యతను యధాశక్తిగా నిర్వహించటం ఎవరికైనా కర్తవ్యం. సంఘం లేనిపోని గౌరవాన్నిచ్చి మగవాడ్ని అందలాలెక్కించింది. మగువను అణగద్రొక్కింది. 'మగవాని బ్రతుకు చిప్పనిండ మెతుకు, ఆడదాని బ్రతుకు గంజిలోని మెతుకు' అనే సామెతను బట్టి సంఘం వీరిద్దరికీ ఎంతటి తారతమ్యాన్ని చూపిస్తుందో అవగతమవుతున్నది.

ఆడదాన్ని కామదృష్టితో చూచే సంఘాన్ని దానవ సంఘంగా భావించాలి. 'ఆడదాన్ని చూసినా, అర్థాన్ని చూసినా, బ్రహ్మకైనా పుట్టు రిమ్మతెగులు' అనే సామెతలో పురుషుడిలో పొంచి ఉన్న కీచక స్వభావం గోచరిస్తుంది. అదే దానవత్వమంటే మాతృమూర్తిగా మహిళను సంభావించినప్పుడే ఆ సంఘం సంస్కారవంతమైన సంఘం అవుతుంది. అదే నిజమైన నాగరికత. కన్నుదోయికి అన్యకాంత లడ్డంబైన మాతృభావముచేసి మరలిపోయే ప్రహ్లాద ప్రవృత్తి ప్రజానీకంలో ఏర్పడినప్పుడు అది మహోన్నత సభ్యతా సంఘం అనిపించుకుంటుంది.

సామెతలు చాలావరకు స్త్రీని నిరసిస్తున్నాయి. రంకులు బొంకులు స్త్రీకి అంటగడుతున్నాయి. ఏమైనా ఇవి పాత సమాజంలోని రోతనే ప్రతిబింబిస్తున్నాయి అనిపిస్తుంది. మంచిని నిరూపించే సామెతలకన్నా చెడును విమర్శించే సామెతలనే ఎక్కువగా ప్రజలు సృష్టిస్తారేమో! ఏమైనా ఇదీ ఒకందుకు మంచిదే. ఇట్టి వాటిని పురస్కరించుకొని ఆత్మవిమర్శ కావించుకొంటూ తనను తాను సంస్కరించుకొని స్త్రీ సంఘానికి జీవగఱ్ఱలాగా నిలవగలుగుతుంది.

'అతిథి పట్ల చూపే ఆదరమే
జాతి సంస్కృతికి కొలమానం'

## ముఖాముఖి నిర్వహణ

| | | | |
|---|---|---|---|
| 1 | డా. కాసరనేని సదాశివరావు, ఎమ్.ఎస్. | - | ప్రజావైద్యశాల, క్రొత్తపేట, గుంటూరు. |
| 2 | ఆచార్య తూమాటి దొణప్ప | - | తెలుగు శాఖాధిపతి, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జుననగర్. |
| 3 | శ్రీ ఆకురాతి పేరయ్య (53) | - | చేనేత పారిశ్రామికులు, వ్యాపారి, క్రొత్తపేట, గుంటూరు. |
| 4 | శ్రీమతి కొట్రా వసుమతమ్మ (60) | - | క్రొత్తపేట, గుంటూరు. |
| 5 | శ్రీ పి. రామబ్రహ్మం (51) | - | వజ్రాల వ్యాపారి, పెద్ద బజారు, గుంటూరు. |
| 6 | శ్రీ వెలగలేటి అయ్యన్నాచార్యులు (61) | - | విశ్వకర్మ, ఏ.టి. అగ్రహారం, గుంటూరు. |
| 7 | డా. దివి శ్రీమన్నారాయణ, ఎల్,ఐ.ఎమ్; ఎన్.డి. | - | ఆయుర్వేద వైద్య నిపుణులు, పట్టాభిపురం, గుంటూరు. |
| 8 | శ్రీమతి విష్ణుభొట్ల లక్ష్మమ్మ (72) | - | క్రొత్తపేట, గుంటూరు. |
| 9 | శ్రీమతి కన్నెగంటి బసవపున్నమ్మ (55) | - | దుగ్గిరాల. |
| 10 | అంతనగారి లక్ష్మమ్మ (67) | - | దుద్దుకూరు, మెదక్ జిల్లా. |
| 11 | డా. కాసరనేని జయప్రదాంబ, ఎమ్.బి.బి.ఎస్., డి.జి.వో. | - | ప్రజావైద్యశాల,క్రొత్తపేట, గుంటూరు. |
| 12. | ముసిరిగారి పుష్పమ్మ (57) | - | కరీంనగర్, కరీంనగర్ జల్లా. |

**"అపదలకోర్చి సంపదలననుభవించిటమే స్త్రీ జీవితంలోని అంతర్యం.**

**జానపద సాహిత్యం ఈ ఆంతర్యానికి చక్కగా అద్దం పడుతుంది"**

# ఆధార గ్రంథ పట్టిక

## తెలుగు


1 అప్పకవీయుము : కాకునూరి అప్పకవి, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండే సన్స్, చెన్నపురి, 1934.

2 ఆంధ్ర పదములు – పాటలు : టేకుమళ్ల అచ్చుతరావు, సీతారామా ముద్రణశాల, నరసాపురం, 1924.

3 ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి : ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీఖండవల్లి బాలేందు శేఖరం, బాలసరస్వతి బుక్ డిపో, కర్నూలు, మద్రాసు, ద్వితీయముద్రణ, 1957

4 ఆంధ్రుల సాంఘిక చరిత్ర : శ్రీ సురవరము ప్రతాపరెడ్డి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1949.

5 ఆటలు – పాటలు : నేదునూరి గంగాధరం, ప్రాచీన గ్రంథావళి, రాజమహేంద్రవరం.

6 కోయిల : రాయప్రోలు సుబ్బారావు.

7 క్రీడాభిరామము : వినుకొండ వల్లభరాయుడు, నదోదయ సమితి, హైదరాబాదు, 1968.

8 చాటు పద్య మణిమంజరి : శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1961.

9 జానపద కళాసంపద : ఆచార్య తూమాటి దోణప్ప, నిర్మలా పబ్లికేషన్స్, విశాఖపట్టణం, 1975.

| | | | |
|---|---|---|---|
| 10 | జానపద గేయాలు (ప్రథమ సంపుటి) | : | ఎల్లోరా, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1955. |
| 11 | జానపద గేయాలు, ద్వితీయ సంపుటి | : | ఎల్లోరా, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1959. |
| 12 | జానపద గేయ వాఙ్మయ పరిచయము | : | హరి ఆదిశేషువు, నవ్వ విజ్ఞాన ప్రచురణలు, గుంటూరు, ద్వితీయ ముద్రణ, 1967. |
| 13 | జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి | : | వేదునూరి గంగాధరం, విశ్వసాహిత్యమాల, రాజమండ్రి, 1961. |
| 14 | తృణ కంకణం | : | రాయప్రోలు సుబ్బారావు. |
| 15 | తెలంగాణ జానపద గేయాలు | : | లక్ష్మీకాంతమోహన్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1972. |
| 16 | తెలంగాణ పల్లెపాటలు | : | ఆచార్య బి. రామరాజు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1968. |
| 17 | తెలుగు కన్నడ జానపద గేయాలు | : | డా. ఆర్వీ ఎస్. సుందరం, జానపద విజ్ఞాన భారతి, మైసూరు, 1979. |
| 18 | తెలుగు జానపద గేయ సాహిత్యము | : | డా.బి. రామరాజు,ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాదు, 1958. |
| 19 | తెలుగు జానపద గేయ గాథలు | : | డా. నాయని కృష్ణకుమారి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1977. |
| 20 | తెలుగుదేశపు జానపద గీతాలు | : | డా. ఎస్. గంగప్ప, సమాచార పౌర సంబంధశాఖ, హైదరాబాదు, 1976. |

| | | | |
|---|---|---|---|
| 21 | తెలుగు పల్లెపాటలు | : | ప్రయాగ నరసింహశాస్త్రి, కవితా పబ్లికేషన్స్, విజయవాడ, 1960. |
| 22 | తెలుగు సామెతలు | : | శ్రీ ముసునూరి వేంకటశాస్త్రి, విశ్వభారతి ప్రచురణాలయం, రాజమహేంద్రవరం, రెండవ ముద్రణ, 1958. |
| 23 | తెలుగు సామెతలు | : | విశ్వనాథ సత్యనారాయణ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, ద్వితీయ ముద్రణ. |
| 24 | తెలుగు హాస్యము | : | శ్రీ ముట్నూరి సంగమేశం, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1952. |
| 25 | త్రివేణి | : | సంపాదకులు శ్రీ బి. రామరాజు, శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీ నేదునూరి గంగాధరం, శ్రీ తూమాటి దొణప్ప, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి, హైదరాబాదు, 1960. |
| 26 | నరస భూపాలీయము | : | రామరాజభూషణుడు, శిరోమణి సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి వివరణ, యం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్టణం, మద్రాసు, సికింద్రాబాదు, ఐదవ ముద్రణ, 1976. |
| 27 | నాట్యవేదము | : | శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, అభినవభారతి, గుంటూరు. |

| | | | |
|---|---|---|---|
| 28 | పల్లెపదాలు | : | 'కృష్ణశ్రీ', ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు, (మన్మథ సంక్రాంతి). |
| 29 | ప్రజావాఙ్మయం | : | చింతా దీక్షితులు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1955. |
| 30. | పాండురంగ మహాత్మ్యము | : | తెనాలి రామకృష్ణ కవి, వావిళ్ల రామశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు, 1968. |
| 31 | పారిజాతాపహరణము | : | నంది తిమ్మనార్యుడు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1978. |
| 32 | బాలభాష | : | వేటూరి ప్రభాకరశాస్త్రి, ఆర్యశ్రీ ప్రచురణాలయం, మద్రాసు. |
| 33 | బాలికా భూషణము | : | మాణిక్యవల్లియను మాతు శిరోన్మణి, శ్రీనికేతన ముద్రాక్షరశాల, చెన్నపురి, 1898. |
| 34 | మధుర కవితలు | : | 'ఎల్లోరా' విజయ పబ్లిషింగ్ కంపెనీ, విజయవాడ, 1961. |
| 35 | మనుచరిత్ర | : | అల్లసానిపెద్దన, వేంకట్రామ గ్రంథమాల, వేంకట్రామ అండ్ కో, విజయవాడ, మద్రాసు, హైదరాబాదు, 1968. |
| 36 | మాధురీదర్శనము | : | రాయప్రోలు సుబ్బారావు. |
| 37 | మిన్నేరు | : | నేదునూరి గంగాధరం, ప్రాచీన గ్రంథావళి, రాజమహేంద్రవరం, 1968. |
| 38 | ముత్యాల సరాలు | : | గురజాడఅప్పారావు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1953. |

| | | | |
|---|---|---|---|
| 39 | మున్నీరు | : | నేదునూరి గంగాధరం, ప్రాచీన గ్రంథావళి, రాజమహేంద్రవరం, 1973. |
| 40 | మోటపదాలు | : | బాదగౌని నరేంద్ర, నవోదయ సమితి, హైదరాబాదు, 1962. |
| 41 | యుగయుగాల్లో భారతీయ మహిళ | : | జె. వరలక్ష్మి, హైదరాబాదు. |
| 42 | లోకోక్తి ముక్తావళి (అను) తెలుగు సామెతలు | : | విద్వాన్ వి. కృష్ణమూర్తి, ది మోడరన్ పబ్లిషర్స్, తెనాలి, 1955. |
| 43 | విజయవిలాసము | : | చేమకూర వేంకట కవి, ప్రకాశకులు 'విశిష్టరచనలు' హైదరాబాదు, 1968. |
| 44 | వేదకాలపు స్త్రీలు | : | జటావల్లభుల పురుషోత్తం, కొవ్వూరు, 1933. |
| 45 | శ్రీమదాంధ్ర భాగవతము | : | బమ్మెర పోతనామాత్యుడు, రాయలు అండ్ కో, కడప. |
| 46 | శ్రీమదాంధ్ర మహాభారతము, | : | వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు, 1967. |
| | ఆది పర్వము | | నన్నయ " |
| | అరణ్యపర్వము | | ఎఱ్ఱన " |
| | విరాట పర్వము | | తిక్కన " |
| | ఉద్యోగ పర్వము | | తిక్కన " |
| 47 | సరాగాలు | : | 'ఎల్లోరా' విజయ పబ్లిషింగ్ కంపెనీ, విజయవాడ, 1961. |
| 48 | సాంప్రదాయిక విజ్ఞానం | : | టేకుమళ్ల కామేశ్వరావు, నవ్య సాహిత్య పరిషత్తు, గుంటూరు, 1941. |

| | | | |
|---|---|---|---|
| 49 | సామెతలు | : | గట్టినేని రామస్వామి చౌదరి, శ్రీవేంకటేశ్వర గ్రంథమాల, చినగాదెల వర్రు, గుంటూరు జిల్లా. |
| 50 | సెలయేరు | : | నేదునూరి గంగాధరం, దేశోద్ధారక గ్రంథమాల, హైదరాబాదు, 1956. |
| 51 | సాహిత్య దర్శనము | : | ఆచార్య కాకర్ల వేంకట నరసింహం, కె. హరనాథ్ అండ్ సన్స్, విశాఖపట్టణం. |
| 52 | సాహిత్య శిల్ప సమీక్ష | : | ఆచార్య సింగళి లక్ష్మీకాంతం, మాలికో పబ్లిషర్స్, తిరుపతి, 1966. |
| 53 | సుమతీ శతకము | : | గొల్లపూడి రామస్వామి సన్, రాజమండ్రి, 1979. |
| 54 | సూక్తి సుధాకరము | : | పండిత పెనుమత్స సత్యనారాయణ రాజు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1963. |
| 55 | స్త్రీల వ్రత కథలు | : | శ్రీ బాలాంత్రపు వేంకట్రావు, సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమండ్రి, 1953. |
| 56 | హంస వింశతి | : | అయ్యలరాజు నారాయణాచార్యుడు, శృంగార కావ్య గ్రంథమండలి, మచిలీపట్టణం, 1938. |
| 57 | హరవిలాసము | : | శ్రీనాథుడు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1968. |
| 58 | హిందూ వివాహ ప్రాశస్త్యము | : | విశ్వహిందూ పరిషత్ ప్రచురణ, గుంటూరు, చతుర్థముద్రణ, 1976. |

## సంస్కృతము


1 అభిజ్ఞాన శాకున్తలమ్ - కాళిదాసు, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి,హైదరాబాదు.

2 ఉత్తర రామచరిత నాటకమ్ : భవభూతి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, ద్వితీయ ముద్రణ, 1970

3. ఉపనిషచ్చన్ద్రిక : ఓంకార ముద్రణశాల, గుంటూరు.

4 కుమార సంభవమ్ : కాళిదాసు, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

5 తత్సమ చంద్రిక : సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి.

6 విష్ణు సహస్రనామ స్తోత్రమ్ : సాధన గ్రంథమండలి, తెనాలి.

7 శ్రీమద్భగవద్గీత : గౌడీమఠం, గుంటూరు.

8 శంకర గ్రంథరత్నావళి : సాధన గ్రంథమండలి, తెనాలి.

9 శ్రీ సూక్తము : శ్రీమాతా నిరంజనానందగిరి, శ్రీ ఆత్మారామాశ్రమము, కొవ్వూరు.


### పత్రికలు

### తెలుగు


1. ఆంధ్రప్రభ (దిన పత్రిక).
2. తెలుగు (త్రైమాస పత్రిక).
3. నవభారతి (మాస పత్రిక).
4. పరిశోధన (ద్వైమాసిక పత్రిక).
5. భారతి (మాసపత్రిక).


### ఆంగ్లము


1. Indian Express (Daily)

## సంచికలు

1 త్రివేణి - పాములపాటి బుచ్చినాయుడు స్మారక సంచిక, పర్యవేక్షణ – నార్ల వేంకటేశ్వరరావు, స్వతంత్ర ఆర్టు ప్రింటర్స్, విజయవాడ, 1971.

## నిఘంటువులు

### తెలుగు

1 ఆంధ్ర వాచస్పత్యము - శ్రీ కొట్ర శ్యామలశాస్త్రి ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి, 1959.

2 విజ్ఞాన సర్వస్వము : నాలుగవ సంపుటము, తెలుగు భాషా సమితి, మద్రాసు, 1961.

3 శబ్ద రత్నాకరము : బహుజనపల్లి సీతారామాచార్యులు, చెన్న పట్టణపు దేశభాషా గ్రంథకరణ సభ, చెన్న పట్టణము, 1961.

4 శ్రీకృష్ణరాయాంధ్ర విజ్ఞాన సర్వస్వము : నాళం కృష్ణారావు, విజయలక్ష్మీపురం, బాపట్ల.

5 సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము : మొదటి సంపుటము, సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి, హైదరాబాదు, 1958.

6 సాహిత్య పదకోశము : తెలుగు అకాడమి, హైదరాబాదు, 1978.

7 సూర్యరాయాంధ్ర నిఘంటువు : ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ, వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ, 1936.

### English

1. A Dictionary of Psychology – James Draver, Penguin Books


* * * * *



# డాక్టర్ అంచే విజయలక్ష్మి

ఎమ్.ఎ., పిహెచ్.డి.

| | | |
|---|---|---|
| స్వంత ఊరు | : | ఈమని, దుగ్గిరాల మండలం. |
| విద్యా విశేషాలు : | | |
| ప్రాథమిక విద్య | : | జిల్లా పరిషత్తు పాఠశాల, ఈమని. |
| 6 నుండి ఎస్.ఎస్.ఎల్.సి. | : | శ్రీ పాటిబండ్ల సీతారామయ్య ఉన్నత పాఠశాల, స్టాల్ బాలికల ఉన్నత పాఠశాల, గుంటూరు. |
| పి.యు.సి. | : | చుండి రంగనాయకులు కళాశాల, చిలకలూరిపేట. |
| బి.యస్‌సి. | : | ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు. |
| ఎమ్.ఎ. | : | ఆంధ్ర విశ్వవిద్యాలయం, పి.జి. సెంటర్, నల్లపాడు. |
| పిహెచ్.డి. | : | ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు. |
| ఉద్యోగం | : | శ్రీ దొడ్డా రాఘవయ్య నాగరత్నమ్మ శ్రీ చిలకలూరిపేట విద్యా సంఘం డిగ్రీ కళాశాల, చిలకలూరిపేటలో తెలుగు అధ్యాపకురాలిగా, రీడర్‌గా. |
| ఆన్ డెప్యుటేషన్ | : | అసిస్టెంట్ ప్రాజెక్టు ఆఫీసర్ (ఉమన్). జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, గుంటూరు. |
| ముద్రిత గ్రంథాలు | : | స్త్రీ సాధికారత – పారిశ్రామికత. |